# సవరణలు

## అవతారికలో

పుట ౨౪ — పంక్తి ౨౪ 'మూఁతురు బిడ్డయైన రామకృష్ణ ప్రసాదు' అని యున్నది.

'శివరామకృష్ణ ప్రసాదు' అని యుండవలయు.

పుట ౨౯ పంక్తి ౧౯ 'యార్లగడ్డ శివరామకృష్ణ ప్రసాదు' అని యున్నది.

'శివరామ ప్రసాదు' అని యుండవలయును.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౭ | 4 | సత్వ | సత్య |
| ౯ | 3 | వోని | పోని |

## అసలు గ్రంథములో

పుట ౫౯ పంక్తి ౧౧ 'చంచూకృతదారణాత్రిపురుషుఁడు' అని యున్నది.

'చంచ్వాకలి తానిలాగ్నివిధుతారయు' అని యుండవలయును.

పుట ౧౦౩ పంక్తి ౮ 'ఁబదునేడుదినములాపగిది కట్టె' అని యున్నది.

'నిరువదినాల్గు నాళ్లిట్లె కట్టె' అని యుండవలయును.

పుట ౧౧౦ పంక్తి ౧౫ 'దేవగురుణ దన' అని యున్నది.

'దేవగురుణ దనంతట' అని యుండవలయును.

పుట ౨౯౮ రెండవ పంక్తిలోఁ జివరఁగల 'తనర' మూఁడవ పంక్తి మొదలు.

వేగవతి వృత్తములో రెండవ నాల్గవ చరణముల మొదట నున్న 'జ్యా' 'సం' లు మొదటి మూఁడవ చరణముల తుది యక్షరములు.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 3 | 5 | చేసువఁ జేరఁగ | చేరువ జేఁగ |
| ౭ | ౧ | పోత్రికల | పోత్రుకల |
| ౮ | ౪ | కట్టిడి | కట్టిడి |
| ౧౩ | ౧౮ | టిరుల్ | టిరులన్ |
| ౧౬ | ౧౪ | యానవంబు | యాసనంబు |
| ౩౬ | ౧౩ | శస్య | శస్న |
| ౪౧ | ౨౭ | శ్రి | శ్రీ |
| ౫౭ | ౧౨ | జెన్ను | లెన్ను |
| ౬౨ | 3 | మంత్రకృషశా | మంత్రకృష్టశా |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౯౨ | ౧౬ | బుధిఁ దర్కము | బుధి ! తర్కము |
| ౯౬ | ౧౨ | బగుఁగ | బనఁగ |
| ౧౦౦ | ౯ | నడలెను | సడలెను |
| ౧౦౧ | ౧౧ | జెప్పుచుందు | జెప్పుచుందు౹ |
| ౧౦౫ | ౧౯ | టాడంబరముల్ | లాడంబరముల్ |
| ౧౧౨ | ౧౯ | జూచెను | జాచెను |
| ౧౧౪ | ౧౦ | గోరణమున | గోగవనమున |
| ౧౧౫ | ౫ | కేలిరి | కేరి |
| ౧౪౯ | ౯ | లహోవిప్తలఁగ | లహర్లిప్తలఁగ |
| ౧౯౭ | ౬ | వంచలుఁగ | నంచలుఁగ |
| ౨౦౯ | ౨౩ | కథాసకలంబును | కథాసకలత్వము |
| ౨౧౬ | ౧౪ | స్నావ | స్థానవ |
| ౨౧౭ | ౭ | మొప్రికల | మొప్రికేల |
| ౨౨౨ | ౨౦ | కుబేరులది | వసంతులది |
| ౨౨౮ | ౧౮ | నా ప్రతిబింబ | నాఁ బ్రతిబింబ |
| ౨౩౦ | ౨౧ | ఒకచేత పంచ | ఒకచేతఁ బంచ |
| ౨౪౧ | ౧౦ | లిప్తల్ లిప్త | లిప్తఁగ లిప్త |
| ౨౫౭ | ౬ | ఁజెలఁగెడు | సాగెడు |
| ౨౬౪ | ౮ | కుడిచేత | ఎడమచే |
| ౨౮౫ | ౨౫ | మేసత్వను | మేసత్త్వము |
| ౩౦౪ | ౩ | నవ్వుతల్లి | నవ్వఁదల్లి |
| ౩౦౯ | ౮ | నిలు | విల్లు |
| ౩౨౬ | ౧౯ | భేళ | బీళ |
| ౩౩౬ | ౬ | వశిషులు | వశిష్ఠులు |
| ౩౩౭ | ౨ | వరింతో | వరింతో |
| ౩౬౧ | ౧౯ | నలము కమ్మని | నలముఁ గమ్మని |
| ౩౬౩ | ౧౫ | గాధ | గాథ |
| ౩౬౫ | ౧౦ | మార్పు కోర్కి | మార్పుఁగోర్కి |
| ౩౬౬ | ౨౬ | దూపంబుల | ధూపంబుల |
| ౩౬౮ | ౧౫ | మంజిషా | మంజిష్ఠా |
| ౩౬౭ | ౩ | డొక | దొక |
|  | ౧౫ |  | రామసర్వ |
|  | ౧౮ | సీమప్రసార | సమప్రసార |
| ౩౮౦ | ౬ | జల : నీకేతా | జలనీకేతా |

# శ్రీమద్రామాయణకల్పవృక్షము

## అవతారిక

శా. శ్రీమంజూషిక భక్తరక్షణకళాశ్రీచుంచు వానందవ
ల్లీమంజుప్రసవంబుఁ జిద్గగనప్రాలేయాంశువున్ మోక్షల
క్ష్మీమాణిక్యవినూత్నమేఖల కటాక్షీభూతనీహారరుక్
శ్రీమంతంబయి పొల్చు వెల్గు నొకఁడే సేవింతు విశ్వేశ్వరా!

శా. కైలాసాచలసానువాసము వృషస్కంధాగ్రసంస్థాయి త
త్ప్రాలేయాచలకన్యకాకుచతటీపర్యంకనిద్రాగతం
బాలోలాగ్రజటాధునీఘటితనాకాశస్సరిత్కంబు దే
హాలంకారితలేలిహానము వెలుంగర్చింతు విశ్వేశ్వరా!

సీ. పంచభూతములు దివాకరుండును నిశా
కరుఁడు నీ తను సప్తకంబయేని
యీ శరీరంబు నీదే! కన్నువిప్పుటఁ
గన్నుమూయుట నీవు కలుగ వెట్లు?
ఏతదధిష్ఠాత యెవ్వాఁడో యజమానుఁ
డనిన నీ యష్టమతనువు వాఁడు
కెరలి నన్నేమి మిగిల్చితి నా సామి!
బిట్టు నే నన్న దభిజ్ఞగాక!
స్వామి! నీదు పారమ్యంబుఁ బడయజాల
దఖిలవిశ్వంబుఁ దాను నీ వయ్యుఁగూడ
హరిహరబ్రహ్మమయ మయి యర్ధచంద్ర
చూడము వెలుంగును నొసంటఁ జూడలేక

ఉ. పావు నెఱుంగు బ్రహ్మ నగపాలును మాత్రమెఱుంగుఁ బార్వతీ
దేవియు నీ వెఱుంగుదువు తెల్లము రామమహత్తు కృత్స్నము మా
దేవున కేను నీ యనుమతింబడి సంకిత మిత్తు జానకీ
దేవిమనోహరుండు రఘుదేవుని సాధుకథాప్రపంచమున్

సీ. మఱల నిదేల రామాయణం బన్నచో
నీ ప్రపంచక మెల్ల నెల్లవేళఁ
దినుచున్నయన్నమే తినుచున్న దిన్నాళ్లు
తనరుచి బ్రదుకులు తనవి గాన
చేసిన సంసారమే సేయుచున్నది
తనదైన యనుభూతి తనదిగాన
తలఁచిన రామునే తలఁచెద నేనును
నా భక్తి రచనలు నావిగాన
కవి ప్రతిభలోన నుండును గావ్యగత శ
తాంశములయందుఁ దొంబదియైన పాళ్ళు
ప్రాగ్విపశ్చిన్మతంబున రసము వేయి
రెట్లు గొప్పది నవకథాదృతిని మించి

ఉ. జాగ్రదవస్థ నేమి యన స్వప్నసుషుప్తులఁగూడ రామ నా
మగ్రహణంబె నా వయిన మానసజిహ్వలు సేయుఁ దత్కథా
ప్రగ్రహాకృష్టిసంశ్లథధురావశమై చను మన్మనోఽశ్వ మో
యుగ్రుఁడ! నీవ సారథివ! యూనుము పగ్గములన్ గరంబులన్

ఉ. వ్రాసిన రామచంద్రుకథ వ్రాసితివం చనిపించుకో వృథా
యాసముగాక కట్టుకత లైహికమా? పరమా? యటంచుఁ దాఁ
జేసిన తండ్రియాజ్ఞయును జీవునివేదన రెండు నేకమై
నా సకలోహవైభవసనాథము నాథకథన్ రచించెదన్

శా. ఆ నాతండ్రి యనన్ దధీచి శిబి కర్ణాదుల్ పునారూపసం
స్థానం బందిన కర్మయోగి సితచంద్రప్రౌఢకాంతిచ్ఛటా
స్నానం బాడిన స్వచ్ఛలింగమయు నిన్ సాధించి మా నందమూర్
లోనన్ నిల్పిన భక్తరాజు సుజనశ్లోకుం డుదారుం డొగిన్

# అవతారిక

సీ. నకనకలాడునట్టి కడుపులన్ వచ్చి
త్రేఁచుచుఁ బోయెడు తెరువరులును
చినిఁగిన గుడ్డలఁ జనుదెంచి నూతన
పరిధానములఁ దాల్చి యరుగు జనులు
పరిదీనవదనులై యరుదెంచి యుత్సాహ
కృతమందహాసులై యేగువారు
సందేహభాజనాస్యములతో వచ్చి యా
శ్చర్యసూచిముఖాలఁ జనెడువారుఁ
బాలుతు రన్నాతురులు యాచకులును నిత్య
కలితబహుళకార్యాంతరాగతులు విశ్వ
నాథవంశాబ్ధిశశి శోభనాద్రియింట
నిరులు వదలి వెల్తురులు గొం చేగునట్లు

శా. తప్తాఘుల్ బహుసోమపీథిపరిభుక్తక్లిష్టసోముం బలెన్
సప్తాశ్వద్యుతి శోభనాద్రి వినయాంచద్వంశపారంపరీ
ప్రాప్తంబై చను క్షేత్ర మర్థిజనలిప్సాపూర్తి వెచ్చించి ని
ర్లిప్తుండుం బలెఁ బొల్చె యాచకముఖాలీధార్తి నిర్యాతనన్

ఉ. దూసిన స్వర్ద్రిపై మిగులు దోవతి యొక్కఁడుఁ దాల్చి పోవఁగా
గోసఁగి పూర్వ మాశ్రితుఁడు గోచి యొకండు ధరించి వచ్చి సా
మీ! సొరవోయి కప్పికొన నేనియు లేదన; శోభనాద్రి ని
స్త్రాసకుఁ డంగవస్త్రమును దాలిచి దోవతి నిచ్చె నట్టిఁడో!

గీ. అట్టి తండ్రికిఁ బరమభక్తాగ్రగణ్యుఁ
డైన పుత్త్రుఁడ నేను రామాయణంబు
నీకుఁ దండ్రికి భేదంబు లేక యున్న
పరమనిశ్చలబుద్ధి నర్పణము సేతు

గీ. సప్తసంతానములలోఁ బ్రశస్తిఁ గాంచి
ఖిలము గాకుండునది ధాత్రిఁ గృతి యటన్న
నట్టి కృతిశతనిర్మాతనైన బిడ్డఁ
బడసె నా తండ్రి కృతిలోకపారిషదుఁడు

గీ. అతని యాస్తిక్య మింతని యనఁగఁ గలదె?
లేదనిన యూహ పుట్టని సాదునకును
నట్టి తండ్రికిఁ బుత్త్రుల మైనయట్టి
మువ్వురము సర్వథా తండ్రిమూర్తి మేము

ఉ. తమ్ములు రామచంద్రునకుఁ దమ్ములు నూహ నెఱింగి చేయఁగాఁ
దమ్ములు ధర్మరాజునకుఁ దమ్ములు చెప్పినయట్లు సేయ నా
తమ్ములు నట్టి రందుఁ జినతమ్ముఁడు సన్మతి రామమూర్తి చి
త్తమ్మున నేను వాని కొకదైవముగాఁ గనిపింతు నెంతయున్

ఉ. పండితకీర్తనీయుఁ డిరుబాసల దిట్ట రసజ్ఞసభాళి మా
రెండవవాఁడు సన్మతిధురీణకవిత్వకళోగ్రకార్తికే
యుండును వేంకటేశ్వరు లహో! మఱి నా కవనం బిదెల్ల ధీ
శౌండుఁడు తత్పరీక్షఁ బడి సంకునఁ బోసిన తీర్థమై చనున్

క. గణనాథుఁడు గురునాథుఁడు
మునికిని యజ్వకును బోలె మొగి నాకును నా
యనుజుం డగు నాతని వ్రా
సిన వ్రాల్ క్రొమ్ముత్తియముల శిల్పము సేతల్

చ. తిరుపతివేంకటేశ్వరులు దేశముఁ గైతయు గుచ్చియెత్త బం
దరుపుర మాంగ్లపుం జదువునం జని వారలలోన వేంకటే
శ్వరగురురాజపాళి పదసంజనితత్రిదివాపగాసుధా
ఝరముల మున్కలాడు ఫలసంగతి సత్కవినై మెలంగుచున్

చ. తన యెద యెల్ల మెత్తన కృతప్రతిపద్యము నంతకంటె మె
త్తన తన శిష్యులన్న నెడదం గల ప్రేముడి చెప్పలేని మె
త్తన యయి శత్రుపర్వతశతారము సత్కవి చెళ్లపిళ్ల వేం
కన గురువంచుఁ జెప్పికొనఁగా నది గొప్ప తెలుంగునాఁడునన్

సీ. శిష్యవాత్సల్యంబు చెలువుదీర్చిన మూర్తి
కాకవికంఠంబు కత్తికోఁత
యెడఁద మెత్తదనంబు విడిదిచేసిన చోటు
వ్యర్థవాదములకు నగ్గిపిడుగు

భాషానుభవపరీపాకస్వరూపంబు
నీరసవాదికన్నిటిముంపు
పరమనిర్భికుండు పరమసత్యవ్రతా
చారుండునున్ సత్యసంగరుండు
సమభిగమ్యత్వ మప్రధృష్యత్వ మొప్ప
వఱలు నట్టి చెళ్లపిళ్లాన్వవాయశశికిఁ
బరమ మస్మదుపజ్ఞమా భవ్యసృష్టిఁ
దేర్చు ప్రథమమూర్తికిని జోదిళ్లు పెట్టి

మ. అల నన్నయ్యకు లేదు తిక్కనకు లేదా భోగ మస్మాదృశం
డలఘుస్వాదురసావతారధిషణాహంకారసంభారదో
హాలబ్రాహ్మీమయమూర్తి శిష్యుఁడయినాఁ డన్నట్టి దా వ్యోమపే
శలచాంద్రీమృదుకీర్తి చెళ్లపిళవంశస్వామి కున్నట్లుగన్

చ. తన మృదుజిహ్వపై రవలు దాల్చిన నూఁగు నిగారపుం జిగుల్
చను కవితాసతిన్ విడచి సాధుమహోహవశీలుఁడౌ మహా
త్ముని యసిలేనిసేనఁ బడి పోయెడువానిఁ గోడాలి యాంజనే
యుని మును నాకు జంటకవియున్ బ్రియమిత్రము సంస్మరించుచున్

క. ఆతఁడు నేనే కాదిది
మా తండ్రులు కూడఁ జెలులు మఱి యాతనితో
నాతో సాఁగిన కావ్యము
రీతి య దుండెడిది మధురఝరీభ్రమరితతిన్

ఉ. ఆతఁడె తోడు కల్గినను నచ్చముగాఁ గలకండ లచ్చులుం
బోఁతలుపోసి యుండెదము పోతనగారి విధాన; దీపితా
లాతమువోలె నుంతయు విలంబన మోర్వదు నిత్యవేగి నా
చేతము శబ్ద మేరుటకుఁ జిన్నము నిల్వదు భావతీవ్రతన్

సీ. కఠినస్తనోపరి గ్రైవేయమణికాంతి
కర్ణతాటంకంబు గాడిపఱుప
క్రమనితంబాగ్రకాంచికింకిణులతోఁ
గరకంకణధ్వనుల్ కలఁతఁ బూన

మౌక్తిక ప్రశశాంకమౌళాతపములపై
ఫాలస్థలీజ్యోతి పాఱువెట్టఁ
దత్కాలవిచలితాధరహాసమాధుర్య
మాత్మప్రసన్నత నగఁబుపఱుప
పాలితానోన్యలంఘనస్పర్థములును
జాలితాన్యోన్యసౌందర్యసరసములును
నైన పలుకుల కూడిక యనఁగ నొప్పు
శారదామూర్తి నా యెదఁ జాలు గాక

క. నన్నయ్యయుఁ దిక్కన్నయు
నన్నావేశించిరి పరిణాహమనస్సం
ఛన్నత వారలు పోయిన
తెన్నున మెఱుఁగులను దీర్చి దిద్దుచుఁ బోదున్

ఉ. అంతయొ యింతయో తెలిసినట్టి విమర్శకులైన కావ్యసి
ద్ధాంతుల యొత్తిడింబడి మహాకవి నాఁగటిచాలు దీర్పఁ గా
లాంతరకీర్తివృష్టిగతమై చను లాభము నెంచుచున్ లలా
టంతపరూక్షచింతనవటన్మధుభారతిసస్యధారణిన్

వ. ఈదృశంబుగ మహాకావ్యరచనాప్రసూనవనబంభరాయమాణచిత్తుం
డనై సర్వధర్మమూలబీజంబుగ నవిచ్ఛిన్నసంప్రదాయార్థినై

సీ. ఋషివంటి నన్నయ్య రెండవ వాల్మీకి
తిక్కన్న శిల్పపుఁ దెనుఁగుతోఁట
యెఱ్ఱన్న సర్వమార్గేచ్ఛావిధాత్రుండు
పోతన్న తెలుఁగుల పుణ్యపేటి
శ్రీనాథుఁడు రసప్రసిద్ధధారాధుని
కృష్ణరాయఁ డనన్యకృతిప్రబంధ
పెద్దన్న వడపోత పెట్టె నిక్షురసంబు
రామకృష్ణుఁడు సురారామగజము

ఒకఁడు నాచనసోమన్న యుక్కివుండు
చెఱిపి పదిసార్లు తిరుగ వ్రాసినను మొక్క
పోని యీ యాంధ్రకవిలోకమూర్ధమణుల
మద్గురుస్థానములుగ నమస్కరించి

ఆ. భాసకాళిదాస భవభూతి దిఙ్నాగు
లకుఁ బ్రశస్తవాగ్విలక్షణుఁడు ము
రారిభట్టునకును రామకథాభావ్య
కారులకును మోడ్పుకై ఘటించి

ఆ. అచ్చమైన యమృత మమరులు త్రావినా
రోయి! దాని కే నసూయపడను
పరమమానియైన వాల్మీకికృతరామ
సత్కథాసుధారసంబుఁ ద్రావి

ఆ. సర్వకావ్యవాక్కు జనియించె నే మౌని
వదన సీమనుండి వాని దెలఁతు
సర్వశిల్పభూమి సర్వలక్షణలక్ష్య
నవవిధాత్మభూతు నాకుజాతు

శా. ఈ సంసార మిదెన్ని జన్మలకు నేనీ మౌనివాల్మీకి భా
షాసంక్రాంతఋణంబుఁ దీర్పఁగలదా? సత్కావ్యనిర్మాణ శే
ముషీసామగ్రి ఋణంబుఁ దీర్పఁగలదా? కాకుత్స్థుఁడో స్వామిగా
థాసంపన్నము భక్తిఁ దీర్చినను ద్వైతాద్వైతమార్గంబులన్

గీ. ఒక్క వాల్మీకి కాక వేఱొక్కఁడెవఁడు
సుకవిశబ్దవాచ్యుం డిఁకఁ గుకవినింద
యప్రశస్తపథంబుగా నవుటఁ జేసి
మునిఋణముఁ దీర్ప నీ కావ్యమును రచింతు

వ. బాలకాండమ్ము పూర్తి జేసి యయోధ్య మొదలువెట్టి గ్రంథ
ప్రకటనగతవిషణ్ణ చేతస్కుండనై యలసుండనై యుండ

సీ. చిఱునవ్వు నవ్వెనా! చిన్నారి ముత్యాలు
ప్రోవులు ప్రోవులు పోసినట్లు
కనులెత్తి చూచెనా! కప్రంపుఁ జిఱుపొడు
లుప్పుని తీఁగగా నూదినట్లు
ఒకయింత నడచెనా! యొగి ఢిల్లిభోగాల
రాశి లాభము కొలపోసినట్లు
పన్నెత్తి యాడెనా! ప్రభుత విస్మృతి వడ్డ
సాధుభావము బారసాచినట్లు
మంజులవినీతవేషుఁడు మధురమూర్తి
యార్ద్రభావుఁడు కుదిమట్టమైన బొమ్మ
బాలరాఘవువలెఁ బితృవాక్యపాల
నానినీపామసీపాసనాతనుండు

వ. అయిన శ్రీ వాసిరెడ్డి రాజారామగోపాలకృష్ణమహేశ్వరప్రసాదుఁడు ముక్త్యాలయువరాజు వైవస్వతమన్వంతరమున నీ కలియుగం బైదువేల నలుబదినాల్గు గడచిన స్వభాను విజయదశమి నాఁడు నన్నుఁ బిలిపించి తన యుద్యోగులచేత నా 'నర్తనశాల' యాడించి సత్కరించి

గీ. ఎవఁడు ఋత్విక్కు సారస్వతేష్టియందు
దనకుఁ జిఱుమాన్కిశాబిచంద్రనిచేత
సాధు శివరామకృష్ణప్రసాదుచేతఁ
బితకు నడిగింప నిద్ది యంకితము సేయ

క. రామాయణమ్ము వ్రాయు న
సామాన్యపుఁగవనశక్తి సమకూరునో లే
దో మత్పుత్త్రిన కనియెడు
నే మాత్రపుశంక లేక యెపుడో నేనున్

గీ. పద్యములు గిల్కువేళ సర్పణముచేసె
నీ మహాకృతి నా తండ్రి యీశ్వరునకు
నంటి; మచ్ఛిష్యుఁ డాతఁ డెట్లిచ్చువడుట
యిది యనియె నాడు సామంత మెఱిఁగియుంట

వ. వైశంపాయనుండు భారతంబు జనమేజయునకుఁ జెప్పినట్లు చెప్ప వచ్చు వారి కోర్కెయుఁ దీరు నన, సరేయంటి, నంత మీరేమి కోరెద రని యడుగ

క. నేను మనస్సన్న్యాసిని
నే నిది యిమ్మంచు నడుగ నెవ్వరి నెపుడున్
దానెది యేనియుఁ బ్రాప్త
మ్మైనన్ వలదంచుఁ జెప్ప నంతియగాకన్

వ. మీ రేడుకాండమ్ము లచ్చువేయించి యిచ్చెడుపొత్తమ్ములు నీ కాలమ్మున సొత్తే యని

క. కృతిచే సమాప్తమగుఁ గీ
రితి స్వర్గద మంతె; నే వరింపను స్వర్గం
బతిరూక్షచింతనాగ్ర
స్థిత తేజము శివుఁడు నన్నుఁ జెందెడుగాతన్

ఆ. ఏను గోరనట్టి యీ స్వర్గఫల మింత
పొరువోవనేల? వాసిరెడ్డి
వంశనృపతిమణికి ఫలియించుఁ గావుత
ప్రాభవంబు స్వర్గఫలమటంచు

సీ. యువరాజు వచ్చి రాజ్యోదంతములు చెప్ప
నూఁకొట్టు మాత్రమే యుర్వినేత
దీక్ష సద్గ్రంథకాలక్షేప మొనరించు
నింత మాత్రమె లోకవృత్తశీలి
చరణంబు కదుపని సౌధైకదేశభా
గనివాసమాత్రమే గ్రామవాసి
తనపేరఁ గొడుకుచేత నొనర్పఁబడు పుణ్య
కర్మలు వినుమాత్ర కార్యకారి
యగుచు రాజర్షియైన ముక్త్యాల వృద్ధ
రాజు శ్రీచంద్రమౌళీశ్వర ప్రసాద
పర్యధిష్ఠితసౌధాగ్రభాగ మేగి
తద్ధరాపతి యభివాంఛితంబుగాఁగ

వ. వారి వంశంబు వక్కాణించెద

సీ. ప్రాజ్యాంధ్రధరాజ్యేందిరాపీరనారాయ
ణుండు వేమారెడ్డి నిండుసభను
దౌర వాసిరెడ్డి యన బిరుదవైభవ మందె
దళవాయి యొకఁడు సదాశివాఖ్యుఁ
డా వాసిరెడ్డి వంశాభిఖ్య యయ్యెఁ దా
నందు శ్రీగిరిమల్లికార్జునాఖ్యుఁ
డగు బాలుఁ డొక్క బ్రాహ్మణిచేత రక్షింపఁ
బడె నరికృతనిశావధమునందుఁ
జెలఁగి నూతక్కిలోన వేంచేసియున్న
స్వామి ముక్తీశ్వరుని దయావర్గితుం డ
తండు తన వంశమెల్ల నస్తంగతంబ
యయ్యుఁ జిలవలు పలవలై యతిశయించె

గీ. పైని వీరపనీఁ డన్న ప్రభువు నంది
గామ తనరాజధానిగా ఘనతఁగాంచె
మూఁడు శాఖలకును దాన మూలపురుషుఁ
డయ్యె వీరపనీఁడు మహాపురుషుఁడు

వ. ఆధరాజానికి రాఘవరామచంద్రమౌళిభూపతులు ముగురుపుత్రులు; రాఘవభూపతి మాగల్లురాజు, రామభూపతి రాఘవపురాధిపతి; చంద్రమౌళి చింతలపాటినేత; చంద్రమౌళిభూపతి ముక్త్యాల జేండ్లకు మొదలిరాజు

ఆ. ముగురు పుత్రులకును మూఁడురాజ్యమ్ములు
చేసి యిచ్చె నెంత చేవగలఁడొ
వీరపనితకీర్తి వీరపనీఁ డన
వాసిరెడ్డికంటె వాసిరెడ్డి

ఉ. వీరపనీని ధర్మసతి పేరు భవాని; భవానిరాణిగ
ర్భోరుపదంబు నెంతచలువో? పులువోయిన యచ్చవెల్గులై
తీరిచి పంచపంచసితదిక్కులఁ జిక్కని రత్నకాంతిమా
లారుచిరప్రభాఖను లిలాపతు లెందఱొ ధర్మ మూనఁగన్

వ. ఆ భవానీవీరపనీంద్ర సంతానమున రెండవవాఁడైన రామభూపతికి
వీరపనీఁడు రాఘవయ్య చినపద్మనాభయ్య చంద్రమౌళి రామలిం
గన్న నరసన్న యని యార్వురు పుత్త్రులు, వారిలో జ్యేష్ఠుఁడైన
వీరపనీనికి సూరన్నయు, సూరన్నకుఁ జిననరసన్న, చినరామలింగన్న
యుఁ బుత్త్రకులు. వీరందఱు కొలఁది కాలము రాజ్యపాలనము జేసి
దివంగతులైరి. ఆ రామధాత్రీవరుని తక్కినపుత్త్రులు నిష్పుత్త్రకులు,
వారిలో మూఁడవవాఁడైన చినపద్మనాభయ్య

ఆ. ఏనుఁగంతపులిని నెగిరెడుదానిని
గత్తితోడ రెండుగాఁగ నఱకె
శౌర్యమునకుఁ బాదుషా లోభపడి మది
నతని నధికవిభవయుతునిఁ జేసి

వ. ఢంకానగారాలు డౌలతు లులుగోజజోడుమహాళ్ళు సురియపిళ్ళు
బిరుదు లిచ్చి పెనుగంచిప్రోలు; బేతవోలు; తిప్పసంత్రావూరు;
కూచిపూడి; రాయపూడి పరగణాలమీఁద రాచరికంబుఁ జెల్లింప
నాజ్ఞయిడి పంపె

ఆ. చింతపల్లి కోట చినపద్మనాభ భూ
జానికట్టె నోలి శౌర్యమౌళి
యతనిపేరు వినినయంతన శాత్రవ
ప్రతతి చెడియెఁ దూలి బైసి మాలి

వ. ఆయన మూలపురుషుఁడైన వీరపనీని పెద్ద సంతానమైన రాఘ
వయ్య రెండవమనుమని బుచ్చిరాఘవయ్యను దత్తతగొనియె. ఆయ
నకుఁ బుత్త్రులు లేరు. ఈరాజ్యమును రాఘవభూజాని మూఁడవ
మనుమఁడు నాగన్నయు చంద్రమౌళి భూపతి రెండవమనుమఁడు
లక్ష్మీపత్యపరనాముఁ డచ్చన్నయుఁ జెఱిసగము పంచుకొనిరి.

తే. మూలపురుషునకుఁ జ్యేష్ఠపుత్త్రకుండు
కఁడగి మాగల్లురాజు రాఘవనృపుండు
రాజ్యపాలన మాఱేండ్లు ప్రాజ్యరాజ్య
లక్ష్మి పులకింపఁ జేసి యిలఁ ద్యజించె

ఉ. శ్రీపతికిన్ దనూభవుఁ డశేషజగత్ప్రభవుండు బ్రహ్మయ
ట్లా పెదపద్మనాభనృపుఁ డయ్యెను బుత్త్రిఁడు రాఘవాఖ్యధా
త్రీపతిమౌళి కా కొడుకు తేఁకువ నిర్వదిరెండువత్సరాల్
ప్రాపితశాంతియై చన ధరాపతి యేలె బలారి వోలికన్

వ. ఆ పెదపద్మనాభనృపతికి నల్గురు కొడుకులు, పెద్దవాఁడు చంద్ర మౌళి చిననాఁడె స్వర్గతుండయ్యె. రెండవవాఁడు బుచ్చిరాఘవయ్య, రాఘవపురరాజ్యవంశీయుఁడు చిన పద్మనాభనృపతికి దత్తు పోయె. నాల్గవకొడుకు రామభూపతి. ఈయనకుఁ బద్మభూపతి, వీర భూపతి యను నిద్దఱు కుమారులు; అయిదవపుత్త్రుఁడు లక్ష్మీపతికి వెంకటరామన పద్మన రామలింగయ్య రాజలింగయ్య లను నల్గురు కుమారులు; వీరిలో వేంకటరామన్నకుఁ గోదండ రామన, యచ్చన యని యిద్దఱు తనూభవులు. రామలింగయ్యకు బుచ్చిరాఘవయ్య నరసయ్య రామయ్య లను ముగ్గురు కులదీపకులు. ఈ బుచ్చిరాఘ వయ్యకుఁ గోదండ రామలింగయ్య, జగ్గయ్యలు పుత్త్రకులు. రాజ లింగధాత్రీపతికిఁ బద్మన్న పాపన్న చల్లన్నలు కుమారులు; వీరిలోఁ బాపన్నకుఁ గోటయ్య సంతానము. ఆఱవవాఁడైన బుచ్చన్న సంతులేని వాఁడాయెను

ఉ. మూఁడవవాఁడు నాగనవిభుండు ప్రభూతవిభూతిశాలియై
యాడినమాటకున్ గొణిదెఁడైనను దాటక వేటకైననున్
గూడిన ప్రాణిహింస నొనఁగూర్పక తేర్పకయుండ కుండఁగా
వేడిన యాచకాళిఁ బృథివీపరిపాలన మాచరించుచున్

క. కొని రాఘవపురమందున
తన సగపా లతఁడు సముదితస్వఃకాంతా
నినదితవీణావాదన
పనితయశోరేఖుఁ డగుచుఁ బ్రజఁ బాలించెన్

వ. ఈయన సంతానము ముగ్గురు. పెద్దవాఁడు రామన్న రాజయ్యె, ఆయన తమ్ములు జగ్గభూపతియు నాయుడమ్మ యను వేంకటాద్రియు.

శా. ఆ జగ్గయ్య పరాక్రమంబున దిగంతానేకపాభీలుఁడై
యాజానేయముపైని ఢిల్లిఁ జని శౌర్యప్రజ్వలుండై ప్రజల్
జేజేపెట్టగఁ బాదుషా ప్రియపడన్ జేకొంచు సాహస్రికా
భ్రాజన్మన్సబుదారి కీర్తినికషా భ్రస్రోతసీపద్ముఁడై

ఆ. సవ్యసాచి ధర్మజాతుని సౌమిత్రి
రామచంద్రుపోలె రామనృపుని
జగ్గశౌరి సేవ సలుపుచుఁ దగఁ బ్రజ
కనులయందుఁ బచ్చకప్పురముగ

క. ఈతఁడకాలమృతిం గన
నేతాదృశశౌర్యశాలి యిది శూలంబై
భ్రాతృస్నేహపయోనిధి
చేతోగతి రామనృపతి చింతావశుఁడై

వ. పందొమ్మిదేండ్లు రాజ్యమ్ముచేసి దివంగతుఁడయ్యె; నీరాజునకు పాపయ్య యనియెడి నాగన్న కొడుకు; ఈ రామధాత్రీపతి రెండవ తమ్ముఁడు నాయుడమ్మకుఁ జంద్రమౌళి యను రాజు పుత్త్రికుండు. వీరిద్దఱుఁ జిన్నవాండ్రగుట జగ్గశౌరి కచ్చమాంబాదేవివలనఁ గలిగిన సంతానము వేంకటాద్రినాయుడు రాజ్యమ్ముఁ దాను గ్రహించి వారు పెద్దవారైన తరువాతఁగూడ వారి కీయక తానే పాలించె

మ. ఇది యన్యాయముగాఁ గనంబడునుగాని వేంకటాద్రీశ్వరుం
డుదయాస్తాచలసేతుశీతనగమధ్యోర్వీలసత్కీర్తియై
యదిరా! ముప్పదినాలుగేండ్లవనిఁ గళ్యాణాద్రిగాఁ జేసెఁ దాఁ
ద్రిదశేశుండయి హేమకుండలులు ధాత్రీదేవతల్ వేల్పులై

వ. ఆయన మన్నెసుల్తాను; నెలకు మూఁడువేల మన్సబుదారు, మణికిరీటధారి, యమరావతీప్రభువు

సీ. ఒకటి తక్కువ వేయి యూండ్లకుఁ బ్రభువు నాం
ధ్రావనీనానాగ్రహారదాత
యష్టోత్తరశతశివాలయాశ్చర్యప్ర
తిష్ఠాతబహుయజ్ఞతీవ్రకారి

షోడశదానభాసురకీర్తి సప్తసం
తానార్థనిత్యనిత్యప్రణేత
నిరతాన్నదాత మండితజయస్తంభని
ర్మాత దుష్కృదుష్కామనిర్మథనకీర్తి

ఆ మహాప్రభుభోగశౌర్యములు లక్ష
లైన సాధుప్రబంధమ్ములై త్రిలింగ
దేశమునఁ బ్రోవులై విడదీయరాని
తెల్లకీరితి పటముల యల్లికపడె

క. అలకృష్ణరాయభోజులు
తొలివాం రాఘునికులందు దొర లీయన యీ
వల ధర్మప్పారా వా
వల నాహిమసేతుకీర్తి పాడినవారల్

వ. ఈ యపరదేవేంద్రున కిద్దఱు భార్యలు. వెల్లెమ్మయుఁ బార్వతియు; వ
పాపయ్యకు రామభూజాని కొడుకునకు రాజ్యమీయక వేంకటాద్రి
నాయ డేలుకొనెనో, ఆ పాపయ్య పెద్దబిడ్డను రామయ్యను గాక
రెండవవానిని రామనాథబాబును న్యాయముగా వెల్లెమ్మగారు పెంచు
కొని యాయనకు రాజ్య మిచ్చిరి. రెండవభార్య పార్వతి జగన్నాథ
బాబును బెంచుకొనెను. ఈయన వెంకటాద్రినాయని తండ్రి జగ్గ
శౌరి తరువాతివాఁ డైన నాయుడమ్మకు రెండవమనుమఁడు.
ఈ నాయుడమ్మకుఁ జంద్రమౌళి కొడుకు. ఆ చంద్రమౌళికిఁ బద్మ
నాభరామన్నయు నీ జగన్నాథబాబును కుమారులు

ఆ. తమకుఁ దమకుఁ గోరి ధారణి నిద్దఱు
దత్తపుత్త్రికులును దగవు తెగక
కోర్టు లెక్కి పోరుకొనిరి తొమ్మిదియేండ్లు
నేండ్లు పట్టు నచటఁ బూండ్లు పట్టు

వ. రామనాథబాబు పెద్దవంశములోనివాఁ డయ్యు, వయసుచేఁ బెద్ద
వాఁడై జగన్నాథబాబే రాజ్యము చేసె

చ. ఇరువది తొమ్మిదేండ్లకునె యీయన స్వర్గతిఁ బొందె నా ధరా
వరునకు భార్య లిద్దఱు శుభంబుగ నచ్చమ రంగమాంబయుఁ
బరువడి భర్త యీ పగిది స్వర్గతి నందెను రాజ్యమెల్ల ని
ర్భరముగ వ్యాజ్యమందుఁ బడెఁ బాపము వారలదుఃఖ మెట్టిదో?

వ. అందు రంగమాంబ లక్ష్మీపతి యను కుఱ్ఱవానిని దెచ్చి దత్తుచేసి కొని సవతియైన యచ్చమాంబతో మఱఁది యైన రామనాథబాబుతో వ్యాజ్య మాడుచుండఁగా

గీ. తమకుఁ దమకని యూరకే తమకపడుటె
యూళ్ల యజమాయిషీయు వసూళ్లు లేవు
కప్పముం గట్ట రనినట్టి కారణమున
నాంగిలేయులు రాజ్యమ్ము నాచికొనిరి

వ. ఆ దత్తపుత్త్రుఁడు లక్ష్మీపతికి వేంకటలక్ష్మియందు నరసింహరాయం డుదయమయ్యె; జగన్నాథబాబు నన్నగారు పద్మనాభరామన్నకు నాయుడమ్మ కొడుకు. ఆయనకు ముగ్గురు భార్యలు. ఆ రామనాథ బాబునకుఁ బార్వతియందు దాశరథినాయుడు శివప్రసాదు నని యిద్దఱు కొడుకులు; శివప్రసాదుని భార్య జ్ఞానప్రసూనాంబ; దాశ రథినాయనికి లక్ష్మీదేవమ్మ బంగారమ్మ యను నిద్దఱు భార్యలు; వారిలో లక్ష్మీదేవమ్మకు రామనాథబాబు కలిగె; ఈ రామనాథ బాబునకు బాలచంద్రశేఖరవరప్రసాదుండు కలిగె

గీ. తమ జమీ పోయినది భృతిదారులైరి
కాని యొక్కొక్కదొరయు మొగంబులందుఁ
బట్టపగలింటి సూర్యులపగిది నుంద్రు
వెలి సిరి హరింపఁబడు నెత్రువెలుఁగు పోదు

క. ఆ కోవ రాజ్యలక్ష్మీ
ప్రాకామ్యము మఱలఁగలిగి భాసిలుగాకన్
శ్రీ కలుగఁ బుణ్యకార్యా
నేకంబులు సేయువారి కేల గలుగదో!

వ. ఇంక మూలపురుషుఁడు వీరపనీని మూఁడవకుమారుఁడు చింతల పాటిఱేఁడు ముత్యాలరాజులకు మొదటివాడును వారినుండి యీ

వఱకు వచ్చిన యీవంగసంబంధాయనయే మఱల జన్మించినట్లున్న
మత్కావ్యశుశ్రూషాశీలియైన యీయనయు

చ. ఇరువురు చంద్రమౌళులై యహీనగుణాన్వితులై సురారాధ
స్మరకృతికృత్కుమారులై నికామము క్షేత్రసుమాహితాత్ములై
యరయఁగఁ జంద్రమౌళియయ మన్వయమున్ బొసగించునట్టి యీ
దొరలను మూలభూతుఁ డగు తొల్లిటిభూపతి చంద్రమౌళియున్

క. ఆ రాజే డేం ప్లేలెను
గౌరీపతి మఱలఁ దనకుఁ గొమరుఁగాఁగన్
తీరక రాఘవభూపతి
తారకము ఫలించినట్లు తనయుం బడయ్యెన్

గీ. అతఁడు దక్షిణాపథమున నవతరించె
నీతఁ డుత్తరభారత సీమ నతఁడు
రావణు జయించి సీతఁ బొరంగ జేసె
మొప్పుదలఁ గాంచెఁ దనకు లక్ష్మిన్ గ్రహించి

ఆ. రమణి వేంకమాంబ రాఘవు నిల్లాలు
శాకమూరివంశచంద్రరేఖ
కొడుకు లిద్దరైరి కుశలవులంబలె
నల్లరాజమౌళి యచ్చనయును

మ. చిరుమామిళ్ళకులమ్ముకొమ్మ గ్రహియించెన్ బాపమాంబన్ సహా
యురుపాక్షిన్ బతి రాజమౌళి ధరణీపుణ్యానతానంబుగా
విరిసెంబో మునియేటికాలువయుఁ బ్రవహించెన్ బ్రజల్ జొన్నకూ
ళ్ళురలన్ బంగరుగింజలాట్రగడముల్ భోగంబులై మించఁగన్

ఆ. పెర్మిమీఱఁ దండ్రి పేర్వెట్టె నీ రాజ
మౌళి, కొడుకు చంద్రమౌళిగాఁగ
తాతభార్య గౌరి తనభార్య పార్వతి
యతఁడు నీరుకొండ యల్లువాఁడు

గీ. రామలింగయ్య పెద్ద, వీరన్న చిన్న
చంద్రమౌళికుమారులు, చంద్రమౌళి
పిన్నతండ్రి లక్ష్మీపతివేరి యచ్చ
నావనీపతి తాను రాజ్యమ్ముఁ జేసె

ఆ. రాజమౌళి తాను రాజ్యమ్ము చేసెను
యెనిమిదేండ్లు పైని నెల్ల నేల
యన్నకొడుకుఁ జాల పిన్నవాఁ డౌటచే
నచ్చనయె భరించె నాత్మశీలి

వ. నిస్సంతానకమైన రాఘవపురరాజ్యమును చెఱిసగముగా మూగల్లు మూలభూతుండైన రాఘవనృపతి సూనుండగు నాగన్న తోపాటు పంచుకొన్న దీ యచ్చనయ్యె. ఈయన నలుబదియెన్మిదేండ్లు తన వంతును చింతలపాటివంతును బాలించిపోగాఁ జంద్రమౌళి కొడుకు వీరన నష్టరాజ్యమ్ము నలంకరించె; నంత రామలింగయ్య పెద్ద వాఁడై చిఱుమామిళ్ల వెంకటాంబ, పుదుంబాక పద్మావతమ్మ యను యిద్దఱి భార్యలుగా గ్రహించి యిఱువదియొక్క వత్సరమ్ములు రాజ్యమ్ము చేసె; ఈ రామలింగయ్య

సీ. అట్లు వేదాద్రియు నట్లు భరద్వాజు
నాశ్రమంబును గాంచినట్టిచోట
దాఁ గృష్ణవేణి యుత్తరవాహిని పవిత్ర
మై మల్పు లిరిగిన యట్టిచోట
వారాణసియుఁబోలెఁ బ్రళయకాలంబునం
దైన విపత్తి లేనట్టిచోట
ఒకకృష్ణపాయ తా నొగిఁజుట్టి వచ్చి యు
త్తమ జలదుర్గభూతమగుచోట
నొక్కసితరాజహంసమ్ము నొడ్డునందు
తెక్కముడుచుక కూర్చున్న ఫక్కిఁ దోపఁ
గట్టె ముక్త్యాలకోటను గట్టె స్వర్గ
సీమకును రతనాల నిచ్చెనల మెట్లు

వ. ఈయనకు రాజమౌళి లక్ష్మీపతి రాఘవుఁడు చంద్రమౌళి వేంకయ్య యను వేంకటాద్రియు నీ యేగురు కొడుకులు.

ఉ. మిక్కిలిఁ బాదుసాకడ నమేయగజాశ్వగతిప్రభవముల్
చొక్కపు శస్త్రవిద్యయును జూపి ప్రశస్తిసిగాంచి గౌరవం
బెక్కిన రాజమౌళి యొక యేడు ధరిత్రి ధరించి వేల్పువీ
డెక్కిన రామలింగనృపుఁ డెంతొ విషాదము పొందియుండగన్

కం. తన తమ్ముఁడైన నీరస
కను రాఘవపురధరిత్రిఁ గైకొనియెను జ
గ్గన వేంకటాద్రినాయని
జనకుఁడు నాగన్న కొడుకు సత్వాధికుఁడై

గీ. ఇరువదొక్కేండ్లు రాజ్యము నేలి రామ
లింగభూపతి చనెఁ బైని లీల రెండు
వత్సరములు లక్ష్మీపతి వసుధ నేలె
నన్ని దేములు రాఘవుఁ డేలె నృపతి

శా. ఆపై రాజయి చంద్రమౌళిపతి ప్రాపై సత్కవిశ్రేణికిన్
దాపై దానపరంపరాకళనఁ జంద్రజ్యోత్స్నకున్ గీర్తిచే
రాపై సస్యపరీమళోన్మిషితమర్యాదాత్మకున్ ధాత్రికిన్
గాపై యుండఁగ వేంకటాద్రి ధరణిన్ గైకొన్న ప్రాప్తినతన్

గీ. తాఁ బుతుంబాక పద్మాక్షి ధర్మపత్ని
క్షితికి మించియ రాజుగాఁజేసి యతని
నాత్మజు నొసంగెఁ జినవేంకటాద్రిఁ గార్య
పాటవమున భగీరథు వంటివాని

వ. ఈ చినవేంకటాద్రికిఁ బినతండ్రియైన వేంకటాద్రికి రామలింగయ్య రాఘవయ్య లక్ష్మీపతు లను ముగ్గురు కుమారులు. రామలింగయ్యకు వెంకయ్య రాజమౌళులును లక్ష్మీపతికి రామలింగన వేంకటాద్రి నృసింహులును బుత్రికులు. వీరిలో రామలింగన సేతువమ్మ వలన సాంబశివప్రసాదు వేంకటాద్రినాయఁడు సుబ్బరాయఁడను ముగ్గుర సుతులఁ గనియె. సాంబశివప్రసాదుని భార్య భారతమ్మ. వెంకటాద్రినాయనికిఁ బిచ్చమాంబవలన ముగ్గురు పుత్రులు కలిగిరి

గీ. చంద్రవహాళి మోహేంద్ర రాజ్యంబు మఱలఁ
దేను యత్నంబుచేసి గతించె మును ది
లీపకాశ్యపీభర్తనోలిక; భగీర
థుండు చిన వేంకటాద్రినాథుండు తోఁచె

గీ. ప్రబలుఁడౌ వేంకటాద్రితోఁ బ్రతిఘటించి
పెరిగి తనఖ్యాతిఁ గొనెఁ జిన వేంకటాద్రి
పెద్దచిన్నల వారిట్టిపెట్టు మాటల
వేంకటాద్రికి సరిపోను వేంకటాద్రి

సీ. ముక్తీశ్వరునకు గోపురము ప్రాకారముల్
నిర్మించె, వేదాద్రి నృహరిఁ జేర
సోపానములు చేసె, సుకృతి కృష్ణాసనీ
మాహాత్మ్యకృతి గాంచె, మహితసప్త
సంతానములు నిల్పెఁ దంతస్యమానభ
ద్రస్త్రదేకనిధి వేంకటాద్రినృపతి
యా వేంకటాద్రికి నీ వేంకటాద్రికి
భేదంబు చేయక పృథ్విజనము
లొకరొకరి పుణ్యదీధితి యొకరొకరికిఁ
గట్టిపెట్టినయట్లుగాఁ గానిపించు
నాంధ్రదేశగోదాంతరవ్యాప్తమైన
వేంకటాద్రినామకమహాపిద్దమాతులు

క. పాపమ వెంకచ్చమ్మయు
నాపతికిం బత్నులైరి యా పాపమ కాం
తాపాళిశిరోమండన
మై పొలిచెఁ హరికి లక్ష్మియట్లు లలనమై

గీ. పాపమాంబికయును గాలిగోపురంబు
నెంచి కట్టించె స్వామిముక్తీశునకును
నెంచిన ఫలంబుగా ముగ్గు రెసఁగినారు
సుతులు ముక్తీశ గోపురోన్నతులు తాము

వ. వారు భవానీముక్తీశ్వర ప్రసాదనాయఁడు, చంద్రమౌళిభూపతియు, సదాశివప్రసాదు. చంద్రమౌళికిఁ బార్వతి లలన, సదాశివునకు వెంకా యమ్మ భార్యయు, సూర్యభానుప్రసాదు కొడుకును. భవానీ ముక్తీశ్వర ప్రసాదనాయని దేవేరి సౌభాగ్యవతి

క. ఆ రేండ్లు రాజ్యమేలెన
భారతియుతుండై భవానిముక్తీశ్వర భూ
దారిం బాంగ్లేయవిభుల్
తొల్లి రాజ్యము నాచికొనిరి కప్పము పేరన

గీ. మఱలఁ దన రాజ్యమెల్ల సంపాదనంబు
సేయు మనిరాసుఁజేసెను వేంచేసె భర్త
రాణి సౌభాగ్యవతి దుర్గరక్షణంబు
పాలనము సర్వమును దనపైనిఁబడెఁగ

సీ. పొంచుపొంచని క్రోధసిపుచ్చునా! దానదా
సీజనంబు తీరాలసేవనంబు
సిశిపోయి తాఁ బాడుపెట్టునా! తనకోట
తను భాగ్యసంపత్త ముత్యాలపేట
సేయలేక పరిత్యజించునా! వంశ గౌ
రవము రూపైన మర్యాదలెల్ల
నెత్తుపట్టమని యెగచునా! త్రపమౌళి
యౌచిత్య మెఱుఁగని యాచకాలి
రాజ్య మది పోయి రాజ్యము రాని నవుమ
నా మహాదేవి తన నగ లమ్మి మాట
విలువఁ దాకట్టువెట్టి వస్తులు పరుండి
వట్టితేజాతో రాజ్యము పట్టి తెచ్చె

గీ. నాటనుండియు ముక్త్యాలకోటలోన
సఖలరక్షణి బామ్మగారైన రాణి
గారు సౌభాగ్యవతిదేవిపేరు లక్ష్మి
కవచముంబోలె మన్నించఁ గలుగుటొప్పు

మ. తన శౌర్యంబున వాగ్మితన్ బ్రతిభచేతన్ బుద్ధిసంపత్తిచే
తను నాంగ్లేయుల మెచ్చఁజేసి మఱలన్ దాఁదెచ్చె ఖ్యాతిలక్ష్మి యీ
యన ముక్త్యీశ్వరసుప్రసాదబహదర్ ప్రారంభసంరంభరే
ఖ నొగిన్ విఘ్ననిహన్యమానుఁ డతిలోకప్రౌఢతేజస్కుఁడై

వ. ఈ రాజుచేసిన పుణ్యకార్యంబు లననుమేయంబు లపరిమితంబులు; శ్రీరంగనాయకుఁడు తిరుపతి వేంకటేశ్వరుఁడు కంచికామాక్షి వేదాద్రి నృసింహుఁడు ముక్త్యాలముక్తీశుఁడు నీ ధరాజానికి ఋణగ్రస్తులు. వారివైభవంబు లీ రాజువలన నెన్నిసాగె? ఇదిగాక సూర్యగ్రహణ వేళ నుభయతోముఖగోదానములు షష్టిపూర్తివేళ నిచ్చిన భూదానములును నఖండములు; ఈయన నిత్యపార్థివలింగార్చనా పరుఁడు. ఆ జేని యీ యఖండపుణ్యఫలమంతయుఁ జిఱుమామిళ్ళ యన్నపూర్ణా వేంకటరామయ్యల గర్భమై తనకుఁ జేరిన సౌభాగ్య వతి యందును, ఆమె కడుపు ఫలించిన యుమామహేశ్వర వేంక టాద్రులయందును గనిపించె

క. ఆ కాంత యోర్మియందున
భూకాంత సమస్తసుగుణపుంజముగానై
యా కొడుకు లపరమఘవులు
భూకాంతులు ధాత్రిపంటపొలములుగానై

శా. తా మున్నాఁడిన సర్వతీర్థఫలముల్ తా మొగ్గ వచ్చెన్ భవా
నీముక్త్యీశ్వరరాజచంద్రునకనన్ నిర్వ్యాజలోకోపకా
రామేయాత్ము లుమామహేశ్వరధరారాడ్వేంకటాద్రుల్ సుతుల్
శ్రీమంతుల్ ప్రభవించి రంచితగుణశ్రేయోనిధానాత్ములై

గీ. జనకుతోడ నుమామహేశ్వరనృపుండు
తనకుఁ జిననాడె సర్వతీర్థముల కేగి
కంచి మొదలుగ దర్శించెఁ గాన నెల్ల
దేశముల తెల్వితో ధరిత్రిని వహించె

గీ. రామలింగయ్య మొదలు ధరామఘవులు
వీరు ముక్త్యాలలో నుండి వీరి పూర్వ

రాజధాని చింతలపాడు తేజుచూడ
రను నవప్రభఁదీర్చ నీ రాజమౌళి

వ. చింతలపాటిలో శివాలయమ్ము నిర్మించె, ముక్త్యాలలో హరిహరాలయములకు ధ్వజస్తంభము లెత్తించె, ముక్తేశ్వరస్వామికి గుడిశిఖర మెత్తించె. ఈయన కిద్దఱుభార్యలు, పెద్దయామె పద్మాక్షి. రెండవ యామె వెట్టెమ్మ. ఈమె శాకమూరివారి యాడుబిడ్డ.

క. ఆరాజునకును దుహిత లు
దారలు నల్వురు ఘటిల్లి తనయులు లేమిన్
బేరిమిఁ దమ్ముని కొడుకున్
గోరికలు ఫలింప దత్తుఁ గొనెను సుదారన్

వ. ఈ మహాకావ్యశుశ్రూషాశీలియైన చంద్రమౌళీశ్వరప్రసాదుఁడే యీ దత్తపుత్రకుండు; ఆ కూతుండ్రు రాజ్యలక్ష్మమ్మ పార్వతీదేవి భవానీదేవి పద్మాక్షమ్మలు (శ్రీ చిలుమూరిముళ్ళ విజయసారథియుఁ జిలుమూరిముళ్ళశివరామకృష్ణప్రసాదును నాయుమామహేశ్వరధాత్రీపతిదౌహిత్రులు; వీరిలో విజయసారథి

క. ముప్పాళబాబు వినయము
కుప్ప మతిఁ గుప్రదాత కోమలమతి తాఁ
జెప్పిన కవనపుఁ జేసియా
తెప్ప యతం డొకడు నేను దీర్చని ఋణమున్

చ. వలసినయప్పు డిచ్చె నది వచ్చిన దక్కఁగ కిప్పటికైనను న
వలదన నిచ్చు నేమియననచ్చును తప్పదు పుచ్చుకొను ని
శ్చలరసబుద్ధి యీ విజయసారథి యీ కవిజన్మమెత్తి వి
హ్వలమతి నొందు వంశ మది యంతయు దాసులు చూడ నే సిరిన్

వ. ఆ యుమామహేశ్వరనృపాలుని యింకొక కూతురుబిడ్డయైన శివ రామకృష్ణప్రసాదు

సీ. తనమాటగాఁగ ముక్త్యాలసంస్థానము
ర్యాద లన్నియు సాగునట్టివాఁడు
తన యుపజ్ఞయుఁగ ముక్త్యాలపూర్వ్యవరాజ
కవితారసజ్ఞత కలుగువాఁడు

తనదైనయట్టి సంధానమ్ముగాఁగ ము
క్త్యాలరాడ్వితరణఁ జూపువాఁడు
తనసీతిగాఁగ ముక్త్యాలబంధుత్వంబు
దాఁటిన చెలిమిగాఁ దనరువాఁడు
సత్కవి రసజ్ఞుఁడును విమర్శకుఁడు నాకు
నొకట శిష్యుఁ డాజానుబాహుఁడును మధుర
హాసుఁడును బచ్చదబ్బపండైన మేని
వాఁడు ముక్త్యాల సిరి కోరువాఁడు సతము

వ. ఆయుమామహేశ్వరభ్రాతృశ్వరుని తమ్ముఁడు వేంకటాద్రి, రంగమ్మ పార్వతమ్మ దుర్గమాంబ లక్ష్మిదేవమాంబ త్రిపురాంబ యను నైదుగురు భార్యలతోఁ జంద్రమౌళీశ్వరప్రసాదు సదాశివప్రసాదు దుర్గాసదాశివప్రసాదు గౌరీపతిమహాదేవఠాకూరు అను నలుగురు పుత్రకులతో నైదింద్రియములు నాల్గుపురుషార్థములతోడి యాత్మజీవునివలెఁ బ్రకాశించె

క. ఆయన రెండవ కామిని
శ్రీయుతమతి పార్వతమ్మ సేవించిన భ
ర్త్రాయత్తభక్తిభావ
వ్యాయతిఁ దా ముక్తినేల కధిపతిఁ గనియెన్

వ. ఆ వెంకటాద్రి నలుగురు పుత్రులలోఁ జంద్రమౌళీశ్వర సదాశివ ప్రసాదు లామె కడుపుపంట

శా. ప్రోగుల్ వడ్డ తపస్సులై నెగడఁగా ముక్త్యాలలక్ష్మీపరి
భోగార్హుండగు చంద్రమౌళినృపతిన్ బుణ్యాకృతిం గాంచెఁ గ
ల్పాగశ్రీమతి పార్వతమ్మ బహుజన్మానేకపుణ్యైకరే
ఖాగంధంబు బహిర్గతం బయిన రేఖన్ హేమభూధ్రాకృతిన్

క. ఇది పుట్టిలు చిఱుమామిళ
కుదురు చలువా! తా జనింపఁ గుదురై పుణ్యా
స్పద మైనది సత్తెనపలి
గదిసినచో నెసగు నోర్వఁగలుపురి చలువో?

వ. ఇట్లు ముక్త్యాల రాజ్యలక్ష్మీమహేశ్వరుని శ్రీచంద్రమౌళినృపతిని గన్న యుమామహేశ్వర వేంకటాద్రినృపతులలో నే

శా. అన్నాదమ్ములలోన నే రధికుఁ డాతండంగ ఖ్యాతాత్మ్యసం
పన్నుల్ వారల మైత్రికిం బొరపు గన్పట్టంగఁ బూర్ణాత్ములై
యున్నల్ వారల నేత్రముల్ సుతులుగా నొప్పారిరో నాఁగ ను
త్పన్నుల్ నల్వురు జ్యేష్ఠపుత్రకుఁడు ముక్త్యాలాపురిం జేలఁగన్

వ. ఈ చంద్రమౌళిభూపతి కిద్దఱు భార్యలు; మొదటిభార్య శ్రీ దుర్గ గడ్డమల్లికార్జునప్రసాదధాత్రీశ్వరుని కుమార్తె వేంకట దుర్గాంబా దేవి

క. ఈ వేంకట దుర్గాంబిక
శైవశరీరార్థమైన జననివిధానన్
సేవించెఁ జంద్రమౌళి ధ
రావల్లభుఁ జంద్రమౌళి ప్రాణముగాఁగన్

వ. రెండవభార్య ముత్తనపల్లి నివాసి శ్రీ శోభనాద్రి వేంకటాద్రినాయని ప్రథమతనూజ కనకవల్లీ దేవి

శా. లీలాదేవకియైన యీ కనకవల్లీ దేవియే నవ్య ము
క్త్యాలుం బ్రోవులు పోసినట్లునిన సంతానంబు శ్రీరామగో
పాలాఖ్యున్ యువరాజుఁగాంచె నతఁడే పాలించు నీనాటి ము
క్త్యాలాలక్ష్మిని దండ్రిచే సుకృతిసంతానంబు నేలించుచున్

గీ. రమ్యమూర్తియు మతియును రమ్యగుణుఁడు
రమ్యహాసుఁడు రమ్యమర్యాదుఁడైన
రామగోపాలకృష్ణుని రాజబాల
భైరవాప్తుని గనినట్టి కనకవల్లి

సీ. ఈ యమ్మ యొఱిగిన యెన్నివ్రతంబులో
యమర నిత్యోద్యాపనములు సేయు
నీమె క్షమావార్ధి యెంతలోఁతో సేవ
కావళి యట్టడు గందలేరు
ఈ రాణి దగు చేయి యెంత చల్లో! సిరి
యగు నామె కను పడినంత మేర

నీమె దయాగుణ మెంతటి మస్సృణమో
సేవకుల్ బంధుల చెలువుగాంచఁ
గెలనఁ బ్రవహించుచున్నట్టి కృష్ణవేణి
యొక్క వర్షర్తువున మాత్ర మొప్పఁగాని
యాఱుఋతువుల యందున నార్ద్రహృదయ
నిండి కనకవల్లీ దేవి నిండుకుండ

వ. ఈ కనకవల్లీ చంద్రమౌళీశ్వరప్రసాదరాజదంపతుల గర్భంబుపండిన శ్రీ రాజరామ గోపాలకృష్ణమహేశ్వర ప్రసాదు నర్ధాంగియైన రాజ్యలక్ష్మీదేవి

గీ. చల్లపల్లి ప్రభువు సత్కీర్తనీయుండు
అంకినీడుప్రసాదు నాత్మజాత
యేర్లగడ్డవారి యిల్లా మెపుట్టిల్లు
పొలతి సుగుణములకుఁ బుట్టినిల్లు

సీ. పెద్దరాణి యదెంత ప్రియముగా మాటాడు
పిన్నరాణి యదెంత ప్రియముఁబలుకు
పెద్దరాణి యొసఁగుఁ బేర్మి నే మడిగిన
పిన్నరాణి యొసంగుఁ బేర్మి నడుగ
పెద్దరాణికి మేము బిడ్డ లట్లుందుము
పిన్నరాణికి మేము బిడ్డలమును
పెద్దరాణి తనంతఁ బిలచిపెట్టును మాకుఁ
బిన్నరాణి తనంతఁ బిలచిపెట్టు
కోరి యే రాణి కా రాణిఁ గూర్చి చెప్ప
చుందు రా యత్తకోడండ్ర యురుగుణాళి
మాటమాటకు ముత్యాల కోటలోన
బరమసంతుష్ట మైనట్టి పరిజనంబు

మ. యువరాజ్ఞీ యువరాజు లిద్దఱును బూలో పూలు లేనవ్వులై
యువరాజ్ఞీ యువరాజు లిద్దఱును దావో తావి క్రొంబ్రేమయై
ప్రవహాత్సంస్కృతి రుక్మిణీయదుకులస్వాముల్ రతీమన్మథుల్
శివులై ముక్తిపు రేందిరా ప్రకటరాశీభూతపుణ్యాకృతుల్

క. పోఫ్రాపున కధిపతియును
దీపితజాతీయవాది ధృత్యుత్సాహ
ప్రాపితగైర్వాణ్యాంధ్రీ
శ్రీపారుఁ డశేషనిశితశేముషి తలఁపన్

క. సిండ్రైనమనిసి భాషా
పాండితి కలవాఁడు పెద్దపాయామనసున్
దండిగఁ గృష్ణాజిల్లా
సిండిన గౌరవముగల మనీషియు పోలుచున్

వ. మఱియు గౌరీపర్వత మహాదేవ ఠాకూరు

గీ. కపట మెఱుఁగనట్టి కందనగాయయు
కందు తెఱుఁగనట్టి కంటిచూపు
నెట్టివేళనైన నింత కన్బొమముడి
యెఱుఁగనట్టి మోము నెసఁగువాఁడు

ఆ. తగ జయంతిపురము తన యేలుబడిగాఁగ
గ్రమముఖత తెలుపఁ గమ్మదనము
పోలి యున్నకొడుకు ముక్త్యాలయువరాజు
కూడియుండు నీడుజోడుగాఁగ

వ. ఈ వంశమును జెప్పుచు వదలిపెట్టరాని దొర శ్రీ చల్లపల్లి ప్రభువు
యార్లగడ్డ శివరామకృష్ణప్రసాదు బహదూరుజమీందారుగారు
ఉమామహేశ్వరప్రసాదుగారి మరియొక దౌహిత్రుఁడు

గీ. కమ్మకులమునకును గన్నాకు మంచిత
నమ్ము రూపుగొన్న నవ్యమూర్తి
రాజనీతివేత్త ప్రథిత కృష్ణాబోర్డు
నధిపుఁ డితఁడె యెన్నియైనసార్లు

క. మాయూరిలోపలను మా
మా! యన్నా! యంచు నరుసలై యుందుము మే
మా యచటి కమ్మవారును
మా యదియును గమ్మటూరు మఱిమఱి తలఁపన్

క. కౌశికపర సూరయార్యుఁడు
ప్రాజ్ఞుండు కమ్మవార యీమత్కవితా
వర్ణ్యప్రథమదశాసం
పత్నీలాపోషకుండు పరమసఖుండౌ

గీ. మఱియుఁ గమ్మవంశ మహినేత వినుకలి
దారిగా నిరీ బ్రచారి మబ్బు
నాదు కావ్యమునకు నవ బాలచంద్రము
శ్రావ్యడభక్తిభానుభగమునకు

మ. కలిలో దైవము లేఁడు భూసురు లనంగా ద్వేషఘ్నుపోయె ని
తెలుఁగున్ నాటి మఱీ విచిత్రమయి పొందఁబూని ముక్త్యాల తా
ములు బద్ధాదరులైరి నాఁడు మఱి నేఁడున్ సంప్రదాయంబుగాఁ
కలుగున్ వారికె విన్చి రామకథ యీ కాలుష్యముం బ్రోఁచెదనే

వ. ఇట్టి మన్వంశసంభూతుఁడైన యీ చంద్రమౌళీశ్వరవరప్రసాద ధాత్రీపతి శ్రోతఁగా మచ్చిత్తగత వేదాంతవాసనాపారిజాతప్రసవములు దక్షిణదేశ కుర్తాలము సిద్ధేశ్వరీ పీఠాధిపతులు జగద్గురు శ్రీ విమలానంద భారతీస్వామియుఁ గర్తపురీ నివాసులు శ్రీ శృంగగిరి విరూపాక్షపీఠాధిపతులు జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీ మహంతాచార్యులవారును సాక్షాద్బ్రహ్మములుగా భావించి

క. శ్రీనందమూరు నిలయా!
ప్రాణాంతక్లిష్టికా! కృపాపరతంత్రా!
నానానిగమశిఖాగ్ర
జ్ఞానాకృతి! భక్తజనవశా! విశ్వేశా!

# బా ల కాం డ ము

## ఇ ష్టి ఖం డ ము

### క థా ప్రా రం భ ము

సీ. ఆత్మ నిత్య మ్మకాలాద్యవచ్ఛిన్నమ్ము
సచ్చిదానందసంపచ్ఛ్రయమ్ము
అద్వితీయ మ్మేక మపరిణామప్రాప్త
మపరిమేయ మ్మది యచ్ఛ తెలివి
అట్టి జ్ఞానముతోడ నైకకాలికముగా
నాదిమునుల్ గల రా ప్రభువులు
యోగనిద్రాముద్ర నూని తామే యద్దై
యదియ తామై యుందు రమృతకళలు
ఆత్మతో నాది మునులెట్టు లవనితోడ
నాదినృపు లైకకాలికులై చరింత్రు
ఆనృపులయందు నిక్ష్వాకు వంబుజాప్తు
మనుమఁ డొప్పు వైవస్వతమనువుకొడుకు

శా, ఆయైక్ష్వాకులు కోసలంబులు నయోధ్యాపట్టణస్థానిగా
భూయోధర్మ వివర్ధమాన విభవస్ఫూర్తిన్ గృతత్రేతలన్
క్ష్మాయోపానవ కంఠహార తరళ స్థానీయులై యేలి రా
గ్నేయంబైన మహస్సుతో శ్రుతివిధానిర్ణీతధర్మంబుతో

క. ఆ రాజు లొక్క రొక్కరు
నారాయణమూర్తు లుగ్రనారాచపథ
స్వారాజ్యస్ఫారావన
వీరకళాకేళి ధర్మ వితరణ పటువుల్

సీ. అందఱు తండ్రులు నలధర్మకాములు
తనతండ్రి యేకకాంతారతుండు
అందఱు తల్లులు నవనిరాట్కన్యలు
తనతల్లి యప్సరోజనవతంస
యందఱు బిడ్డలు నధికధర్మాత్ములు
తనబిడ్డ ప్రత్యక్షవనజనేత్రుఁ
డందఱు భాగ్యమ్ము లతినాకములు తన
దగు భాగ్య మఖిలలోకాతిశాయి
తనకడుపు విష్ణుఁ బడించుకొనుటచేత
మునిజగన్నేత కశ్యపు మొదలియుద్ది
దశరథుం డొప్పు నైక్ష్వాకుధరణిపతుల
లోనఁ దన పూర్వు లందఱిలోన మిగిలి

ఉ. ఆరయ నెందఱేని కల రాయన కంగన లందు మూఁగు రిం
పారిన ప్రేయసుల్ గుణగణాఢ్యులు కోసలరాజపుత్రి దే
వేరి సుమిత్ర శాంతగుణపేటిక కేకయరాజకన్య హే
లారతి డాగురేకుల తళ్తళ కాఁటుక రాజుకంటికిన్

సీ. కౌసల్య ముక్తికాంతాసమానాకార
నలి సుమిత్ర యుపాసనాస్వరూప
విజయరమాకార వినయాంబుధి సుమిత్ర
కైకేయి మధుసామగానమూర్తి
కౌసల్య నవశరత్కాల మందాకిని
సితపుండరీకంబు శ్రీసుమిత్ర
మందారపుష్పంబు మహిళామణి సుమిత్ర
కైకేయి నునునల్లకల్వపూవు
ధర్మకామంబు లీరెంట దశరథుండు
ముగురు భార్యలందును రసమూర్తులందు
నమృతసౌఖ్యానుభూతి, నధ్యయనసుఖము
తీర్థభోగసుఖమ్ము సిద్ధింపఁగనియె

చ. ధరణిని న్యాయమార్గమునఁ దన్పుచు షష్టిసహస్రవర్షముల్
పరమసుఖంబులంది నరపాలుఁడు ధర్మగృహీతకామినీ
పరమసుఖంబులంది నరపాలుఁడు శత్రునిబర్హణక్రియా
పరమసుఖంబులంది నరపాలుఁడు తృప్తిని గాంచఁ డింతయున్

చ. సితతరకాంత్యుషఃప్రభల చేరువఁ జీరఁగ నల్లచిర్మొగిల్
గతి వికసత్సితాంబుజముఖంబున శైవలవల్లి పోలికన్
సతుల మొగంబులం దొక విషాదపురేఖను గాంచి ధారణీ
పతి యిదియేమియం చడుగఁ బట్టఁడు తానును దీనవక్త్రుఁడై

ఉ. నాలుగు కంధులన్ నడుమ నాటిన స్వీయజయప్రభావతా
కాలలితంపుఁ జాలనము క్ష్మాపతి గుండియకున్ సుఖంబు తేఁ
జాలదు వేదనీత్యుపనిషత్సకలాగమపారవేది భూ
పాలుని గుండియన్ నిలువఁబట్ట దతృప్తి యొకండు దట్టమై.

మ. అసివాళ్ళేగుచు ధారణీపతి యయోధ్యావీధి నేవర్ణపున్
శిశువైనం గనిపించినన్ నిలచి వీక్షించున్ హసించున్ గృపా
వశుఁడై వానిని దీసి యెత్తికొని యే భక్ష్యమ్ములో తెచ్చి యి
చ్చు, సమాశ్వాసన సేయు నంతటన పుచ్చున్ దీర్ఘనిశ్వాసమున్

సీ. అంగళ్ళలోనఁ గ్రయ్యంబులై యుడిన శి
శుశ్రేణి యాటవస్తువులు చూచి
ఏరైనఁగొని యింటికేగుచో దారిలోఁ
దోతెంచు నుయ్యెలతొట్లు గాంచి
చిత్రపటంబులన్ జిన్నిపిల్లలు నవ్వు
చున్నట్లు వ్రాసిన యొఱపులరసి
ఎందైనఁ బసిపిల్ల లేడ్చుచున్నట్లు వి
న్పించినఁ జెవియొగ్గి విని చలించి
తనమనోవాంఛ యెల్ల సంతానమయము
గాఁగ నజధారణీపతికన్నకొడుకు
అవని రాజ్యకార్యముల మధ్యమునఁగూడ
దన్నె విస్మృతిఁ గని పరధ్యాన మందు ౧౧

గీ. రాజపూరుషామాత్యతనూజు లెవ్వ
రైనఁ దంత్రులతో సభ కరుగుదెంచి
నపుడు పతి రాజకార్యము లట్టిపెట్టి
వారితోఁ గూడి కాలయాపనము చేయు

ఉ. భూపతి కోర్కె వ్యక్తమయి పొల్చినయప్పటినుండి రాణులున్
లోపలివాంఛలన్ బలుకులలో వెలయింతురు సుస్ఫూర్తి గల్గఁ బృ
థ్వీపతి వారిపైఁ గలుగు ప్రేమము పుత్రసమీహఁ జేసి వే
య్యై పదివేలునై యమితమయ్యె ముదాత్తరతిప్రగల్భతన్

చ. మహిపతి పుత్రవాంఛయుఁ గ్రమక్రమ వర్ధితమ్ము సమస్త భూ
వహనము మంత్రులందిడి సభాముఖమే కనుకున్న వారలున్
దహితహ పొంది సర్వవసుధాపతి సౌఖ్యమునందఁజేయు స
న్నహనము పెర్చి తాదొకటనంబునఁ గూడిరి యోజసేయఁగన్

వ. ధృష్టి జయంతుఁడు విజయుఁడు సిద్ధార్థుఁ డర్థసాధకుఁ డశోకుఁడు మంత్రపాలుఁడు సుమంత్రుఁ డను నెనమండ్రురు మంత్రులు గూడి తమలోఁ దాము రాజుదైన్యంబు వాపు టెన్నఁగానక యది యెల్ల తమ దోషమని భావించుచుండ వారిలో సుమంత్రుఁ డిట్లనియె

సీ. మీరు మంత్రజ్ఞులు మీరింగితజ్ఞులు
ప్రియహితరతులు ధాత్రిపతికెపుడు
మీరు యశస్వులు మీరనురక్తులు
రాజకృత్యములందుఁ దేజుకలరు
మీరు పండితులును హ్రీరమ్యులు కుశలు
లనురక్తి లోకక్రియం దొకళ్లు
నీతిమంతులు మహోనియతేంద్రియులు బహు
శ్రుతులు శ్రీమంతులు శుద్ధమతులు
మీరలు మహాత్ములరు త్రయీపారవేదు
లన్నమాటకు వెనుకాడ రమితవిక్ర
మాన్వితులును తేజఃక్షమాయశములు కల
రనృతమాడరు క్రోధకామార్థు లగుచు

వ. ఇట్టి మీయందొకండు దోసంబు కల్గునే ? మీ గుణగ్రామంబులు
గణనసేయఁ బెక్కులు కలవు

ఉ. నవ్వుచుఁగాని పల్కరు మనంబుల నీసును బెంప రెంత దా
దవ్వుల వార్తయున్ సువిదితంబగు మీయెడఁ జారచక్షుషుల్
చివ్వల జేని కీరు కుడిచేతులు సౌహృదవార్ధు లెంతగాఁ
ద్రవ్విన నంతగా వెలికిరావో భవద్గుణరత్నసంతతుల్

చ. బలమును గోశమున్ జెడక పట్టుదు రెంతయుఁ బ్రాప్తకాలదం
డులు రిపుఁడైన నిష్కలుషు నొవ్వగఁజేయరు శౌచవంతులన్
దలపయిఁ బెట్టుకొంద్రు వసుధాదివిపన్నరపాలవంశ్యులన్
గలఁపక కోశవృద్ధికగు కార్యములన్ నిపుణుల్ ప్రియంవదుల్

వ. ఏతాదృశగుణగణాన్వితులరైన మీరు పాలించుటంజేసి యుత్తర
కోసలమ్ములు సుభిక్షమ్ములై యున్నయవి. జేసికిఁ బుత్రసంతానంబు
లేమి మీ దోసంబగునే యనిన వారలు నతనితో నిట్లనిరి

చ. ప్రథితయశల్ జలేజహితవంశపు జేండ్లకు నీవు నచ్చు సా
రథివి నృపుండు నిన్ననుజురాణను జూచు సమస్తశాస్త్ర నీ
రధివి భవద్బలంబునన రాజు బెడందలు వాపనెంచు ధీ
రధిమణిపోల్చు మాకిపుడు రా! యొక త్రోవను జూపవే యిఁకన్

క. నీకు సుమంత్రుండను పే
రే కలిగె సుమంత్రధీధురీజన్యగిరీ !
నీ కెఱుఁగరాని త్రోవలు
మా కెఱుఁగగరావు చూడుమా మంత్రిహరీ!

వ. రాజు శోకంబార్చుట నీపని నీచూచు రాజకార్యంబులు చూచుట
మాలో నర్థసాధకునిపని యని ప్రియవాదాజ్ఞాపూర్వకంబుగఁ
దక్కిన యమాత్యులు పలికిన

ద్రుతవిలంబితము.

మదిసుమంత్రుఁడు మంత్రులమాట కొ
ప్పుదల పూనునొ పూనఁడొ యన్నటుల్
వదన మింతగ వంచి యనంతరం
బిదియ మీఁదగు నిష్టమగ్నైనచో

అశ్వగతి

పోయెదనంచు వచించి విభుం గన నశ్వముపైఁ
బోయె సుమంత్రుఁడు మంత్రులు పొందిరి సంతసమున్
శ్రీయుతవజ్రమహాశ్మగరిష్ఠసుసౌధముపై
క్ష్మాయువతీసుమనోహరు గాంచె సుమంత్రుఁ డొగిన్

మ. తనరాకన్ బలియంగ రాకయ పరధ్యానంబుగా నున్న రా
జును వేఁజేతులు కట్టుకొం చెదురుగాఁ జూపై సమీపించి ని
ల్చిన భూమీపతి కొంతసేపటికిఁ జూచెన్; జూచుచున్ నిన్ సుమం
త్రునిగా నెంతు, సుమంత్రుఁడే యని తలంతున్ నీవు నిక్కంబుగాన్

వ. ఈ యర్ధరాత్రంబున నేలవచ్చితివన సుమంత్రుం డిట్లనియె

చ. రఘువులనాటనుండియు సరఃప్రభవాప్తుని వంశభూపతుల్
మఘువుని యుద్ధముల్ సనఁగ మారథమెక్కిరి బాహుదర్ప సా
రఘనులు మీకవారో తరతరంబుల బంటులమేము మీరు దా
నఘనులు నేది కావలసినన్ జనుదెంతుము మిమ్ముఁజూడఁగన్

క. అని మంత్రివలుక భూపతి
యును నీకొక్కండు వలయునో యది యడుగన్
నను వలెనో? నీ వలసిన
దనుక నెదురు చూడమికి స్వాతంత్రత లేదే ?

క. నీకేది వలయునో యది
సైకొమ్మన నాకు నేమి కావలయును మీ
రీ కరణి దిగులు పొందుచు
మాకు దిగులు కలుగసేత మానఁగవలయున్

శా. నిద్రాహారములెల్ల మాని యిదిగో నీ మంత్రులున్ గాఢశు
క్రుద్రూసంభవదష్టులై మెలికలుంగాఁజుట్టుకొంచుంద్రు నన్
భద్రా! పొమ్మని పంచి రీయెడకు నన్ బాలింపవే నీవా య
త్క్షుద్రాత్ముండవు యాజ్ఞికుండవు నిదా శోకంబు నీబోటికిన్

వ. అనిపలికిన విని తేడాసనంబున మసలి మరల వంగి కూర్చుండి కపో
లమ్ము కేలనూది యుస్సురని నేత్రంబుల బాష్పంబు లురలి మంత్రీ!
యని పిలిచి

సీ. ఇడి పొత్తికల భార్య నడికట్టుతోవచ్చి
యందీయఁ బసిపాప నందుకొనఁగ
చిటికతోఁ బల్కరించినఁ దొట్టెలోబిడ్డ
బోసినవ్వులచిట్టిహాసు మఱుగ
రా బాబు నీవిట్లురా యని నవ్వుచుఁ
జేసాచ మార్నవ్వు శ్రీలకుబుక
గృహముఁ జేరినయంతనే కాళ్ళకడ్డమ్ము
వచ్చి మోకాళ్ళులఁ బ్రాక నుబ్బ
తతసుకృతమేమిచేయు దంపతులు ధాత్రి
నోచుకొందురో నేనింత నోచలేదు
అల్ల కౌసల్య నోచలేదా సుమిత్ర
నోచలేదు కైకేయియు నోచలేదు

ఉ. పువ్వులు దిండ్లు మంచములు పుత్తడిబొమ్మలు నింద్రనీలముల్
గ్రువ్విన కుడ్యముల్ చిలుకకొయ్యలు మారకతంబు లన్నియున్
నివ్వటిలున్ నిరంత మవినిందితభోగము లింటిలోపలన్
దివ్వియలే దివే మనుమతించెదు చీఁకటి ముద్ద లన్నియున్

ఉ. ఓరగఁ బుణ్యలోకము లటుండఁ బ్రజార్థముకానియట్టి భా
ర్యారతి చూడఁ బాశవము కన్నను హీనము సంతులేని సం
సారము సేఁత ధర్మపరిసంగతి మాలిన రాజ్యపాలనం
బారయ ద్రవ్యకామమలినాత్మలు సేయుదు రిట్టి పాపముల్

ఉ. నా మును చన్నతేండ్లు నలినప్రియబంధుని కోవ దీపమా
లామహితోజ్జ్వలచ్ఛలదిలాపతిసంతతి వెల్గఁజేసి రే
నో! ముదుసళ్ళ యందఱ తిలోదకహారిని నన్నుఁ జూడుమా
నా మొగమందు వ్రేలెడిని నాపితృదేవత లాస్యదైన్యముల్

సీ. ఆత్మజుఁ డన్న తీయదనం బెఱుంగని
చిత్తంబు ఊరూపు చేదుకట్టె
ప్రియసుతుఁ డన్న జాబిల్లిఁ జూడని కన్ను
లవి యప్రసన్నతాంధ్యంపు గూళ్ళు

కొడుకన్న చిన్నారి పడవ చేరని వాని
బ్రదుకు ఝంఝామరుత్ప్రళయవీధి
కొమరుఁడన్ పుణ్యకర్మముఁ గాంచ నేరని
కట్టడి పున్నరకంపుఁ ద్రోవ
తనయుఁ డన్న సూక్ష్మతత్త్వం బెఱుంగని
జీవి మాయలోనఁ జిక్కుకొన్న
యనదపుర్వు వాని కైహికాముష్మికం
బులు నశించు దారి వెలుఁగు లేక

వ. అని యనుచున్న రాజునకు సుమంత్రుఁడు

గీ. జనపతి! సుహృత్తులో బంధుజనులో యుక్తి
చేతితోఁ దీసివేసెడు సేగి కాదు
దైవ మనుకూలమైనప్డు తమకుఁగూడఁ
గొడుకు గలుగును నే నెఱుంగుదును దీని

ఉ. ధారణి యెల్లయుం దిరుగుఁ దాను సతారము సూర్యమండలా
ధారము గాఁగఁ జక్రధరధారి సమండలమూర్తి జ్యోతియా
సూరుఁడు వోల్చు నక్షిఘటుఁడుండు తదంతరవర్తి మానవులా
ధార మతండు సూర్యకులధామము వెల్గుగ లేక మ్రగ్గునే!

సీ. ఐక్ష్వాకనృపులు త్రయ్యర్థ నిర్ణయ విధా
మీమాంసలకును నాఁ మేడితములు
కాకుత్స్థరాజు లాగమ మహావిజ్ఞాన
శక్తి కథ్యాహారసముదయములు
రాఘవుల్ ధర్మచరణ చారణ వివేక
నిధికిఁ బౌనఃపున్య నియతమతులు
మాంధాతృవంశభూమండలేశులు పరం
జ్యోతిరంతర్భావశుద్ధమతులు
తమకతంబునఁ ద్రేత కృతంబువోలె
నూత్నఖట్వాంబు దీధితి నూలుకొల్పు
ద్వాపరము కొంత గడచునప్పటి కథాళి
త్రివేద విదేల దశరథరాజమౌళి

చ. పుడమిని ధర్మపుం గొఱతఁ పుట్టని యన్ని దినాలు మీఁదు వం
గడమునఁ జేటులేదు; మొలకల్ గలుగుఁగా బెనువృక్షరాజి య
య్యెడు ఘనశాఖికాంచలగృహీతదిశాంతములై ద్విజాళి గూ
ళ్లిడుకొని గొంతులెత్తి వెలయించు నుషోమధురార్ద్రగానముల్

శా. నీరాజ్యంబున ధర్మపుంగొఱతగానీ యొవ్వధాశోకి! పృ
థ్వీరాజ్యప్రియకేకి! వేయి దివిటీల్ వేయించినన్ లేదు నీ
దోరగ్రస్థితచాపదండ మటులే తూణీరమల్లే నుషు
ప్త్యారంభంబును బొందుచుండ నిటు ధర్మారంభముల్ పొల్చెడున్

క. నాతోరా! ఱేప యయో
ధ్యాతీర్థము సేసివత్తు మట ధర్మి! భవ
చ్చేతము చేసిన పున్నెము
గోతమ్ముల నెత్తికోనగున్ నరపాలా!

క. తొలిపేండ్ల యేలుబడిఁ గో
సలములు మీ యేలుబడిని జను నొఱపులతో
వెలసినవో? నాకు మాత్రము
నలువుగ మున్నిట్టులుండెనా? యనిపించున్

వ. అన్న మంత్రిమాటలకు రాజు కించిదధరవిస్తారమాత్రగోచరంబైన చిఱునవ్వుతోఁ జాలు చాలు నోయి సుమంత్ర! మంత్రులే తమ పాలనంబ తామ పొగడికొం టెత్తుకొందు రట్లైన నెల్లియ యయోధ్య చూచివత్త మని యతనిని వీడ్కొలిపి తానును సుఖనిద్రం గనియె. సుమంత్రుఁడును హృదయాహ్లాదసూచివదనారవిందవికాసుఁడై తన యింటికరిగి సుఖనిద్రం బొంది మఱునాఁడు ప్రొద్దుపొడుపువేళకు రథ మ్మాయితంబుసేసి రాజద్వారంబున నిలిపి లోనికిం జని

గీ. అవనిపతిఁ జూచి మ్రొక్కి తే రాయితంబు
చేసి తెచ్చితి నన మందహాసమొకఁడు
విని యనుమతించినట్టి సూచనగఁ జేసి
వెడలెఁ బౌరదర్శనయోగ్యవేషుఁడగుచు ౪౭

బూనికన్ ఖదను పోవఁగా రథా
స్థాని రాజు మెయిసాగ నూగుచున్

ఉ. అంతట నింక నొక్క పథమై రథ మేగ నమస్కరించు సా
మంతులు రాజసంఘములు మచ్చుల సావడులున్ మహానగ
ప్రాంతులు కూర్చు రత్నములరాసులయంగడు లన్యభాషలన్
వింతగఁబల్కు వర్తకులు వేలకువే లగపించి రచ్చటన్

సీ. అతిభక్తి బలికర్మ లాచరింతు రొకంట
ధృతి రచ్చసావళ్లఁ దీర్తు రొకఁట
శాలితండులముల మేలిమందు రొకంట
నిక్షురసంబు లందిత్తు రొకఁట
నొకఁట మహారథప్రకరమ్ము విహరింతు
రొక్కంట యోధుల నుత్సహింత్రు
ఒకఁట దుందుభిమృదంగకములు మ్రోగింతు
రొకఁట వీణానాద మొలుకుచుంద్రు
ఎవనిఁ జూచిన నారాజ్యమెల్లఁ దనది
యన్నటుల నుత్సహింతు రందున్న ప్రజలు
దూరమున రాజుఁ జూచినతోఁ గరములు
కట్టుకొని వంచి తల భక్తివెట్టుచుంద్రు

చ. రథము పురీబహిఃపరిధి రాఁగను దోలె సుమంత్రుఁ డచ్చటన్
బృథులవియత్ప్రచుంబిశిఖరిన్ బటుదుర్గపుగోడఁ జూచి నీ
రధివలెనొ నగర్తఁగని రాజభటుల్ బురుజుల్ గమించి బా
ణధులును యంత్రముల్ గొని రణస్థులుగా నిలుచున్కిఁ జూచుచున్

వ. ఇట్లు డున్నతటి సుమంత్రుండు

సీ. స్వర్గ మన్గొవు వెన్ జను త్వత్పురీవృష
గళమున వ్రేలాడు గంగడోలు
ప్రళయకాలమున వైవస్వతమనువు చే
మిగిలిన తొలిచోటమీనుముల్లు
మనువంశ్యపతుల ధర్మపు స్వాతిచినుకైన
ముక్త కయోధ్యకు శక్తి డిప్ప

త్రేతగా జాటుడు కృతపురుషుండు కాల
నిలువఁ ద్రొక్కిన నిట్టి నేలకొనుపు
ఊర్ధ్వలోకపుఁ బ్రాసాదాల మొలుగనుండె
గట్టిపాకంబముగ నిల్పినట్టి పోటి
పార్థివేంద్ర! యయోధ్యనగ్రసంపుగోటి
యీ పురీజయలక్ష్మికి నినుపలోగ నగు

సీ. సరయూనదీకన్య సంత్రేగ మొను ఘనక్ర
భూప్రపదశ్రీణముగాఁ బొలుచు నిచట
గాధేయదృష్టసుంత్రతాపసాశ్రమసీమ
వరుణుఁడు తోలి త్రేసిన నంగ నిచట
నా భగీరథుని రాజ్యపునేల యని జాలి
మందాకినీదేవి మలఁగ నిచట
సాగరుల్ త్రవ్వ రసాతలవాహినుల్
బుగ్గలు బుగ్గలై పొడిచె నిచట
నట్టి యీ వారి రిపులతోఁ బుట్టు పగఱు
లైన దుష్కర్త శత్రులతోన త్రాంచు
నీ ప్రతాపంబు పేర్మి మన్నించుకొంచుఁ
గడఁగి నీ రాజధానిని గాఁగిలించె

వ. అని వచింప నతని ధర్మానుబంధ్యద్భుతోద్రేకషలను రాజు సంతో
షించుచున్నంత

మ. కమలశ్రీ తన దివ్యబాహు లలమంగా సూర్యరశ్మిల్ విశా
సముఁబొందెన్ వెన్నుదిప్పి రేసగమి యా హేమ్మపాలు కోటన్ హాజా
రమునన్ దుందుభినిస్వనంబు పటహారావంబు వీణాధ్వనుల్
క్రమమొప్పన్ వినుపింప నంతిపురిఁ జేరన్ దోలి రశ్వంబులన్

క. మిగిలిన దినమెల్లను తేఁ
డు గనగ సంతోసమునఁ గడుం గల మొగమొ
ప్పఁగ నున్నఁజూచి మంత్రులు
పొగడిరి బళియని సుమంత్రు బుద్ధకుశలతన్ ౬౦

వ. ఆ మఱునాఁడు సుమంత్రుండు తేరెక్కించి రాజును మఱల బయలు దేరఁదీసి

చ. మఱి యరదంబు బ్రాహ్మణుల మాడువు లుండిన రథ్యఁబోవ నం దఱు నటు స్రగ్వులుఙ్ మకుటధారులు కుండలులుఙ్ ముదాననుల్ వెలితలఁవేది కర్మకృతిఁ బేర్చెడువారలు వేదపాఠకుల్ గుఱిచెడకుండ నేత్రములకుఙ్ నడుమఙ్ దిలకించు వారలుఙ్

చ. కనఁబడి రంతటఙ్ రథము క్షత్రియు లుండినపేఁట నేగుచో ధనువులు చేతఁబూని ముఖతామరసంబుల వేదఘోష లిం పొనరఁగ క్షత్రబ్రాహ్మణమహానిధు లొప్పఁగఁ దోఁచి రందఱుఙ్ గనఁ గన నొక్కఁడొక్కఁడునుగా ననలుంసును నింద్రుఁడుఙ్ బలెఙ్

వ. అంత సూతుఁడు

క. గణగణమని కేతన కిం
కిణు లులియఁగ రథముఁదోలెఁ గేళీప్రచల
ద్వినమితకంధరగుంజ
ద్వనజాప్తతురంగవజ్జవంబుల హరులఙ్

వ. తోలి యేన్గుకొట్టంబులం దరిసి చూపి

గజవిలసితము.
చీఁకటు లివ్వికావు జిలుఁగు తళుకు జిగి
దంతాకృతి గానరాద యసలు నలుపుటిరుల్
గాక నగాళికావు కదలవు మెదలవు
ముందీ కరిరాజి లేద యిటు గునగున కదుపఙ్

సీ. దిగిభముల్ సకుటుంబముగ నిందు వచ్చెనో
వసుధ మీ మోయుట భార ముడిగి
అరులదుర్యశము లిం దరిగెనో మీ ఖడ్గ
ముద్ర దంతవ్యాజమున వహించి
మీ కంటిబొమముళ్ళు సాకారముగ వచ్చి
కదుములు గట్టి యీ కరణిఁ జనునో
న్యాస ముంచెనో యింద్రుఁ డసురుల భయముచే
మీపురిఙ్ దన మణుల్ రూపుమార్చి

గోవులు ధాన్యముల్ గుఱ్ఱముల్ లేనివా
రధికకాములు నపేతాభరణులు
దీనులు వ్యాధిబాధితులును క్షిప్తచి
త్తులు నకాలమృతబంధువులు నైన
జనులు దశరథభూపాలసన్నిధి కరు
దెంచిరేని భూపతి సేఁగిఁదీర్చఁగలఁడు
రండు రండోయి జనులు రారాపు లోఁబుఁగ
నిట్టె రండని భేరివేయించె మంత్రి

సీ. ఎవఁడు నృశంసుఁడో యెవఁ డవిద్వాంసుఁడో
యెవఁడు నాస్తికుఁడో ప్రేమహీనుఁ డెవఁడో
యెవ్వఁడు లోభియో యెవ్వఁడు క్షుద్రుఁడో
సంకరుఁ డెవఁడో తస్కరుఁ డెవండో
బ్రాహ్మణులను వేదపాఠి కాఁ డెవ్వఁడో
ధర్మి కాఁడెవ్వఁ డదాత యెవఁడో
యెవఁ డాహితాగ్ని కాఁ డెవ్వఁడు యజ్వ కాఁ
డెవఁడు షడంగవేదీతరుండో
తమ కులాచారరీతులు తప్పినట్టి
వార లెవ్వరో వారిని వారిఁబట్టి
ఱేని యెదుటికిఁ బిలిపించి తే నిగూఢ
ముగను చారులకెల్లను ముదలవెట్టి

వ. అంత బహుదినంబులు చనియుఁ దన కిది లేదని ఱేని యెదుటి కొక్కఁడును రాఁడు. వీఁడు దురాచారుఁడని రాజభటు లొక్కని బ్రత్యక్ష పఱుపరు. దినములతోఁబాటు రాజు చింతయు వృద్ధిపొందుచుండె

చ. మఱల నమాత్యులెల్లరు సుమంత్రునిజూచి ధరాధినేత కీ
యఱమఱ పాయునే? శుభములందుదుమే? యల దైవ మింత స్రి
గ్గతి బొనరించుచున్న కడగండ్లను దీరునె? నీవు పోయి క్ర
చ్ఛఱ నొకతెన్నుఁ జూడవలె జాగొనరింపకు మయ్య ధీనిధీ!

వ. అని వేగిరపెట్టి తోలినఁ దాను బయలుదేరినవేళ లగ్నముకట్టి శుభ
గ్రహంబు లుచ్చస్థితినుంటఁ జూచి చింతావివశుండైన రాజుతో ౭౯

హరిణాక్షి! మనబాము లన్నియుఁ దీరెనే
బెడదలు తొలఁగెనే బిసరుహాక్షి!
మత్స్యపుచ్ఛాభిరామవిలోచనాంచల!
సుకృతముల్ పండెనే ముకురవదన!
క్రీడ హయమేధ మన్న నాఁగేటికొఱ్ఱు
లాగి పాపంపు బెట్టపొలాలు దున్ని
దివిజతర్పణ మన్న బోదియలు ద్రవ్వి
మంచిసుతు లను శాలి పండించివైతు

ఉ. నీకనులంచులందు మలినీభవదార్తి నవాంజనాచ్ఛరే
ఖాకమనీయతన్ గనెడుఁగాక సుసంతతి కల్గునంచు తే
పే కద యశ్వమేధక్రతు వింతటఁ బూర్తియగున్ మఱింతటన్
నీకడుపున్ ఫలించు రమణీ! రమణీయమణీఘృణీతతుల్

క. అని సమ్మోదవిచలిత చ
రణనీరజయుగ్ముఁడై ధరాపతి పరిష
జ్జనసామంతామాత్యకృ
తనమస్కృతి సింహపీఠిఁ దాఁ గొలువున్నన్

క. అధిగతయాథాతథ్యుఁడు
సుధామయహృదంతరప్రశుద్ధజ్యోతి
ర్మథనజనిత ఫేనాంచల
విధావదననీరజప్రవిస్ఫురితుండున్

శా. చేతోరాజితనిశ్చలాత్మమయసచ్చిద్వ్యగ్రనిష్ఠాపరం
జ్యోతీరూపుఁడు భ్రూవిలగ్నపటుతేజోగాఢలజ్జానమత్
స్ఫీతాంభోజనియోని కేశవపదాక్షీణప్రభావుండు వి
ద్యాతత్త్వాఖిలపుంస్వరూపుఁడు సరద్ద్రాఘిష్ఠరోచిష్ణుఁడున్

చ. తొణికెడుకోప మేఁచి తనతో వివదించిన గాధిసూతి యే
మునివృషభేంద్రు కంటికొన ముంగిట నెట్టనిజీఱఁ దేను జా
లని బిగువుల్ సడల్చి యవలన్ వనజాసనుమాట చాల కా
ఘనుఁ డనుదాఁక బ్రహ్మఋషి కాఁడొ యతండు వశిష్ఠమౌని తాన్

సీ. పరమభర్తృవ్రతాపాతివ్రత్యపేటిక
జనులయాయువుఁ బెల్చు మినుమినుచుక్క
సప్తర్షిమండలాస్థానికాదీపిక
యతివరూపముఁ గొన్న యచ్చవెలుఁగు
పనస్సవంకరఘురీనీరకతకంబు
నీలువాంస్రసుర తల మేలిపువ్వు
మూర్తిమద్వేదసమూహాతిథ్యశ్రేణి
ముగుదతల్లుల మీఁద మిగుల వెలిసి
యంగనాజనస్కచారితార్థ్యచరణము
నసయనంబులు గన్న పుణ్యముల ప్రోవ
రుంధతీదేవి యా మునీంద్రుని గృహంబు
వెలుఁగు వచ్చె వశిష్ఠుఁ డా వెలుఁగు వెలుఁగు

చ. సరగున వెంట మానిపరిషత్ప్రథమాసనయోగ్యుఁ డుగ్రసు
స్థిరమతి వామదేవుఁ డరుదెంచెను లేచి సభాసదుల్ ధరా
వరుఁడును మంత్రులున్ మునులుఁ బాద్యము లర్ఘ్యము లిచ్చి తన్ని త
త్పరమపుటాజ్ఞఁ గైకొని సభాగతవేదు లలంకరించుచున్

గీ. అంత జాబాలి వచ్చె సుయజ్ఞుఁ డరుగు
దెంచెఁ గాశ్యపముని యరుదెంచె నంత
రాజునకు నాప్తు లా మునిరాజులకును
నొగి సమర్ఘ్యము లిచ్చి కూర్చుండఁబెట్టి

చ. ధరణితలంబునందుఁ బ్రభుతన్ వెలయించిన వొక్కసారిగా
గురుతరగోనిధానములు కోమలకాంతులు దీప్రముల్ దివా
కరకిరణంబులున్ మనువుగా మొదలైన కులంబు జ్యోతిరు
ద్ధురమతులైన మీ వెలుఁగుతో వెలిగించిరి ధాత్రి మానవుల్

చ. ఇనకరసంతతిప్రతతి కించుక సాగని లోప మున్నదే?
మనుకులసంతతిప్రతతి మాయెడ సాగని లోపభీతి క
ల్గినది భవత్తపోబలము కేవలరక్షగ నున్న మాకులం
బున ననుఁబట్టి లోపమని పుట్టఁగఁజేయకుఁ డంజలించెదన్

క. పుత్త్రార్థ మశ్వమేధము
సత్త్రం బొనరింతుఁ గల్పసరణిఁ బటుతరా
మిత్త్రాఘకృతి గలుగఁగఁ
బుత్త్రులఁ గలిగింతు వంశముఁ వెలిగింతుఁ

ఉ. ఊఁదిన యోగనిష్ఠులయి యుర్వికి మీరలు మూలకంబముల్
పాదులు పెట్టినట్లు నిలువంబడి రంతన మీఁదునాజ్ఞలఁ
గాదని యల్లబ్రహ్మయును గాలిడ లేఁడు దయాప్రసార రే
ఖాదృతిఁ జూడుఁడీ క్రతువు సాంతము సేయుఁడి యాప్తబుద్ధులై

చ. తతమహిమంపుఁ బ్రోవయిన తాత! వశిష్ఠ! సమాదరింపు దే
వతలకు బ్రహ్మవోలె మనువంశపు ఱేండ్లకు నీవుగా పురో
హితుఁడవు ముఁ దిలీపునకు నిచ్చిన నందినివోని యీమహా
క్రతుఫల మిచ్చి నాకుఁ బ్రసరన్మనువంశముగాఁగఁ జూడవే

క. చేతోజారాతులు వి
ద్యాతరుణీప్రాణనాథు లావిర్భూత
జ్యోతిష్కులైన మీదు మ
హాతపములు మాకు నిప్పు డండగ నిలుచుఁ

క. అహిమకరద్యుతిసంతతి
దహదాత్మజ్యోతిరుగ్రధామనిధులు భ్రూ
విహరదమృత లేఖులు మీ
మహిమజలధు లిట్టె పొంగి మము రక్షించుఁ

క. సర్గపురాకాలజగ
న్నిర్గమనప్రాక్సనామసీమాంతస్సం
సర్గకరణపృథుసంక
ల్పార్గళములు లేని వెలుఁగు లవి రక్షించుఁ

శా. అంచుం బల్కెడి ధారణీశ్వరుని ధర్మాధీన చేతంబు వే
ద్యాంచద్వస్తువినిర్ణయోగ్రధిషణాతాత్పర్యముఁ సమ్మదో
దంచత్పూరము నింప నాత్మలను గాఢాహ్లాదులై యేమియుఁ
మించఁ లేదు ప్రజఁ ఘటించెదవు సుమ్మీ! నీవునుఁ భూమిపా!

ఆ. అయిన నశ్వమేధ మాచరింపుము మేధ
ప్రాప్తి హేతుభూత మశ్వమేధ
మదియు వేయిపుత్రు లంతరించు ఫలమిచ్చు
నట్టి యొక్కసుతుఁడు పుట్టఁడెట్లు?

వ. అని లెక్కిన ఋషు లనుచుండఁగ నారింతి ప్రియయుఁ గ్రతి

ఉ. నాయన! యశ్వమేధము నొసఁగ్గు గరిష్ఠ సుపుత్రలాభకృష్టి నా
రాయణుఁ డిచ్చెదన్ సావిను నందిగ నాపను నీయుపస్థిగ
ఖాయతిఁ బుత్రుఁడున్ గలుఁగుగా సతతమ్ముఁ గోరు సంప్రదిక
న్యాయవతీశిరోమణిఁ మహాసుకృతాంబుల పంట పండఁగా

వ. అంచు నేత్రమధ్యభాగాగ్రోన్మీలనంబును నేత్రాంతవిస్తారితయుం గా
ఫాలభాగంబు తేజంబుపుంజంబుగా సమూఢగతుఁ డైనట్లు తోఁచిన

క. పతి సంభ్రమచకితుఁడు ముని
పతి పాదములందు వ్రాలి బాష్పసారి
ప్లుతిఁ దాత! తాత! నీవా
క్కు తిరుగ నేర దది యంతనుకన్ బలుకుచుండన్

క. నీ వన్నమాట యజధర
జీవిభుఁడే బ్రదికియుండనే విని తా నే
మావాఁడో? యిందుమతీ
దేవియు నాపసిదినాల దివిఁ జేరెదో!

గీ. గుమ్మగాఁబడి పాదయుగమ్ము వదలి
పోవని యితేశు మెల్లన లేవఁదీసి
మునిజగత్పతి మైత్రావరుణి ధరాప
తిం గవుంగిలించి యెద హత్తించుకొనియె

ఉ. చూచెడివారి కెల్లఁ బతి సొంపుగ నర్వదివేలయేండ్లవృ
ద్ధై చనువాఁడుగూడఁ బడుచై పసివాఁడుగనై కనంబడన్
రాచిన వెల్గుప్రోవు మునిరాజుకడన్ బతి చిన్నదివ్వె యా
చూచినవారు చూచి రిరుజోతుల యెక్కువతక్కువల్ సరిన్ ౧౧౧

క. మునిపతియును జనపతి పూ
నిన గాదిలికౌఁగిలింత నిడుపులయిన యా
మునిపతి జనపతి గడ్డము
లను బడి ప్రమదాశ్రుతతి తళాతళ మెఱసెన్

క. కడమమునులెల్లఁ గన్నులు
తుడుచుకొనుచు రాజుఁగాంచి తురగము వదలం
బడుఁగాక సిద్ధపఱుపుఁడు
జడనుపడకయుండ సర్వసంభారమ్ముల్

మ. కలికిన్ వేసిన బండకొయ్యలవలెన్ గన్పట్టు వేలక్షకో
టులుగాఁగన్ సరయూఘురోత్తరపుటొడ్డుంబట్టి యూపంబు లా
తొలినాళ్ళన్ భవదీయవంశమణిభూతుల్ భూపతుల్ యజ్ఞక
ర్మలు గావించిన శాసనంబులయి యో క్ష్మానాథచూడామణీ !

ఉ. అచ్చట యజ్ఞభూమి కనువైన ప్రదేశము నీదుమంత్రులం
బుచ్చుము పుణ్యపుందలఁపు పుట్టినయప్పుడె కార్యరూపమం
దచ్చుపడంగఁజేయవలె నావయి నేదొ వికల్పమందినన్
లొచ్చుగు హెచ్చుగున్ దలఁపులోఁ బనిదీర్చుట యుత్తమంబగున్

వ. అని మును లనుచున్నంత రాజు మంత్రులం దిలకించిన

సీ. ధృష్టికి దృష్టిలో దృష్టి లేదాయెను
గనులు పట్టవు జయంతుని గనంగ
నానందజనితదర్పాంధుఁడు విజయుండు
సిద్ధార్థకుఁడు రససిద్ధయోగి
యర్థసాధకుఁడు ముక్తార్థప్రయత్నుండు
తా నశోకుం డశోకాననుండు
మంత్రపాలుఁడు సర్వమంత్రనిర్ముక్తుండు
మఱి సుమంత్రుండె సుమంత్రుఁడయ్యెఁ
బార్థివేశుఁడు సర్వసంభారములను
గూర్చుఁడీ! పుష్పకుంకుమాభ్యర్చితమ్ము
సర్వలక్షణోపేత మశ్వమును వదలు
డా! మునీంద్రులయాజ్ఞల ననుమతించి

చ. సరయువు నుత్తరంపుదటిఁ జక్కఁగఁ జీరిచి యజ్ఞభూమిగా
విరచనసేయుఁ డెల్ల పృథివిన్ సమమౌనటు లెత్తుపల్లముల్
సరిపడఁజేయుఁడీ! చదునుసల్పుఁడీ! దిబ్బ్రసలన్ మదించి భా
స్వరమృదుశాద్వలంబు గల పచ్చని పెళ్ళలు కప్పుఁ డెల్లచోట్

ఉ. అల్పముగాని యత్నమున నన్నియు సిద్ధము సేయుఁడీ! యథా
కల్పముగాఁగ శాంతులును గావలె శ్రద్ధ వహింపుఁడీ! క్రుధా
జల్పులు బ్రహ్మరాక్షసులు శాస్త్రవిదుల్ తలఁచి వేచి క్షుద్రముల్
తల్పులువోలెఁ జొచ్చుకొని తత్ఫలమున్ హరియింతు రంతయున్

క. అపరాధము పుట్టఁగరా
దపరాధిని గర్తఁ జంపు యజ్ఞపురుషుఁ డె
ల్లపనుల యందున మీరలు
నిపుణులు మత్సర్వకార్యనియతులు మీరల్

క. అని విశ్వాసము సంభా
వనయును దీపింపఁ బలుకు వసుధేశునియం
దున ద్విగుణీకృతభక్తిపి
శునవస్తు లమాత్యు లగుచుఁ జూచుచు నిలువన్

చ. నరపతి మాటలన్ విని మనంబుల హర్షమిలంటి రాజుచే
విరచితపూజులై చనిరి విశ్వసుతుల్ మునిరాజు లంతఁ బృ
థ్వీరమణుఁ డెల్లమంత్రిసమితిం గని యిట్లనిపల్కె లోచనాం
బురుహయుగంబు రేకు లలమూల వడన్ జిఱునవ్వు వెన్నెలన్

గీ. వెదుకఁబోయినతీవ దవిలెను గాలి
కందు రవు డేమి సేయుదు రల్లతీవఁ
ద్రెంచి తెచ్చి యౌషధము వండించుకొనుఁడు
మిగిలినది భిషగ్రత్నముల్ మీరుసూడ

వ. అని యెల్ల సభాసదుల వీడ్కొలిపి

ఉ. ఇంచుక దూరమయ్యె రథ మెక్కి సుకేతనకింకిణీక్వణా
భ్యంచితరావముల్ దనదు నాగమనంబు నెఱుంగఁజేయఁ దే
రంచున దూఁకెఁ గోసలధరాధిపకన్యక మేడముందు వ
స్త్రాంచలపాళి రివ్వుమన నంగలతోఁ జనె మేడలోనికిన్ ౧౨౫

మ. కని కౌసల్యను నీవు వింటివటవే కళ్యాణి! నారాయణుఁ
దనమంత్రంబు బలంబు పేర్మిఁ బిలుచున్ దానై వశిష్ఠుండు నా
పౌనరించున్ హయమేధమందు హవిసున్ బొందంగ నీ పేరు చె
ప్పెను నీ దౌకడుపున్ ఫలించునని చెప్పెన్ దాత సంత్రాతయై

ఉ. కన్నుల నత్తరుల్ బుగులు కాటుకఁ బెట్టుము పైడిచీర తె
న్నెన్నియొ పెట్టెఁదీసి ధరియింపుము నచ్చినవాని నెల్లఁ గ్రొం
జెన్నుల భూషణాలిఁ గయిసేయుము పూతహవిఃప్రదానవే
ళ న్నినుఁ జూడఁగా నదితిలాగున శ్రీహరి యెంచఁగా వలెన్

క. ఇపు డేమఱకుము హరి లో
భ పెట్టవలయు మనకడుపుపంట కతనిరా
క పదింతలు ఫల మిచ్చెను
సుపరీక్షితమార్గమెల్లఁ జూడఁగవలయున్

చ. అను పతిమాటలం దనిసి యాయమ యెన్నఁడు వచ్చునేని యా
మునిపతి తెచ్చునేని నవభూషలుఁ జీరలు దాల్చి యెంత వె
న్నుని దనియింతు నాదగు కనుంగొన లొత్తిన బత్తిఁ జూచి మ
న్ననఁ బొనరింపఁగా వలె సనాతనుఁ డాద్యుఁ డటంచుఁ బల్కఁగన్

క. ఎఱుఁగనిదానవా నీకుం
గఱదలు సెప్పంగ ననుచుఁ గదలి యిలేశుం
డఱిముఱి సుమిత్రమేడకు
నెఱకలు కట్టుకొనినట్లు లేగ నడచుచున్

ఉ. ఓసి సుమిత్ర! నాయెడద నూహ జనించిన దశ్వమేధయా
గాసమకర్మచే సుతుల నందెద నంచును మానుటెల్ల సే
బాసని రద్భుతంబు ఫలవంతము యాగ మటంచుఁ జెప్పిరిన్
గోసలధారణీశ్వరుని కూఁతునకున్ సుతలాభ మంచునున్

క. నీకును బుత్రులు కలిగెద
రాకాంక్షల వెంటఁ బడియ యరుగును ఫలముల్
నాకడుపు సర్వవిధముల
వేకాయలు గాయఁ జూడవే నిపుణమతీ! ౧౩౨

రాధోరణ్యుపనీతసద్రజతసీరప్రత్న కాంత్యుగ్రసం
బాధశ్రీపరితర్పితాత్ముఁడయి శోభాదర్శనైకాగ్రతన్

సీ. క్రతుయత్న మెంతదూరము వచ్చెనో చూడ
వెల్లెన్గ వజ్రి పంపించెనొక్కొ
యజ్ఞాగతునకు నారాయణునకు మున్గ
దలి పాంచజన్యంబు తరలెనొక్కొ
యాగఫలంబైన యమృతకుంభము మింటఁ
దెరలి ప్రాగ్దిశ బయద్దేరెనొక్కొ
మైత్రావరుణి ప్రేమమంజులాశీర్వాద
వల్లిక తలపూవు వదలెనొక్కొ
యష్టతనువుల హోత్రియైనట్టి తనువు
తోడి రుద్రసంరంభవిభూతి చెదరి
ముందునకుఁ దూఁగెనో యన నిందుబింబ
మల్లఁ బ్రాచి బారెడుపైని హాసులొలికె

క. తనుఁగాంచి పొంగు భూపతి
మును నిలువఁగఁ జంద్రముండు మూర్తింగొని వ
చ్చెనొ యనఁగ సుమంత్రుఁడు ని
ల్చెను భూపతియెదుర శ్వేతసిచయధరుండై

క. తన వెలుఁగు లెల్లయును నా
తని కులపతి యిచ్చునట్టి తళుకెగదా యం
చని చంద్రుఁ డతని ముందఱ
చనుదెంచె ననంగ మంత్రి సవినయుఁ డయ్యెన్

చంద్రకళ.
మున్ను విన్నది దేవరహస్యంబున్ దమకున్ వినిపింపఁగా
నెన్నొసార్లు తలంచితిగానీ యేను వచింపనె లేదు నేఁ
డెన్నఁ జెప్పకయున్న ఫలం బొక్కింతయు లేదు ధరాధిపా!
మున్ను దేవయుగంబున వింటిన్ భూప! భవత్సుతహేతువున్

క. అని చంద్రకళలు విరిసిన
వనఁ బల్కిన మంత్రిఁగని రహస్యంబా? న ౧౮౪

న్నను మఱుఁగుసేట్టి యున్నా
ఘ్నను దాఁచితి వేటికి ప్రలోభము మంత్రీ!

ఉ. ఎయ్యది యొప్పు దాఁచవలె నెయ్యది యొప్పు వచింపఁగావలెన్
గయ్యలు కాయు చుందొ? యధికంబుగ నొండులు పేర్చుచుందొ? నీ
వయ్యమురాపగంబలె మహాప్రభుబుద్ధివి దాని చెప్పుమా
యయ్యతసంబు సేయుటము సాద్భుతమంత్రవినిర్ణయాకృతీ!

క. అను జూని ప్రశ్నయంబున
కును గొంచము కదలి రాజగోపాలక! నా
వినినది చనినది యొకటియ
చనినది నీ వెఱుఁగుదువును జారులవలనన్

ఉ. అంగము లేలు భూమిపతి యాప్తసుహృన్మతి రోమపాదుఁ డే
లంగలయూళ్లు బెట్టయి యిలాపతి ధర్మగతిన్ వ్యతిక్రమ
మ్మొం గలుగంగ వర్షములు పుట్టకయుండిన యంత వంగముల్
చెంగలులై చెడన్ జనులు చిక్కిన పాపమునందుఁ బోవకే

సీ. మాగాని పరిసరామ్రప్రీతి దైయిసట్టు
మొలకనాసలె దుట్టుతలలు వేస
మెట్టచాలుల విత్తు పెట్టకమున్నె చు
మ్మలుచుట్టి మలమల మాడిపోయె
ఊటలూరెడి సెలయేటి మేల్వారసలు
నెండిన బుగ్గలై యింకిపోయె
బావులలో నీరు వట్టి పూడకఁదీయ
మున్ను పుట్టిన జల మిన్నుపట్టె
పాడియావుల చన్నులు పట్టి నెత్తు
ధార లోడిన జనులు హాహారవముల
రాజు మొగసాల నిలచి మొఱ్ఱ లిడినంత
విభుఁడు నేడ్చుచు వారిఁ జేవిసరి పంపె

క. హితులను మంత్రులను బురో
హితులను గనుఁగొంచు మీర లీ బెడదయు నే 

గతిఁ బాయవచ్చుఁ జెప్పక
మతి నిలువదు నాకు నింతమంది వగలచే

క. ఒకచోటఁ గుఱుపు మం దిం
కొకచో నన్నట్లు పాప ముర్వీపతిదీ
వికృతపుబాములు ప్రజలవి
యకటా! యీబాము లెట్టు లపహృతము లగున్

వ. అని పురోహితులం జూచి

క. మీరలు శ్రుతధర్ములు లో
కారాధ్యులు నా త్తధర్మ లఖిలఘనజగ
చ్చారిత్రవేదు లీశ్వరు
లీరాజ్యమ్మునకు మీర లే గతి నాకున్

శా. ఆయెండో యొకజీవి చిన్మొగిలు రా దాకాశవీధిన్ బరి
స్ఫాయ త్తీవ్రకరోష్మచేఁ బగిలి భూభాగమ్ము బీటుల్ వడెన్
నా యీ భూప్రజ కేమిసెప్పుదు నవంధ్య మ్మౌ యనావృష్టి కే
ప్రాయశ్చిత్తమొ చెప్పుఁడీ యదియు శీఘ్రమ్మేను గావించెదన్

గీ. అని ప్రలాపించు రాజు నూరార్చి ద్విజులు
త్రోవ యొక్కటె కల దది దుర్ఘటంబు
నేము పూర్వమె చెప్పఁబోయెదము గాని
చేయఁగ నసాధ్య మని దానిఁ జెప్ప లేదు

వ. మహాతపస్వియగు కాశ్యపునకు విభాండకుండు పుట్టె; నవ్విభాండకు
నకు ఋశ్యశృంగుండను కుమారుండు కలిగె; ఆ ఋశ్యశృంగుండు
విభాండకుని కన్నులకు వెన్నెలవత్తి; తండ్రి యాయన నట్లు పెంచె

చ. అతనికి లోకమే తెలియ దగ్నియుఁ దండ్రియు నిద్దరే జగ
మ్మతనికి బ్రహ్మచర్య మిపుడైనను నల్లె ద్విధాగతిప్రసా
రితముగఁ బొల్చు నవ్వనిఁ జరించును మూరపుఁడోఁట పోఁడు లో
భితమతి కాఁడు స్త్రీ పురుషభేదము కూడ నెఱుంగఁ డింతయున్

క. మూఁడవమానిసి నెఱుఁగఁడు
నాఁడుది యన నేమొ యెఱుఁగఁ డంతకుమున్నీ

పో(డిమి వని( జని తెచ్చిన
కాండలు సమిధలును బండ్లు( గాయలె యెఱు(గుక్

సీ. తండ్రికన్నను ముందు( దానె మేల్కొని యగ్ని
హోత్రమ్ము సరిచూచి యుపుకగట్టు
తండ్రికన్నను సముద్యద్ఘోష మేపార
నర్ఘ్యలును ఋక్కు లనుపఠించు
తండ్రికన్నను సమాహితశ్రద్ధనౌ యుప
ర్బుధున కర్చ్యాహవిర్భగ్నము * లిడు
తండ్రికన్నను నిశ్చితజ్ఞానదృఢబుద్ధి
బితృసమర్చ్యాధురాశ్రితి( గాంచు
నతడు పుంరూపబ్రహ్మచర్యంబు శ్రేన
ప్రోవు నెల్లప్రాయశ్చిత్తరూపి మతడు
వాని నాపాప మేఘముహోనివాని
నిటకు( దెచ్చితివే వనావృష్టి తొలగు

క. సీతనయ శాంత నొసగు ము
యా తపసికి( గవల( జేచట నాతం డాన్నా
శ్లేతావునందు నుండునో
యాతావున సీతిబాధ యని లేదు నృపా!

ఉ. ఆ జనకుండు పుత్త్రవిరహంబు సహింపడు ఋశ్యశృంగు నే
యోజను దెత్తువో! యతని యున్నవనంబులు దవ్వు నేర్పుతో
రాజ! విభాండకుక్ మొఱ(గి రావలె( దేవలె( గుట్టనూని ను
ర్వ్యజన తాపనోదన గరిష్ఠకళా ప్రతిభాస్వరూపునిక్

వ. అని పురోహితులు విన్నవింప రోమపాదుండు మంత్రులతో విచారించి యదికాదని యిదికాదని పెక్కునాలోచనలు త్రోసి పుచ్చి దాదితో(చక

మ. ఎడ(దక్ భీతులు పొంది మాని( గొనిరా నెవ్వండు ముందంజ వే
యడు; నే బోవను నేను బోవ ననుచుక్ హా! హా! యనావృష్టిచే(

* హవిర్భగ్నములు = హవిస్సులైన దుంపలు

జెడియున్ మృత్యువు వద్ద నుండియు మునిం జేరన్ భయం బంట హా
త్తెడు నేత్రంబులకున్ బొరల్ జనులబుద్ధిన్ మాయ యట్లేకదా!

వ. అట్టిసమయంబున రాజునకు వింజామరలు వీచు కుసుమశరకోదండ లస్తకమధ్యలు తత్కార్ముక భ్రూయుగలు తజ్జ్యాతనూలతలు నలువురు వారయువతులు వీచుచున్న చేతు లడ్డముగా నొడ్డుకొని యొకళ్లొకళ్లు కన్గిలుపుకొని వారిలో నొక్కగడుసరి రాజుతో నిట్లనియె

ప్రియంవద.

దివిషదీశ్వరుఁడు తేప మానులున్
గవురుగప్పుచు పొగల్ వెలార్పఁగా
నవు దపస్సుల మహాగ్ని రేగఁగా
నవుర! యచ్చరల నంపునంటఁగా

పణవము.

మౌనానాథుల్ మఱి మముఁ బంపింపన్
మానీంద్రున్ గొని మమతం దెత్తున్
తేనుంజాలక ధృతి నే రానే
రా నీ పట్టణరమ సిగ్గిల్లన్

వ. ప్రభువులు తాంబూలంబు దయసేయించినచో నీ నా చెలిమికత్తెలతోఁ గూడి యిప్పుడే బయలుదేరుచుంటి నన

ఆ. పతియు నచ్చెరువడి వారితో మునిశాప
భీతి మీకు లేదొ భీతహరిణ
నేత్రలార! యన లవిత్రముల్ వోని చూ
పులు నిగుడ్చి మందముగ హసింప

ఉ. నాతుల గుండెనిబ్బరము నచ్చి ధరాపతి పంపె బండ్లపై
నా తలిరాకుబోండ్ల మునిదైన తపోవనిఁ జేర వారలున్
జాతినిగూడ మాదు మెయిజాపు గగుర్పొడిపించు నిట్టలే
చేతము గల్గువారి నిఁకఁ జెప్ప మటంచును గువ్వకోలుగా

క. నవ్వుచుఁ ద్రుళ్ళుచు నోసీ!
నవ్వొక్కవ నీకు మానినాథుఁ డెఱిఁగినన్ ౧౭౦

చవ్వలగుఁ దియ్యఁదనములు
పువ్వులుకాసికి నిఁకొక్క ములికియుఁ దలఁగఁగన్

మ. కెరలున్ మాని యటుండుఁ గీలెడఁగినన్ గీడెంచి మేలెంచు మం
గురు కోపంబున నోసి నిమ్మక నెవరిందున్ బంపినారిన్న భూ
వరునిన్ జెప్పకు డేమొవచ్చెని మనన్ బా[illegible]నో శీ[illegible]నో భూ
వరు చూడాసిత కేశమున్ గదల కొప్పుంగావలెన్ భామినుల్

వ. అని విభాండకుని యాశ్రమంబున కల్లయగు ప్రదేశంబున బండ్లు
దిగి యందు విడిసి

క. మునియాశ్రమంబు దగ్గరఁ
జనరా దమ్మానికొడుకు చనరాఁడేఁటు ద
ర్పున కంచు ద్విజులు పలికిరి
మునితనయుని జూచుటకును మోసంబయ్యెన్

వ. ఇట్లుండ నొక్కనాఁడు ఋశ్యశృంగుఁడు తనతండ్రి తపోవనిఁ జాల
దవ్వు చనినవేళ యపృచ్ఛాగమనంబున నదత్తస్మిత కాంతారాక్షి
ముఖుండై వచ్చుటఁజూచి వారందఱోసియోసి! యని యం
దొకర్తుక వీణయు నొక్కతె మృదంగంబును నొకతుక తాళంబులుఁ
బూని ప్రమోయింప నాయకురాలు గొంతెత్తి నాట పున్నాగ
యారభి శ్రీ వరాళిరాగంబులు క్రమంబున నత్తి కృతులు వర్ణం
బులు పాడినంత

సీ. తన గొంతులోన నూఁగు నిఃనాదము లపూర్వ
నినదితంబులు వచ్చి నిట్టవాడిచి
తన గుండెలోన డాఁగిన మెత్తనగు చోట్లు
భావరూపము లంది పైకి వచ్చి
తన సృష్టిలోన నుండిన క్రొత్తమాధుర్య
సీమలు క్రేళ్లుగాఁ జెంగలించి
తనయాత్మఁ దా నెఱుంగని యొక్క యానంద
పరిధి రేఖాస్వయంవ్యక్తి కలిగి ౧౭౫

కనుఁగొలుకులందుఁ గన్నీళ్లు గార్చి మైఁ గ
గుర్పొడువఁ దనదేహ మా క్రొత్తబిగువు
లెచటఁ దెచ్చెనో యని కను లింతలుగను
విచ్చి చూచుచు మునికుఱ్ఱ బిగువు చెడియె

క. అంతట నవ్వోలఁదుక లై
కాంతిక కేళీకళారహస్యార్థనవా
త్యంతధ్వనిమద్గీతా
సంతానము భరతశాస్త్రసరణిం బాడన్

సీ. రాగానుసారి భావాగణ్యగీతిచే
నర్థానుగుణ్యహస్తాప్తిచేత
హస్తానుకారి నేత్రాపాంగరోచిచే
లక్ష్యానుగాస్యచాలనముచేత
వదనానుకారి గ్రీవాభేదపటిమచే
గ్రీవానుగాంగసంశ్లిష్టిచేత
నంగలాఘవకృతోత్తుంగభంగీనృత్య
కేళ్యనుసారిభంగిమలచేత

గీ. నాటుపొంగులు తరఁగపూ లంబురోచు
లూఁగిసలు మధురేఖలు నొదిగి వెనుక
కరుగుటలు ముందువచ్చుట లైన నాలు
గంబుధులవోలె వారు నృత్యంబుసేయ

చ. విని విని చూచి చూచి కనువేడుకు తీరఁగ వారిఁజేరి మె
ల్లన నవి మీకుటీరము లలంకృతు లే వనసీమ కయ్యెడున్
గనులు చెవుల్ సుతర్పితముగా నొనరించిరి క్రొత్తశాస్త్రముల్
కని విని నేనెఱుంగ నవలన్ వచియింపరు నాకుఁ దండ్రులున్

చ. అని యడుగుల్ స్పృశించి యలనల్లనఁ గౌఁగిలిఁబూని యంతఁ జి
క్కఁ-స యొక స్పర్శ యేచి తనుకంపము పుట్టి యొడల్ బిరాన జి
ల్లనఁ దెలియంగరానిసుఖ మంది యిదేమగు మానులో భవ
త్తనువులు దాఁకఁ జల్లనగుదానికి నెట్టితపంబుఁ జేసిరో ౧౮౦

సీ. మీశిరస్సులజడల్ మేలుగా నునుపుగా
నట్టె ముప్పేటగాఁ బుట్టెనో కో-
మీసలు గడ్డముల్ మీ ముఖచిబుకగ
ల్లముల మొలఁగనే మొలంగవో కో-
నాకు మొగాన నున్నది యొక్క-కొమ్ము ఱొ
మ్ముల మీకు జంటలై పుట్టెనో కో-
యెపుడు సర్వాంగానవు నిష్టచేతనే
పిఱుఁదులు మీకింత పెటిఁగెనో కో-
యనుచు వారల జడలంటు నాసనములు
తడుము నురములు తాఁకు ముట్టుఁను బిఱుఁదు
లట్లు సేసియు నచ్చోటి కసమశరుఁడు
తొంగిచూడఁడు ముని ఋష్యశృంగువంక

శా. భూపశ్రేష్ఠుని కూఁతుపెన్మి టనుచున్ బూజింతు రమ్మాని నా
రూపాజీవలు నాత్మలన్ మునికుమారుం డవ్వారారోహలన్
మీ పర్ణాంగణశాల యేదియొ? ననున్ మీవెంటఁ గొంపోదురో?
మీ పుణ్యాశ్రమహోమకర్మలు గనన్ మేలౌను నాకుండెనన్

క. అన వారలు మా యాశ్రమ
మున నన్నియుఁ గనకసౌధములు గల వనఁగాఁ
గనక మనఁగ నేమన భూ
షణములు చూపించి దాని సంగతిఁ దెలుపన్

శా. ఐనం దప్పకవత్తుఁ జూచుటకు మీవౌ నాశ్రమంబుల్ తరుల్
గానీ పండ్లనుగాని యందు నిటులేగా యుండు నన్నం దరుల్
వీనిం బోలియ యుండుఁగాని ఫలముల్ వే ఱవ్వి నీవుం దినం
గానౌ నున్నవి కొన్ని మాకడ నటం చా వారముఖ్యాంగనల్

ఉ. లడ్డు జిలేబు లిచ్చిన బలా యని లడ్డులు నవ్యబర్హ్మివౌ
గ్రుడ్లని చూచుచున్ దొడిమఁ ద్రుంచుట తోఁచదు మాతిలేని పీ
బుడ్లనుచున్ జిలేబులను బూని విచిత్రపు టిప్పపూవులా
యొడ్లకు మీఁదు నాశ్రమఫలోన్నతి కల్గునె యంచు మెచ్చుచున్

శా. వహ్వో యంచు జిలేబి లడ్డులను నాస్వాదించి యానందమై
జిహ్వాతర్పణమై పురే యనుచు మీ చిత్రాశ్రమస్థానిలో
బహ్వానందము లింక నెన్నికలవో వత్తుర్ నిజం బేను న
న్నాహ్వానించుట కేదియైనఁ గలదా? యభ్యంతరం బన్నచో

ఉ. అచ్ఛపలేక్షణల్ భరతునాగమ మెల్లఁ బ్రయోగవైఖరిం
దెచ్చినవార లాట నట నేర్చిన బ్రాహ్మణసంప్రదాయముల్
గ్రుచ్చినమాట లేర్చి తమరుర్ జనుదెంతురో. యాతిథేయ మం
దిచ్చెద మింతకన్న వలెనే చరితార్థుల మమ్ముఁ జేయఁగర్

క. ఆ యే డీ యేడుతరాల్
మాయురె! తరియించు మూడుమంటలు నెగడుర్
మా యాశ్రమహోమగవీ
పాయసములు చారితార్థ్యఫణితి వహించుర్

వ. అనినంత ఋశ్యశృంగుఁడు తనతండ్రి యుటజంబుఁ జేరు వేళ యైన
దని గ్రహించి

గీ. ఇంతసేపును మీక్రొత్త లేను మఱగి
రండు మాపర్ణశాలకు రండటంచుఁ
బిలువనేలేదు క్షమియింప వలయు రండు
పోద మిపుడు మా యాశ్రమమ్మునకు మీరు

చ. అటు కనుపించు కానుగుల యాదెస మల్లిన నుల్ల యుండు మా
యుటజము తండ్రిగారు మఱియుర్ బ్రియమారఁగ నర్ఘ్యపాద్యసం
ఘటనముఁ జేసి మెత్తు రదిగాకయుఁ బెంపుడులేటికూన యొ
క్కటి కల దద్దియుర్ బదయుగంబులు నాకు గళంబు సాఁచుచుర్

క. మఱి దర్భలు నేఁ ద్రుంచెడు
తఱి నదియును గొఱికివెట్టుఁ దాతలు దానిర్
జిఱుతుకఁ దెచ్చిరి యదియును
పఱకలు నాచేత నొసఁగవలెఁ దాఁ దినఁగార్

వ. దానినిగూడఁ జూడవచ్చు రండనిన నా చకితనేత్రలు

ఉ. మిమ్ములఁబట్టి నిల్చితిమి మేమును బోవలె మాకుఁ బ్రత్యవా
యమ్ములు పుట్టు తత్క్షణమ యార్చవలెర్ జని మీదు నాతిథేగఁగర

యమ్ములు మాకు వచ్చె భవదాగమనార్థము యుంచునందురా
మమ్ముల నింపె నెల్లి యన మంచిది మంచి దటంచు నాతఁడున్

క. చని దినము దినము నారే
యును వారలఁగూర్చి యూహ లూహించుచుఁ బ్రా
ద్దున లేచి యగ్నిహోత్రము
లను సేసినఁ దండ్రి వనములం బడి చనినన్

ఉ. వచ్చునో రాఁడో! యందునికి భద్రమొ భద్రముకాదో? యొక్కచో
వచ్చిన వృద్ధమౌని తమపాల్లవి యేమగునంచు నుంట్లపై
నిచ్చలు గూరుచున్నటుల నెవ్వగఁ బాంచజీవారిఁ జేరఁగా
వచ్చెను ఋశ్యశృంగుఁడు సబన్ధపురోహిసము గ్లనుండఁగా

గీ. పోదమా యన్నఁ బోదము పోదమంచుఁ
గదలి శకటంబుపైని సంగములు సేరి
యచట రాజాజ్ఞ నుత్తమహాయయుగంబుఁ
బూనిచిన రథంబున రాజధానిఁ జేర

ఉ. ఆరథ మేగుత్రోవ జలదావళి మింట వినీలకాంతిమా
లారుచిరాతపత్రపరిలంబినియై రథనేమినిస్వన
స్ఫోరకహేతువై యుఱుముచున్ వెనుకన్ జనలన్ బ్రవాతధా
రారమణీయవాఃకణధురాపరితర్పితదేశమై చనెన్

చ. అదివర కేమియుం దెలియఁ డాముని చూచుచుఁ బూచుచుండెనే
మది నెఱిఁగెన్ సమస్తమును మానినులున్ బురుషుల్ పురానఘుల్
సదనములున్ బొలంబులును సాగులు పంటలు కర్షకుల్ సవాం
బుదములు ధర్మముల్ సహజబోద్ధలు నిశ్చలతత్త్వమానసుల్

ఉ. వర్షముతోడ నొక్కపరి వచ్చిన మౌనిని రోమపాదుఁడున్
శీర్షక మా పదాబ్జములఁ జేరిచి రాజ్యము నీది నీవు రా
హార్షము వర్షమున్ గలిగె నయ్యా! మదాత్మజ నిత్తు ఋశ్యశృం
గర్షికి నీకటంచుఁ దనకన్నియ శాంతను బిల్చి చూపఁగన్

శా. లజ్జాముగ్ధముఖారవిందఁ గని యా లావణ్యపాథోధిఁ దా
నజ్ఞానమాతయు లజ్జయొత్తిడి మొగం బల్లంత వాల్చెన్ బురే! ౨౦౧

మజ్జారే! పురికిన్ వనంబునకు నీమాత్రంబు భేదం బటం
చజ్జల్ప్రోవులు వారముఖ్యలు సురంటంటించి గెంటించుచున్

వ. పరిహాసంబులు సేయువేళ వారిర్వురకు రాజు వివాహంబు సేసె; శాంతర్శ్యశృంగులకుఁ బుత్రసంతానంబుఁ గలిగె; నిది మున్ను దేవ యుగంబున సనత్కుమారుఁడు ఋషులతోఁ జెప్పునెడ నేను విన్న సంగతి; ఈ కథఁజెప్పి యా మహర్షిసత్తముండు శంసామార్గమున ఋశ్యశృంగుఁడు మీకు నల్లుఁ డగుననియు వాని మహత్త్వమునఁ బ్రాంశుతనులు వీర్యవంతులు నగుసుతులు నీకుఁ గలుగుదు రనియుఁ జెప్పె

క. ముని ఋశ్యశృంగు నిచటికిఁ
గొనిరావలెఁ గ్రతువు సేసికొనుటకు మున్నే
మనుజాధిప! వనజాధిప
ఘనవంశమణీ! త్రయీశిఖాబుద్ధిధునీ!

వ. అని మంత్రి విన్నవించినంత

సీ. ఒనర బోర్కాడించి యుయ్యాలతొట్టెలోఁ
బండఁబెట్టిన పసిపాపవోలె
వీథులంబడి తిర్గి బూదియ మైఁ జల్లు
కొని పర్వులంబెట్టు కుఱ్ఱవోలె
నన్నమ్ముఁ దించు మోమంతయుఁ బెరుగన్న
మును జేసికొన్నట్టి బొట్టెవోలెఁ
జట్టి! తలంటిపోసెద నన్న నందక
తొలఁగి పర్వులువెట్టు నులిపివోలె
వెల్లదుస్తులు కట్టించి వీథులన్ షి
కారు పంపిన రాజకుమారువోలె
మింట నడుచుక్క జాబిల్లి మేదినీశు
నేత్రములకును జలువఁ బండించిపోసె

చంద్రిక.

కువలయమణి చిట్టికోర్కులున్ దవిలి శిశిరమూర్తిఁదాల్చి పె
ల్లివము చిలుక మింటికెక్క నన్ సవియుఁ జెలఁగ నొప్పెఁ జంద్రికల్

చంద్రలేఖ.

భూమీభృన్మౌళికాంతుల్ ఘోషామణిశ్రేణి నెగ్గన్
శ్రీమత్కాంతిప్రసారక్షీరోదరత్నప్రవాళో
ద్దామాంశుల్ రాజసౌధప్రాఘుష్టగాంగేయకుంభ
గ్రామంబుల్ నెల్లప్రోవుల్గాఁ జంద్రరేఖల్ చలించెన్

సీ. చంద్రబింబం బని యంద్రుగానీ వియ
ద్వల్లిఁ గాచిన * చంద్రబాలకాయ
ప్రాలేయకరుఁ డన్న పలుకెకానీ యింటి
గట్టు ‡ నైలావాలుకంబుపంను
సోముఁ డంటయె కాని యామినీక్రకచక్ర
త్తంబైన † సోమవల్కంబు చెక్క
యమృతాంశుఁ డనుటయే యాకాశకాంతకో
ద్యానభూషణ ♦ మమృతాఫలంబు
ఏకదేశవర్ణవ్యత్యయమొకశనస్స
మాత్రవర్ణలోపాగమవ్యాకృతిఁ గాని
పేరు మారెను వీని కన్ బృథ్వీపతికి
మంత్రి చిఱునవ్వు నవ్వుచు మాఱుపలికె

వ. మున్ను సనత్కుమారుండు ఋశ్యశృంగుం డధ్వర్యుండుగా నీయశ్వ
మేధంబు పుత్త్రఫలప్రాప్తిహేతు వనియె

శా. హ్రీశ్యామాక్షుఁడు నల్లుమాని యిటు నీయింటన్ వసింపన్ సురల్
వశ్యుల్గా నయి కోసలంబు బహుకృత్యప్రాప్తసస్యం బగున్
శ్రీశ్యామాంబుదమాలికాతతులతోఁ జేరన్ భవద్దేహముల్
భ్రశ్యచ్ఛోకము పూర్ణవాంఛలుఁగ భూపా! పుత్త్రసంతానమున్

క. భూతరుణీహృదయేశుఁను
తాత వశిష్ఠులకుఁ దెల్పి తాతముదలతో
వే తరలి పోద మెల్లియ
ప్రాతఃకాలమున మీరు రాణులు మేమున్ ౨౧౧

---

*చంద్రబాల = పెద్దయేలకులు, ‡ఏలావాలుకము = నూగుదోస, †సోమవల్కము = తెలిచండ్ర, ♦ అమృత = ఉసిరిక,

ఆ. అనుచు మంత్రితోడ నరిగి యట్లే వశి
ష్ఠులకుఁ దెల్పఁగాఁ గడున్ ముదంబుఁ
బొంది వారు తండ్రి! పో! ఋశ్యశృంగుండు
చిన్నిసుకర * పాల జున్నుగడ్డ

వ. అని వశిష్ఠు లనుమతిం జూపిన

ఉ. ఆ మఱుప్రొద్దుటం బయనమై ధరణీశుఁ డమాత్యులున్ సతుల్
గ్రామణులున్ రథంబులు తురంగములున్ గజపాళితో నయో
ధ్యామహనీయపట్టణము దాఁటి స్వపాలితకోసలంబులన్
భూమిప్రజల్ ప్రమోదమును బొంది యొసంగిన కాన్క లందుచున్

శా. [1]ప్రేష్ఠమ్ముల్ ప్రజమోములం గనుచుఁ దత్ప్రేమన్ గుబాళింప [2]బృం
దిష్ఠమ్ముల్ పొలముల్ గనుంగొనుచు [3]సాధిష్ఠంబులై యుంట బం
హిష్ఠమ్మై చను త్రోవ వేగిరముగా నేగన్ సుమంత్రుండు [4]క్షే
పిష్ఠాశ్వంబులఁదోలఁ గోసలములున్ వెన్క ప్రయాణించుచున్

సీ. కలవింక చాష కంక శశాద నోలూక
మాకలి కారండవాకులములు
పుష్కరాహ్వ రథాంగ భుజగభు క్కీర వ
నప్రియ కూజితవర్తితములు
వ్యాఘ్ర హర్యక్ష మృగాదన సబ్ధరో
మాచ్ఛభల్ల శివా వృకార్దితములు
పృషత రురు న్యంకు కృష్ణశారైణశం
బర శశ చమరప్రవల్గితములు
నైన యడవులు గల యద్రు లందునందు
ముగురు భార్యలకును భయమోదములను
గూర్చుచుండఁగ నరిగె నా క్షోణిపుండు
చను చమాత్యు లా యా విశేషములఁ దెలుప

ఉ. ద్రోణులమీఁద దాఁటిరి నదుల్ చులుకీకృతవారిరా
మానియు యామ్యదిగ్గగనమండలలక్ష్మి మొగంబు వెల్గుచు ౨౧౭

*సుకర = సాధువైనయావు. 1 ప్రేష్ఠము=మిక్కిలి ప్రియము, 2 బృందిష్ఠము= మనోహరము, 3 సాధిష్ఠము = పదిలమైనది, 4 క్షేపిష్ఠము=మిక్కిలి వేగముకలది.

కైక— నెఱచిల్లగింజ యసలారిన గందము నాఁటెఁ బంకసం
తానము లోపలన్ విఱిచినన్ దెలిజగ్గుల గుమ్ముసిల్లెలన్

క. చని యంగదేశములు చే
రినఁ జారులు రోమపాదపృథ్వీపతి కా
యనరాకఁ దెలియఁజేసిరి
మును రఘుపతి రాజధాని ముంగిట చనఁగన్

మ. ఋషిలోకప్రథమానతాపనుఁడు జగచ్ఛ్రేణీనిరంతోగ్రక
ల్మషసంక్షాళనహేతుసంతతతపోమాహాత్మ్యపుంజప్రభా
సుషమామూర్తి వశిష్ఠుఁడే నృపగృహాస్యన్ గొల్చియుండన్ నన్
వ్యాపితుండై కనవచ్చునంట నము లేరి? నాకు ధాత్రీస్థలిన్

చ. ప్రశమితసర్వకాముఁ డిటు భావన సేయుచు రోమపాదుఁ డా
దశరథభూమినేతకును దా నెదురేగ సఋశ్యశృంగుఁడై
మసలి సభార్యుఁడై తనకుమార్తెను శాంతను గూడఁ గొంచు వా
రు ననిన వీరు చన్న యిరుత్రోవలు మేల్కరియాదికోవలై

చ. దశరథరాజు కొమ్మ్కజప దారికిఁ బాసయుగంబునందు ము
న్నె శిరసుఁజేర్చి నాకయిన నేస్తము గావున రోమపాదుఁ డీ
రు సగము నాకు నల్లు రది త్రోపువడన్ మునిరాజు తోట నీ
శిశిరదృగంతముల్ దనుపుఁ జెందుత మాయెడఁగూడ నో మునీ!

క. అని శాంతఁజూచి తల్లీ!
నినుఁ గడుపునఁ గాంచినాఁడ నే ననుకొన నా
మనసున ధైర్యం బానదు
తొనుకునో దత్తాపహారణదోషం బనుచున్

చ. అని యనుచున్న యా దశరథావనినాథుని పాదయుగ్మమున్
గొనఁ జను రోమపాదు నిదిగో యని కంట నదల్చి కౌఁగిటన్
గొని రఘురాజమౌళి మనసంగల తొల్లిటిజన్మమైత్రి యిం
దనుకఁ దొసంగుఁ బొంద దనినన్ దొర లిద్దఱు బాష్పనేత్రులై

శా. ఆకాంతల్ గలచక్కఁగఁ గన్గొనఁగ నత్యాశ్చర్య మొప్పంగ శాం
తాకౌసల్యలు రెండువల్లికల యందం బొప్పఁ గౌఁగిండ్లలోఁ ౨౨౮

జేకోనై యొకరొక్కరిన్ విడువ రా చేకల్వలున్ మందహా
సాకారంబులుఁ బ్రశ్రయోక్తులు రహస్యంబుల్ గడున్ జిత్రమై

ఉ. అంతట నందఱుం గలసి యంతిపురిం జని యొక్కరొక్కరిన్
సంతస మందఁజేయ సరసంబుగఁ బల్కుచుఁ బ్రేమగర్భిత
స్వాంతము వెల్లడించుచుఁ బ్రియంబు లెఱింగిన కాన్కలిచ్చుచున్
వంతులు తీర్చుకొం చొకరివంక నొకళ్లు రసార్ద్రమూర్తులై

ఉ. తూరుపు రేక లారకయ తోఁటల సామివికాసిసూనముల్
చేరల నగ్నిహోత్రములు సేయఁగ రాఘవరాజమౌళికిన్
గూరిమిఁ దెచ్చి యిచ్చు ననుగున్ సుత శాంత శిరఃపరిష్క్రియా
శ్రీరతి కన్న నా రఘుధరిత్రిపు నగ్నులె పెద్దసేయుచున్

చ. తన నగ లెల్ల శాంతమెయిఁ దాల్చి నిరాభరణాభిరామమో
హనతనుమూర్తియై ముదము నందును గోసలరాజకన్య శాం
తను గృహకేళిబర్హిపరిణామతనూలతఁ గాంచి యామె పో
యినయెడ లెల్లఁ గన్ను లొలయించు నవోత్సుకతాసమార్ద్రిముల్

సీ. కౌసల్యయొడిలోనఁ గాని కూర్చుండదు
జడ సుమిత్రయె కాని ముడువరాదు
కైకేయితోఁగాని కైలాగుఁ బూనదు
వారితోఁగాని నవ్వంగరాదు
తనసుతున్ గౌసల్యగనుక ముద్దాడని
చ్చు సుమిత్ర గనుక గ్రచ్చుకొననిచ్చు
కైకేయిగనుక చిక్కని ముంగురులు పాయ
గాఁ దీయఁగా నిచ్చుఁ గరుదులాడి
శాంత కీ రీతి వారితో జగము వారి
తో సకలముగా రోమపాదుండు చూచి
తల్లి చూచి హృదంతరుత్ఫుల్లమోద
జలధులై యొక్కవారము జరిగె నిట్లు

చ. దశరథఋశ్యశృంగులును దాము పరస్పరమున్ బ్రియానులా
పసుఖముఁ బొందుచున్ మునికిఁ బార్థివసత్తముఁ డర్చ సేయుచున్

దశరథనేతసుక్ మునియుఁ బా మృదుగౌరవ మాచరించుచుక్
గొన కొకరొక్క రాంతరనిగూఢసమార్ద్రిమనస్కు లౌటయుక్

వ. ఇట్లు సప్తాష్టదివసంబు లుండి దశరథుం డొక్కనాఁడు రోమపాదునిం గని

ఉ. మిత్రయశోనిధీ! తురగమేధము సేయ వశిష్ఠులాజ్ఞ చేఁ
బుత్త్రిలు లేని కారణము పొందెఁ దలంచితి ఋశ్యశృంగు లా
సత్త్రిము సాగఁజేయ ఫలసంగతి శీఘ్రము కల్గునంచు నీ
మైత్రిఫలం బొసంగు మని మానిని యాచనసేయ వచ్చితిక్

శా. నా వెంటక్ దయచేసి పంపఁగదె శాంతక్ ఋశ్యశృంగుక్ క్రతు
శ్రీవేళక్ గబురంపెదక్ వెడలిరాఁగే నీవు నీమంత్రులుక్
నీవాల్లభ్యము నీదు సంతిపురియుక్ నీ వస్త్ర దేతెంచి నీ
వే వీక్షింతువు ఋశ్యశృంగులను నం దేకీలిగాఁ జూతునో

వ. అనిన రోమపాదుం డిట్లనియె

క. దైవము రక్షించియొ మఱి
దైవము రక్షింపకయొ కదా పర్యయస్థి
తా వచ్చె ఋశ్యశృంగుఁడు
నీవచ్చుటకూడ దైవనియతియ కాదే

క. నీకూఁతు రగుటను న్మను
నా కూఁతురె శాంత? మాని నా కల్లుఁడు ముం
దీ కొంచియమ్మ గౌరవ
మే కొండంతగ వచింతువేలయ్య నృపా!

వ. మఱి ఋశ్యశృంగుఁడో!

శా. శ్రీస్యందానసుఁడై వశిష్ఠులని పేరే చెప్పినక్ గౌరవ
భ్రశ్యత్కేశనిబంధనమ్ము గురుతాత్సంనన్నివీతంబుగా
వశ్యుండై చనుదెంచు వెంటఁబడి నేఁ బంపించు టేమున్నదో
హాస్యంబాగద నీవు నర్థివయి నేనా! దాత నో మిత్రమా!

వ. నాయాజ్ఞ యేమున్నది? కొంచుఁబొమ్మనిన దశరథుండు పరమ ప్రీతుండై

క. సుఖమో దుఃఖమొ జన్మము
ముఖస్తుతులు గావు నిన్నుఁ బోలు నమృతుఁడై
సఖుఁ డొక్కఁ డున్న నీదృశ
మఖంబు లోక వేయి యశ్రమంబుగ నెగ్గున్

క. అని ఋశ్యశృంగుతోఁ జె
ప్పిన నాయన రోమపాదపృథ్వీపతియా
జ్ఞను శాంతయుఁ దాను నయో
ధ్యను జేరఁగ బయలుదేరి రాసమయమునన్

శా. రథ్యాసంతతి కమ్మగంబురల ధారావారి సంసిక్తమై
పథ్యానందథు వొప్ప ముత్తెములకోవల్ జిల్గుతా ముగ్గులై
వీథ్యంతమ్ములు ద్వారతోరణపటీవిస్తారశోభాఢ్యలై
విధ్యాశీర్ముఖభూసురప్రణుతమై వెల్గెన్ బురం బంతటన్

శా. శ్రాంతస్విన్నవిలోచనుల్ దశరథప్రస్థానవేళన్ నృపుల్
సంతోషంబును దుఃఖ మొప్పఁగఁ బరిష్వంగంబులం బట్టుచున్
గాంతల్ వీడఁగలేక యొక్కొకరు నక్కా! సెల్లి! యజ్ఞార్థ మే
తెంతున్ దప్పకవత్తుగా యనుచుఁ బ్రీతిస్నిగ్ధలై పల్కుచున్

శా. శ్రీపూర్ణానన శాంతతోఁ గలసి తోఁచెన్ ఋశ్యశృంగుండు ముం
దై పర్వెత్తు రథంబుపై దశరథుం డావెన్కఁ బోగా నుషః
శ్రీ పద్మాస్యలు రాణు లొక్కొకరు వారిన్ వీరు వీర్వారి నే
దో పల్కాడుచుఁ జాల వెన్కఁబడి యెట్లో సాగిపో నంతటన్

శా. అంగమ్ముల్ సనుదెంచువేళఁ బదినాళ్లయ్యెన్ బ్రయాణంబు వా
రంగమ్ముల్ విడి యిల్లుసేరుటకు నాల్గయ్యెన్ దినంబుల్ హృదుల్
పొంగారంగ నయోధ్యలోని ప్రజ లాభూపాలుఁ డేతెంచు వే
ళం గేహంబులు వీథులున్ గొలుప హేలాసత్తలాధూపముల్

శా. తమ్మనాథుండు సుఖంబుగా వినియె శంఖస్వానముల్ దుందుభి
ధ్వానంబుల్ పటహస్వనంబులు సముద్రప్రౌఢకల్లోలమా
లానృత్యంబులుఁ గాఁగఁ బట్టణప్రజల్ మానిన్ విలోకింప భ
క్త్యానమ్రుల్ సనుదెంచి రక్షియుగకోణాఘూతబాష్పంబువుల్ ౨౮౫

శా. సౌధాగ్రంబులు దేహళుల్ నతగవాక్షంబుల్ తటిచ్ఛ్రేణిసం
బాధం బేచినరీతి సుందరతనూవల్లీమతల్లీలస
న్మాధుశ్రీమృదుమూర్తులై వెలయు వామాదీప్తు లేపారఁ న
ద్వీధీతోరణమాలికాతతులఁ దద్వీక్షాప్రభల్ గూర్పఁగన్

ఉ. మానిని గాంచవచ్చి రను మాటయె లేమ లతాంగు లెల్లరున్
మానిని శాంతఁ గాంచి మునిమాటయె విస్మృతిఁబొంది దాని యం
దానికి దానియొద్దికకు దానియదృష్టపు రేఖకున్ దివ్య
జ్ఞానిధులై నిరంతము ప్రశంసలు సేసి రుదాత్తవాక్కులై

మత్తకోకిల.

ఎంత చక్కని చీరఁ గట్టిన దెంతసొమ్ములు క్రొత్తవిన్
వింతలున్ మెయిఁ దాల్చికొన్నది విశ్వమోహనమూర్తియై
యెంతభాగ్యము భర్తతో రథ మెక్కి ముందఱిబండిపై
నింతగౌరవ మొప్ప నేగుట యేలతాంగులు నోచిరే?

వ. అని పౌరవనితలు మెచ్చుకొనుమాటలు వించు వారిపలుకుల కుబ్బి
ఋశ్యశృంగునివంకఁ జూచి తలవంచుచుఁ జిఱునవ్వు సన్నలతో
శాంతాదేవి ముదం బందుచుండ సరథంబులు రాజసౌధంబులఁ
జేరిన రాణులెల్ల నంతఃపురప్రవేశమ్ము సేసినఁ దక్కిన రాజస్త్రీ
లందఱు శాంతచుట్టును మూఁగి

సీ. పడఁతి మీపిత రోమపాదులు సేమమా?
కుశలమా? మీతల్లి కోర్కెవల్లి
యెండలోఁ బడివచ్చి తింక స్నానముచేసి
విశ్రాంతిఁ గైకొనవే కుమారి!
యెన్నాళ్లు లైనదే యీవు రాఘవకుల
మ్మును వీడి చని యోసి ముద్దుబిడ్డ!
కడు స్రుక్కితివి లేచి కడఁగి భుజింపవే
మో మెంతవాడెనే ముద్దుగుమ్మ!
అల్లపసినాఁడు నీవు భాగ్యాలరాశి
వనుచు ఋషిధర్మపత్ని వౌదంచు నెఱుఁగఁ

జాలమైతిమె యో పూతచరిత ! యేమి
భాగ్యమే నీది గౌరవయోగ్యురాల !

గీ. అని యనేకవిధంబుల నాదరించి
యంప శాంత పుట్టింటి కెట్టింపుసుఖము
భర్తతోఁగూడి యనుభవింపంగనయ్యె
మునిని గూడిన తరువాత మొదటిసారి

క. కౌసల్య వచ్చి తల్లీ !
నీ సుఖమే మొదట పైనినే నాసుఖమం
చా శాంత కేమివలయునొ
యాశాంతములందు నున్న నవి తెప్పించున్

క. అమృతపు నవ్వులు నవ్వుచు
సుమిత్ర శాంతకును సర్వశోభలు సేయున్
క్రమమున మునికిని శాంతకు
నమర్చి గదు లెల్లఁ గేకయాత్మజ పొంగున్

వ. అంత

సీ. ఎట్టినా నేత్రమ్ము లిప్పి వేళానల
ధూమసంతానమ్ము తూఁటినట్లు
ఆకులు తినుట దీక్షాకాలభోజన
నియమతీవ్రతచేత నెగడినట్లు
చివురాకు ముక్కునఁ జిమ్ముట జుహువుచేఁ
బాత్రాదికమ్ములు పట్టినట్లు
పంచమస్వరము స్తోభలు చక్కఁగాఁ జాఁచి
సామగానమ్ములు సదివినట్లు
రేక లీఁకల నలుపు ధరించినట్టి
నియమవస్త్రమాలిన్యంబు నెఱయునట్లు
సప్తతంతుమహాకార్యసమయమందుఁ
గర్త పోలికఁ గోకిల కానుపించె

౨౫౫

సీ. ప్రతి రసాలకుజంబుఁ బచ్చిపింపెలతోఁప
నెల మసలినకాంత వలెనె తోఁచె
ప్రతి నిస్వనద్భంభరము యజ్ఞవిధిరా
కై యేగు బ్రాహ్మణునట్లు తోఁచె
ప్రతి మల్లెపూవు సవప్రేష్టహవిరగ్ర
సుగృహీతలాజల చొప్పు దోఁచె
ప్రతి చిన్నిపూఁదోఁట పలితదోహనఘూప
ముల యజ్ఞవాటిక వలెనె తోఁచె
మాధవుఁడు సవప్రీతుఁ డన్నట్టు కలిసి
యెల్లరీతుల సాగింప నేమొ యనఁగఁ
దాను దద్వితరూపమాధవుఁడు వచ్చె
దీప్తమఖయోగ్యనిర్గర్వ దిష్టమూర్తి

సీ. దశరథరాజు శాంతతోఁ గ్రీంగుడును
దగ వత్సరాదిపండుగయుఁ గూడ
జలకమ్ము లాడించి సన్నమామిడిపిందె
ముక్కలతో వేఁపపూఁతెఁ బెట్టి
సన్నబంగరు జరీ చిన్ని పీతాంబరం
బులు గట్టఁ బెట్టి జోళ్ళలు ప్రియాన
వజ్ర గోమేధిక వైదూర్య మరకత
స్వచ్ఛకాంతులగు భూషణము లిచ్చి
మునికి నర్ఘ్యపాద్యంబు లిమ్ముగ ఘటించి
షడ్రసోపేత దివ్యభోజనము పెట్టి
సుప్రసన్నుని మునిరాజుఁ జూచి భక్తి
వినమితశిరస్కుఁడై సమీపించి మఱియు

ఉ. అచ్చట రోమపాదుని గృహంబుల సౌఖ్యము లందుచుండ నేఁ
దెచ్చితి మిమ్ము మీ యనుమతింబడి నైనను మీకు నిందు నే
పొచ్చెము లేక యున్నదియె భూదివిపన్మణి! మీకు శాంతకుఁ
నచ్చిక నెల్లవారలు పొనర్తురె మీవగు నాజ్ఞ లన్నియుఁ  ౨౫౮

క. నీవన్నమాట ప్రతిదియు
సేవకు లందఱును లెక్క సేయుదురు గదా?
నీవిచ్చు చనవు గౌరవ
భావన సేయుచు నెడందఁ బాటింతురుగా?

క. ఏరును చూపుల మాటల
ధోరణి నడతను మలంగు ద్రుతి నీయందున్
గౌరవము సడల నీయరు
గా! రమణులు నిన్ను నిన్నుఁగాఁ జూతురుగా!

వ. అని యడిగిన దశరథునకు ఋశ్యశృంగుఁ డిట్లనియె

క. నీ యంతిపురమునందున
నాయెడ గౌరవము సడలునా? నన్నును నీ
వో యధికమో యనంగా
వేయువిధంబులుగ గౌరవింతు నృపాలా!

క. అల రోమపాదు గేహం
బులకన్నను నిచటె నాకు మోద మధికమై
వెలసెడు శాంతయు మీ యిం
డ్లల నచ్చుట కన్నఁ బ్రేమ నూల్కొలుపు సుమీ!

క. ఋణపఱచుచుంటివని న
న్నును నీదెస జన్నమింకనున్ మొదలిడ వే
మి నృపా! సంభారమ్ములు
పొనరింపుము వదలు గుజ్జమును వేగముగన్

క. అను ఋశ్యశృంగుఁ గనుఁగొని
వినమ్రమౌళి యయి భక్తి వెట్టిన దోసిం
టను రాజు నశ్వమేధం
బున నాధ్వర్యవము నీవ పూనఁగ వలయున్

గీ. యాజకత్వము సేయఁ బుత్త్రార్థి నగుచు
నిను వరించుచునుంటి మనీషిలోక
మౌళిరత్నమ! యనిన నమ్మౌనిరాజు
ప్రీతుఁడై దాని నంగీకరించి యనియె

శా. సంభారమ్ములు కూర్పఁ బంపు నృప! యజ్ఞాంగంబులన్ సహస్రిజ్వాల
ద్గంభీరోజ్జ్వలసైన్యయుక్తముగ వేగం బంపుమా! సన్మహా
త్మాంభోరాశి వశిష్ఠదేవు ననుమానం బేల? శీఘ్రంబుగా
దంభాపేతముగాఁగఁ జెప్పవలె నధ్వర్యుండునే నోటనన్

క. ఆపైని నేను జెప్పెద
నా పుంస్త్వతిస్వరూపు ననుమతి సర్వ
వ్యాపారంబుల సిద్ధి
ఘ్నోపాయపథంబుఁ జూపు నుల్లెయ యనఁగా!

చ. అనవుడు మౌనిలోకగురుఁడైన వసిష్ఠమునీంద్రుఁ డంతయున్
మును పతి పైని మౌనియును బోయి వచింప వసిష్ఠుఁ డంతయే
నిని నిది యుక్త మింకఁ జేసనీ! తురగం బనఘ్నోత్స్నహాట ఘం
దనుక నె యొక్కయేఁడు నన నాయన! వేగిర పొందుమనుం చనన్

శా. రాజున్ శీఘ్రముగా సుమంత్రు నటనున్ రావించి వేగంబ యి
చ్చో జాబాలిని గశ్యపున్ మను సుయజ్ఞున్ వామదేవున్ మహా
తేజోరాసులఁ బిల్వఁబంపవలె ఋత్విక్శ్రేష్ఠ సన్మూర్తుల త్విజుల్
భ్రాజిష్ణుల్ ననుఁ జేరఁగానలయుఁ బిల్వంబంపుమా! వెంటనే

క. తానె సుమంత్రుఁడు చని యా
నానాభూసురులఁ బిల్చినన్ వా రరుదే
భూనాథుఁ డెల్లవారి న
నూనంబుగ గౌరవించి నుతిపూర్వముగన్

చ. కొడుకుల కోసమై దిగులుగొన్న మనస్సునకున్ సుఖంబు లే
దెడపక యశ్వమేధనవమే నొనరింపఁగఁ బిల్వఁబంచితిన్
గొడుకులు గల్గుకోసమయి కోవిదరత్నము ఋశ్యశృంగులున్
గడపఁగ జన్నమున్ సుతులఁ గాంతును మీ దయకల్మి చేతనే

మ. అని ప్రార్థించిన జేనికిన్ ముదితులై యామౌనులెల్లన్ సెబా
సని నీకున్ సుతు లుద్భవించెదరు రాజా! నల్వు రుద్దామశౌ
ర్యనితాంతప్రతిభుల్ గుణాంబుధులు సూర్యప్రౌఢతేజుల్ తనం
తన నీ కీ మతి యొప్పుకల్గె నపుడే త్వద్వాంఛలున్ దీరెడిన్ ౨౭౩

ఆ. ధర్మబుద్ధి మఱి వృథాపోవ దెప్పుడు
నశ్వమేధయజనమందు నీదు
మనసు దవిలె నపుడె మానవనాయక!
నీకు సుతులకలిమి నిశ్చయంబు

వ. అని ఋశ్యశృంగపురోగంతలు వశిష్ఠప్రముఖు లాశీఃపూర్వకానుజ్ఞ లిచ్చిన

చ. ప్రమదముచే భుజద్వయము పట్టుక ఱేడు నమాత్యులన్ గురూ
త్తము లనుమాట వింటిరిక దా! యిఁకఁ దక్కిన యెల్లయైన కా
ర్యములును మీవి జన్నమునకైన ప్రయత్నము లెల్ల మీర వే
గమునఁ బొనర్పఁగావలయుఁ గాలము లేదును నింకఁ జూడుఁడీ

మ. యయువున్ బుచ్చుఁడి! యుత్తమోత్తమము సోపాధ్యాయమున్ సద్ధర
జ్ఞ్మయభూపానవసజ్జనాప్రణుతిసంపద్ద్రశ్యమున్ వెంబడిన్
రయ మేపారు సహస్రితోఁ జనఁగ శస్త్రాజీవులన్ సంయుగ
క్రియలన్ బూర్వము రాటుదేలిన భటశ్రేణిన్ నియోగింపుఁడీ

చ. ఒకనిముసంబు జాగు తగ దుండిన మీ రిట నున్నయట్లుగా
సకలము గూర్పఁగావలె వెసన్ సరయూత్తరభూమి యజ్ఞవా
టికి ననువుం బొనర్పుఁడు ఘటింపుఁడు యజ్ఞగృహంబు లల్లయా
జ్ఞికులును దత్ప్రమాణములు చెప్పినయట్లన గట్టఁబంపుఁడీ

క. ఏవరునఁ జెప్పఁబడునో
యావరునను శాస్త్రసమితు లాడిన యట్టుల్
గావింపవలయు శాంతులు
గావించుటె కాదు హెచ్చుగాఁ జేయవలెన్

క. ఇది సర్వరాజులును జే
యుదు మన శక్యంబుగాద యొకయపరాధం
బొదవినఁ గష్టము ఛిద్రము
వెదకెదరు సుశాస్త్రవిదులు ద్విజరక్షస్సుల్

ఆ. క్రతువు చెడిన యజ్ఞకర్తయు నశియించు
గ్రతువు చెడకయుండఁ గడపవలయుఁ
గార్యరచనయందుఁ గంజాతయోనులుఁ
గంజలోచనులును గారె మీరు

క. అని మంత్రుల నియమించిన
మనుజాధిపధర్మబుద్ధిమహిమలు గని బ్రా
హ్మణులు పతిం బొగడి యాతని
యనుజ్ఞఁ గొని తిరిగి వార లరిగిరి యిండ్లన్

ఉ. సాంగ్రహణేష్టితో మొదలు సల్పి సురంగవిసర్జనాంత మ
ల్లం గ్రమ మొప్పఁ జేయుచు ననలన్ మునుకింతయు నీలు చిక్క దం
చుం గ్రతుభార మెల్ల మతిమంతులు మంత్రులు సెప్పఁజొప్ప వా
రిం గ్రమ మొప్ప గౌరవసురీణులు గౌరవపూర్వకంబుగాన్

ఆ. వీడుకొలిపి రాజు వేశ్మముల్ సొచ్చిన
మంత్రు లెల్ల తను నియంత్రితములు
కార్యములను సేయఁ గడఁగిరి మనువేళఁ
దేనెకొఱకుఁ దిరుగు తేఁటులట్లు

క. జన్మముకొఱకై యంతకు
మున్నే యుడినట్టి యూమముల యిట్టికలున్
సున్నము వేలును బుట్లును
గ్రన్నన వచ్చిపడెఁ గ్రతుధరావీధికడన్

సీ. నాల్గుశాఖల బ్రాహ్మణశ్రేణి బ్రహ్మచ
తుర్ముఖంబులవోలెఁ దోనవచ్చి
రఖిలకర్మాంతికు లధికప్రవీణులౌ
శిల్పకారులును వచ్చిరి సవార్థ
మైన స్రుక్స్రువముల సఖిలలక్షణయుక్త
ములు యూపముల్ సేయఁగలుగు వర్ధ
కులును వచ్చిరి రాజకుంభకారులు ఖన
కులు గణకశ్రేణి గూడ వచ్చె
భరతమాని వేదపారంగతులు నట
నర్తకులును వచ్చినారు సామ
వేదవాదనప్రవీణవీణాహస్తు
లైన ద్విజులు వచ్చి రమృతనిధులు

చ. తిరిగి వసంతకాల మరుదెంచె నుదంచిత చంచరీకసం
చరణ పదార్పితప్రసవ సంచయ సంచిత మాధుబిందుని
ర్ఝరములు బుగ్గలై యఁబుక శాఖలఁ గోకిలకాకలీమధు
స్వరసరణిప్రవల్గితదిశామధుకుల్యలు పాయలై చనన్

చ. దశరథరాజు భక్తివినతంబగు మౌళి వశిష్ఠుఁ గాంచి శా
స్త్రసరణిఁ దత్పదాబ్జముల సర్వసమర్చలు సేసి తాత! మీ
రు సకలయజ్ఞకార్యమధురూపులు సర్వవిదుల్ క్రతుక్రియా
నిశితమతిప్రథన్ మనుమనిన్ దయచూడుఁడు సర్వరీతులన్

చ. పొరి పొరి నాదెసన్ గరఁగిపోదువు మిత్రునిబోలెఁ జూతు వ
బ్బురముగ నన్ను మాకు గురుమూర్తివి నీ ముదలం గమించిపో
వరు తొలిరాఘవుల్ క్రతువుపట్టున విఘ్నము పుట్టకుండ నీ
బరు వఖిలంబు మోయుము కృపామతి! నిన్విడి క్రోవయున్న దే?

ఉ. ఆర్యుఁడ వప్రమేయమహిమాన్వితమూర్తివి నైనయట్టి నీ
ధైర్యముగాక నే నవనతత్పరుఁ డౌదునె? నీవ యీ మహా
కార్యము సేయుచుంటి వని కైజత మోడ్చి నమస్కరింప ధీ
ధుర్యుఁడు మౌనిరాజు క్రతుధూర్వహుఁ డయ్యె నరేంద్రు ప్రీతికై

మ. నరనాథావసథంబు లెల్ల ముని యాజ్ఞాపించె శోభానిరం
తరసందీప్తులు గల్గఁజేయఁగ నయోధ్యాపట్టణస్థుల్ ధరా
సురగేహంబు లలంకృతంబులు బుభుక్షుప్రాపితానేకభా
సురభక్ష్యాన్నరసంబులై నిరతమున్ శోభిల్లు నట్లుండఁగా

చ. పురిఁ బెఱయిండ్లకెల్లఁ బ్రతిపూటయు రాజమహానసంబునుం
డి రుచిరభక్ష్యభోజ్యకమనీయరసాన్నములన్ దలిర్చు ప
ళ్ళెరములు బుట్టలున్ బ్రమదలీలను బంపఁగ మౌని యాజ్ఞ యి
చ్చె రససమృద్ధియున్ రుచియుఁ జేసిన పాకము లెల్లఁ జిమ్మఁగా

ఉ. పల్లెలనుండి యజ్ఞమని వచ్చినవారికి నెల్లవేళలన్
బిల్లయు మేఁకయుంచనక పెట్టవలెన్ సకలాన్నభక్ష్యముల్
కొల్లలుగాఁగనై విసువుకొంటయుఁ గోపముమై విదల్చుటల్
నెల్లఁగరాద యెవ్వరయి సేరిన నన్నము పెట్టు వేళలన్ ౨౯3

చ. ప్రళయపయోధివీచి బడబాశిఖిఘాతము పొంగి ధాత్రి నీ
ళ్ళల మునిగించుచో జలధి లోఁగొనఁజాలని మట్టిముద్ద య
వ్వల నొకఁ డుండు నిత్యమగు పత్తన మా యవనీశు సాదృతిన్
బిలువుము మానవేంద్రుప్రియమిత్రము స్నిగ్ధుని గాశికాపతిన్

చ. అమృతులు యోగ్యులున్ దశరథావనినాథునిమామగారు బా
వమఱఁది యిద్దఱన్ బిలువఁబంపుము కాదు మఱీవె పోయి పి
ల్వుము తగఁ గేకయాధిపుఁడు పుత్త్రుఁడు బంధుసముద్రులాటఁ గొం
చె మదియు దూరమే యయినఁ జెచ్చెరఁ బిల్చుట యుక్తమే యగున్

ఉ. క్ష్మాపతి యాత్మలో నొదువు సంగతి యంగధరాధినేత శాం
తాపితృపాదుఁడున్ మిగులధర్మి గుణాంబుధి రోమపాదధా
త్రీపతి యజ్ఞవేళ కరుదేరుట ముఖ్యము ఋశ్యశృంగుఁ డా
భూపతియల్లువాఁడు మఖమున్ నడిపించెడివాఁడ యాటచే

చ. నిభృతుఁడు దాశరాజు గుహునిన్ బిలువన్ వలె రాజ్యవర్తక
ప్రభు వతఁ డంతెగాక గుణవంతుఁడు నిష్కలుషుండు నీవు ధీ
విభవుఁడవౌటఁ జెప్పెదఁ బవిత్రము లూహలు కాక యా యెదన్
ప్రభవముకాని సంస్కృతికిఁ బట్టతఁ డాతని నీవె పిల్వుమీ

శా. ఏలాగై కబురంపెదో తెలియ భూభృన్మిత్రమా పక్షిరా
జాలంబున్ బొనరింప దేవతలకై యస్మన్నృపుం డేగినన్
మేలై సాయపడెన్ జటాయు విచటన్ మేల్కొరు నాతండు నీ
వేలా పిల్తువొ దక్షిణాపథమునం దెందో వసించుంగదా!

వ. ప్రాచీనులైన సింధుసౌవీరులు సౌరాష్ట్రులు దాక్షిణాత్యులు నైన
పార్థివులను బిలిపింపుము

చ. మృదువులు ప్రేమపాత్రులగు మేదినిరాజులఁ బిల్వుమన్న నొ
ప్పిదమగువారి నయ్యెడలు ప్రెగ్గడ పంపి తనంత నేగె భూ
మిదయితు లేరిఁ దా నరిగి మెత్తనిగౌరవ మిచ్చి పిల్వనౌ
నో దనకుఁ గల్గు బందుగులనో చెలికాండ్రనొ పోయి పిల్వఁగాన్

గీ. పనులు సేయంగ నియమింపఁబడిన కర్మ
కారు లరుదెంచి భూపాలకద్విజాళి ౩౦౮

గృహము లన్నియుఁ దగ నలంకృతములుగను
జేసినామని మూనితోఁ జెప్పవచ్చు

సీ. బీటువిచ్చినచోట్లు బిగియించి యతికించి
పెకలినచోట్ల నిట్టెక్క నమర్చి
పెళ్ళువిచ్చినచోట్లఁ బెట్టి బిగియించియు
పైమెఱుంగులు గిలాబీలు చేసి
రంగులువేసి చిత్రములు వ్రాయించి
యిమవులు శోభనాకృతులు చేసి
పందిళ్ళు పాకలు పచ్చనితోరణా
లన్నియు సిద్ధమ్ము లాచరించి
యెల్లవర్ణంబులవను బ్రత్యేకములుగను
విడిదులను బావులను దోవ్లు నేలువంచి
యన్నియేర్పాట్లు చేసితిమయ్య మహాను
నృపభ! భవదాజ్ఞఁబడి యని విన్నవింప

క. తపసి స్వయమ్ముగఁ జని యా
ల్లపనులు మేలయిన సంతలం గని మెచ్చెన్
నిపుణులగు కర్మకారుల
కుపద లొసఁగి పంపె దినము లొగిఁ జన్నంతన్

చ. ఉపదలుగాఁగ నేనుఁగులు నుగ్రలులున్ నెఱకోనపోడిగల్
కపురము గంబురల్ పునుగు గంధము మేలగుశాల్ జగాహారారం
గుపసిండి క్రొన్నగల్ తళుకుకోకలతో దుముదాళ్ళు కోంప్లు జ
న్నపుఁదటి కేగుదెంచిరి చనన్ మును బంట్లును వెన్క బందుగుల్

చ. తెలిపి యొకింత లేదు నృపతిప్రతతుల్ చనుదెంచుచుండఁ బె
ద్దటికము చేసి పూజలిడఁ దాను వశిష్ఠునకున్ నృపాలవల్
పిలుఁద నొసంగు గాన్కలను బెట్టెల కెత్తఁగ నేన్గుగుఱ్ఱముల్
గుఱితిడుకో సుమంత్రునకుఁ గొట్టములందునఁ గట్టఁ బంపుచున్

చ. ఉదుకులయంచులన్ జలము లుబ్బి తరంగల నొత్తుచున్ సము
ద్రుఁడు బడబాగ్నివోలె సరితూఁగి యయోధ్య నమస్తరాజులన్ ౩౧౩

గడుపున దాచెఁ దద్బలముఖంబులు హద్దుల కొత్తి తత్ప్రభల్
మడగకయుండ స్వీయమహిమల్ పెనుకాల్వలుగాగ నూగఁగన్

ఆ. పాలకడలితనయ పద్మ పెండిలివేళ
నఖిలజలధిరాజు లరుగుదెంచి
యతనిలోనఁ గలసినట్లుగఁ బరరాజ
బలము లవి యయోధ్యఁ గలసిపోయె

సీ. చని యెంత ప్రొద్దువేళను దల్పు దట్టినఁ
జిటుకలో వచ్చి తీసెదరు తలుపు
మంచితీర్థమ్మును గొంచెమిత్తురె యున్నఁ
దియ్యని మజ్జిగఁ దెచ్చియిత్తు
రదుగుల నిదురింతు మన్నచోఁ దాము ని
ద్రించు మంచముఁ బ్రక్క తెచ్చియిత్తు
రప్ప! పిల్లకు వేళతప్ప భోజనమున
కన వండిపెట్టుదు రప్పుడపుడె

ఆ పురంబునఁ బురుషులు నంగనలును
దమ ధరాపతి యజ్ఞవిధాన వేళఁ
దామె గేస్తులై వచ్చునందఱును దమకె
యతిథు లన్నట్లు గౌరవ మాచరింత్రు

ఉ. అంత వశిష్ఠులున్ దశరథావనినాథుని గాంచి యత్న మొ
క్కింత కొఱంత లేదు ధరణీశులు నీకును నైనవారు నీ
యంతిక మేగుదెంచిరి యథాజ్ఞముగాఁగ భవత్ప్రజాళి వ
ర్తింతురు వెంటనే బయలుదేరుము పావనయజ్ఞవాటికిన్

చ. ఉరువడిఁ గానవచ్చె సరయూనదికిన్ మొనమొన్న వట్టి బం
గరుబయలైన యుత్తరపుగట్టున నేఁడు విచిత్రచిత్రసుం
దరతరయజ్ఞసౌధము లనంతము లాత్తరమాప్రగల్భముల్
పురుడు తలంపుతో నగుచుఁ బుట్టినవో యనఁగా నిలేశ్వరా! ౩౧

సీ. పిలుదివియనిమగల్ గుఱికాండ్రను నాల్గువం
దలమంది రాజపుత్రికలు సూతు
లును గ్రామణులు శిల్పులును సంగ్రహీతలు
రక్షించినట్టి తురంగముమ్ము
సను దెంచెఁ బదునొకండును నెలలకును మున్న
యట రథకారగృహంబునందుఁ
దెచ్చి బద్ధాంఘ్రుల ఘృతగంగు నాలుగు నెప్పి
నారు పురోహితుల్ సూరిజనులు
యయును మేధ్యయశాలి కాంధ్యంబొందమునఁ
దెచ్చి యాశ్వత్థ్రజమును బంధించినారిగ
లోయి పుణ్యోదయమా! పునరాగమనమున
త్రిప్రధాన! యిప్పుడు బయు ప్రేరనలయు

క. అంద ఋశ్యశృంగుడనను ని
సదనము కేలించుచుంటి జన్న మునకు ని
న్నిదె కొనిపో సతిసనొగము
తుదలను నుత్సాహమిష్ట తోణికసలాడెన్

క. అనినంత ఋశ్యశృంగుడు
సనుదెంచి ధరాధినాథ! సర్వము సిద్ధం
బినవంశవనధిచింతా
మణి! మణికల్పితసహస్రమండప! యనినన్

ఉ. ఆస్యమునందు భక్తి తొలుకాడఁగ ఫాల్గునమాసమందు దమా
వాస్యయు నాట సూర్యభగవానుఁడు దోఁచిన శిన్యుషస్సునన్
గాశ్యపిభర్త యజ్ఞపరికల్పితవాటిఁ బురోవశిష్ఠుఁ డై
ఋశ్యవిషాణమాని వివరింపఁగ యజ్ఞవిధాన మేగినన్

ఆ. మునిని ఋశ్యశృంగు ముందిడుకొని వశి
ష్ఠాదిమునులు రమ్యయజ్ఞవాటి
గతులు ద్విజులు యజ్ఞకర్మ మారంభించి
రాగమముల నుక్తమైనయట్లు ౩౨౨

శా. శంసామార్గవిధాత లార్జవనిధుల్ సాధుల్ త్రయీన్యాయమీ
మాంసావేత్తలు కల్పసూత్రవదనుల్ ఘృక్ష్మాదేవతల్ కృష్ణవ
ర్త్మాంశుల్ యాజకులై ధరిత్రిపుని యజ్ఞారంభముల్ దీర్పఁగా
శంసామార్గ మతిక్రమించె మఖదీక్షాకాలసాన్నాయ్యముల్

పంచచామరము.

మొదల్ దినంబు లేడు మూఁడు మూఁడు వైశ్వదేవముల్
పదంపడిన్ మహాగమంబు పల్కినట్టి హోమముల్
పదింబదిం బొనర్చి కల్పవాగ్వ్యతిక్రమంబు లే
క దాంతులై చరించి రెల్ల ఘృక్ష్మాత లేషుయాజకుల్

శా. ధీమన్ముఖ్యులు ఋత్విజుల్ ప్రభువులై దీపించి 'నాసగ్స్థితే
సోమే౽ధ్వర్యు'రితిప్రపంచితమహాసూత్రార్థముల్ దాటకే
మా మా యంచు ననేకవింశతులు హోమంబుల్ విధింజేసి రా
హోమాంతమ్మున వేల్చి రెల్ల హవి సింపొందఁగఁ బూర్ణాహుతిన్

ఉ. ఆపయి యాజకుల్ క్రతుమహాగమవేత్తలు ద్వాదశప్రవ
ర్గ్యోపసదంబులన్ సలిపి రొప్పుగఁ దా రుపదేశశాస్త్రమా
ర్గాపతితంబులై వెలయునట్టివి పై నతిదేశతఃపరి
ప్రాపితమైన కర్మలును నన్నియుఁ జేసిరి వ్యగ్రబుద్ధులై

క. తవిలి ద్విజావళి ప్రాత
స్సవనము మాధ్యందినంబు సాయంసవనం
బు విశేషవిధుల్ సలిపి వి
ధివదాచరణంబులన్ నుతించిరి సోమున్

సీ. ప్రాతస్సవనమందుఁ బ్రభు నింద్రుగుఱిచి సో
మాంశంబు నిచ్చిరి యా ద్విజాళి
హరివంతుఁడని వాని కర్పించి ధానము
లంతఁ బూషణ్వంతుఁ డని కరంభ
మరసి సరస్వంతుఁ డని పరివాపమ్ము
వాసవుం డని పురోడాశ మిచ్చి
మిత్రావరుణులంచు మృదుపయస్య నొసంగి
యింద్రు నుద్దేశించి యెల్ల నొసఁగి

యొక పయస్య వినా ప్రసహాంగసను సా
సంగి మాధ్యందిన తృతీయసవనములను
ఋత్విజులు చుట్టుఁజేరి యర్పించి పెట్టు
స్తోత్రములఁ దృప్తుఁజేసిరి సోమరాజు

ఆ. బ్రహ్మ దక్షిణమునఁ బశ్చిమ మ్మధ్వర్యుఁ
డుత్తరమున హోతయును బోలిచన
నుదితముఖుఁడు నిలచి యుద్గాత తూర్పు
రూపు సోమ దేవు సన్నిధాని

శా. గీర్వాణోర్వ్యవిదగ్గణ్యులు మతిశ్రేష్ఠాప్రమాణుల్ సదా
నైశ్చల్యప్రథమానతారులు ద్విజుల్ నానామహాయజ్ఞకా
ర్యాశ్చర్యక్రమమాణులై నడుపఁ బ్రత్యాదేశముల్ లేక ప్రా
యశ్చిత్తేష్టి యటన్నపల్కు వినరా నా రాజు జన్మంబునన్

క. అహుతం బని స్ఖలితం బని
యహారారంభావసానయజ్ఞాహుతి మం
త్రహతాదుచ్చారణములఁ
బ్రహరింపదు మంత్ర మొకఁడ బ్రహ్మగళింజనున్

గీ. ఋక్కులు యజుస్సులును సామ లొక్కఁడొకఁడు
నిక్క దేవతలును బోలె నివ్వటిల్లె
నసిమహాచండముగ నుదాత్తానుదాత్త
ములును స్వరితముల్ తీక్ష్ణతామూర్తు లయ్యె

ఉ. జన్నము సాగినన్ని దివసంబులు నిల్చిన చోట నిల్వకే
చన్నప్రజల్ బడల్వడరు సంతస మింత కొఱంత పొందరా
పన్నులుకారు నాఁకలిపిపాసల డయ్యరు మూకలంబడిన్
స్విన్నులుకారు బందుగుల వీడి చరింపరు తప్పిపోవరున్

ఉ. సుందరయజ్ఞవాటి వెనుచొప్పునఁ దీరిచి దిద్ది వేయు మేల్
పందిరులందు సోలుపుల బంతులు తీరిచి నాథవంతులున్
దిందు రనాథవంతులును దిందురు గట్టునఁ దేఁచి తేఁచి గో
విందలు కొట్టుచున్ జిఱుతబిడ్డల పొట్టలనిండఁ గుక్కుచున్ ౩౩౮

ఉ. విస్తరిమీఁద వంగఁబడ వేయక మానెదరేమొ సూదకుల్
విస్తరిపైని వంగుటకు వెన్నును వంగదు పొట్ట వంగదుఁ
హస్తము లడ్డముంచినను నాగక వడ్డనఁ జేతు రన్నియుఁ
గస్సిగ నల్లి తిందు రవుఁగాదనలేక క్రతుప్రసాదముల్

సీ. ఇపుడె గుండిగ దింపి యిగురఁబెట్టితిఁ బొడి
పొళ్ళాడు నీ యన్నమును దినుండు
పూర్ణమ్ము లేకుండఁ బునుకులుగా వేసి
తిమి కరకరలాడు తినుఁడు వీని
గాలుచునున్నది కాఁబోలు క్షీరాన్న
మిదె దొన్నెలను దెచ్చియిత్తు నుండుఁ
డిది గడ్డపెరుగు మీరింకఁ గొంచెము వేసి
కొనవలెఁ జలువసేయును గదండి
యనుచు బతిమాలి బతిమాలి యవనినాథ
సూదకులు కొల్లలుగఁ దెచ్చి చూఱయీయ
సన్నమున నాదరంబునఁ దిన్నకడుపు
పెన్ను నెడదలు నుబ్బిపోయెదరు జనులు

సీ. అన్నంపురాసులు చిన్ని తోమాలెల
కై సన్నజాజులు పోసినట్లు
సన్న ఖర్జూరపుఁ జాపలపై సూప
రాసులు గంధమ్ము తీసినట్లు
ఎఱ్ఱవాగుగను వేయించి నప్పడములు
పునుఁగు కుంకుమ కుప్పవోసినట్లు
వంగపండుల పేళ్ళ వరుగు చోష్యపు గుబా
ళింపు లత్తరులు నొల్కించినట్లు
రాఘవుల యిలువేల్పు శ్రీరంగనాథ
ప్రభువు పవళింపుసేవకై భద్రపఱిచి
నట్టి సంభార మనఁగ మహానసంబు
ద్రవ్యములు పొల్చె దశరథక్రతువు వేళ

శా. ఎన్నన్ నీవు జటాయువా? సఖుఁడ! రా! యెన్నాళ్ళ కెన్నాళ్ళ కీ
నన్నున్ లోనఁ దలంచినావు కబు రందం జేసిరా నీకునున్
మిన్నున్ డిగ్గుము నీవు వచ్చితివి నా మేఘంబు సాఫల్య మం
దు న్నీకున్ గబురంపుటన్ దగు సుమంత్రుండున్ సుమంత్రుండుగా

క. అన డిగిన పక్షిరాజున
కును ఱెక్కలు నిమిరి చుంచుకొస చాది నినున్
నినుఁ గంటిని స్నేహావధి
నని ఫలముల నారగింప నందిచ్చు తతిన్

ఉ. నాకమునందు యుద్ధముల నాడఁగఁబోయెడు రాజుతోడ మై
త్రీకలనన్ వహింతు రెవరే నని యందున దీర్ఘ పక్షచం
~~[illegible]~~ఁడు నీతఁడు మిత్రుఁడౌట లే
దే కద యబ్బురం బని వహించిరి యబ్బురమున్ సభాసదుల్

గీ. పక్షిరా జారగించుచోఁ బార్థివుండు
తాత! నీచెల్మి యొకయెత్తు దైవతాధి
నాథుచెల్మియు నొకయెత్తు నా కటన్న
ఱెక్కతుద లార్చి యనుగొత్తి పక్కిఱేఁడు

ఉ. నే నొకపక్షిమాత్రుఁడను నీవఖిలేశుఁడ విట్లు నన్నుఁ బ్రే
మానతబుద్ధిఁ గాంతువు ధరాధిప! నీవన నాదుమైత్రికిన్
గానను హద్దు నీ విటుల గౌరవమాడినయంతఁ బొంగి నా
లోనన నేను గ్రొమ్మనసులోఁ బులకించుచు నుంటి మిత్రమా.

ఉ. ఈ మిష వెట్టి వచ్చితిని యెంతటి కెంతటి కెంతదూర మీ
భూమి నినున్ గనుంగొనఁగఁ బుత్త్రిలు గల్గుదురయ్య నీకు నే
నా మునికూనలన్ గనుదునా? కనుఁగొన్నను గుర్తుపట్టువా
రే? మఱి నీకుమారు లని యించుక చంచువు వాల్చి నవ్వుచున్

క. తన పక్షాంచలమారుత
మున ఱేనికి వీవఁ జాలు పో! నీవా? నా
కును వీతు వంచు దశరథ
మనుజేశ్వరుఁ డతసి వీచె మలువసనమునన్ ౩౫౧

గీ. మొదట శ్లేష్మాతకము పాతి పిదప దాని
కిరుదెసల దేవదారువు లిట్టునటుల
మూఁళ్ళుగా మోదుగులును మూఁరేళ్ళు ఖదిర
లౌలయ ఖాదిరపాలాశములను బాతి

క. అమరించిరి యెడములను యూ
పము యూపము నడుమ షణ్ణవత్యంగుళముల్
సుమమాలాకుంకుమగం
ధములను వస్త్రముల శోభితంబులు గాఁగన్

క. సుమమాలాకుంకుమగం
ధములను వస్త్రముల శోభితములై తగు యూ
పము లేఁడు నేడు సప్త
ర్షిమండలమహస్సులై విశిష్టతఁ దాల్చెన్

ఆ. కూడి శుల్బకర్మకుశలులౌ బ్రాహ్మణుల్
సూరిమణులు శుల్బసూత్రవిహిత
మైనయట్లు చేసి రగ్నిసంధానమ్ము
నిట్టికల ప్రమాణ మెఱిఁగి తెచ్చి

గీ. ఱెక్కలును బుచ్ఛమును బ్రసరించి శిరము
వాంచి నిలచిన గరుడినా వహ్నులాఱు
ప్రతిదిశమ్ము సహస్రహిరణ్యశకల
ప్రోక్షితమ్ములు జ్వలియించె భూపశిఖులు

స్రగ్ధర.
నానాదైవత్యముల్ పన్నగములు ఖగముల్ నాకరాజాదిదేవ
శ్రేణిప్రీత్యర్థమై కూర్చిరి ద్విజులు పశుశ్రేణులన్ రమ్యయూప
శ్రేణిన్ మేధీయమై పొల్చిన తురగము రాజిల్ల యాదోమహార
ణ్యానీసంభూతముల్ గ్రామ్యములునుదఱుచైమూఁగ మోక్తంబుగాఁగన్

శా. ఊరుం బల్లెల నుండు జంతువితతిన్ యూపంబులన్ గట్టి నా
నారోకంబులకున్ బిగించిరి సమస్తారణ్యముల్ దీప్తయూ
పారూఢంబులు మూఁడువందలు పశుల్ యజ్ఞాత్తమా సంఖ్య శా
స్త్రారబ్ధం బొక మైదువందలును దా నాపైని బందొమ్మిదిన్ ౩౬౪

భుజంగవిజృంభితము.

సాధ్వీచూడారత్నం బాకో
సలపతిసుతఁ బెఱజలజాతనేత్రల బ్రహ్మహో
త్రధ్వర్యూద్గాతల్ వే హస్తా
హారణమునఁ బెనలిచిరి యల్లభోగిని హోత తా
నధ్వర్యుండున్ బాలాకల్యన్
హాసదు వనఁగను దగినియట్టి యాపరివృత్తిఁ ద
త్రధ్వానాబ్జాస్యన్ దా నుద్గా
తయును సతులఁ బతులు కరంబు లూనినయట్లుగా

క. వారివెల లొసఁగి తిరిగి ధ
రారమణుఁడు పుచ్చుకొనియె రామామణులన్
వారివెలయంచు నిచ్చెను
బేరున కా పేరులందు వెల యున్నదియే?

క. ఆ యశ్వరాడ్వపాస్తా
నీయంబయినట్టి తేజనిని నధ్వర్యుం
డాయతిప్రయోగకుశలుం
డై యగ్నులయందు వేల్చి యమరిచి నండెన్

శా. ప్రాణస్పృష్టము లౌటఁ బాపములు తత్ప్రాణంబులం బట్టి యూ
ఘ్రాణించెన్ ధరణీతలేంద్రుఁడు వపాగంధంబుఁ దద్గంధ క
ల్యాణశ్రీపరిసర్పణోద్ధతులముం దల్లాడి ప్రుగ్గెన్ వథ
క్షోణిన్ దీసిన యాఁకలై చెడు కుగుంజు లోవలె జీర్ణాఘముల్

క. తక్కిన తురగాంగమ్ములు
ముక్క మిఁగులకుండ హోమముం జేసిరి ఋ
త్విక్కు లవనీంద్రుపాపము
చక్కిలమై వడియమై పిస్లై చెడఁగన్

ఆ. ఇతరయజ్ఞహవిసు లెల్లను బ్లక్షశా
ఖాంతరముల నునిచి యశ్వమేధ
హవిసు వైతసంబునం దుంచి మూన్నాళ్ళు
హోమములను జేసి రుర్విసురులు

తెలియని కయ్యముల్ జనుల దిద్దుటలున్ బెఱతేండ్లు తొత్తు
త్తుల కెదురొత్తు లెత్తుటలతోఁ గికురింతువె మమ్ము ధాత్రిపా!

చ. స్మృతికిని దెచ్చుకో తురగమేధము సేయుట యయ్యో నీ కహో
సుతులను గోరి సర్వరిపుసూదన! ధాత్రిభరంబు మాన్పుకో
మతిఁ దలపోసికొ దవనిమండల మింతయు నీవయిన్ భవ
త్సుతుఁ డొకఁ డుండి యేలవలెనూ! పెఱవారికి జోక్య మున్నదే?

ఉ. మేదిని మెల్లయున్ దొలుత మీఁది సుమూరవుఁజెక్కలెల్ల నా
యా దొర లేల నిచ్చిరి ధరాధిప! యుత్తరకోసలంబులే
మీఁదగు నేల్బడిన్ నిలిపి మీ తొలితేఁడులు మీఱు ధర్మసం
క్షోదము లేక పైయదువుఁ జూచుచు నుండిరి సర్వధాత్రిపై

క. మీ రక్తనాళముల సం
భోరుహామిత్రుని సమగ్రములు తేజములున్
ధారావాహికగాఁ జనుఁ
బ్రారూఢములై పరంపరాప్రాప్తములై

క. కొడుకు వదలి పున్నరకము
చెడదే! యదియేమి ముక్తిఁ జేరంగట్టం
గడఁగెదవో? యే యఘములు
కడిగెదవో? యిట్టిత్రోవఁ గంటే? వింటే?

చ. ఇనునిమహస్సు నెత్తురుల నేఁచెడు పుత్త్రుని ధాత్రి కిచ్చి నీ
వనమున కేగుటో? మొదలివస్తువుఁ గన్బొమలందు నాగుటో?
పోనరువఁగావలెన్ గోనుము భూమి సమస్తము మాకు నేటికిన్
జనెద మిదే యటంచు మృగచర్మములున్ బుడిచెంబు లూనుచున్

క. తారును బ్రాహ్మణులు బయ
ల్దేరిన భూపతియు భూమిదేవుల రం డో
ధారణిసురలారా! నా
ప్రారబ్ధము మీర మీర పాపఁగవలయున్ 3౯౦

క. అని మగుడించిన నా బ్రా
హ్మణులును నీధాత్రి యేల నయ్యా! మా కో
మనుజవిభూ! దృప్తభుజా!
ధనుర్వినిర్గతపృషత్కదారితశత్రూ!

ఉ. ఇత్తు వటన్న బ్రేమ కలదేని నృపా! మణు లిత్తువేని బసిం
డిత్తువు పాలు పూటకును నిత్తువు పిండెడి గోవు లిత్తువేన్
మెత్తువు నింక నీ తురగమేధము లన్నిట మాకె యా ద్విజం
బిత్తువు దానవీర! వనమేగిన నిత్తువ పుచ్చుకొందుమో?

మ. అను ఋత్విక్కుల పల్కులం దోషవు మేల్గై రాజు సప్పాలులుం
దనియన్ రత్నములున్ మణుల్ పసిడియుంగ్గల్ సందవేల్గోవు లుం
డిన మంద ల్పది యిచ్చి పైఁ బసిడినాణెంబుల్ పదార్కోట్లు ని
చ్చెను నద్దానికి నాల్గురెట్లగుచు నిచ్చెన్ వెండినాణెంబులున్

చ. కొమరు మిగుల్ మణివ్రతతి గోవులుఁ గ్రొత్తయు పెంపియున్ వశి
ష్ఠమునికి ఋశ్యశృంగున కొసంగిరి వారును గొంచుఁబోయి తా
రమరఁగ ఋత్విగాళి పదునార్గురకున్ బదునాలు భాగముల్
సమములుగాఁ జేసి యిచ్చినఁ బ్రశంసలు చేసిరి మౌనులన్ ద్విజుల్

క. ఇతరులు శ్రుతిస్మృతివిదుల్
క్షితిసురులకు రాజొసఁగె బసిఁడి నాణెములన్
మతిఁ దనియఁ గోటి యీగతి
శతక్రతువు గూడఁ జేయఁజాలఁడు నాఁగన్

గీ. ఒక్క పరదేశి నిరుపేద యుర్విసురుఁడు
కూడి యెకిమీనిలోఁ దనగోడు చెప్పఁ
గదలునన వచ్చి తనకు మున్గా మురారి
కరఁగి పతి తీసి యొసఁగె నుంగాముఱారి

ఉ. దీటుగఁ బూరిపాక మణిదీపిక పెట్టినయట్లు కంకణం
బేటి కొసంగెనో నృపుఁడు నేటికిఁ దాను గ్రహించెనో యెదం
గాటపు దైన్య మొప్ప నవుఁగాదన లేక చనన్ ద్విజుండు ద
ద్ధాటక మిచ్చి కైకొనియె నద్ది సుమంత్రుఁడు ద్వారవీథికన్ ౩౯౨

క. జలనిధి పొంగినదో యన
నలలు నలలు గాఁగ భూసురాశీర్వాదం
బుల రవము చెలఁగె ధాత్రీ
తలపతి గృహతతులు శ్రీనిధానంబులుగాన్

ఉ. సాధుజనైకకంటకనిశాచరకంఠకఠారశమూర్తి మా
యాధవుఁ డంజనాద్రిశిఖరాంచలచిక్కణకాంతిమత్తనూ
సాధుమనోజ్ఞమూర్తి త్రిపిశప్రభుబంధవిమోచనుండు భూ
మీధవ! త్వత్పురావనసమిద్ధమహానిధియై తలిర్పుతన్

ఉ. ఊనిన మేనిపైఁ బొడుపు లొత్తక మెత్తనిక్రిందిపొట్టపైఁ
గా నొనరించి శ్రీవిభునికాయము కందనియట్లు చూచు మేల్
పానుపు శేషభోగి నరపాలక! నీదగు భారమంతయున్
దానయి మోచుఁగాక నవతామరసేక్షణభక్తశేఖరా!

మ. అడుగుందమ్ముల శంఖచిహ్నములు దా నంటంగఁ బాఁకోళ్ళ ద్రే
ల్మిడిఁ బాదాపహచిహ్నముల్ దనువుఁ దాల్చెన్ బాంచజన్యంబుకై
వడి సేవింప ననంగ నే ప్రభువు పంపన్ దక్షిణావర్త మె
ప్పెడు తేజమ్మది నీ కులంబునను గల్పించున్ యశోదీప్తులన్

క. నిఘ్నము జగ మఖిలము గళ
దఘ్నము దైతేయులకును దర్పితమదశ
త్రుఘ్నము సుదర్శనము పా
పఘ్నముగా నీయెడన్ గృపంగను భూపా!

క. పతియు వినమ్రశిరస్కుఁడు
క్షితిసురవాగర్థములను జింతించుచుఁ గం
పిత దేహయష్టి యాచును
గృతార్థుఁడఁ గృతార్థుఁడ నని కేలు మొగిడ్చెన్

క. ఒకదినుసుది సుఖదుఃఖము
లకు మఱి యాశానిరాశలకు నడిమి యొకా
నొకభావముచే బతి గుం
డె కదలి కనుగొనకొలంకు నిండె జలముచేన్

ఉ. శ్రీనిధి నాకసౌధశిఖరిజ్వలితావనినీయమానసో
పానపరంపరాభినవపద్ధతి పాపవనీదవార్చి య
జ్ఞానతమైన దీప్తఫల మంది ధరాపతి మోదవాహినీ
స్నానము చేసినట్లు తనుసంగతముత్పులకల్ వహించుచున్

ఉ. శృంగమునిన్ సిగన్ గయి ధరించి నృపాలకుఁ డశ్వమేధమున్
సాంగముగా నొనర్చి ఫలసంగతిఁ దెచ్చిన నీ ఋణంబుఁ దీ
ర్పంగలనయ్యా? యింకఁ గులవర్ధనహోమము లేమిసేతువాఁ
యంగము ప్రాణ మెల్ల భవదర్పణమున్ బొనరించితిన్ మునీ!

గీ. నావయిని నీకుఁ బ్రేమ యున్నదియొ లేదొ
సాగిపోనీ కనీస మస్మత్కుమారి
శాంతకును దమ్ముఁడంచుఁ బ్రాసంగువిత్తు
నొకని గనిపింపనీవె మహోనిధాన!

క. అనినంత ఋశ్యశృంగుఁడు
తనయులు గలిగెదరు నీకు ధాత్రీతలనా
థ! నలువు రం దొక్కఁడు సూ
ర్యునకున్ సూర్యుఁడు వెలుంగునో మీకులముల్

ఉ. అంచునె ధ్యానమగ్నుఁడయి యమ్ముని యించుక లబ్ధసంజ్ఞుఁడై
ప్రాంచదథర్వవాక్చిరములం దుదితం బయినట్టి రీతిఁ గా
వించెద బుత్త్రికామ మను వేల్మి యటంచును వేల్వఁబోచ్చెఁ గుం
డాంచల మగ్ని నాలుకల నాని పొడై వెలియారిపోవఁగన్

సీ. కాంతులు దెసలందుఁ గదలించినట్లుగా
వీరులు కత్తుల వేసినట్లు
రోసాన ఝుంఝులు దూసిచన్నట్లుగా
వెలుఁగులు నావిర్భవించినట్లు
కృష్ణరక్తచ్ఛవుల్ క్రేవల వెలయించి
పటహాస్వనంబులఁ బ్రజ్వలించి
హార్యక్షలోమవర్ణాభిరామంబులై
క్షితిధరాగ్రోపలోత్సేధములయి

పుల్గులు నాల్కలు సాచినట్టులుగ సాగి
తీక్ష్ణసూర్యాంశువహ్నులు దిమ్మరించి
మానియు నథర్వవేదోక్తమంత్రపటిమ
వహ్ని వేల్చుచోఁ బావకజ్వాల లెగసె

క. పరితో జ్వాలామాలల
హిరణ్యరేతసుఁడు చిటిలి యింధనము శిఖా
భరజిహ్వా చీలి మిన్నులు
పురపుర లేలిహ్యామానములుగా మండన్

క. రాజు ముని యొక్కగొంతున
భ్రాజిష్ణువులైన దీప్తపటుమంత్రములన్
తేజోమయు దమునుని సు
త్తేజితమతులై ధృతిన్ నుతించిరి నుతులన్

అష్టమూర్తి.
అగ్నాయీప్రియతమున్ ని
స్సమితభక్తిప్రపత్తిన్ హవణు పొల్చిన శ్రద్ధా
మగ్నంబౌ హృదయచేతోఁ
మలినమార్గంబునన్ భూమహావిరర్పణకార్యం
బగ్నిగ్రాహాదులును గర్తల్
హాదనునం జేసి బర్హీ! యమృతబుక్తతిఁ బాడన్
భుగ్నజ్వాలల వియద్భా
ము లోరయం బ్రాకి బర్హిర్ముఖుల కిత్తు హవిస్సుల్

అష్టమూర్తి.
ఋక్సామాకృతి యజుర్మూ
ర్తిని మహాథర్వవాసున్ గృతసుహావ్యతురంగున్
వాక్సమ్యక్చరదుదాత్త
స్వరితమార్గప్రవిష్టున్ బటుహావిఃప్రియచిత్తున్
దిక్సీమాంతనిబిడజ్యో
తిని బృహద్భాను నిన్నుం దెలిసి స్తోత్ర మొనర్పన్
ద్రాక్సంపాదితములౌఁ ద్రై
దశజగత్సౌఖ్యముల్ నిర్దళనమందు నఘంబుల్

పంచచామరము

నమో నమో హవిఃప్రియాయ నాకవాసినాం ముఖా
య మామకీనభక్తితృప్తితాత్మనే సురప్రభూ
త్తమాయ కర్మమార్గదాయ విదారితాత్రితాపదాయ
నమః కృపీటయోనయే ధనంజయాయ బర్హిషే

క. నీమూర్తి ఋక్కులు యజు
స్సామంబు లథర్వములు సుసుస్వన! యాజ్ఞ్వ
శ్రీమహితలోకసంతతి
సోమించును నీకతాన శోచిష్కేశా!

ఆ. శమ్మ! నీవు కరుణఁ జూచుటచేఁ గర్మ
వితతు లెల్ల సాగు వీతిహోత్ర!
నీదు కరుణ వెలయ నెగడెడి జగములు
బర్హి! నీవు కలిమిఁ బ్రభులు సురలు

వ. అని స్తోత్రంబులు సల్పుచుండ నమ్మహాగ్నిఁ నుండి మహాప్రభమ్ము మహావీర్యమ్ము మహాబలమ్ము కృష్ణరక్తాంబరధరమ్ము రక్తాస్యమ్ము దుందుభిస్వనమ్ము స్నిగ్ధహర్యక్షతనూజశ్మశ్రుప్రవరమూర్ధజమ్ము శుభలక్షణభూషితమ్ము దివ్యాభరణభూషితమ్ము శైలశృంగసముత్సేధమ్ము దృప్తశార్దూలవిక్రమమ్ము దివాకరసమాకారమ్ము దీప్తానలశిఖోపమం బయిన యొక మహాభూత మ్మావిర్భవించిన

క. భూతలపతి భయవిహ్వల
చేతస్కుఁడు వాక్కురాక చేరల కన్నుల్
భీతిమెయి వికచశతప
త్రాతతవిస్తృతములై మహాకృతిఁ జూచెన్

ఉ. ఆగతి నున్న రాజుఁగని యా వెలుఁగోయి నృపాల! న న్నిహా
భ్యాగతునిం బ్రజాపతిసమాగతుఁ గాఁగ నెఱుంగు మన్న రా
జాగతసంజ్ఞుఁడై ద్రుతకృతాంజలియై 'భగవన్ నమోఽస్తు తే
స్వాగత' మేమినే నొనరుపం గల నీ కెఱిగింపు మం చనన్ ౪౨౦

ఉ. అప్పురుషుండు చేతఁ గొనినట్టిది మేల్మిపసిండిచొక్కపుం
గొప్పెర దీప్తపాయసము కూరిచినట్టిది వెండిమూఁతతో
నొప్పెడునట్టిదిన్ దనదు నుగ్మలినాఁ బ్రియమైనయట్టిదిన్
దప్పక చూచి సర్వవసుధాపతితో నిటు పల్కె నంతటన్

క. నీ యర్చాప్రభవిష్ణుత
తుష్టాయోషాహృదయనాథ! సంతోషితమై
యీ యమరవితతి పొల్చెడు
నీ యర్చాఫలము లెల్ల నిండించుటకున్

మ. అమృతజ్యోతిరుపేత మియ్యది నృపాలా! అద్యగోదోహప
క్వము సంతానకరం బనామయము పర్వాన్నంబు ప్రాప్తించె ను
త్తముఁడా! భార్యల కిమ్ము దీనిని యదర్థంబై యజింతో తద
ర్థము ప్రాప్తించెను నారగింపు మనుమీ ధాత్రీశ! నీ భార్యలన్

క. అని ప్రాజాపత్యపురుషుఁ
డను జేఁగొప్పెర నొసంగుఁడున్ బతియు మొగం
బున వినయ మొప్పఁ దలఁతోఁ
బ్రణామ మొనరించి కొనుచుఁ బాయసపాత్రన్

చ. అనుకనుకొచుఁ గేల్మొగిచి యద్భుతమున్ బ్రియదర్శనంబుఁ దృ
ప్తనయనవీథికాంజనము తత్పురుషాకృతికిన్ బునఃపునః
ప్రణతులు సేసి సంతసము పట్టనిమేనఁ బునఃపునఃప్రద
క్షిణములు సేసి స్తంభమును జెందె నిలంబడి యట్లె చూచుచున్

క. అంతట నవ్వెలుఁగు దిశా
క్రాంతమ్మై యగ్నికంబెఁ గాంతమ్మై దుః
ఖాంతమ్మై సర్వసుఖ
ప్రాంతమ్మై సర్వదృగ్ధరాపటు వయ్యెన్

క. అత్యగ్నికమ్ము ప్రాజా
పత్యపురుషుదీప్తి కనులుపట్టకయ లయా
దిత్యశతకోటిదీప్తి
స్తుత్యమ్మై జనుల కనుల సూదులు పొడిచెన్ ౪౩౭

ఆ. కనులు మూఁతపడవు కాంచనేరవు బహి
రంతరమ్ము లోకసమాధి నిద్ర
గ్రుడ్డితనము కాక కుల్యాంబువుల మున్గి
కనులు తెఱచినట్లు కానవయ్యె

వ. అంత

సీ. ముదిపృదాకువు సెజ్జ మునులు జోదళ్ళయ
హాళి నైఁ గూర్కు సుమాళి యొకఁడు
ప్రామినుక్కుఁ చిట్టచివళ్ళలో నసురుల
దోరించు నట్టి కటారి యొకఁడు
ప్రామత్రిక్రీనీడఁ బారమ్ము ముసలులౌ
మునులచేఁ జదివించు పోఱఁడొకఁడు
పాలవెల్లి కరళ్ళపై వెలికింతలై
కాలివేళ్ళు చీకెడు కందొకండు
పసిమియై గాలికిని రాలిపడిన యొక్క
నలుసు నివ్వరిముల్లైన వెలుఁగొకండు
స్థూలమై వచ్చి వచ్చి తా సూక్ష్మమగుచు
జనపతికరస్థ మగు పాయసమునఁ జొచ్చె

సీ. అసురకన్యాకంఠహారమంగళసూత్ర
సూత్రకర్తన కేళి సురియవాటు
దనుజవాటీకేళివనసర్వతోభద్ర
భద్రతాహానువుపైఁ బావకోడు
బర్హిర్ముఖాళిసంపత్తివృద్ధ్యాజీవ
జీవమ్ము గాకృష్టి జిగురుఁగండె
మునిధర్మకర్మనిర్మూలనోత్క్యపకంఠ
కంఠదేశములకుఁ గాని దిగులు
సూరిలోకైకకంటకాసురవితాన
ప్రాణముల పైకి నెత్తిన పాముపడగ
యగు మహాజ్యోతి యొక్కఁ డంతంత వచ్చి
జనపతికరస్థ మగు పాయసమునఁ జొచ్చె

## ఖండాంతము

గీ. శివ! భవత్తనుపూజయై తపులుఁగాక
బాలకాండేష్టి యిది చంద్రమౌళినృపతి
వినియె నెది సత్యకవివల్ల విశ్వనాథ
పార్వతీశోభనాద్రిగర్భంబు వలన

చ. తొలిచదువుల్ నినుం దెలియ త్రోవలు చెప్పనుజాలవందురే
మలిచదువుల్ ఫలించునటె? మానని తర్కము పెంచిపెంచి చం
చలతమమైన బుద్ధి మతిశాలితయం చనుకొను గాక! ని
శ్చలతమమైన నీదు పదసారసభక్తి నొసంగవే శివా!

మందాక్రాంత.

గౌరీపాదాంబురుహవినమత్కాంతలాక్షానురక్తా!
పారావారోన్మథనజనితప్రౌఢకాకోలభక్తా!
శారజ్యోత్స్నామృదుశశిశిశుస్వచ్ఛచూడాగ్రముక్తా!
సౌరప్రోద్యజ్జగదవననిష్ణాతగంగాభిషిక్తా! ౮౩౮



మించిపోయిన రొష్టు కల్పించె నెవఁడు
స్వామి కసి యల్లెత్రాట వంచనిది కూడ
ఖంగు ఖంగున మ్రోఁగుచుఁ గదలివచ్చె
స్వామిభుజలంబమానమై శార్ఙ్గధనువు

సీ. నాభిసంస్థములు ప్రాణము లింక నాడునే
యల్పదైత్యులకు దీర్ఘాయువులకు -
గళసీమలకుఁ బైని గంఠముల్ నిలుచునే
చండాసురులకుఁ బాషండులకును
ఒకఁ డొక్కఁ డూఁది బాహువు లింకఁ జెలఁగునే
విద్యాధరులకు దోర్వీర్యులకును
స్వఃకామినులఁ జెఱపట్టుటల్ సాగునే
చెడిపెరక్కసుల కశృంఖలులకు
ప్రభుమహాయుధమూలవిరాట్టు కదలి
కూడి విజయేందిరోగ్రభ్రూకుటి యనంగ
విధృతమై లస్తకంబున వెడలివచ్చె
స్వామిభుజలంబమానమై శార్ఙ్గధనువు

చ. తన బహుకల్పనిత్యమగు తాపసిరూపున వచ్చియున్న శా
ర్ఙ్గని తొలివెల్గుబొడ్డు బదరీవనిలో ముదిచెట్టుక్రింది ప
చ్చనివెలుఁగాచు వచ్చుటను శార్ఙ్గధనుశ్చటులోగ్రశృంగగుం
ఫనములు లేనిచో గుఱుతుపట్టియయుండరు సర్వదేవతల్

ఉ. వచ్చిన శౌరి దేవతలు వాఁగులు చుట్టి ప్రదక్షిణించి నీ
పచ్చనివెల్గు మా నయనవారిజకేసరదీప్తి ఔమ్ముపై
మచ్చ చరన్మధువ్రతము మాహృదయేశ్వర! కెంపుగంబమా
చిచ్చులవిల్లు తేనియలు జిమ్మన లేచిన ధారయుగ్ ప్రభూ! -

సీ. ఓయి హృషీకేశ! దోయిలింతుము నీకు
శార్ఙ్గధనూరాజ! స్వాగతంబు
అనిరుద్ధ! నీకుఁ బాదాభివందనములు
హరివింటిమన్నీఁడ! యంజలి యిది

సంకర్షణా! సమర్చలు నమస్సులు నీకుఁ
గార్మకోత్తమ! నీకుఁ గై మొగుడ్పు
మధుసూదనా! నీకు మంత్రపుష్పము లివ్వి
యద్భుతధనువ! జోహారు నీకు
ఎన్న డెఱుఁగని దర్శనం బిచ్చినారు
తొలిమునిబుజమ్ముపై నొప్పె తొలిధనుస్సు
తొలిమహాసుకృతంబులు తోఁచినట్లు
మరకతశిలాక యిది యీద్రి మణిశిలాక

సీ. యోగసంరక్షదీక్షాగురుమూర్తి యీ
తొలిబ్రహ్మచారి యుద్ధురత వచ్చె
మునిరూపమంది యీ మొదటి వేలుపుదిట్ట
వైకుంఠరాజ్యమ్ము వదలివచ్చె
ఈ శ్రీశమూర్తి యాదృతశివాకృతి సూని
వరమహాలంకారి యరుగుదెంచె
ధర్మంబునే చంకతాళిగాఁ గొని స్వామి
యెడఁద మహాలక్ష్మి విడుపుఁగాంచె

శ్రీవికుంఠమహానగరీమరకత
నిభృతకుడ్యాంశువులఁ దననీడఁ జూచి
యిప్పు డీ స్వామి తన్నుఁ దా నెఱుఁగఁగలఁడొ
యెఱుఁగఁజాలఁడొ యనురూప మెసక మెసఁగె

సీ. అసురమారీకేళిపిశునమై యేపారెఁ
గర్తృక్రియలు రెండుఁ గలసినట్లు
అభయహస్తప్రదానాకృతిం జనె ధను
స్సధికహస్తమువోలె నందగించి
బ్రాహ్మణక్షత్రధర్మపరస్పరాశ్రయ
శ్రమ మొప్పె మునిభుజాగతధనుస్సు
సంకల్పసహితభాస్వత్సచ్చిదానంద
మధుబోధకళ వోలె మలఁగె మూర్తి

హారిధనుఃఖండసహితమై యవనికి డిగె
నవశబలరోచి ప్రాగ్గగనంపుముక్క
యని సహస్రధా దివిషత్సహస్రముల న
వీనసుతిసహస్రంబు లావిర్భవించె

ఉ. దేవత లట్లు సర్వజగతీపతి వారిజనాభు స్తోత్రసం
భావన చేసి చేసి తమబాధలు జ్ఞప్తికి వచ్చి దైన్యదు
ర్ధీవికలాత్ములై త్రిజగతీపతిఁ గాంచిరి బాష్పనేత్రులై
తీవలు పూలుఁగా ద్రిజగతీపతిమైఁ ద్రిసహస్రనేత్రముల్

క. త్రిసహస్రనేత్రములలో
ని సిలుగు లెసరెక్కె రెండునేత్రములందుఁ
మసల దివిషదీశుఁడు సా
రసగర్భునివంకఁ బొంగురాఁ గనుగొనియెన్

క. తల కదలలేదు కన్నులు
చలింపలే దమరపతికి జలజాసనుఁ డా
వెలుఁగు లోలయు దారులలోఁ
దెలిసెను డోలిమునికిఁ దెలుప దేవతలిడుమల్

గీ. జలజనాభుని నాభిదేశంబుఁ జూచి
కేల్మొగిడ్చి విధాతృండు కేశవుని ము
ఖంబుఁ జూచి దేవతలముఖంబులు గని
యింద్రుఁ గాంచుచు మునితోడ నిట్టులనియె

క. ప్రభు వన్నుఁ జెప్పుమనెదరు
ఋభువులు దశకంధరాధరీకృత తేజో
విభవులు దినదినగండము
విభు! నూఱేండ్లాయు వయ్యె వీరల బ్రదుకుల్

చ. వరము లొసంగకుండినఁ దపస్సులు చేయరు చేసిరేని గా
పురుషులకున్ వరా లొసఁగఁబోమని చెప్పఁగ లేదు దానఁ గా
పురుషులయందు వానిఫలముల్ విపరీతములౌఁ దపస్సులున్
వరములు దైత్యు లీ వరుస స్వర్గసముచ్ఛ్రయకృచ్ఛ్రతా ప్రియాంఘ్రి

ఉ. ఈ మహి యేరుపడ్డ మొదలెందఱు లేరసురుల్ మహేమువీఁ
డే మొ[illegible]లా! పురానముచివృత్రులకన్నను వెల్గఁబెట్టెనా?
ఆ మును గల్గువారన మహాభుజదర్పితశౌర్యవృత్తు లీ
గ్రామణియో ప్రతిష్ఠకయికాదు జయించుట సంపదాప్తికై

సీ. మయశిల్పభాస్సుధర్మామహానటశిలా
ప్రతిమలు లంకకుఁ బయనమయ్యె
హరినీలకృతములైనట్టి నీ ప్రతిమలు
చెవులును ముక్కులుఁ జెక్కఁబడియె
వెల్లేన్గు మునుకలువెట్టు జాహ్నవి మడు
గులు చేపలను బట్టు గుంటలయ్యె
అమ్మ పూజాగృహమ్మసురసైన్యము ధూమ
పానమ్ము సేసెడు కోనయయ్యె
ఒక్కనాఁడు మాన్మథోత్సవాకృతు లచ్చ
రలను గాంచినంత రామ! రామ!
వెడలుచుండు నాకు వేయియు రెండు క
న్నీటిబొట్లు నిముసనిముసమునకు

ఉ. త్రుంచినపూలతో లతలతోఁ గళవాసిన నందనంబు పో
నెంచను మాటదక్క దటులేగిన నైనను మాదుమాట య
ట్లుంచు తపఃప్రభావగళితోర్మ్ములు మానులు పోయినన్ సరే
వంచన వెక్కిరింపుఁ బడి వచ్చినఁజాలును ప్రాణముండినన్

ఉ. ఎమ్ములు కానిపింపఁ దొలియెమ్ములు నేపులు కొల్లవోవఁగాఁ
గొమ్ములు తిర్గ నయ్యసురకోటిదయన్ సురలోకభోగపు
మ్మమ్మరమంతయున్ వదలిపోయియుఁ బేరునయందు మూఁడులో
కమ్ములరాజటన్నది యొకండె త్యజించదు శార్ఙ్గభీకరా!

శా. ఏచేతుల్ భవదగ్రజాతుఁడయి నే నెత్తన్ బధిశ్రాంతిపోఁ
ప్రాచీనామరలోకనాయకు త్రుటత్పాదంబులం దప్పుడున్
దోఁచుంబో యవియే కరంబులయి నీతోఁబాటుగా యజ్ఞవే
ళాచంచద్ధవి నందుకొమ్మనెదొ వేళాకోళమో శ్రీహరీ! ౨౭

క. ఈచేత యజ్ఞ భాగము
నాచేతను గాదు కొనఁగ నా తమ్ముఁడ నీ
వా చెనటి రక్కసుతలల్
రాచెద నని మాటయిమ్ము రాజీవాక్షా!

వ. లేకున్న నేను యజ్ఞభాగమ్ము గ్రహించుట లేదన

శా. అద్దేవుం డసురనాథు నగ్నియని దేవా! సర్వహోమంబు ని
న్నుద్దేశించియ చేయఁగాఁ బడును నీ వాహా! హవిర్భాగముల్
వద్దన్నన్ మఱి యే రితిం గలుగునో నా యందు పేర్వొంగ ని
న్నుద్దేశింపఁగఁ గోరువుండు మనఁ దా నొందరా హవిర్భాగముల్

ఉ. ఇస్తురాకో హవిస్సులు మహీసురు లింకను ప్రత్యకోటికిన్
మెస్తురాకో బుగర్థములు మాల్చి పిశాచుల ప్రేతసూత్రముల్
క్రొత్తలు పుట్టునో మఱియుఁ గ్రొత్తలు పుట్టకయున్న ధర్మముల్
తుస్తుముగాన వాసిగుదఁ దాఁచదగా కట యింత లోఁచినన్

ఉ ఇనొక్కయూహ పుట్టునని యయ్యది పుట్టవటంచు నున్న దే!
యయ్యసురేశ్వరేశుని హృదంతరమందున నాఁడు వాఁడుగా
దయ్యెను పద్మనాభుని ప్రధానపుమూర్తిని సూర్యదేవునిన్
గొయ్యతనంబునైఁ బనులకున్ నియమింపఁగ నేను లెక్కయే!

సీ. అతనిగేహము లేమి యాపురంబున నెల్ల
నధమ సేవకుఁడయ్యె నగ్ని యనఁగఁ
జమురు వత్తియు లేక జ్వలియింపవలె దివ్వె
తెలిబూదితో మండవలయుఁ బ్రొయ్యి
యొగి దయవచ్చిన నొకతడికట్టె యం
టింతు రంటింపరు పంతగాండ్రు
రాఁజుదునో నేను రాఁజనో తడికట్టెఁ
దడికట్టెయును లేక తప్పనపుడు
మరల నందునఁ దక్కువ మండుటయును
వనట నెక్కువ మండుట పనికిరాదు
మనసుతోడ నా యంత నే మండవలయు
నంతలోన నా యంత నే నారవలయు

క. నా కొకఁడే ధైర్యము పతి
లోకేశుఁడు తిగ్మరోచి లోకువ కాఁగా
నా కేమి దిగులు? పోనీ
లే! కానిమ్మని యొకండె వృత్రధ్వంసీ!

ఉ. అంతట దక్షిణేశుఁ డను నంబుజనాభ! విచిత్రమైన వృ
త్తాంతము నాది నేను యముఁ డౌటయు నాకు యముండు రావణుం
డింతకు దక్షిణేశుఁడను నేనొ దశాస్యుఁడొ చెప్ప లేను ప్రా
ణాంతకమౌ నిరర్థకదిశాధిపతిత్వము లేల మాకిటన్

శా. ప్రాచీనామరులందు నే పురుగుఁ జెప్పన్ జూడఁగా రాక చా
నే చారా దొక వేళఁ జచ్చినను బోనే పోవఁగా రాదు మే
మౌ చోటీశ్వరలోక మే గెదరు వా రాహా! పరిభ్రష్టధ
ర్మాచారుల్ బహుపాపకర్మనిరతుల్ ప్రారబ్ధహింసాకృతుల్

క. అది కాదుగాని రావణు
మొదలిబిరుసు లెల్ల దించె బో యర్జునుఁ డా
యదరిపడిపోవు టెంతయు
నది యెప్పటి కపుడె క్రొత్త యంభోజాక్షా!

గీ. అన నిబుతి యంతదూర మేలయ్య యే యు
మేశుతో నుట్టికట్టి యూరేగు నితఁడు
అతఁడె తనగిరి నితఁ డెత్తినపుడు కాలి
బొటనవ్రే ల్నొక్కఁగాఁ గనుల్ మిటకరించె

క. అన వాయుదేవుఁ డిట్లనెఁ
దనచంకను నిటికి యింద్రతనయుఁడు వీనిన్
వనధుల నేడిట మునుఁగన్
దనయూపిరి యాడమికిని నను దండించెన్

క. నే నైదువిధము లందన్
బ్రాణుల దేహంబులందు మసలుదునుగదా!
దానవులమై నెచట నే
నేనో నేనే యెఱుంగ నేరను శౌరీ!	౮౦

ఉ. ఊపిరి యాడకుండఁ దినుచుండుదు శ్రావుగనుండు రంతఁ దా
న్నై పృథివీపదార్థము వియుక్తిని సూక్ష్మతరాణువుస్వరూ
ధీవధము దోసంగి యలికిన్ దొరయించ్చుచున్న నన్ను లేసుచో
నూపిరి యాడకుండుట ప్రభూ! యిదేమి కొన్ని నాకు చెప్పవే!

సీ. సౌధాంతరాంతరస్థలి నేను వీవఁగా
వలెఁ జల్లఁగా వీవవలయు సంద్రఁ
గడలి మొత్తనఁ జల్లఁగా వీవఁగారాదు
వలసిన స్తంభింపవలయు నేను
నన్ను గుంభింతును నవయుగ్రతముల నవి
రాల్పాలి తేన్వులు నా రావెపంచు
మైరేయపానోగ్గమానినీముఖవాయు
వులు తావివలయు శీతలత వలయు
దానవులకడఁ గన్నెరలోని వేఁక
చందమగు నేను ప్రాణాలు జవ్వజవ్వు
గాఁగఁ దప్పించుకొని తిరుగంగ నాదుఁ
గాక నా కొక్కచో నుండఁగా వలంతి

క. మధుసూదన! నేను నుప
ర్బుధులను దేవతల మునుట వోయి పదార్థ
ప్రథ మిగిలినాము జ్ఞానం
బుధిఁ దర్కము ముదురుపాకమునఁ బడి యచటన్

క. ఇటు వేదములను జదివెద
రటుల బృహస్పతిమతంబు నగ్గింతురు నా
కటు వారిఁ బట్టవచ్చునె
చిటారుకొ మ్మెక్కినారు శ్రీదర్పితులై

శా. ఆ సిద్ధాంతము లేమి చెప్పుదు హరీ ! యన్యాంగనాకర్షణ
వ్యాసంగోక్తుల వారు నూత్నబుధులై యాయాముసుల్ నిల్పు వ
న్యాసీమల్ చని తెచ్చిపోదురు స్మృతిన్యాయాదిక గ్రంథముల్
రాసుల్ తంపటవెట్టి మాసులఁ బలత్రగాహులన్ దాఁచుచున్ రశ్రీ

క. వలదనినవారు పెండిలి
వలదని తా మాడకుండ వదలుదురో బి
డ్డలఁ గన మానుదురో వా
రలనుం బెంచరొ తమంత రక్షస్సులుగా !

మధ్యాక్కర.
ఒకనాఁడు గౌతము నాశ్రమోద్యాన మొనరంగఁ గాల్చి
ఒకనాఁ డగస్త్యహోమార్చి యుష్టని యూఁది చల్లార్చి
ఒకనాఁడు గాధేయు వహ్ని యుముకలో నుమిసి నెత్తురులు
మకిలియౌ నెఱచియు నించి మత్తిలి మంద్రు రాక్షసులు

గీ. తల్లి చెవులను ద్రెంచెడు దట్టునకును
బిన్నతల్లిచెవుల్ సన్నబీరపూలు
అక్కట కుబేరునకు మొదల్ దిక్కు లేదు
ఇంక మామాట యనవలెనే ముకుంద!

ఉ. వాఁ డఖిలాశలన్ మెలఁగువాఁడయి యీశ్వరు నేమరించి క్రో
వ్వాఁడితనంబు పేర్చి తన పత్తనవీథిక నిల్పి నల్దిశల్
మూఁడగఁజేయు నంత నయిమూలలు మాడఁగఁజేయుఁ గేశవా!
నేఁడని మెల్లి యుం చసుర నేర్చినదానికి నంతమున్నదే ?

మ. అఖిలప్రాణిశరీరదేశములయం దానాభిమూర్ధంబు నే
నఖిలేశా ! చరియింతుఁగాన దనుజోహల్ నన్నుఁబోలెన్ జతు
ర్ముఖుఁడున్ నేరఁ డెఱుంగ నయ్యవి క్రియారూపంబులం దాల్చెనా
నఖఘాతంబులఁ దేలిపోవును జగన్నాశంబు సర్వేశ్వరా !

మ. అనిలన్ బ్రహ్మయు నే నెఱుంగుదును గాదా వాయుభట్టారకా !
నను నిందించెదు నేనుగాని దనుసంతానంబు మీమాళిన
ర్తనరేఖావిధురాత్మ లౌటకును జింతం గూరనో? తత్తప
స్సున కే నీయనుబో వరంబు లనఁగాఁ జూ డింత వీలున్నదే?

చ. నిజమున కొక్కమాట నళినీదళనాభ! సురాళి యింక నా
ప్రజ వానరించు దుండగపురాపిడు లోర్వఁగలేరు తండ్రి! యాఁ
బ్రజవనతద్వధాధ్వగ ముపాయ మొకం డది సన్నిధత్తమై
యజితు లనంగనౌ నసురులందున నిల్చె వరంబువేళనే

మ. అనినఁ బ్రహ్మ త్రివిక్రముఁ గని యయోధ్యానాథుగర్భంబునం
దున జన్మింపుము తండ్రి! యీయవనినాథుం డన్న నా కశ్యపుం
డును దీశేయగుఁ దల్లి యయ్యదితి దీటుం బొందుఁ గౌసల్యతో
నినుఁ గాంక్షింతుము నూత్నమాఘవతమాణిక్యాకృతిం జూడఁగన్

క. ఒక్కొక రూపంబున నీ
వొక్కొక బెళుకు సవరింతు వొగిఁ గార్యవిధా
ఫక్కిక ప్రోసీ! సృజనన్
జక్కదనము నేర్తు నీదు సవరింపులలో

ఉ. నీ యవతారముల్ గని గణించితిఁ గ్రొత్తలు మత్స్యకూర్మసిం
హాయతపోత్రివర్ణిముఖమై చను సృష్టుల రాజపుత్త్రికుం
డై యెటులుందువో మెయి వహించిన నైదగుభూతముల్ మత్తే
యే యరవంబడిం గిసలయించునొ నీదెసఁ జూడఁగోరెదన్

క. అన లేఖర్షభుఁ డిట్లనె
నినుఁ జూతుము సొగసుపంట నేల కొరగు చి
క్కని చక్కని రాకొమరుని
సునిశితశరహతుల రిపులఁ జూతుమును హరీ!

శా. పాషాణాకృతులైన రాక్షసుల గ్రీవాదేశదంభోళియై
దోషాచారుల నిత్యపానసజలాంధుప్రాప్తభూకంపమై
రోషావిష్కృతమూర్తిమద్దనుజజత్రుక్షోణికుద్దాలమై
వేషం బూష్మవినిస్సరద్వ్యాధుర మావేశింపవే శ్రీహరీ!

శా. స్వామీ! సాగరకన్యకాకరతలస్పర్శాత్తరోమాంచసు
శ్రీమచ్చిక్కణమూర్తి! నీతనువు శోషిల్లంగ రాకుండ రా
జై ముందేగిన వెంట వచ్చి దనుజప్రాణంబులన్ యుద్ధవే
శామార్తాండులు రాచిపెట్టెదరు గోలాంగూలయూథోత్తముల్

వ. అనిన దేవేంద్రునితో సురగురుం డిట్లనియె

క. మఱి నీ తనయుఁడు వాలి ప
గఱను బిలుకుమార్చు బాహుగర్వి స్వయముఁగా
నుఱియ తదామనుజాచ్యుతు
నెఱుఁగునె? కన్నా కటంచు నెఱుఁగునె? హరికిన్

క. ఆ కపిపరమేశ్వరుఁ డ
స్తోకమనీషాపయోధి శుద్ధమతి సవ
వ్యాకరణవేత్త మోక్షా
శోకాన్వేషణుఁ డధీతిచూడామణియున్

క. పవనునకుఁ గిన్క కలుగునె
యవని నెవరికైన సుతుల యతిశాయిత్వం
బు వినఁగ మోదము తండ్రిని
బవను నుఱఁడు హనుమ వేగపటిమలయందున్

ఉ. పావని వైనతేయుఁడు జవంబున మూర్తిని మేరుపర్వతం
బావళియా తదున్ముఖులెయై రణమాడుదురే సపత్నులం
చావలఁ బ్రాణ మాసపడనైనది కాదా! త్రివేళలన్ మద
ర్చావిధిబుద్ధి యా హనుమ సత్త్వము తేజము నే నెఱుంగుదున్

క. వాలిదశకంఠు లాతని
జాలరెటులఁ దిరుగఁదీయ క్షత్త్రకిశోర
శ్రీలలితాచ్యుతమూర్తిని
నేలా యెఱుఁగఁడు తపస్వి హృత్కమలమునన్

చ. హనుమను నగ్నిదేవుఁ డిటు లాడుచునుండఁగ నాదిమానినే
త్రనిబిడకాంతులుం బయికిరా నఱగన్నుల నప్పళించు స్వా
మి నిభృతవక్షమం దురల మెత్తనిభూతి మలంచి యూర్పు బి
గ్గన నిఱియంగఁబట్టి పయికావిని లాగు నురోవృతంబుగన్

మ. అన నింద్రుం డను నాంజనేయుఁడు సరే యా కీశులున్ బద్మలో
చను సేవింపకపోవ రందఱు సురాంశప్రోద్భవుల్ గాన బు
ద్ధిని వక్రత్వము పొంద రీ గురుని వర్ధిష్ణ్వంశమా తారుఁడున్
మనపక్షంబునఁ జేరు పౌరగురుసామాన్యాత్తధీశక్తియున్

వ. అంత వరుణుం డిట్లనియె ధనదునికుమారుఁడు శ్రీమంతుఁడు గంధమాదనుఁడును విశ్వకర్మసుతుండు శిల్పవిద్యాపారంగతుఁడు నళుఁడును బావకునితనూభవుండు సుమ్మసదృశప్రభుఁడు యశస్తేజోవీర్యాతిరిక్తసర్వకీశుండు శ్రీమంతుండైన నీలుండును నశ్వినుల

పుత్త్రులు సౌందర్యప్రవీణవంతులు మైందద్వివిదులును అశ్విన్యా
యంశజుండు మహాబలుండు శరభుండును మనపుత్త్రుంబువార యనిన
నింద్రుండు

క. నీకొడుకు సుషేణుని మఱి
కైకొనవేలా యతండు గంధకరికరా
స్తోకభుజాదళితసరా
నీకిని యూతండును మనలనే వరియించుఁ

ఉ. ఇంకను నప్రమేయబలు లెందఱొ కేసరులీ గలారు వా
రంకెను రాగ వాలికి సహాంకృతిశాలులు వారిఁ జేసి యా
తంకము గల్గుట జనసదస్సులు గక్క నా లంగెనంతలోఁ
బొంకము తగ్గి యొప్పుకొనిపోనగు ఘుగ్ర యొదుష్ట వేళలః

సీ. మేరుమందరపర్వతోరునపుష్కలంతు
లిచ్ఛానురూపరూపాచ్ఛబలులు
హర్యక్షశార్దూలహరిదర్పచ్ఛందు
లుపలపాదపకృతయోధనులును
దంష్ట్రానఖాయుధుల్ దారుణాస్త్రవిశార
దులును యుద్ధాభిలాషులును ఘనులు
తమ జనికృద్దేవతారూపవేషప
రాక్రమసాదృశ్యరంజితాకృ
తులు మహావానరులు ససంఖ్యులు గలారు
ఒక్కఁడొక్కఁడు నెదురైన రక్కసులను
ముక్కలుగఁ జేసి డొక్కలు వ్రక్కలించి
విఱిచి ప్రోవులు పెట్టి కవ్వించుఁ బెఱల

సీ. కదలింతురు నగేంద్రఘనమూలగండముల్
భేదింతురు పురాణవృక్షవితతి
క్షోభపెట్టెదరు నకూపారవారాశిఁ
జీల్చివేయుదురును క్షితితలంబు
దుమికెద రుద్భ్రమోత్తుంగపాథోరాశిఁ
జొత్తు రాకాశంపుఁ జూరులందు

పట్టుదు రంభోదపటలి శౌహాశృష్టి
గ్రుద్దిచంపుదురు దిక్కుంభివితతి

ఆ దళద్దృఢస్థలీసింహనాదములకు
భ్రమితమై నేలఁబడు విహంగములగముల
ప్లవగనాథులు స్వప్రతాపప్రతాపి
తార్చిరుద్దామతేజోమహోపఘనులు

క. వాలి యినసుతుఁడు నళుఁడును
నీలుఁడు హనుమంతుఁడును సనీకినిపతు లు
ద్వేలచరు లఖిలగోలాం
గూలోత్తము లైదుగురను గొలుతురు భటులై

క. వాలి రాజును మఱి యువరాజు నినకు
మారుఁడును దక్కుముప్వురు మంత్రు లయ్యు
వాలి సుగ్రీవుఁ దఱుముటవలన నూఱు
లక్ష లగు కీశసేన చీలంగఁబడియె

ఉ. కొందఱు ఋష్యవత్కుధరకూటము లందున నన్యభూమిభృ
త్కందరపాళిఁ గొందఱు సుఖంబున నుంద్రు వలీముఖుల్ గుహా
ళిందచరన్మృగేంద్రశలలీద్వీపవన్యలులాయమర్దనా
స్కందితరేచితోరుపదఘట్టనచండమహాట్టహాసులై

ఉ. వీరలుగాక విస్మయత వేల్పులపెద్దయు నావులించు ధా
టీరభసంపుబిడ్డఁడు కడిందిమగండు త్రివిక్రమప్రభా
వారభటీప్రభావణహా మప్పుడు మ్రోసెను ఋక్షవాహినీ
ఘోరుఁడు జాంబవంతుఁడును గూడియవచ్చుఁ బ్లవంగసైన్యమున్

క. ఇటు హనుమ జాంబవంతుం
డటు నిద్దరు నిద్ద రొక్కలై దితిజచమూ
ఘటల మృగరాజులటు నిజ
కటపెట్టుదు రొరసి యొరసి కదిసి యిరుదెసల్ ౧౯

శా. ప్రాణాయామముఁ బూని యంతట నమోవాకంబు లర్పించి గీ
ర్వాణుల్ జోతలు పెట్టుచుం నిలువ నోపద్మాక్ష! యోశౌరి! యో
వేణీభూతసమస్తబుద్ధివిభవా! విష్ణూ! స్వయంభూ! జగ
చ్ఛ్రేణీభూతనవాంకురాదినవతా(శ్రీ)మంజుబీజాకృతీ!

సీ. అశ్వమేధంబు నీ వా పుత్త్రకామేష్టి
నీ వధ్వరంబులు నీవ తండ్రి!
యగ్నిహోత్రంబున నావిర్భవించిన
సాద ప్రజాపతిపురుషుండ వీవ
పాయసంబును నీవ పాయసంబందుఁ బ్ర
విష్టమౌ తొలినాఁటి వెలుఁగ వీవ
దశరథరాజుకాంతల ముగ్గురకును గ
ర్భంబులం దుండు పిండంబ వీవ
రంగురంగుల నడచెడి రాజ వీవ
పంక్తికంధరకంధరాపాటనప్ర
చండచండాంశుచంద్రని స్తంద్రనేత్ర
ముగ్ధలోకాభిరామరాముఁడవు నీవ

క. అర్ధంబున నొకప్రభువై
యర్ధార్ధంబున నొకండు నా యర్ధము రెం
డర్ధముల నిద్దరైచన
సార్థం బగుచున్న పాయసమునకుఁ బ్రణతుల్

ఉ. మళ్ళినయుంగతోఁ గొలతమారిన నిన్ను విరించి యెంచునో?
పాళ్ళుగఁ బంచి వేల్పుపడవాళ్ళు తలంతురో? యంచు గుండెపై
వ్రేళ్ళుల రాచి బొడ్డు సవరించిన నన్నుఁ దలంచు నీకుఁ గై
కోళ్ళులు కేలుమోడుపులు కోసలరాట్సుతచంటిబిడ్డకుఁ

చ. శిశువులు సర్వసృష్టిగతజీవసమూహము నాకు నీకు నే
శిశువను నట్టి నిం శిశువుఁజేయు వికుంఠరమావిజేతకుం
దశరథభూమినేతకు సుతక్రతుహోతకుఁ దాతతాతకుం
బ్రశమితదుఃఖభూతతతిపక్షమునం గయిమోడ్పుఁ బట్టెదం ౧౦౧

క. దేవముఖగళితసంస్తుతి
రావము వెసఁగన్ దశరథరాజాగ్నిశిఖా
రావము "లగ్నిముఖా వై
దేవా"యను తెలివి గలుగఁ దృప్తత నెసఁగన్

క. పరితో జ్వాలామాలల
హిరణ్యరేతసుఁడు చిటిలి యింధనము శిఖా
భరజిహ్వా చీలి మిన్నులు
పురపుర లేలిహ్యామానములుగా మొఱసెన్

చ. క్రమముగ దేవతావళిముఖస్తుతి సన్నగిలంగ నగ్నిసం
భ్రమరవముల్ మలంగెను సురల్ దిశలేగిన నాల్గుదిక్కులన్
సిమసిమలాడుకొంచు విరిసెన్ శిఖలంతన చొచ్చె నగ్ని న
క్రమమున నాగ్నిమూర్తిగఁ బ్రజాపతిపూరుషుఁ డుగ్రరోచియై

చ. జనపతి హస్తమందునఁ బ్రజాపతిపూరుషుఁ డుంచెఁ బాయసం
బును నలపూరుషోజ్జ్వలసమున్నతతేజముఁ జేసి యెల్లభూ
జనుల విలోచనంబులును జాలవు చూడఁగ నల్లనందుఁ గ
న్గొని చొఱఁబారెఁ గేశవుఁడునుర్ బతిచేఁగల పాయసంబునన్

సీ. ప్రామిన్కుగమిఁ బంటఁబట్టి నీళ్ళలఁ ద్రవ్వ
కొనిపోవు నసుర వెన్కొనిన మీను
శరధిలో మున్ను మంథర మాడఁ బైడిప్పఁ
గుదురుచేసిన చిన్ని కూర్మరాజు
హేమాక్షుఁ డను తుంగ నెగచి ముట్టెయును బా
తాళంబు గ్రుమ్మిన దట్టుపోత్రి
స్తంభంబున సకలాంతర్యామితకు సాక్ష్య
ముగఁ జీల్చి వెలలిన మృగవిభుండు

విఱచి పెరిగించుఁ దననేర్పు వెలయ క్షత్ర
జాతిఁ బోకార్చి వెలయింపఁ జాలుటకును
బరశుధనువులతో మూర్తి పట్టు వెలుఁగు
జనపతికరస్థ మగు పాయసమునఁ జొచ్చె

సీ. క్షీరాబ్ధితరంగలో శ్రీపయోధరములో
తొలిపాముపొలసులోఁ బొంగుతెయ్య
చలువవెన్నెలచాలో మలయునెండలవాలో
యగ్గిమంటలడాలో నిగ్గుచూపు
ప్రామిన్కులచివళ్లో బహుళసృష్టిమొదళ్లో
యచ్చతెల్వికరళ్లో యసలుమూర్తి
తెలిగంటుపాళికో దతిపాళిమోళికో
వట్టిన కేళికో వచ్చునటన

ఇల్లు నై సంతమందో సూసిగ్రహృదయ
మందొ తెనదహారాకాశమందొ యైన
చిత్తు నానందమును మించు సాత్త్వికంపు
జనపతికరస్థ మగు పాయసమునఁ జొచ్చె

ఆ. అంత నెల్లజనుల కనిమిషత్వము పోయి
మానవత్వ మల్ల మసగినట్లు
తెప్పలార్చి చూడఁ గొప్పర చేనొప్ప
రాజొకండె తోఁచెఁ దేజప్రోవు

చ. మసలని భామినేత ముఖమండలమం దొక నూత్నదీధితి
ప్రసరణ మొప్ప నాయన కరంబున నొప్పెను దేవదత్తపా
యసము వెలుంగువాక లెదుర్గై నరికొత్తనొ పుత్రివాంఛయన్
గొసలను దేరి తేఁజిపురు గొన్నదొ మాధవచిహ్న మొప్పఁగన్

క. క్రమమున భూమీపతి వద
నమండలము హర్ష కాంతి నసలుకొని సభా
కమలసువికాసితరణి సు
షమామనోజ్ఞాంశుభాకమంబుగఁ బొలిచెన్

క. సంతోసపు మధుకుల్యా
సంతానము వెనుకనొత్తి చనుదెంచు తరం
గాంతరపరితోషితమై
యంతఃపుర మెల్ల వెల్లువయ్యెఁ దబకలై ౧౧౭

ఉ. వెన్నెలతీవ లల్లుకొని పెట్టిన పందిరినాఁగఁ గార్తికో
త్పన్నసుధాంశుదీధితులు పన్నిన ముగ్గులునాఁగఁ గ్రొంబువుల్
కన్నులువిచ్చి లేసరసి కాచిన వెల్గులునా నరేంద్రునిం
డ్లన్నియు హర్షరశ్మిపట మల్లె వెలుంగులు గుమ్మరించుచున్

గీ. చెఱువులోఁ బూలు చేతులఁ జిమ్ముకొంచుఁ
గడకుఁ జేరంగఁజను సీతగాఁడువోలె
నెదురయిన నవ్వు మొగముల యిఱకటమున
రాజు సీఁదుచు నంతిపురంబుఁ జేరె

క. అంతఃపురమున భూపతి
సంతసమున నెదురువచ్చు శాంతకుఁ బ్రేమ
స్వాంతకుఁ గనత్కనన్నె
త్రాంతకుఁ దలతోడ మ్రొక్కనట్లుగ మ్రొక్కెన్

శా. అమ్మా! నీ వొకదైవమై వెలసినా వస్మద్గృహమ్మందు నీ
వమ్మానిన్ గొని వెంటవచ్చితివి పుత్రావాప్తికై నా కటం
చు మ్మోదమ్ము నెసంగఁ బట్టమహిషిం జూపొంద నీ విద్దికై
కొమ్మా! పాయసమంచు నర్ధ మొసఁగెన్ క్ష్మోణీశ్వరుం డామెకున్

క. ఏయించుక యెడమైనను
బాయసముననుండి హరియుఁ బరువెత్తునొ నా
నాయమ దీక్షావ్రతనిధి
పాయసమును బ్రేమమిగుల భక్షించె వెసన్

క. ప్రాశనసేసెడు త్వరలోఁ
గౌసల్యాధరము జారఁగాఁ బాయసమున్
గాసంతఁ దుడుచుకొనఁగను
నాసంతయుఁ దినఁగఁ దల్లి యనుమానించెన్

ఉ. అంతట రాజు శాంతమృదుహాసముఁ జేసెను శాంతఁ గాంచుచున్
శాంతయు మందహాసరుచిసంపదఁ జూపెను రాజుఁ గాంచుచున్
ప్రాంతచరత్రిపాలవవిరాజితలోచనవారిజాత శ్రీ
కాంతవిభాసి నవ్వొసఁగఁ గాంచె మహాసతి తండ్రికూఁతులన్. ౧౨౪

చ. జనకుఁడు రోమపాదుఁడును సాధులు కేకయరాజు పుత్త్రిఁడున్
మునిపతి ఋశ్యశృంగుఁడును భూపతిగేహము లేగి రల్లవా
రిని బరిచారకుల్ మతిధురీణతమైఁ బరిచర్యలన్ వినూ
తనముగవచ్చువారల విధమ్ముగనఁ దన్పిరి ప్రత్యహమ్మునన్

క. జనకుఁడు ప్రతిదినమును దాఁ
జనెద ననఁగ రాజు తేపు చనవచ్చు ననున్
దినదినము రోమపాదుఁడుఁ
జనెద ననన్ రాజు నేఁడె చనవలెనె యనున్

ఉ. వారలు పోదుమంచు నరపాలునితో ననునట్టిపూట ధా
త్రీరమణుండు క్రొత్తసవరించు నపూర్వములైన భోగముల్
వారును రెండునాళ్లు నరపాలునితో నన రిట్లు రోజులున్
వారము లేగ వారు పడవాళ్లను బంపిరి సైన్యయుక్తులన్

మ. యజ్ఞానంతరవేళ రాజు నిలువేల్పౌ రంగనాథున్ బ్రథా
నజ్ఞానాకృతిఁ బూజలొప్ప రఘురాణ్ణానాగృహారామకృ
ద్యజ్ఞశ్రేణులఁ దర్పితున్ సలిపె నంతన్ బేరుపేరొప్ప లో
కజ్ఞుం డా పతి పేరటాండ్రనుచు జోఁకన్ గొల్చి మాత్రాదులన్

క. ఏదో యేదో పేరున
భూదయితుఁడు గేహములను బూజాపరో్వ
త్పాదన మొనర్చి పోసీ
లే దెవ్వరి నొక్కనెల లలిన్ బందుగులన్

ఉ. అంతట గుప్పుమన్నవి ధరాధిపుగేహములందు మువ్వురున్
గాంతలకున్ నెలల్ మసలు కమ్మనివార్తలు నోటనోట నొ
క్కింత యెడమ్ము శోకముడు లెప్పుడు పొందునొ యంచుఁ జూచు న
శ్కాంతముఖాబ్జయా రజకకాంతవచస్సు లుపజ్ఞలై చనన్

క. గర్భపరిరక్షణాశా
నిర్భరులై పుంసవనము నృపసతులకుఁ బ్రా
దుర్భూతగర్భచిహ్నల
కార్భటు లెసఁగంగ సలిపి రంతిపురములన్ ౧౩౮

చ. అరువదివేలయేండ్లపయి నప్పుడు దేహము వ్రాలఁ దాఁకుచే
మరణమునొంద నిందుమతి మానవనాథుఁడు పుత్త్రశోకసం
భరితములైన కావి నెడఁబాయుచు నాయెడఁ జేసి నాఁడు నే
శ్వరగృహముల్ సమస్తదురితక్షయకారణభూములై నెల్లెడఁ బ్రవేశించినన్

ఉ. ఒక్కఁడు కొండనెక్కె మఱియొక్కఁడు నేఁడుగు నెక్కె మంత్రులం
దొక్కతె కొండ నెక్కె మఱియొక్కతె నేఁడుగు నెక్కెఁ బ్రేష్యులం
దొక్కరు నొక్కరుల్ గలసి యూరక నవ్వఁ జుమ్ము బోవుచుందు రే
దిక్కున మానిసుల్ వసుమతీపతి లోపల నున్నయట్లుగా

క. తా నేఁగుదునని చెప్పఁగ
నైనన్ జనకుండు వచ్చి యంతర్జ్యోతిః
స్థానమున దృష్టినిలుపుట
తో నిలఁబడ దశరథుండు తోడ్తో నగుచున్

ఉ. మీరలు బ్రహ్మవేత్తలు క్షమింపుఁడు నా దెస గర్వితోక్తి దు
ర్వారతి మిమ్ము నాపితి సుపర్వసనిష్ఠ్యని నేఁడు పంపితిన్
మీరలు వచ్చి నా తురగమేధము బ్రహ్మపరంబు సేసిరం
చారనిబద్ధిమై వినతు లంజలులున్ సలిపెన్ బ్రియంబునన్

ఉ. బ్రాహ్మవిధిన్ సమర్ఘ్యమును బాద్యము లిచ్చి సుదోహనక్రియాం
జిహ్మను నల్లకుట్టి నొకచిత్తడిలేఁగటియావు నిచ్చి పై
బ్రాహ్మముగాఁగ నార్చి నెఱిబంగరుచీరలు కట్టనిచ్చుచున్
బ్రాహ్మముహూర్తవేళ నృపుఁ బంచెఁ బురాతనచిత్కళాకృతిన్

మ. జనకుం బాసిన నొవ్వు దీర్చి మృదుచర్చన్ రోమపాదుండు వ
చ్చినవాఁ రింద వసింప నేమిచెదునో చిత్తంబునం జూడు! భూ
జనులన్ రాజ్యము మంత్రులం దునిచి నీ జన్నంబు చూడంగ వ
చ్చిన మే మింద వసించినన్ జెడవొకో శ్రీయున్ బ్రజారాజ్యమున్

క. నీ వనుమతించి యొసఁగినఁ
బోవఁగ నేనున్ దలంతు భూమీధవ! యీ
మా వచ్చుట నేఁడైనదొ
రావలవదె మఱలఁ బుత్త్రరత్నముఁ జూడన్ ౧౮౫

వ. అంత దశరథరాజు మఱుమాటాడమి యనుకూలింప మఱునాఁడు
శాంతర్ష్యశృంగులతో రోమపాదుండు సామాత్యబంధుపరివా
రుండై ప్రయాణంబు గట్టిన

ఆ. సెలవుగొన్నవాఁడు సెలవుగొన్నట్లుగా
నెసఁగె రాజు ఋశ్యశృంగునొద్దఁ
గౌఁగిలించు నామె కౌఁగిలించినయట్లె
చనియెఁ బట్టమహిషి శాంతయొద్ద

ఆ. దాసి చంకనున్న తనయుఁడు నెగఁబ్రాకుఁ
దల్లికొఱకుఁ దల్లి తండ్రి కిచ్చుఁ
దండ్రి తల్లి కిచ్చుఁ దల్లి దాసికొసంగు
సంభ్రమించి రిట్లు శాంతయు ముని

శా. అమ్మా! తమ్ముఁడు పుట్టినప్పుడు సుమంత్రారూఢమౌ మేల్శతాం
గమ్ముల్ బంపెద నీవు నీపతియు రాఁగా మాట నీవిచ్చి నా
వమ్మాటల్ మఱువంగఁబోకు మునికాంతా! యంచుఁ గేళీరహ
స్యమ్ముల్ గోసలరాజకన్య పలికెన్ శాంతామహాదేవితో

ఉ. కానుక లెత్తు బండ్లు మునుగాఁ జనె వెన్కను వీరు కూడి పోఁ
గా నిలుఁడంచు వారు నల కాలువదాఁకని మెట్టదాఁకనం
చా నిలుచున్న నక్కడ కంపి సరే మగుడంగలార మం
చూనిన ప్రేమభారమున నూర్విడి యెంతయు దవ్వుచేరుచున్

గీ. ఎట్టకేలకు మగిడిరి పృథ్వీపతియుఁ
బట్టమహిషియుఁ జూతు రా బాటవెంటఁ
బోయెడు రథాలపై నుండి మునియు శాంత
యుత్తలంబునఁ జూతు రయోధ్యవంక

పంచచామరము.

సుమిత్ర రాజుతో నిదేమి చోద్యమో యసుప్రియుం
డు మాని యెల్లకాల మిందునున్ వసించునా యనున్
సుమిత్ర రాణితో నిదేమి చోద్యమమ్మ! శాంత తా
ను మాని యెల్లకాల మిందునున్ వసించునా యనున్ ౧౫౭

గీ. అనుచుఁ దా దుఃఖపడుచు నారాటపడుచుండె
రథములుం జేర సంతోషపూరంబులైనను
గాళ్ళు కడిగిరి కన్నీటిసెల్వ ప్రీప్పి
రంత నింతులు లేఁత మోతెంతలసను

క. కడచిన దినములతో నడ
జడనునడిదొ లేచుటయును శ్రమ యనిపించెను
గడకన్నుల నెలుఁగు పొంగెలు
నడతెను జాలితింపె బలిసె జనపతి సతులన్

సీ. చీఁకటిలో సంతచెట్టుగాఁ దొలఁగిపో
యెద వేమిపుట్టనే యెన్నెలాడి
నీచేతిలో నేదొ దాచి యే మోఁటుగని
యట్లుగాఁ బలికదే పాపసుకస్త
మంపుగా సంత రెట్టింపయ్యెనే యమ్మ
ప్రొద్దుటిప్పటిలోనఁ బువ్వుబోడి
నీవుమాత్రము తన్కె-వా? చేఁకటిం గాంచి
తోకజాములోపల నుత్పలాక్షి

యనుచు రత్నస్థగితమైన యవనినాథ
సౌధముల మన్నదొరకు టసాధ్యమగుట
ముగురురాణులదాసీలు ప్రముచ్చిలించి
మట్టిబెడ్డలు తెచ్చుచు మఱుఁగుగొంద్రు

సీ. వచ్చి తానంతలో వచ్చును మఱల భూ
నాథుండు కౌసల్య సౌధములకు
నిచ్చి యల్లంతలో నిచ్చుఁ గానుకలు సుమి
త్రకు ధరిత్రీనాథుఁ డొకఁడొకండు
మెచ్చి యా మెచ్చులే మెచ్చి యింకొకరీతి
మెచ్చుఁ గైకేయి భూమీధవుండు
వచ్చినవాఁ డట్లె వచ్చిన ట్లుండు భూ
మీనాయకుండు సుమిత్రకడకు ౧౫౬

నంతనంతట రాజకార్యములు చూచు
చుండి యుండియు యట్టులే యుఱక లేచి
ముగురు భార్యల నవసౌధముల గడపల
దాఁకఁ బోయి లోనికిఁబోక తాఁకి తిరుగు

గీ. ఎల్లవేళలఁ బతియొద్దనే మెలంగ
వలయు ననిపించు ముువ్వురు భార్యలకును
బతియుఁ దమసెజ్జ నుండిన వాంఛ లేని
వట్టికౌఁగిళ్ళ జబ్బుగాఁ బట్టికొంద్రు

ఉ. చిట్టములైన కోరుకులు చెప్పఁగ నేటికి జేనితో సిరుల్
తెట్టెలుకట్టువారు తము తీర్చుకొనంగను లేరొకో? త్రపల్
జిట్టకముల్ ధరాపతికిఁ జెప్పనిరీతిగఁ జెప్పచుండు రా
జెట్టె నమస్త్రప్రాణములు హద్దుగఁ దీర్చును వారికోర్కులన్

క. తొలియోకిలింత లన్నియు
నెలలు గడచినంత తగ్గి నెఱదౌహృదముల్
తొలిపొంగులు నొండులు చెడి
నిలఁబడి తేరిన శరద్ధునీక్రమ మొప్పెన్

వ. అంత నాఱవనెలయందు

క. సీమంతమ్ములు ముువ్వురు
సీమంతినులకును సలుప క్షితిపతియును ని
స్సీమాంతమైన ప్రేముడి
శ్రీమంతుఁడు వారిపజ్జఁ జేరె నెలమితోన్

సీ. వర్షాసమారంభవై భవం బొలసినం
తఁ బయోధరాగ్రముల్ నల్లబారె
శరదృతుప్రారంభసమయాన నూత్నదీ
ధితిఁ బద్మముఖములు తెల్లవడియె
హేమంతహిమపాత మేచి యేచక మున్నె
యంభోజముఖములం దరుచి హెచ్చె
నిశ్లేషము శిశిరానేహా మరుగు దేర
గగనమధ్యమ్ములు కానిపించె

నాగిని వేసంగి వచ్చి పయోధరము ల
దృష్టముగఁ బయస్సులు సేకరించుకొనియెఁ
బక్షమున నెలల్ పసలఁ గన్పునుగాని
ఋతువు మాత్రము చిహ్నముమిత మనంగ

సీ. ఒకనాఁడు రోమపాదోర్వీధవుం డంపె
బంగరు-చీరలుఁ బంక్తిగంప
లొక్కనాఁటికి విదేహోర్వీభృతుం డంపెఁ
బట్టు-చీరలు లస్తు బంక్తికోలది
నొకనాఁడు కేకయోర్వీశపుత్రుఁ డంపించె
నగలు నాణెములు సన్నవలిపములు
కౌసల్య కొక్క-లేఖయు జరీ-చీరలుఁ
బ్రత్యేకముగఁ బంపె బడఁతి శాంత
స్వాయముగాఁగ నరుంధతీసతియుఁ దెచ్చెఁ
గొడుకగు సుయజ్ఞమునిరాజు పసుగునేయుఁ
దాను జేతనునేసిన తఘుసుతోగరు
టంచువల్కలములుఁ బంస్తు నాదరమున

సీ. హారినీలమణికృతహారమ్ము లంపు నొ
క్కొక్క-సామంతుఁ డొక్కొక్క-నాఁడు
గారుత్మతంబులకై పురు లంపు నొ
క్కొక్క-రాజబంధు వొక్కొక్క-నాఁడు
సాగరోద్భవరత్నసమితు లంపించు నొ
క్కొక్క పెద్దశెట్టి యొక్కొక్క-నాఁడు
యజ్ఞశేషమ్ము భూపాళిఁ బంపించు నొ
క్కొక్క సోమపీథి యొక్కొక్క-నాఁడు
పురముపెద్దలు సతుల నంపుదురు రోజు
రోజు నూఁడిద లవ్వారారోహాలును ని
రంత మరుదెంచి పట్టపురాణులకును
గర్భసంరక్షణోపాయకలనఁ జెప్పు

ఉ. వేదపురంధ్రులట్లు కని పెంచిన తల్లులు పండువగ్గుము
త్తైదువ లేగుదెంచి పరిహాసము ప్రేమయు గౌరవంబు ము
గ్గాదిలిమాటలన్ వరుసఁ గైక సుమిత్రను రాణిఁ బాళ్లగా
నాదలుతీర నాడుకొని యద్భుతశీలలు చూతు రెంతయున్

సీ. తా నదేమో పిచ్చితల్లి కౌసల్య యే
ప్రేమఁబోయిన నదే ప్రేమఁబోవు
శాంత పంపించిన సన్నజరీచీరఁ
~~బహుశేషుదినము లాపగిదిఁ గట్టె~~
నెందఱు వలదన్న నిది శాంతచీరంచు
నది యుదికించును నదియ కట్టుఁ
దెలివి యరుంధతీదేవి వల్కల మీయ
నాపైని నది తాల్చె నదియు పనిగఁ
బదియునాల్గుదినంబు లాపగిదిఁ జూచి
కొట్టుపట్టిన వని దాచికొనియె దాసి
పట్టమహిషీమహాయోగపరిధులైన
చీర లాపైని దాల్పఁజేసినది దాసి

సీ. శ్రీరంగనాథపూజారాజితవ్రత
దినమును స్నానమాడును దలార
నెలకు మూన్నాళ్లు వానలయెద్దడిని మడి
చీర యారక తడిచీరఁగట్టు
యజ్ఞశేషము వశిష్ఠాశ్రమమ్మునసుండి
తినదు సుయజ్ఞుండు తెచ్చుదాఁకఁ
బ్రాశించదును రంగపతి కారగింపైన
వార్త యంచెలమీఁద వచ్చుదాఁకఁ
బర్వదినములఁ జిఱుచాప పైని బండు
కొనును జూలాంద్రుదరకు నివి కూడదనుచు
మొత్తుకొందురు దాసీలు ముసలివారు
వ్రతము భంగంబుచేయదు రాణిగారు

౧౬౭

ఆ. అసలు పూర్వమే మహారాణిసీత సు
మిత్ర యిపుడు మఱియు మీఱిపోయె
నామె యెదిదాల్చు నదిదాల్చు నదిచేయు
నామె తానుగూడ నదియుచేయు

ఉ. ఇంతటి నేమ మొప్పియును నిన్నెలు రాణులు సంజవేళ కా
సంత శిరంబునువ్వి కనుచాయలఁ గాటుక దీర్చి దిద్ది సీ
మంతములన్ గుబుల్కొనెడు మంపుల సొంపుల బొట్టు దీర్చి సీ
మాంతములన్ జెలగెఁ జను నా నృపకాంతల మోహనాకృతుల్

క. ఆకృతి నొందుచుఁ జెల్లెలు
కైకేయికి ముసలిదాది కలదొక్కతె తా
నేకాలము పతి యచటికేఁ
బోనుండిన దానితోడ మునుఁగును దేలున్

సీ. నుదుటఁ గస్తురిబొట్టు చదురుగాఁ దీర్చి
ముసలిది వలదన్న మొగము నవ్వుచు
శ్రీరంగనాథుని సేవింప మడిఁగట్టె
మంథర వలదన్న మానివేయుఁ
గౌసల్యఁ గనఁబోవఁగా బండిఁ బిలిపించి
వగ్గు కాదన్నచోఁ బంపివేయుఁ
గోర్కె సింగారించుకొని పతిఁ గలయఁగా
దాది కిష్టము లేదొ తగ్గిపోవు
తల్లి నెఱుఁగని దోషమ్ము తగిలి కైక
కన్నతల్లిఁ జూడని మమకార మెల్ల
దన్నుఁ జేతులఁ బెంచిన దాదిమీఁద
నొలుకబోయును గుండెలో నులికిపడుచు

సీ. మడికట్ట వలదన్న మంథర మన్నించి
నాటి లోలో రంగనాథుఁ గొలుచు
దాదిరొత్తిడి మహాధనచేలములు గట్టి
కాంత కాషాయముల్ కాంక్ష సేయు ౧౭౨

ముసలి రత్నాసనమ్మును వీడ నీయమిఁ
బాదుకల్ తోడి పోవఁ బడఁతి యెంచు
సడివగ్గునడుపులు సగ మిష్టమై కాక
యతివ నే నిందుండ ననుచుఁ బలుకు

నపుడో మంథరమాటకు నెదురుతిరుగు
నొక్కొకప్పుడు మంథర కొదిగియుండు
నెంతగొడ్డమ్ములైన నాయింతియెడఁదఁ
ప్రభువు శ్రీరంగనాథుండు పాయకుండు

క. సరిదైన పెంపకము లే
ని రాచసంతాన మెంత నెగ్గడితనమో?
గరువమ్మొ పట్టుదలయో?
సరసమొ మంథరయు నేర్పెఁ జాన కఖిలమున్

ఉ. ఆ వనితాసిరాపథములం దెసలారుటఁజేసి జన్మతోఁ
గేవలసత్త్వమూర్తి యగు కేకయనాథు నసృక్ప్రవాహముల్
భావములోపలన్ దెలియఁబట్టనిచోటుల మూలసత్త్వగం
ధావలితంబులై పరిణతాకృతి భద్రములౌఁ దదూహలున్

క. ఇష్టాపతితము వర్ణము
నష్టాపద మంచుఁ బూవుటాడంబరముల్
దృష్టి నిముసమున కొకఁడు వి
శిష్టతఁ గైకేయి పట్టుచీరలు తాల్చున్

క. ఆ హరిణాక్షికి దౌహృద
దోహదములు ముసలి దాది తోడ్తోఁ జేయున్
దేహాళి నిలువఁగ నీయదు
కాహళరావమును జెవులఁ గాడఁగనీదున్

ఉ. సంజలఁ బెద్దతల్లులు ముసళ్ళరుదెంచినఁ జూచిపోవఁగా
రుంజును వృద్ధదాసి యొక రూక్షపుఁజూపున దాని నార్పి ము
గ్ధాంజనలోచనాంతమధురాకృతి దర్శన మిచ్చుఁ గైకయున్
గ్రొంజెలువారుకావి కనుగోనలు నాదరగౌరవంబులై ౧౭

ఉ. కాదని యెంత చెప్పినను గైకొని వినంబడనట్టు పెద్దము
ఛేదున లేగ మంథరయుఁ దల్లి! యికానొకనెన్ను పెన్ను బల్
చేదు లటంచు రక్షలను జేసి పఠింబడి సృష్టి సమక్
బూది నొసంటఁ బెట్టుఁ గులపూజ్య సపత్నులు దుష్టయం బాగిన్

గీ. పెద్దము ద్దమవయు నోర్చి పత్ని మగని
భాగ్యరాసులఁ బొగడెనల్ పట్టమందు
నృపకుటుంబ సౌభాగ్యమున లేము తల్లి
యాలుతెలి తెరుపదని పెటంగ్రము తొలుత

కం. చెంబెడు సిబ్బెను నగుచు సు
ఖంబున నా యింత గడచి గట్టెక్కిన చో
నంబా! మీదీవనఁ బీ
తాంబరు రంగేశుఁ గొలుతు మందురు నృపల్

వంశస్థము.

లతాంగు లానంద విలాసమూర్తులై
నితాంతగర్భంబులు నిక్కి మించదట్
బతెంగ రాట్పుంచువుభాతి శార్గ్గస
జ్యాతాధురా సైఖరి నద్భుతంబుగాన్

గీ. చిత్రభానుసంవత్సరశిశిర మేగి
యల స్వభానువసంతంబు నరుగుదంచె
ముగురు రాణులు కాన్పుడు ముతుకఁ దాల్పఁ
దరులు చివురాకు నన్నముల్ దాల్పఁ జొచ్చె

కం. జరిగెను మహాయుగంబులు
నిరువదియెనిమిది తలంప నేడవమన్వం
తరము గడచు నీమాదిరి
నిరాశమగు శోభ గల్గెనే మధువేళన్

మధుమతి.

వగరుపిందెలతోఁ జిగురుటాకులతోఁ
దొగరువన్నెలతో మిగిలె మావితరుల్

హంసరుతము.

శ్రీ సంపాదితములై యభ్యాసం బొప్పఁగ సరోజా
వాసంబై మధురవంబై కూసెన్ మత్తకలహంసల్

భ్రమరవిలసితము.

మాకందోద్యత్సుమమధుఝరిణీసేకంబై త్రావి సివము లెసఁగన్
సాకూతం బొప్ప సరససరఘానీకంబుల్ ఝుమ్మని రొద లురలెన్

మత్తకోకిల.

మాధవాగమ మెల్ల లోచనమంజుశోణనవచ్ఛవిన్
సాధులై యెసఁగన్ బికీతతి శ్రావ్యమోహనగీతికా
మాధునిర్ఝరపాళిఁ జిమ్మఁగ మాధవుం డరుణాత్ముఁడై
సాధుధర్మము నెగ్గఁజేసెడి చాయఁ దోఁచిన దెల్లెడన్

గీ. భావి నష్టమసూర్యసావర్ణి మనువు
నంతరమున సప్తర్షిమహావిసూత్న
మండలమహర్షి ఋశ్యశృంగుండు వచ్చెఁ
బురిటి కరుదెంచు శాంతతోఁ బొలతితోడ

గీ. తోణికిసల వశిష్ఠారుంధతులును ప్రేమ
లెసఁగ శాంతర్శ్యశృంగుల కెదురుపోవ
నిరుతబిసిజంట యెదురెదు రేగినారు
రెండు మన్వంతరము లెదు రేగినట్లు

ఉ. చైత్రము శుక్లపక్షమున సప్తమినాఁ డరుదెంచె శాంతి తా
ర్యత్రికముల్ నినాదముల రాజమహాభవనాంగణోజ్జ్వల
ద్ధాత్రి మనోజ్ఞరావమృదుతాళలయానుగనృత్యదక్షణ
శ్రీత్రముగాఁగ మొదలహారిబహురీతులు పిచ్చలించఁగాన్

మ. ముని శాంతన్ మునికాంతఁ గన్గొనియె సమ్మోదంబు శ్రీదంబుగాఁ
గని కౌసల్యయుఁ గూతు వొదువు గదే కల్యాణి! యీనాఁటికా
కనరాఁగా ననుఁ దీరె నీ కను నుడిన్ గాఁగింటఁదాల్చెన్ మునీం
ద్రునికాంతామణి రాణిగర్భమును జేదూయంగఁ గేల్మోడ్పఁగన్

క. శాంతయు నిట్లనె నీ గ
ర్భాంతర ముజ్జగిలనున్న యద్భుతశిశువున్

సీ. ఏడుశంఖంబులు నెక్కటి న్యర్బుదం
బర్బుదంబులు నాల్గు నంత నెన్మి
దై నట్టికోట్లును నరువదియేడు ల
క్షలు వేలుపదునాల్గు శతములైదు
నిరువది రెండేచు జరిగెను ద్యుగణమ్ము
సృష్ట్యాది మఱుదిన మీఁదినంబు
మార్తాండశోణబింబప్రౌఢసుమమాగ్ర
ధాళధళ్య మ్మింత దాఁటి లేవు
పూర్వ మిన్ని యుషఃకాలములను నేఁటి
నవమి యే పుణ్యకాలమో? తవిలి యీ స్వ
భాను వే నోము నోచెనో? మైన చైత్ర
శుక్లపక్షంబు లెంతటి శోభ గలవొ?

ఆ. చిలుపవానజల్లు బిలబిలవచ్చిన
రాతినేలపైని రాజిలములు
పరువు లెత్తినట్లు ప్రాఁకాడె నినకాంతి
చికిలి మెఱుఁగుడాలు జీరువార

క. అంతట నంతఃపురమునఁ
గాంతలు గుమిగూడి బిట్టుగా గుసగుసలై
వింతలునాడ నృపు శ్రవః
ప్రాంతమ్ములఁ దవిలె గాఢవాంఛాంకురముల్

సీ. ఉఱక తొందరపడె నుర్వీకళత్రుండు
తొలివార్త విని యట్లె వెలఁదులకును
మంత్రసానులఁ బిల్చె మహిమహిళాపతి
తొలినొప్పు లనినంత తొయ్యలులకు
మంత్రజలము లిచ్చె మానవనాథుండు
దొంగనొప్పులు పోవ నంగనలకుఁ
బెట్టించెను విభూతిఁ బృథివీమహేశానుఁ
డెల్లరక్షలు గల్గ నింతులకును

సూర్యరథము వియత్తటీ సుందరాధ్వ
మందుఁ బరువులు వెట్టెడు నర్ధయామ
మల్ల యామము యామమ్ము నర్ధమును మ
హాప్రకృతి యెల్లఁ జంద్రునియందు నిలువ

గీ. ముగురు రాణులకును బ్రొద్దుపొడుచు వేళ
నొప్పు లుదయించె నిరువురినొప్పు లాగె
మఱి యథాపూర్వము సుమిత్ర మసలెఁ గోస
లావనీత్తనయానపర్యాసమాధి

క. అడుగులు వేయించి రోగిణ్
మడతిని గోసలతనూజ మంతరసానుల్
వడివడిగ నడిమిమింటికి
నడుగిడఁబో ద్వాదశాత్మ నరదపువాజుల్

సీ. కర్కాటకమున లగ్నమున స్వస్థానమం
దమృతాంశుఁ డుండె బద్ధాంజలి యయి
భాగ్యాధిపతిని దేవగురుణ్ దన [illegible]
నక్కునఁజేర్చుచు నమృతరోచి
కర్మాధిపతియై ప్రకామ తేజోహేతు
వైన కుజుండు కర్మాధిపత్య
నిధి మకరమ్మున నిలచి లగ్నముఁ జూచు
రవిని గర్మస్థితు రాజుఁ జూచుఁ
దెలిసి షష్ఠాధిపతియైన దేవగురువు
శశిని లగ్నాధిపతిఁ గూడి జన్మలగ్న
మందు నివసించెఁ జరరాశియైన కటక
మంచు సాగి పునర్వసు వంతమందు

క. రుద్రాంశుఁడైన సూర్యుఁడు
భద్రతఁ గర్మాధికారపదవీస్థితుఁడై
రౌద్రమున నుచ్చమేషో
న్నిద్రస్థితి వెలుఁగుచుండె నిప్పుకపోలణ్

క. శ్రీమన్మాలాభారతి
గా మొదలగు యోగశతముగా గ్రహరాజుల్
స్వామి జననంబువేళకు
సోమించిరి దితిజహరణసూచకములుగాన్

సీ. గంగాళములనిండఁ గాఁచుచుండిరి నీళ్లు
లుడుకెత్తఁ బరిచారికోత్కరంబు
తమ సుభద్రస్థితి తప్పునో యని మింట
నుడుకెత్తుచుండె గ్రహోత్కరంబు
మెలకువగలద్వేళ్ళు మలచుచు మంత్రసా
నులు పట్టినారు కోసలతనూజఁ
గదలక మెదలక గ్రహరాజు లంద ఱు
లలిఁ జుట్టినారు కోసలతనూజ
రవి మహారథసైంధవరాజఖురవి
ఘట్టితాకాశగోత్రభిద్గ్రావసౌధ
దేహళీటంకృతిం బలెఁ దెరలె మింట
నగరి మొరుసు మధ్యాహ్నఘంటారవములు

పద్మనాభము.
ఘంటారవం బట్లు శీర్షోదయం బిట్లు
గా నయ్యె లగ్నంబు నిష్కర్షగాఁగన్
ఝంటీప్రసూనంబు లట్టుల్ గ్రహశ్రేణి
చెల్వొందెఁ దత్కాలసంభూత దేహిన్
వెంటన్ జగన్నాశనోద్యన్మహాదైత్య
విధ్వంసనక్రీడనారంభుఁ జేయన్
ఘంటాపథంబయ్యెఁ గన్పింపరాకుండ
తన్మనాథు గేహంబు దేవాళి కెల్లన్

అష్టమూర్తి.
ఋక్సామాకృతి యజుర్మూర్తి ని మహా
థర్వావాసున్ గృతపతంగతురంగున్
వాక్సమ్యక్చరదుదాత్తస్వరితమా
ర్గప్రవిష్టున్ బటుహావిఃప్రియచిత్తున్

దిక్సీమాంత నిబిడజ్యోతిని వ్యాపిం
కేశు విష్ణుఁ ధృతధనుశ్చుణహస్తుఁ
ద్రాక్సంతుష్టహృదయాబ్జాత కనెఁ గా
నల్య శౌరిఁ దళితదైత్యమహౌఘుఁ

సీ. ఐదుగ్రహము లుచ్చ్రమై లోకనాయకుం
డావిర్భవించె ధర్మాధినేత
లగ్నమ్మునందున లగ్నాధిపతి తప
స్థానాధిపతియైన సౌరగురుని
సంబంధముండి పంచమకర్మపతిమహా
స్థితి కుజుచేత వీక్షింపఁబడఁగ
రుద్రాత్ముఁడైన సూర్యునిచేత మేషస్థు
చేతఁ గర్మస్థలస్థితునిచేత
దశమభావమ్ము బలయుతిఁ దనర బుధుఁడు
దీప్తగతిఁ దృతీయవ్యయాధిపతి కుంభ
మందు విపరీతఫలదుండు నలర దైత్య
విదళనోగ్రాంశుమూర్తి యావిర్భవించె

ఉ. కెవ్వున స్నిగ్ధమంథరము కేక వినంబడె మంత్రసానియుఁ
బువ్వును బోలెఁ జే శిశువుఁ బూనెను బట్టపురాణియుఁ గనుల్
నొవ్వగు మూఁతవిచ్చుచుఁ గనుంగొనె భాగ్యము నామె కన్నులుఁ
నవ్వెనొ జాలిపొందెనొ సనాతనమౌ మనుకాంతిఁ జిమ్మెనో!

క. అలసములగు చేతులఁ గొ
సలరాట్సుత శిశువుఁ గొనఁగఁజూచెను నవ్వుల్
గిలకొట్టె మంత్రసానియు
వలదని చేసన్నఁజేసి బాలునిగిల్లెఁ

క. కెవ్వునఁ గేకలిడెఁ శిశు
వవ్వసుధానాథుమహిషి ప్రాణములందుఁ
జివ్వుమనె మంత్రసానికి
నవ్వులుఁ బరిహాసములును నానావిధముల్

ఉ. మంతరసానితో నొకతె మానుము తప్పుడుదాన! పిల్లవాఁ
డెంతగ నేడ్చెనే యనిన నేడ్వఁడొ? యింకను వడ్లగింజము
ల్లంతటిసామి వచ్చె జగమంతయు నాఁగదొ యింక నంచుఁ గే
రింతలు నాడుచున్ బులకరించెను జూపులలో సమార్ద్రయై

చ. కలఁకయు మోదమున్ నయనకాంతుల వింతలుగాఁగ దేవినొ
ప్పులు మొదలైనయంత విడిపోవఁ డహో! పురుటిల్లు రాజు ముం
గిలిఁ జనుఁ జావడిన్ నడచు గెంటుపడున్ ముదిమంత్రసానిచే
వెలలును వచ్చుఁ దా మఱల వెల్లనితామరలైన కన్నులన్

చ. చుంచువుకల్గు నీకొడుకుఁ జూతువు కొంచెముగాఁగ నాఁగిర
మ్మంచును మంత్రసాని వసుధాధిపుఁ బంచెను సామి పుట్టుచోఁ
గొంచెములోని కొంచెమునకున్ జనుదెంచెను రాజు పట్టరా
కంచుల నుబ్బు తాల్మి కనులం దొక వింతరువార మేచఁగన్

క. చూపించెఁ గట్టికందును
భూపతికిని మంత్రసాని భూపతి యానం
దాపాంపతి చిఱుకన్నుల
నాపంచప్రాణములుగ నాస్వాదించెన్

క. నిసుఁగుఁ గనుగొంచుఁ గంచును
వసుధేశునికనులు రాణి వై పేగును రా
ణి సగము మూసినకన్నులు
వసుధేశుని కనులవంక వచ్చు మృదువులై

క. ఘోరతిమిపుచ్ఛతాడిత
మై రత్నాకరజలంబు లావర్తములై
తీరుబడి శాంతమా గతి
ధారణిపతిగుండె కొంత దడదడయాగెన్

క. విధిలేక వదలె నచ్చోటు
పృథివీపతి తోఁచ కరద మెక్కి నిజపురీ
పృథుబహిరుద్యానంబుల
రథమును దోలించె నెడఁద రాపిడికోలఁదిన్ ౨౨౧

క. నిసువును ప్రేమ యుటికిచన
మునరుచుఁ గను మంత్రసాని ముసలికనులలో
నిసువుంగను బట్టమహిషి
నిసువుఁగనదు శాంత కనులు నెటిమూసికొనన్

క. ఇదియంతయు నొక నిముసపు
కదలిక జగదీశుపైని గలిసీళ్లులు చి
ల్కి దురుసు మంతరసానియు
గుదిలించెను శిశువు నేడ్పు గురుసులువారన్

క. తోరము కట్టిన కత్తిని
గోరణమున మంత్రసాని కోసెను బొడ్డున్
నీరజముకాడఁ జిదిమిన
నేరిమిని గలుక్కుమనె మనీషన్ విధియున్

ఉ. కోసిన బొడ్డుపై నదిమి గోర విభూతిని బోరుకాడ గం
గానరిదంబుపాదయుగుఁ గంధిసుతాహృదయేశు స్వామినిం
జేసిరి బోరుకాడఁగను జేసిరి క్షీరసముద్రశాయి ము
క్తీశుఁడు ముక్తిగబ్బు విడియింపఁగ రానిసు వింపు లొందఁగన్

ఆ. గోధుమలనుబోసి గోతుపుపట్టుంజీరఁ
బఱచి లోకనాథుఁ బండఁబెట్టి
గడ్డమీఁది చిన్నిబిడ్డ మూదంచును
గోఱవిఁ ద్రిప్పినారు గ్రుడ్డుచుట్టు

క. ఇప్పసికందు పెనుగొఱవిఁ
ద్రిప్పించును రాత్రిచరపురీగేహములన్
గప్పుల చుట్టున ననఁగాఁ
గప్పుం జిగు లెగసెఁ గొఱవి కప్పు పొగలలో

క. చిటపట సవ్వడి వినఁబడెఁ
గిటకిటనన్ బట్టమహిషి కిటికిడెనఁ గనన్
చిటికలు గుటికలు మెటికలు
పటపట చిటచిటని జల్లువాన కురిసెదున్

శా. వర్ష స్వాంబులో? దేవతామకుటరాడ్వైదూర్యరత్నాంశులో?
హర్ష స్వాంతసురాళిబాష్పతతియో? యానందలేశంబులో?
యార్షశ్రీనతదీపవర్తివిగళత్స్వారంభతైలాంశలో?
ధర్షణ్యాశరకామినీనయనచింతాబాష్పసంతానమో?

మ. అవి పూవుల్ వడగల్లు లేఱిరి యయోధ్యాపత్తనీబాలకుల్
నవతాశ్రీసితపుండరీకజలదానందోష్ణధారల్ నత
చ్ఛవులై ధారణినాథసౌధమణిరాజత్ప్రాంగణాంబుల్ మణుల్
పువులున్ వియ్యములందెఁ గాంతులు రవంబుల్ వెన్నెలై మందమై

క. చినుకులను దిస్సమొలతోఁ
జని చేతులు చాఁచుకొంచు జగ్గులనవ్వుల్
తనరఁగ శాంతాదేవి
వనితామణికొడుకు వానవల్లప్పాడెన్

ఆ. శాంతకొడుకు వానసంబరమ్మునఁ దూఁగి
వానలోనఁ దిరుగు వచ్చి పురిటి
యింట శౌరిఁజూచు నింతలో వానలోఁ
దిరుగు మఱలఁ జొచ్చుఁ బురిటియిల్లు

క. తనచేతి కిమ్మనును స్వా
మిని నవ్వుచు మంత్రసాని మెటికల్ చిటికల్
చన విఱిచి యతనికణతలు
ననఁగా రాదయ్య దేవుఁ డని బెదరించున్

ఉ. ఓమిన ఋశ్యశృంగగురుయుక్తముగాఁ జని యక్కగారు శాం
తామధుమూర్తి ముంగురులునాఁ జను కర్కటిడెక్కలందు హే
లాముఖచంద్రముం డమరి లగ్నముగాఁగను జిట్టితమ్మునిన్
క్షేమపుఁబ్రోవుఁ గాంచి యొసఁగెన్ దొలిదీవన లల్లువెట్టుచున్

గీ. అంత వచ్చిన భూపతి కంగనలును
నదివఱ కెఱుంగనట్లుగా నంతనంతఁ
దొలఁగిపోదురు సిగ్గుపొందుదురు తక్కి
తారుదురు నవ్వుచుందు రందాలగనులు ౨౩౫

క. ధరణీపతి తన యంతః
పురమే యదియొక్క క్రొత్త పోడిమి నెఱపఁ
దిరిగి తనకు బాల్యదశా
పరిణామము జరుగునట్లు ప్రమదం బందెన్

సీ. విరియఁబూఁచిన లేఁతవెన్నెలతీవల
పొదరుటూయెలలోన నొదిగినట్లు
తెలిపాలవెల్లి జగ్గులకరళ్ల సుమాళ
మెసఁగు జీబులలోన మసలినట్లు
లోకవేయిపున్నమ లొత్తుజిగటదేసు
చిక్కవెన్నెలవెన్నఁ జొక్కినట్లు
మెఱుపుఁదీవల నిట్టచెఱువువెల్లులనీళ్లు
లోదెపనల మున్క లొలసినట్లు
నంతిపురమునయం దయోధ్యాపురంబు
నందుఁ బ్రతిజీవి కదలని యానసమున
నుఱికివచ్చు నానందరసోల్బణంబె
కాక చైతన్య మేదిన కరణి నొప్పె

మ. సెలయేటైనను వేళపట్టుఁ జనఁగా జీమూతధారల్ మహో
పలముల్ సేరఁగ గండుఱా లురలి జీవద్వేణిఁ గట్టంగ ఘు
ల్లలఁ గాంతారము లేగఁగాఁ బెనుతటాకం బొందు చేరంగఁ గో
సలరాజాత్మజ చిన్నిబిడ్డఁగను టాశల్ సేరె విద్యుద్గతిన్

మ. ఎదురెక్కెన్ నవహర్షకుల్యలు ధరిత్రీశోజ్జ్వలత్పత్తసీ
పద మాశాంతము లందునుండి హితభూపాలోగ్రసామంతు లిం
పొదవం జేరఁగ వచ్చునట్టి యరదంబుల్ వాహిను ల్గాఁగ న
ట్టిద రాట్పత్తనమోదవార్థి యెగఁదట్టెన్ సంగమస్థానముల్

గీ. ప్రొద్దు వాటారిన దటంచుఁ బ్రొద్దు గ్రుంకె
నంచు వెన్నెల లరుదెంచె నంచు నెవరొ
యనిన నెఱుఁగుటయే గాని యవనిపతికి
నించుకే దినగతి గోచరించలేదు

చ. నెఱికళలందునన్ సగము నిండినఁ గ్రుమ్మిన యంకముద్రచే
మెఱుఁగులకందు నీలిపస మించినరాజు నృపాలునిండ్లలో
నెఱికళ లన్నియున్ మిగిలి నిండిన కాంతల యాననంబులన్
గుఱుతిడనయ్యె నయ్యమృతగోళము దగ్గఱ నిండుకాంతులన్

గీ. రాజు పురుటింటిలోన నిద్రాసమాధి
గతుని హరిఁజూచు సౌధశేఖరనితంబ
గతుని హరిణాంకుఁ జూచు నా కాంతిగోళ
ముల విభేదంబు దెలియక మోసపోవు

గీ. రువ్వ నయనాభిరామచంద్రుండు వీఁడు
రువ్వ నయనాభిరామచంద్రుండు వాఁడు
మింట నితఁడు రేచన నస్తమించిగాని
యిరువురి విభేద మెఱుఁగడు ధరణిపతియు

ఉ. నిండిన కోర్కెచేత నవనీపతి లో నయనాభిరామచం
ద్రుం డనుకొంచుఁ బోవు నొకత్రోవున లో శతశోఽభిరామచం
ద్రుం డనుకొంచుఁ బోవు హృదిఁ ద్రొక్కిసలాడుచు నంత రామచం
ద్రుం డనుకొంచుఁ బోవు నెద నూర్పిడిసేయుచుఁ హూరుపెత్తుచున్

శా. తా జన్మంబును జేయనెంచిన మొదల్ తారాడెఁ జంద్రుండు నీ
యోజన్ వచ్చెను నేఁటికిన్ దిరిగి యోహో! వాఁడె వీఁడయ్యెనో
రాజై స్వీయగృహమ్ములన్ వెలుఁగు నీ రాముండు చంద్రుండు తా
రాజై రాజునెడందరాజయి రసారాముండుగా వెల్గెడిన్

మ. మధుమాసంబున నల్పయామము త్రియామా శ్రీత్రియామంబులున్
బృథువుల్ తాము గతించికూడ మిగిలెన్ రేయామభాగంబు మో
దధునీసాగరసంగమమ్ముగఁ బ్రభాతప్రాయమై రేయి సం
గ్రథితానందరసాపగాపులినతీరం బయ్యె రాట్సౌధముల్

సీ. వెనుగాళ్ళపగ్గముల్ బిగువులు సడలంగ
మునుగాళ్ళు గాటికిఁ గొనలు తగుల
వెన్నువంగఁగ సాఁగి పీనులు టెక్కించి
పొలపొలవచ్చు వేఁబోక సన్న

వెలుఁగులఁ దలవంచి పెడద్రిప్పి ముట్టియ
మారేడుపిండెలమాద్రి కన్ను
గ్రుడ్డులు మిలమిలఁ గూరఁగా విచ్చి నా
సారంధ్రముల నుబ్బెసంగఁ జూచె
నుఱిమి యుఱిమి మానవోర్వీశసేవాధు
రంధరంబు స్వస్తురంగమంబు
పొలసుదిండిమూఁకఁ గొలికికిఁ దెచ్చిన
రాజునకును సౌరరాజుకాన్క

క. ఆసమయంబునఁ గైకే
యీసౌధములందు దివ్వె లెసలారెఁ బునః
శ్రీసముపేతజ్వాలా
మాసరకాంతిచ్ఛటారమాజటిలములై

క. పరిచారికలును భూమీ
వరుతోఁ జెప్పంగఁ బర్వుపర్వునఁ జనఁ దాం
దర నీళ్ళుకాచుటకుఁ దాం
దరయును బడినంత లేదు తనయుఁడు కలిగెఁ

సీ. మీనలగ్నమున జన్మించెను దనయుండు
శైవాలపిహితమా శంఖ మట్టి
యొకగ్రుడ్డు లగ్నమం దుండఁగా శుక్రుండు
మూడవరాశికి భూమిపాలు
ప్రియతమకాంతకుఁ బేర్చి పంచమము బు
ద్ధిస్థాన మమృతాంశు దేవగురుల
యునికి నిర్వచియమా నుదధివోని పరమ
శాంతస్వభావుండు జననమందె
రాజు పరువెత్తి చని కుమారకుని లోచ
నాభిరామమూర్తిని జూచు నంత బ్రమసె
బిగియు కళ్యాల సృక్వముల్ పగిలి సూర్య
రథతురంగమముఖముల రక్తిదోఁచె ౨౪౦

క. మందేహుల మూఁక దులుపు
టందున జాగయ్యెనేమొ యాదిత్యునకున్
సుందరి కైక సుతుఁగనుట
యందియు బ్రోఁతలుగ వార్తయై పురిఁ బ్రాకెన్

మ. దినరాజోదయకాలఫుల్లనలినీదీధిత్యనూనాస్యహృ
జ్జనితానందరసానుకూలగమనస్కంధోరులీలాచల
త్తనుమధ్యాభినవాభిరామ యగు వార్తాదేవి యూరేగె ధా
వనకాంచీమణిరత్నకింకిణికిణక్వాణప్రతిస్వానయై

చ. తనదెస రాజు సేయుఁ బ్రమదంబునఁ బట్టపురాణికన్న వ
ట్టిన తెగరాచరీవిఁ బ్రకటించెడు కైకయ రాణియైన భూ
జనులకు నంతలోన నలచానకుఁ బుత్త్రుఁడటన్న వార్తయున్
వినఁబడ రాజె పుట్టె ననిపించె బలాత్కృతబుద్ధి పెంపునన్

క. కౌసల్య కొడుకునంతటి
రాసుతుఁ డింకొకఁడు గలుగ రవితురగము ల
భ్యాసమ్మునఁ గర్కటక
రాశి గలుగఁ బరువిడెన్ ద్వారాధూర్జరముల్

సీ. తనమేను చక్రసుందరముగాఁ జుట్టి స
హస్రఫణల్ సాఁచు నాదిభోగి
యంచుల ధాళధళ్యప్రాప్తదిశముతో
సుడియు వెల్గులపాదు చుట్టు కైదు
వంతస్స్థనారాయణాత్మప్రభాగోప
నవ్రతపాలన తీవ్రమూర్తి
యాకాశదక్షిణాయనదోషపరిహృతి
ధర్మోత్తరాధ్వసంధానశీలి

యగుచుఁ జనుదెంచి మింట మార్తాండమూర్తి
నిన్న నడిజాము పుట్టిన నిసువుఁజూడ
నెంతదూరము పెరిఁగెనో యేమొ యనఁగ
నిముస మనఁగను నిముసంబు నింగి సెలిచె

గీ. అంతన సుమిత్ర కుదయించె నాత్మజుండు
లేలిహానాధిపత్య మాశ్లేషయందు
నాశరాసుప్రచయ లేలిహాన మగుచుఁ
దనువుచేఁ బండువాగైన దబ్బపండు

చ. తనయుఁడుగల్గి నొప్పలును దగ్గవు రాణికిఁ బ్రేళ్ళ నూఁది మె
ల్లనఁ గని మంత్రసాని కవలన్ గ్రహియించెను గుబ్బిసాడు రా
జునకును బాయసంబు మధుసూదను తేజము నాల్గు చేసి యి
చ్చిన తొలిజాడ తోఁచెఁ దనచిత్తమునన్ బ్రమదంబు పొంగఁగన్

గీ. ఇంకొక సుతుండు గలుగఁగ నింకఁ గొంత
సేపు పట్టునటంచును జెప్పె మంత్ర
సాని రాజును శిశువుఁ గౌసల్యకొడుకు
కైక కొడుకులతోఁ బోల్చి కరుదులాడు

ఉ. ఇద్దరు నీలిమైజిగులు నీయన పాండిమ పాయసంబునన్
గద్దఱిపాలలో మఱుఁగుఁగా పొకకొంతయుఁ గొంత లేఁతకా
పద్దిర మద్దికాయ లయినట్టి కనుంగవ భూమినేతకున్
బెద్దయు విస్మయంబు గనిపించును గోసలయందుఁ బ్రీతియై

ఉ. ఆపయి నెప్పుడో కలిగె నామెకు నింకొకపుత్రకుండు న
ష్టాపదకాంతి దేహుఁడు కడంక సుమిత్రయు రంగనాథపూ
జాపరమాంకమై తనబుజంబున జారెడు పట్టుతోరమున్
గోపన హేతువున్ మొదలిగు ర్తుగఁ గట్టెను బెద్దబిడ్డకున్

ఉ. కోయనఁ గోటియై పసపు కుంకుమ గిన్నెలనిండ నూనె నీ
కాయయు సేవకీవితతి గంపలు బుట్టలుగాఁగనై యయో
ధ్యాయతనంబులన్ గడపయన్నది పీడక పంచిపెట్టె రా
త్రీమయవినూత్ననూపురగతిధ్వని సంచలపిల్పుఁ బిల్చుచున్

గీ. రాచి అంపానఁబెట్ట దోషాచరాళి
జెప్పునన్ దన్న దితిజుల శిశువు లంతఁ
జాలుదు రటంచుఁ బురుటింద్ల సాగనార
మట్టులును బ్రాఁత చెప్పులుఁ గట్టినారు

క. ఆగామిదైత్యదహన
ప్రాగల్భ్యవినోదలీల బాలెంతల శో
భాగృహములఁ గుంపటిపొగ
సాగెను సనసన్నగాఁగ జ్వాలాలులుగా

సీ. దైతేయహరణవేళాతీవ్రతంబోలె
నడికట్టు గట్టిరి నలిననేత్ర
లసురవార్తాపరిహారణంబు వోలికఁ
జెవి దూదిఁబెట్టిరి శ్రీనిధాన
లసురదుష్కీర్తిమూలాంకురం బనఁగఁ బం
డ్లకుఁ గప్పువెట్టిరి నలినముఖులు
దుష్టభావాత్తవైధుర్యంబు సూచిగా
ముసుగులు వేసిరి ముగ్ధదృశలు
పద్మనాభులీల బాలెంతరాండ్రు పా
లించినారు మూదలించినారు
హాన్నుకులము చెడిన వెన్నెమ్మలను దాది
పిండు ధర్మరాశి బిడ్డకొఱకు

సీ. ఒకసారి చనుదెంచి యుర్వీకళత్రుండు
కౌసల్యపసికందుఁ గాంక్షసేయు
నొకసారి తానేగి యుర్వీకళత్రుండు
కైకయీతనయుని గాంచిపోవు
నొకసారి కేమొ యింకొకసారి చని రాజు
సౌమిత్రులను గాంచి సంతసించు
నితరులఁజూడని యెల్లవేళల దశ
రథరాజు నెడఁద నగ్రసుతుఁ జూచుఁ
గోసలాత్మజాతకొడుకు రాజునెడంద
వదలిపోఁడు చూపు ప్రిదిలిపోఁడు
ఉఱక ప్రిదిలిపోవునో యనుభావంకి
రాజు ప్రేమఁ గదలి రవ్వ పొందు

క. రా జగ్ని యందు వేల్వఁడు
రాజీవాక్షులును రంగరాట్పూజావి
భ్రాజిష్ణులు గారును ర
క్షోజేత యై రక్ష పదునొకొండు దినంబుల్

క. ఆ పదునొకొండు దినములు
భూపతినగరంబునందు భూదేవాగ్నుల్
శ్రీపతిదయామధురనే
త్రాపాంగజ్యోతిసుషమ లావర్జించెన్

మ. దినముం బూసిన యాముదం బొలసి జ్యోతిర్గర్భముల్ వండి వె
చ్చన కుమ్మించినయట్టి యాముదపుగింజల్ వోలె నార్ద్రప్రభా
ఖను లాత్మీయగృహప్రదీపికలు రాద్గర్భంబు లేపారఁ జి
క్కని యానందపువెల్గు కన్నుమొద లెక్కంబట్ట భూనేతయున్

సీ. జననాయకుండు కౌసల్యాసుతుం గాంచుఁ
బ్రాణమ్ము లన్నియు బహిర పెట్టి
శాంతాపురంధ్రి కౌసల్యాసుతుం జూచుఁ
బ్రాణమ్ములను లోన భద్రపఱచి
సత్తపోనిధులు కౌసల్యాసుతుం గాంత్రు
ప్రాణమ్ములో బిడ్డపాల్లు వెట్టి
కౌసల్య తనయుని గాంచుఁ బ్రేమకొలంది
ప్రాణమ్ములను బిడ్డలోనఁ బెట్టి
యొక సుమంత్రుండు కను దేవయుగమునాఁటి
వార్త కన్నులయెదుటన మూర్తిగట్ట
నవనిపతికిని గగనమైనట్టి బిడ్డ
యఖిలజనముల కనులకు నమృతవర్తి

క. హేమంతము వెనుసనఁగా
శ్రీమంతము లైన పంటచేలవిధమునన్
వే మించి పురుటిదినములు
సోమించిరి రాజసతులు సుతులును గాంతిన్

గీ. స్నాన మాడిన బాలెంత చక్కదనము
పరిణయమునాటి యందమ్ము పాదరించు
రాజు శిశువులఁ గాంచునో! రాణుల ముఖ
దేహకాంతులు కాంచునో! తెలియలేదు

గీ. రంజితాధర తాంబూల రక్తిమంబు
చిఱునగవు తెల్లఁదనములోఁ జిటిలిపోవ
నెఱుపు విఱుగుచుఁ దెలినిగ్గు లెక్క చంద్ర
బింబములవోలె సతులు కన్పించినారు

క. నెలపురుడు దాటవైనను
నిలాపతికిఁ బ్రాణ మాఁగనే లే దఱచే
తులఁ గొని పొత్తులలోఁ గా
సలేయు నిరవధికమోదసాగర మీఁదెన్

గీ. ఆఱుగడియలలోఁ దల్లి యనుట తెలియు
నాఱునెలలకుఁ బైఁ దండ్రి యనుట తెలియు
ననుట నిజమే శిశువు రాజుహస్తమందు
నేడ్చి కౌసల్యచేతిలో నేడ్పు మానె

వ. ఆ పదునొకండవదినంబున వశిష్ఠఋశ్యశృంగులు పిల్లవాండ్రకు నామ కరణంబులు సేయువేళ నయోధ్యాప్రజ లొడ్డువిరిగి వచ్చిరి. వశి ష్ఠులు పుణ్యాహవాచనానంతరంబునఁ బల్లెమ్మునిండ బియ్యమ్ము పోయించి కౌసల్యాతనయునిపే రనునంతలో మహారాజు బియ్యము పైని రత్నాంగుళీయమ్మున రామ యని వ్రాసి చంద్రుఁడని వ్రాయ కయ మున్న

గీ. సర్వదుఃఖహరమ్ము కౌసల్యపూర్వ
జన్మసంస్కృతి యోంకారసదృశమైన
తతమధురరామనామమ్ము ధాన్యలక్ష్మి
యుపహతనిచోళ మగు నెద హత్తుకొనియె

వ. వశిష్ఠులు రామచంద్రుం డనకముందు దశరథుండు రామచంద్రుం డని వ్రాసె. దశరథుండు వ్రాయకమున్న వశిష్ఠుల నోటినుండి రామచంద్రుం డని వచ్చె. ఆలస్యముగ వచ్చిన సుమంత్రుండు బియ్య

ములోఁ జూచి యక్షరమ్ములు సరిగాఁ గన్పింపక రామభద్రుం డని
చదివె

క. ఊరెల్ల రామభద్రుఁడు
ధారణినేతకును ఋషికిఁ దల్లికి శిశువై
శ్రీరామచంద్రుఁ డయ్యెను
దారక మయ్యెను సమస్తధరణీప్రజకున్

వ. అంతఁ గైకేయీసుతునకు భరతుండని సుమిత్రపెద్దబిడ్డ రంగనాథ
వ్రతంబుతోఁ రెండవబిడ్డకు లక్ష్మణుండని చిన్నబిడ్డకు శత్రుఘ్నుండని
వశిష్ఠులు నామకరణంబు చేసిరి

చ. ఉరువడి మ్రోఁతవెట్టుచు నయోధ్యవియత్పథ మందు స్వాదుభా
స్వరము వినూతనాద్భుతము శబ్దగుణం బుదయించె భూప్రజల్
పరిపరి రామ రామ యన భద్రత క్షుద్రతరధ్వనుల్ తదు
ద్ధురమహిమప్రతారితవిఘాతములై చెడి యొత్తిగిల్లఁగన్

ఉ. అంతన కోసలేశసుతయాత్మజునామము నెల్లవారి ప్రా
ణాంతరవీథినుండి బయలై చనుదెంచిన యక్షరంబులై
యింతయు విస్మృతిన్ బడద యేరికిఁ దక్కినవారినామముల్
కొంత కెఱుంగఁగా నడుగుకొందురు వారిని వారు భూప్రజల్

సీ. ఆ చిత్ర మేమిటో? యాపురంబునయందుఁ
బ్రజలెల్లఁ బ్రశ్నోత్తరంబులందుఁ
బ్రశ్న యడుగఁబోయి రామచంద్రుం డంద్రు
బదులు చెప్పగ రామభద్రుఁ డందు
రే వస్తు వేనియు నెట నున్న దే యని
యడుగఁబోవుచు రాము నడుగుచుందు
రెచటికేఁ బోవుచు నెటకేగుచుంటి వం
చన రామభద్రుని గన నటంద్రు
మఱియు నల్లంతలోపల మాటఁ ద్రిప్పు
కొంటయే గాని మొదలిపల్కులకు రామ
ముద్రగా నాడుదురు వేదములకు వేద
శేఖరంబుల కందని సిద్ధమతులు

మ. శ్రమపొందన్ క్షుధయున్ బిపాసయును దీరన్ గిష్టకార్యాంతవి
శ్రమమొందన్ నిదురింపఁ బండుకొను నిద్రన్ మేలుకొన్నన్ వచో
గ్రిమభాగంబుల సర్వభూప్రజకుఁ దండ్రీ! రామచంద్రా! యట
న్న మహావాక్యమె గోచరించె సుమహానందంబు సంధించుచున్

గీ. వృక్షమా మున్నె యున్నది బీజనిర్గ
తంబయై గోచరించు నేత్రముల కెందు
అసలె రామమయం బయినట్టి జగము
నప్పుడే రామమయ మయినట్లు తోఁచె

గీ. సుకృతపరిణతిభేదంబు సువ్వె యొక్క
శిశువె గనిరి కౌసల్యయు క్షీరరాశి
పాలసంద్రపుఁదరఁగల పచ్చి యూర
దట్టె కౌసల్య మైపచ్చి యూరఁజొచ్చె

సీ. వెలికింతలై బోర్లగిలఁ బడఁజాలక
కలశపాథోరాశి కమ్మతరఁగ
చినుకంచు మొగము వాచిన తొలిపసికందు
కౌసల్యయెడఁదలోఁ గరడు కరడు
లై పొంగులొలయు పయస్స్వాదునిర్జర
నిర్ఝరధారలు నిక్కి నిక్కి
చుబుకు చుబుక్కునఁ జుంచుమూతిని బెట్టి
యాబతీరఁగఁ ద్రావునట్టి వేళఁ

గందు గుటక లుబ్బెడు పసిగళములోని
లేఁతనరముల చిఱుకదలికలు చూచి
రాజుముఖమండలమున మూర్తంపుముదము
రాణిముఖమండలమున మూర్తంపుశాంతి

గీ. మొదట నోంకారమును వేదములుగఁ గల్ప
మును యుగంబులుగాఁ బాదములుగ ధర్మ
మజసుతుని మోదవారాశి యాత్మజులుగ
మొగిఁ జతుర్ధావిభక్తమై మొనలుసూపె

ఉ. సాధుజలప్రపూర్ణములు సంతతజీవధు లైన యెల్ల పా
థోధులు నొక్కఁడయ్యు నొకత్రోవన క్షీరపయోధి పెద్ద ధా
త్రీధవు నాత్మవృక్ష మిగిరించిన నల్వురిలోన స్వామి శో
భాధుని యై ప్రమోదమధుభావనిధానముగా జ్వలించెనున్

క. క్షుత్తునకు శిశుచతుష్కము
పాత్రులలోఁ గొట్టుకొంద్రు పోరిఁ గాల్సేతుల్
గ్రొత్తలుగఁ బురామాత్స్యక
జిత్తనులై తిరుగఁబడిన చేఁపలవోలెన్

క. మూలదితిజభూతంబుల
గాలి దవిలి పోరువెట్టఁగా శిశువులు ద్వా
ర్జ్వాలాజ్యోతిర్జాగ్ర
ద్వేలలు కాపుండు దృష్టితీసిన యేకుల్

చ. ఒలికినయట్లుగాఁగ సరయూజల మెక్కి యయోధ్యబావులన్
జలములు చేతికందు నృపుచానలు చేఁద మొగం బెఱుంగరున్
నెలపురుడైననాఁడు రమణీత్రయ మూరక పేఁల నూతిలో
పల నల చేఁదవేసి రొకబారెడు బాలమృణాలబాహువుల్

క. ఆ నాఁడు తొట్టెలో నిడి
మానవపతివంశబాలమార్తాండుని నా
నానారీమణు లూఁచిరి
యానతమృదుహాసరోచిరాస్యాంభోజల్

గీ. నోరు పెగలదటే నీకు నూరక తెగ
రాలిపోవుదు కూనరాగాలతోడ
బిఱ్ఱబిగిసెదు తొట్టెను బెట్టు స్వామి
నేలగాఁ బాడఁగా నొక్క జోలపాట

క. అనరమ్మ యొక్కపాటను
వనితామణు లెల్ల నిటకు వాయనములకై
చనుదెంచిరో యెల్లరకును
నినుమడిఁ దాళాలు పడెనటే? నోళులకున్

గీ. నెల తిరుగలేదు మగనితో నీవు గలసి
యత్తగారిని దొలఁగించి పెత్తనమ్ము
నెత్తిపై కెత్తుకొంటివి నీరజాక్షి
నీకునుం జిక్కనగు పుచ్ఛడీకతనమొ !

క. అని యదలించుచు హేలగ
ననునయముం జేసికొంచు నంభోజాస్యల్
వినమితవదనలు పాడిరి
మనుజేశ్వరశిశువు గానమాధురి కొలయఁ

క. జోజో కమలదళేక్షణ!
జోజో మృగరాజమధ్య! జోజో కృష్ణా!
శ్రీజేతృదిలీపాన్వయ
భూజానిలతాగ్రభాసిపూవా! జో జో!

తన్వి.
జో! కమలాచారువదనకమలాచూర్ణకపోలవికచనఖ జో జో!
జో! కరుణాపాంగకలితతరుణాజూ*వినివారణమధునిధి జో జో!
జో! కృతనాకేశ్వరతతపృతనాజ్యోతిరమోఘకరణతను జో జో!
జో! కుటిలారాతిహారిణజటిలాచ్ఛాదనకార్ముకపటుకర! జో జో!

౧౧గళమహాస్రగ్.

పొత్తులను నందములు బొత్తు లిడినట్టు గొలపొత్తివలె నొత్తిగిలు జో జో!
గుత్తులుగఁ బ్రాకిచని కొత్తళము ప్రేలు సరిక్రొత్తలగు ద్రాక్షవగు సామీ!
చిత్తునకు సత్తునకుఁ జిత్తులగు బోకులగు జిత్తు లమరించఁగల సామీ!
ఒత్తిగిలి పండుకొను ముత్తకలియేడుపుల నొత్తుగను నెత్తకుము జో జో!

క. మొకరిశిశూ! మాంధాతృని
గకుత్థ్సుని దిలీపరఘుల ఘనుఁడగు నజప్పు
త్రీకళత్రుని సుజ్యోతి
ర్మకురంబా! నిదురపొమ్ము! పో పో! జో జో!

వ. అంత నెలపురుడు పోయిన నేకాంతమున                                    ౩౦౧

---

* అజూః = నరకప్రాప్తి.

క. కౌసల్యాశయోర్వ్యాపరిఁ
గౌసల్యాహ స్తజలజకాండోపరి శ్రీ
కౌసల్యావత్యోస్సపరిఁ
గౌసల్యాశిశువు రాజు కడుముద్దాడెన్

ఉ. హాసరి చైత్రపున్ దుదిని నారెడు మల్లెలమొగ్గలం బలెన్
రాసిగ రేకకట్టుకొను శ్రావణమాసపుఁ గేదఁగుల్ బలెన్
మాసరమైన కార్తికమాసములో వరివెన్నులంబలెన్
శ్రీసముపేతులై పెనుపుఁ జెందిరి రానిసువుల్ క్రమంబుగన్

గీ. వెలికిఁ గొనిపోకుఁడీ బిడ్డఁ బిట్టలారు
సంజవేళల నంచుఁ గౌసల్య పలుక
గరుడి వైకుంఠమున భయకంపితుండు
మడమలను ద్రొక్కుకొను తెక్కు ముడుచుకొనుచు

గీ. బోర్లగిలఁ బడనేర్చిన భూపుసుతులు
తలయుఁ గాళ్ళెత్తు లిట్టె కదల్చుచుండ
నీళ్ళ త్రవ్వక చన్న తాఁబేళ్ళ పోల్కి
శాంతకోడు కమ్మతోఁ గేకిసలుగఁ జెప్పు

చ. తనకును నిద్రలో దొరలి ధాత్రిపయిం బడ నేలపాప కో
ట్టినదని రక్షసేసినఁ గడిందిగఁ గోసలరాజపుత్రి యే
మనుకొనెనో మహాప్రభువు నాత్మను దాను విదేహరాడ్ధనుః
పణమగు లక్ష్మియకా పుడమిపాపకుఁ దాఁకిన మాటయొత్తిడిన్

మ. శిశువుల్ నాఁటికి నాఁడు దీపకళికాశ్రీ మాత్రమే కాక ము
గ్ధశనైర్దృష్టులఁ బల్కరించుజనులన్ గాంచంగ సర్వాంగనున్
గుశలత్వంబున నేర్చి గబ్బువెడలన్ గూర్చుండి రోంకారస
ర్వశఆద్యాకృతులై త్రిలింగవిషయవ్యాహారప్రాగ్లభులై

చ. నలువురు బిడ్డలన్ ధరణినాథుఁడు చిత్రము రామచంద్రుఁడన్
బిలుపునఁ జేసియే పిలుచు బిడ్డలు మాత్రము రామచంద్రుఁగాఁ
బిలచిన రామచంద్రుఁడును బ్రీతిగఁ జూచును దక్కుముప్వురున్
గిలకిల నవ్వుచుందు రిరుగేలు మొగిడ్చినయట్లు తట్టుచున్ ౩౦౮

మ. ఋభువుల్ వేగను లుంచి కాయఁగ ధరిత్రీభృన్మహస్సుల్ జగ
త్ప్రభువుల్ ప్రాఁకఁగ సాగి రంతట మహారక్షోఘ్నమంత్రంబులన్
శుభముల్ కూర్ప వశిష్ఠులున్ శిశువు లాశుప్రోజ్జ్వలత్పుష్టి నా
రభటిన్ విద్దెముసేసి రంగన లుహారల్ చప్పటుల్ కొట్టఁగన్

మ. అవురా! శ్రీరఘురామచంద్రుఁడు ప్రభుండై విద్దెముల్ సేయుచో
హావణించున్ నిలుచున్న వైఖరిని ప్రత్యాలీఢపాదంబుతో
శ్రవణాంతానతముష్టియై త్రిజగతీరక్షాపతాకంబుగాఁ
బువు పుట్టంగనె దిక్కులం బరిమళింపుల్ పిక్కటిల్లుం గదా!

ఉ. ఓహరిసాహరిన్ సొగసు లూఁగఁగ విద్దెముసేయ సామి మా
లాహరితాంశువుల్ పోలయు లాగునఁ బచ్చలకంకణాలహా
స్త్రాహృతిఁ దల్లి దండ్రియును నంద వికుంఠపురీకవాటవీ
థీహరినీలతోరణవిధిన్ జెలువారును రామచంద్రుఁడున్

గీ. రామచంద్రుని ప్రక్క నిద్రాసమాధి
రామచంద్రుని ప్రక్కఁ గేళీమహస్సు
వెలిగఁ బోరువెట్టు సుమిత్ర పెద్దకొడుకు
రంగనాథుని చికిలితోరంపువాఁడు

క. నెలనెలకు బిగియుచుండును
నెలనెలకును వదులుసేయు నెఱితోరంబున్
బులకితదేహ సుమిత్రయు
ను లక్ష్మణుని దండవంకనుం గనుఁగొంచున్

గీ. మొలచెడు చివుళ్ళకండూతి సెలవులఁ జన
నురుసు శ్రీరామచంద్రుండు నొక్కినంత
కందిగింజయ్యెఁ గోసలక్ష్మాతలేంద్రు
సుత జగన్నాథమా స్తనచూచుకంబు

క. తనచంక నెత్తుకొన నీ
యనిచో నేడ్చును సరే యటన్నను దామో
యను జాలక ధరఁ బడవే
యును బిడ్డల శాంతకొడుకు నుఱక యెగుచుచున్ 3౧౪

మ. ధరణీనేత కుమారులన్ నలువురన్ దాఁ జూచుఁ దాఁ జూచు భా
సురులన్ ముప్పురురాణులన్ బిలుచుచున్ జూపించుఁ జూపించుఁ ద
త్కరపద్మంబుల నిచ్చి కన్నులరలం గాంక్షించుఁ గాంక్షించుఁ జం
దిరు క్రొవ్వెన్నెలకుల్యలంబలె దెసల్ త్రివ్వించి నవ్వించుచున్

క. బిడ్డల చేతులు మెడకును
నడ్డముగా వేసికొంచు నాస్యాస్యమ్మున్
గడ్డము గడ్డమ్మునుగా
బుడ్డికపోలము కపోలముగఁ బతి చొక్కన్

గీ. రామచంద్రుండు సర్వమూర్ధంబు చేతు
లొత్తి చూచును బూరుషు లెత్తికొనిన
లక్ష్మణుఁడు ముక్కులును జెవుల్ తడిమిచూచు
నెవ్వరే నంగనలు దన్ను నెత్తికొనిన

ఆ. తల్లిచంకనుండి తండ్రిపై కుఱుకును
దండ్రిచంకనుండి తల్లిపైకి
నుఱుకు నంతసేపు నూగిసల్ నవ్వులు
నిదియు రామునకును నేమొ యాట

చ. నడువఁగ నేర్చి రంత లలనల్ నడిపింపఁగ రామచంద్రులున్
గడుకొని యంగనల్ కరముఁగైకొని మధ్యను బట్టువీడినన్
జడనుగ నవ్వుచున్ జని పసందుఁగ శ్రీరఘురామమూర్తి మూఁ
డడుగులు వేసి క్రిందఁబడు నట్టె త్రిలోకము లాఁచినట్టుగన్

గీ. ఎన్ని విశ్వంబులో రాఘవేశు లిండ్లు
మూఁడడుగు లెన్ని వేసిన మొగిడిరావు
ఈ జనుస్సునఁ గృచ్ఛమై యొసఁగఁబోలు
నాకపతిదైన దివ్యకార్యాచరణము

చ. తిరిగి వసంతకాల మరుదెంచె గరుత్కనకచ్ఛవిప్రభన్
గరుడి వియత్పథంబున సుఖంబుగ ఱెక్కలు సాఁచి పోయె మై
హరువునఁ బాంచజన్యములు హంసలు ముక్కులు మీఱె నందక
స్ఫురదురుకాంతిపుంజములు పుట్టె దిశాభిహతాతపంబులన్ ౩౨౨

ఉ. దారుమయాల్పఖడ్గము లుదారనవారణవర్ణరమ్యముల్
శ్రీరఘురామచంద్రునకుఁ జేతి కొసంగఁగ నాడుకో ముఖాం
భోరుహమందుఁ గోసలను బూంచుచుఁ గేళివిచిత్రఖడ్గధా
రారుచి కోఱ్ఱై వనవరాహముగా బెదరించుఁ గాంతలన్

చ. ఒకరుఁడు పూఁటచిన్న మఱియొక్కఁడు నొక్కఁడు రోజుచిన్న వా
రికిఁ దనయన్నగారగుట శ్రీరఘురామునకున్ గడిందియై
చికిలిమెఱుంగు కంకణపుఁజేతులు వారిమెడల్ తగిల్చి యూ
రక కవుఁగింటికిం దిగిచి క్రచ్చుకొనున్ దొలివృద్ధువోలికన్

ఆ. ఒక్కసారిగాఁగ నుభయసంధ్యలు దక్షి
ణోత్తరములయందు నొదిగియున్న
నీలినీడ లొప్పు నింగివోలిక నల్వు
రన్నదమ్ము లాడు నవని తోఁచు

క. నలువురకుఁ గాలిగజ్జెలు
నలువురకున్ రత్నకంకణమ్ములు మెడలన్
నలువురకుం బులిగోరులు
నలువురు నానావిభూషణజ్వలితాంగుల్

మ. జగదీశుల్ హరినీలచిక్కణమణిస్తంభంబులం జుట్టి కే
ళిగ నన్యోన్యభుజావిలగ్నకరు లోలిం జెట్టపట్టాలుగా
నగుచుంబోఁ బ్రతిబింబముల్ పొలసి యింద్రశ్రీమహావేళలన్
దిగిభక్రీడగఁ బొల్చుఁ దా రనిమిషస్త్రీలై కనం గామినుల్

శా. చూడారత్నము కాళ్ళగజ్జెలు కటీజూతిస్వనత్కింకిణుల్
వ్రీడాముగ్ధముఖారవిందము రదావిర్భూతహాసంబులున్
గ్రీడాకార్ముక మంసవీథికను వ్యాఘ్రీశ్రీనఖోద్భాసి వ
క్షోడంబాకృతి తల్లికై కరము సాఁచున్ రామచంద్రుం డొగిన్

శా. క్రీడాకార్ముక మల్లెత్రాటను భుజాకేళీవినిస్వానముల్
పేడెత్తించుచు నొక్కచేత జననీపీన స్తనం బద్ధు నా
డాడం దాఁకుచు నొక్కచ న్గుడుచుచున్ హారిప్రమోదాత్ముఁడై
గోడిన్ నిల్వఁడు కూరుచుండఁడు దరాకూతాస్య కౌసల్యకున్ ౩౨౯

క. పాల్దారివు రామచంద్రుఁడు
పాల్దారివుచు రాఘవుండు పరువెత్తు మఱిన్
పాల్దారివు వచ్చి యాతఁడు
పాల్దారివఁగఁ దల్లియెడఁద పాలకడలియగా

సీ. నా తండ్రి రామచంద్రా! నన్నుఁగన్నట్టి
బంగారుతండ్రి! నా ప్రాణపదము!
మార్తాండకులదీపమా! దిలీపరఘుది
వ్యాన్వయజలధిశీతాంశురోచి!
అజమహారాజసుప్రజ! యయోధ్యామహా
పత్తనీప్రజ కంటిపాప వెలుఁగ!
రావయ్య నాకూన! రావయ్య నాతండ్రి!
రావయ్య నాబాబు! రావె! రావె!
యని దశరథుండు పిలువఁగా హరి సమస్త
మాతఁడే యైనయట్లుగా నడుగుదమ్మి
గజ్జియలు నందియలు గల్లుగల్లు రనఁగఁ
జనును నవ్వుచుఁ జేతులు చాఁచుకొంచు

ఉ. ఇక్కడనున్న రాముఁ డిపు డిక్కడ లేఁడని యింతలోన నే
దిక్కున కేగెనో యని మతిన్ గుదుసుల్లుగ నాల్గుమూలలన్
ద్రొక్కిసలాడు తల్లికిని దోఁచును రాముఁడు వేల్పుటింటిలో
నిక్కడి విగ్రహం బచట నిక్కడ నక్కడిదిన్ గ్రహించుచున్

ఉ. ఒక్కెడ నుండవేమిర శిశూ! యది యేమిటిరయ్య! సేఁత నీ
కక్కఱలేని దంచుఁ గలదా? యొకఁడే పనియైన రాఘవా!
యక్కడఁ బోవరాదు మడిరయ్య! ప్రభూ! ప్రభురంగనాథుఁ డీ
దిక్కున నుండె నీవు నరుదెమ్మిటకున్ బసితండ్రి! వేగమే

గీ. అని పిలువఁ గేకిసలు నవ్వు లాననాంత
మధురుచులు లోచనాంతశంపావిలాస
దీధితులు గాఁగ రాముఁ డేతెంచునంత
నమ్మకును గేకిసలు నవ్వు లాస్యరుచులు

శా. తూనీఁగం బలెఁ బోయి నీళ్ళలను జిందుల్ జిమ్ముఁ జిల్కుల్ శిర
స్స్నానంబుల్ బుడిసిళ్ళగాఁ గొను రఘుస్వామిన్ విలోకించి తం
డ్రీ! నారాయణ! యేమి మీపని యటం చేఁకారి కౌసల్య ర
త్నానూనం బగు పయ్యెదన్ దుడుచు యత్నానూనసాధ్యున్ శిశున్

శా. తానో 'లాములు' తండ్రిపే రెవరయా? 'దాచాతమాలాలు' 'నా
లే! నా 'పే' రన 'నమ్మగాల'నఁగ నోలిం దల్లి 'కౌసల్య తం
డ్రీ!' నాగా ననఁబోయి రాక కనులన్ నీ ర్వెట్టఁ 'గౌసల్య నాఁ
గానే కానులె యమ్మనే 'యని ప్రభున్ గౌసల్య ముద్దాడెడిన్

ఉ. మువ్వురురాణు లొక్కొకరి ముద్దులబిడ్డలఁ జూడ నేగుచో
నవ్వుచు రాముఁడే యుఱికినన్ బినతల్లియుఁ గైక కౌఁగిటన్
గ్రువ్వకొనంగ నొక్కరొకరున్ విడనీయరు ప్రేమపట్టు తా
నెవ్వరు పిల్చినన్ బ్రభువె యేగఁడు కైకయి వద్ద నుండినన్

గీ. కాళ్లు వచ్చిన దాదిగాఁ గైకకొఱకుఁ
బరువులెత్తును శ్రీరామభద్రమూర్తి
నిద్ర మేల్కొన్నదిగ రామభద్రుకొఱకు
నంగలార్చుచుఁ జనుఁ గేకయాత్మజాత

ఉ. చేతుల రత్నముల్ మలఁచుఁ జిన్నిహారంగుల పట్టుబొందు లం
గీ తొడుగన్ గిశోరహరికిన్ గనిపించఁగరాక నీళ్ళలన్
జేతులఁ దట్టుచున్ బురదచేయును నూడఁగఁ దీయనీయఁ డో
తాత యటంచు లాలనకుఁ దార్చెడు గైకను దక్క నెవ్వరిన్

వ. శ్రీరామచంద్రుని వదలి కౌసల్య యుండలేదు; శ్రీరామభద్రుని
వదలి కైకేయి యుండలేదు; శ్రీరఘుకులరత్నమ్ము వదలి లక్ష్మణుం
డుండఁడు; రామలక్ష్మణు లున్న స్థలముననే సుమిత్రాదేవి యుండును

క. భరతుఁడును నతని వెనుజని
తిరిగెడు శత్రుఘ్నుఁ డనుమతింతురు తము మం
థర తీర్చు తీర్పులును బెఱ
పరిచారిక లరుగుదెంచి పాలించుటలున్

వ. మఱి కౌసల్యాగృహంబుల

ఉ. దాఁగుడుమూఁత లాడుదురు తానును గైకయు రామచంద్రు తె
చ్చోఁ గనిపింపకుండఁ జనుచో వెనువెంటనె పోవు లక్ష్మణుం
డాఁగఁగరాని వేగమున నందెలసవ్వడి మందగించుచున్
బోఁగల రాము కన్పడమి మూర్తము నోర్వని తల్లి కుందఁగన్

ఉ. ప్రాగుదితప్రభావమృదుభాస్వరహాసమనోజ్ఞమూర్తి య
ద్ధాగమనప్రచాలితపదద్వయనూపురకింకిణీస్వనా
భోగవిచిత్రగోపనవిముగ్ధుఁడు రాముని పోయినెల్లెడన్
శ్రీగమనక్రియాగుణవశీకృతప్రజ్వలితాంగి తోఁచెడున్

చ. తిరిగి వసంతకాల మరుదెంచె విరాజితరాజహంసముల్
గరువపుఠీవి పోయె నడకన్ గడకన్నుల కాంతులన్ వనాం
తరములు రాగరంజితపథంబులుగాఁ గలిపించెఁ గోకిలల్
మురువులుసూపె బాలవృషముల్ కనుగ్రుడ్డులు ప్రత్తికాయలై

ఉ. ప్రీతిగ దోవతిన్ మడచి పింజలువార ధరింపఁజేసి యం
గీ తొడుగన్ వలెన్ బయి లగించవలెన్ జలతారుపాగ తా
స్ఫీతవిలోచనాంతముల సేవకులన్ గను ఠీవితో దిదృ
క్షాతరళంబులా కనులఁ జాదును దమ్ముల రామచంద్రుఁడున్

గీ. నిభృతతీక్ష్ణప్రసన్నతల్ నిశ్చలతయుఁ
దనుకు శ్రీరామచంద్రుని కనులు చూడఁ
దెలియవచ్చెఁ బురాతిగ్మదీధితిప్ర
శస్తకులరాజనాకరక్షావిభూతి

సీ. తన తల్లి కందుబాటును మీఱి మేయ సా
హసముఁ జూపెడు బాలహంసవోలె
స్తన్యపానము వీడి చనువేళ నోంటి స
ల్లకితోఁటఁ జనెడు బాలకరివోలె
వేఁట నేర్పెడు తల్లి బాటఁ దొలంగి తా
నై దూఁకు బాలసింహంబు వోలె
పుష్కలావర్తకంబులఁ ద్రెంచికొని మెట్ట
పొలము లేగెడు చిన్ని మొగిలు వోలె

రామచంద్రుండు నడువగా రాఘవేశ
గృహములం బ్రతిబింబితాకృతులఁ బొలిచెఁ
బసి కకుత్స్థమాంధాతృల పసి దిలీప
రఘులశీవులు చివురుతొ రాచనడలు

క. ఒకనవ్వు నవ్వ రాముం
డొకకన్నను జెట్ట రాముఁ డొక నడ నడువన్
వికచనయనుఁడై దశరథుఁ
డకటా! యజు లుట్టిపడిర యని తను మఱచున్

చ. ఉత్తరకోసలంబులను నుత్తరశబ్దము దిక్పరంబు కా
దెత్తున కెత్తు గొప్పతనమే యని తా వినఁ బల్కు సూర్యవం
శోత్తములైన వృద్ధుల ఛలోక్తులకున్ బయిమెత్తు పుట్టె నం
చుత్తమురాలు కోసలనృపోద్భవ రామునియందఁ బల్కెడున్

గీ. తొడలపై రామచంద్రుని నిడుకొని నృపుఁ
డేడుగుఱ్ఱాల రథముపై నెల్ల పురము
నరుగఁగ ననూరుయుతబాలతరణి పోడిచె
సౌధములు క్రమ్మిన యయోధ్యవీథులందు

సీ. ఎగఁబడి శ్రీరాము నే పూఁట కా పూఁటఁ
గనకున్నఁ బ్రాణముల్ చనెడి యా య
యోధ్యాపురీప్రజ లూరేగుచున్నట్టి
రాముని గనుగొంచు భ్రాంతి పొందె
దూరానఁ జనుదెంచు శ్రీరామచంద్రుని,
జూచి పూర్వంబునఁ జూడనట్లు
దగ్గరగాఁ జన్న తరుణరాఘవమూర్తిఁ
జూచి తా మప్పుడే చూచినట్లు
దూరమై చన్న యరదంబు త్రోవఁ గాంచి
కూడి రాముని జూడనే చూడనట్లు
కనులచే వంచితులుగాఁగ గళవళింత్రు
బహువిచిత్రజీవులు రామభద్రుఁగూర్చి

చ. ధనువులు పూని భూపతిపదంబులయందు దెఱఁగంగ వచ్చు వీ
రనికరముల్ గనుంగొనుచు రాముఁడు వారల చేధనుస్సులం
గొని చిఱునవ్వులన్ ధనుసుకొప్పులు గూర్పఁగ నల్లెత్రాళ్ళు వం
చినవెస ఫెళ్ళుమంచన హసింతురు వీరులు విండ్లతోబడిన్

గీ. రాముఁ డడుగంగ ధనువు నీరాదు ధనుసు
రాముఁ డడుగంగ నీకుండరాదు పెఱధ
రాపతిభుజావిమర్దనోగ్రంబు ధనువు
విఱిగిన విదేహులైనట్లు వీరు లెంత్రు

మ. తరుణాబ్జారుణలోచనున్ బ్రభువు నంతఃపత్నిసేవకుల్
ధరణీనాథునిపుత్త్రి నెత్తుకొనఁ జిత్తంబందు వాంఛించుచుం
దురు శ్రీరాముని విప్రకన్నులను దోడ్తోఁ గాంచి యుష్ణీషముల్
చరణాబ్జంబుల నుంచి భీతిని నమస్కారంబులన్ జేయుచున్

చ. తిరిగి వసంతకాల మరుదెంచెను మాధవుఁడున్ బ్రభుత్వనై
ఖరిని వనాంతముల్ బహుముఖంబులఁ బొందఁగ స్వీయముద్ర ని
ర్భరసుమనోఽభిరాముఁ డయి రాజిలె రాజితరాజకీరముల్
పరువులు పెట్టె నాత్మభువువారువముల్ హరిదుజ్జ్వలాంగముల్

శా. ఆజానేయము నెక్కి ప్రాతరుదితాభ్యాసంబులై నిత్యమున్
శ్రీజేతృప్రథమానమూర్తి యయి రా శ్రీరామచంద్రుండు వీ
థీజాగ్రత్పురకామినీనయనదీధిత్యంశుమాలాచ్ఛటల్
రాజీవంబుల తోరణాల వరుసల్ రాజిల్లు నిర్వంకలన్

మ. వినిపించున్ బ్రతినాఁటఁ బ్రొద్దుట బహిర్వీథీపురోద్యానధా
త్రిని నభ్యాసము సేయుచో రఘుశిశుక్రీడాభుజాస్ఫాలఘ
ట్టనవిస్ఫారితశింజినీపటుధనుష్టాంకార భాంకారముల్
పునరాయాతపునఃప్రయాతఖగరాడ్భూజాగ్రఘీట్కారముల్

శా. మత్తాశ్వంబులపై మదేభములపై మన్నించి యెక్కించకుం
డెత్తుం బల్లపుఁ జోటులన్ రథము పోనీకుం డతం డెక్క జా
గ్రత్తం జూడు డటంచుఁ జెప్పెను ధరాకాంతుండు వీరాళితో
హృత్తీవ్రత్వముఁజూపు రాముఁ డవియే యెక్కంగ వాంఛించుచున్

చ. నిలువక సజ్జితం బగుచు నేలపయిన్ ఖుర నాడుచుండి గం
తు లిడుచు ముట్టెఁ గాల్నడుమ దూయుచు మానిసి నెక్కనీని ప్ర
జ్వలితహయంబు నొండు పరుషప్రతిభాఖని యొక్కఁ డెక్కలో
పల రఘురాముఁ డెక్కెను సవారును దీసె హయం బుదగ్రతన్

చ. నురుసులు గ్రక్కు కొంచును దనూరుహకూపము లెల్ల స్వేదముల్
తెరలుచు రాయిడించి తెలి తెట్టెలు గట్టుచుఁ దూఁగిపోవుచున్
మరలిన మావు రాముఁ గని మానవనాథునిబంట్లు ప్రాణముల్
తిరిగియు వచ్చె రాజునకుఁ దెల్పిరు రామునిసేఁత యొక్కరున్

సీ. మాలిమిసేఁతకు మలఁగనిదానిని
శృంఖలాబద్ధమై చెలఁగుదాని
గళమున వ్రేలాడఁగట్టిన యనుపమే
ఖలకమ్మిరాపిళ్లకును విదీర్ణ
ఘీంకారనినదభయంకర మగుదాని
వన్యగంధేభంబు వఱలఁ జూచి
రాముండు తుండంబు రాఁబట్టి కుంభస్థ
లం బెక్కి యదలించి లంకె లూడ్చి
మెడగుదె సడల్చి వెలి నాల్గుకడలు త్రోలి
కొట్టమునకు మఱల్పఁగాఁ గుతిలపడుచు
మావటీం డ్రబ్రమందరు మనుజనాథు
వలని భయమున నెదలలోఁ గళవళించి

గీ. రామచంద్రుండు వదలు నారసముతోడ
లక్ష్మణుఁడు పఱ్వఁ బెట్టును లక్ష్మణుండు
వదలు నమ్ముతోఁ బాటుగ బయలుదేరి
పరువునిడు మున్నుగా రామభద్రమూర్తి

క. రథచోదనదక్షతలోఁ
బ్రథమతకై చను పరీక్ష రాముం డొక సా
రథిగా లక్ష్మణుఁ డొక సా
రథిగా లీల యనుచు దశరథుఁ డొప్పికొనెన్ ౩౬౮

ఉ. ఒక్కఁడు బారుగాఁ గడలె నూఁగి రథాళి; రథాళి యేగుచో
నొక్కవిచిత్రవల్గనమహోద్ధతి దాశరథుల్ రథంబులన్
మిక్కిలిఁ ద్రోలి రంతన నిమేషములో మునుమున్నుగా ధరన్
జెక్కినయట్లుగాఁగఁ బఱచెన్ హయముల్ రయతీవ్రమూర్తులై

మ. అథధారాగతులై యెగుళ్లను దిగుళ్లౌ నేలపైఁ బోవుచో
రథముల్ సుంతయు గ్రుద్దుకోవు హయముల్ శ్రాంతాకృతుల్గావు నే
రథియున్ స్వీయరథంబుఁ దప్పికొనిపోరాదట్లు పోఁజాలఁడున్
బ్రథముండై ఘురాముఁడేగఁ బిఱుదన్ రాజిల్లె సౌమిత్రియున్

సీ. ఈ పసికందుల యీ పసిచేతులు
ప్రగ్రహంబుల నెట్లు పట్టఁగలిగె
నీ పసిబాలుర యీ పసిమనసులు
నశ్వంబులను నెట్టు లదుపుపెట్టె
నీ పసిపాపల యీ పసిమేనులు
వేగభారం బెట్టు లాఁగఁగలిగె
నీ చిట్టిప్రభువుల యీ చిట్టిశక్తికి
నొగి రథశిక్ష యె ట్లొదిగివచ్చె

నని భయం బందుటో లేక యచ్చెరు వందు
టో ముదం బందుటో డిందుటో తెలియక
రాజు మఱి రాజు మించిన రాజప్రజలు
నలిగిన యెడందలం దమనస్కులైరి

క. మొదలిబరువు ప్రిదులుటతో
నిది యద నని చెప్పి రశ్వవృత్తాంతంబున్
మదగజవృత్తాంతంబును
బెదరు వదలి రాజభటులు పృథివీపతికిన్

చ. నలువురు పుత్త్రులన్ ధరణినాథుఁడు తా మృగయావిహారవే
ళలఁ గొనిపోవ రాముఁడును లక్ష్మణుఁడున్ మదకుంభికుంభముల్
పులివివృతాస్యముల్ హరిసమూహసటల్ పెకలించి క్రొచ్చి యు
య్యేలలుగ నూగి కార్ముకము లెత్తరు నామిష మెత్త రుత్తముల్

సీ. చెంగలించెడు మహాసింహంబు సెలవులు
నిఱుచంక నిడువురు నిడియఁబట్టి
మెదురేగు మత్తకుంభీంద్రశుండాగ్రనా
సారంధ్రముల వ్రేళ్ళు సాఁచి చీల్చి
వెలికింతలుగఁ ద్రోఁచి పులి నొక్కఁడొక్కఁగ
గొంతుపై నొక్కఁడు గోళ్ళు ద్రుంచి
వృక్షమూలము పీటవెట్టి కూర్చుండిన
పందిముట్టియ బీటువాఱఁ బాచి
చిఱుతపులులకుఁ గన్నులు చిఱుతలువడ
మించులై వానిముందుఁ గుప్పించిమీఁకి
యల్పమృగముల నదలించి యలపుఁగొనరు
రామలక్ష్మణు లధికశౌర్యంపునిధులు

క. తనతల్లి యెత్తికొని త
న్నును ముద్దాడంగ వారునుఁ బీరును రా
ముని లోకాద్భుతకర్మలు
వినిపింపఁగ నమ్మె దెన్ని విధములచేతన్

ఉ. అట్టివ యౌనె నీదు పనులంచు వచింపఁగఁ దల్లి రాముఁడున్
వట్టివ వారిపల్కులును బాలురు లోకమునందుఁ జేతురే
యిట్టి విచిత్రవార్తలను నీ పలుకుల్ విని తల్లి నవ్వె నా
బొట్టియు నవ్వె నెల్ల ననబోడులు నవ్విరి రొక్కయుమ్మడిన్

మ. ఒక లోకాద్భుతశౌర్యవృత్తమును దా నొప్పారఁగాఁ జేసి కై
కకుఁ గాన్పించుకొనున్ రఘూద్వహుఁడు నా కైకేయి యానందబా
ష్పకదంబంబులు గద్గదస్వరములున్ సంతోషకుల్యాంతరం
గకడోలాగమనంబులున్ ముదిపముల్ గాఁ జూచుచున్ జూచు చే

ద్విపద.

నా తండ్రికిని రంగనాథుండు రక్ష
నా తల్లికిని రంగనాథుండు రక్ష
మా బాబునకు ధర్మమహిమలు రక్ష
మా బుజ్జికిని మానిమహాసులు రక్ష

దేవి కౌసల్య పాతివ్రత్యరక్ష
శ్రీవశిష్ఠుల తపస్సనఘుల్ రక్ష
దశరథేశుల పూర్వతపసులు రక్ష
ప్రశమితాఖిలదైత్యభావంబు రక్ష

క. అని దృష్టి తీసిపోసెడు
నని వీపున నేలమన్ను నద్ది చమిరెడున్
దన చంక కెత్తికొని రా
ముని కే ల్మెడఁ గ్రుచ్చి మోము మోమున నిడుచున్

సీ. ఎవరయా యా స్వాము లెవరికో యీ వంగ
డపుఁ దొలివెల్గు క్రపపునివాళి
యెవరయా యా దొర లెవరికో యాదిరా
జపవిత్రకీర్తి చొక్కపువయాళి
యెవరయా యారాజు లెవరికో నవకోస
లపృథివీలక్ష్మి బోగపుమాళి
యెవరయా యా తండ్రు లెవరికో చిన్నారి
వపువుడా ల్కేళి నీలపుదువాళి

యని కవుంగిటఁ గ్రుచ్చుకో నాస్యమందు
ముద్దులిడుకోఁ గడుపుమీఁద మూర్ధ ముంచి
కిలకిలార నవ్వించుకోఁ గేకయాత్మ
జకును దెంపును దెలుపియు జాగు లేవు

చ. ఉరువడి వృద్ధదాసి కనుచుండిన నూరక పల్కరించు; మం
థర కనఘుండఁ జూచి రఘునాథునిఁ గైకయి ముద్దులాడు; సి
గ్గరి పినతల్లిఁ జూచుటకుఁగా నటు లిట్టటుఁ జూచి పోవు మం
థర కనుచుండెనేని రఘునాథుఁడు కోపములోని నవ్వులన్

గీ. దొంగగాఁ బోయి రామచంద్రుఁడు సుమిత్ర
కనులు చేరల చేతులఁ గప్పుచుండు
నెదురుగా నిల్చి లక్ష్మణుఁ డెగచినవ్వఁ
దిగిచి క్రువ్వఁ గవుంగిట దేవి సుతుల

చ. తన తోడ లెక్కి యాడెడు సుతద్వయ మొక్క విచిత్రకంఠహా
రనిభృతరత్ననీలమణిరాజితపార్శ్వము లట్లు కుండల
ప్రణిహితరత్ననీలమణిరాజితకాంతులునా నెసంగఁ జూ
చిన కనులన్ సుమిత్ర యెద చిమ్మనగ్రోవులఁ ద్రిమ్మరించెడున్

చ. తిరిగి వసంతకాల మరుదెంచె వినూత్నశిఖిప్రభాశిఖా
హారణముపోలె నొప్పెఁ జివురాకుల తుట్టతుదల్ జగాజిగుల్
రురువులు లేఁతపచ్చికలు రోసెను సాగెను చాగచెట్టు గం
బుర లుమిసెన్ వనీశిలలు మోసిన కస్తురిలేళ్ళ పక్కముల్

సీ. చికిలిచుక్కలుగ నారికెడంబె పూచెనా?
చిన్నారిమావి పూచినది తాను
సాలంకలుగఁ బారిజాతమే పూచెనా?
చిరునుల్లెతీవ పూచినది తాను
నింతలింతలు నింబవృక్షమే పూచెనా?
సిరిసన్నజాజి పూచినది తాను
పైడిగంటలు మెట్టప్రబ్బలే పూచెనా?
చిన్నిగన్నేరు పూచినది తాను

నల్లవిసెమొక్కయే పూచెనా? మనోజ్ఞ
ముగ్ధమధురోచిఁగల్హారములును బూచెఁ
దాను మాధవుఁ డరుదెంచు దారి యెల్ల
నవవికాసంబు జంటజంటలుగఁ బొలిచె

శా. తేజస్కాములకున్ వశిష్ఠు లుపనీతిన్ గామ్యసావిత్రి సు
శ్రీజాగ్రన్మతిశుద్ధి కల్గ నుపదేశించెన్ ద్రిపర్యాయసం
ధ్యాజీవాతుమనోనిధానములు ప్రాణాయామపారీణతా
భ్రాజిష్ణుల్ శిశువుల్ సెలంగి రచలాంభఃపుండరీకాక్షులై

చ. రఘుపతియిండ్ల నుత్సవపరంపర సాగెను లేశలేశమై
యఘము లసల్ పిసళ్ళఁ బరమాణువు లౌచు మొదళ్ళు క్రుంగ బా
లఘనమనోజ్ఞవక్త్రచపలాభ్రభువు రాముని గాంచి జల్లుగా
మఘవునికోర్కు లొప్పె మహిమండలభావగతుల్ సమార్ద్రమై

సీ. నడినెత్తి నాఁబసియడుగుజుత్తులు చాగ
నార మేఖలలతో నల్లయవిసె
నార మాంజిష్ఠవర్ణపుఁదుండ్ల చిఱుగూడ
కట్లతో రురుచర్మకలితమయిన
యుత్తరీయములతో యూపవక్రము లపీ
డితములు బెరడుతోడివి లలాట
పర్యంతము లగు నాశ్వత్థదండములతోఁ
గనులకాటుకలతోఁ గొంకుమోర్ధ్వ
తిలకములతోడఁ జిఱుబుగ్గల నవాంజ
నాంకములతోడ స్నిగ్ధపాదాంబుజముల
పసపుపారాణి నొప్పిరి వటువు లంత
వనజభవు పూర్వరంగసాధనము లట్లు

క. ముదితుండై 'భిక్షాం భవ
తి దేహి' యని తల్లి నడిగె దేవుఁడు రాముం
డు దయాస్రోతసి 'త్వం చ మ
మ దేహి' యని తల్లి రాము మఱి ముద్దాడెన్

క. రామునకుఁ దల్లి యిచ్చెను
హేమాభరణములు భిక్ష మిందునవకళా
శ్రీమన్మణిసంతతియును
ప్రేమవిభవభాగపాంగవీక్షాంశువులున్

క. క్రమముగ మ్రొక్కిన మువ్వురు
కుమారులకు వటువులకును గోసలసుత యి
చ్చె మురిపెములు ముద్దులు హే
మమహాభూషణవితానమణిపుంజములున్

క. క్రమమున మ్రొక్కిరి నలువురు
సుమిత్రకును రాజసుతులు సుదతీమణి మీ
రమరాయువులును బటుదో
రమందదర్పు లగుఁడంచు నాశీస్సిచ్చెన్

క. నవధర్మపరాయణుఁడై
భువి నేలు మటంచు రాము మొగి దీవించెన్
కవ శత్రుఘ్నుఁడు పుట్టుకఁ
గవ రాముఁడు జీవితమునఁ గమ్మనికొడుకున్

క. రాముఁడు ప్రమొక్కెను గైకకుఁ
బ్రేమోల్బణమోద బాష్పవీచీధారా
గ్రామితదృగ్రేఖకు ధీ
రామోదప్రవిచలాంతరామోఘుకుఁ దాన్

ఆ. కేకయాత్మజాత కేశవునకు భిక్ష
పెట్టె మణులు కుట్టి పట్టుదట్టి
పిడిని మరకతమ్ము తొడిగిన చురకత్తి
వజ్రపుంఖితమ్ము వాలుటమ్ము

చ. మొగమున నింతయై మురిసిపోయెను రాముఁడు కైక కన్నులం
దిగము మటింత యింత యయి యెల్లలువాటెఁ దదంతరంతర
స్థగితరఘూద్వహప్రవిలసచ్ఛిశుమూర్తి మటింత యింతయై
జగములు పట్టరాని యొక సాహసదీర్ఘతనుత్వ మొప్పఁగన్

శా. తత్రత్యుల్ ఋషులెల్ల స్వీయమహిమల్ దాకొల్ప రాముండు గా
యత్రిన్ దా నధికారియై గురుని పాదాబ్జంబునంగుష్ఠమున్
ఛాత్రుండై మృదుపాణిపీడనమునన్ సంవాహనం బొప్పఁ దా
నై 'త్ర్యయ్యర్థ మధీహి భో' యనుచు సంప్రార్థించె నేకాగ్రతన్

చ. గురువులలో గురుండు తనకుం గురు వౌటయె భాగ్యమో? నిరం
తరము సనాతనంబయిన తత్త్వము తా నగుటే విచిత్రమో?
గురువు వచించు విద్య తన కూడు విచిత్రమహావచోమయ
స్ఫురణమో? శబ్దమిట్లె శ్రుతిఁ బొందిన రాముఁ డెఱుంగు సర్వమున్

గీ. పలుకుతోఁ దోఁచు శిక్షయు వ్యాకరణము
స్వరములోఁ దోఁచు నర్థప్రసన్నరీతి
గమనమే చెప్పు ఛందఃప్రకార మెల్ల
నల ప్రకాశించు నెల్లశాస్త్రార్థచయము

3—2

గీ. ప్రత్యహమ్ము నగ్నీంధనభైక్షచరణ
ములును నధ్యయనంబును దొలఁగఁబెట్ట
స్మృత్యుదితమైన బ్రహ్మచారివిధు లెల్ల
స్వామియందున వాచ్యదోషంబు లయ్యె

మ. చకితాక్షుండయి రాముఁ డశ్వగజశిక్షాశాస్త్రమర్మాదు లూ
రక బోధింప గురుండు శ్రద్ధమెయి నేర్వం జూచుచున్నట్లుగా
మొకముం బెట్టు ధనుర్విచిత్రకలనంబుల్ శబ్దవేధుల్ విము
క్తకలంబంబులు సర్వమున్ దెలిసి చక్కన్ నేర్పుచున్నట్లుగాన్

మ. ఒకశాస్త్రంబున మర్మమంత మును దా నూహించెనో లేదో దే
శికుఁ డా యింత వచింప రాముని కదెన్ జిత్తంబునన్ బూర్వకా
లికమై యొప్పును బ్రాప్తకాలమున నోలిన్ వృక్షముల్ వోలెఁ దా
వికిఁ బర్యంతముగాఁగ రాము నెదఁ బుష్పించున్ గళామర్మముల్

శా. మత్తేభంబులు రామచంద్రవదనాధ్మాతంబులై వచ్చు ను
ద్వృత్తధ్వానము లాలకించి బెదరున్ శ్రీరామచంద్రాననో
ద్వృత్తారుణ్యవినూత్నగీతికలచే నాకృష్టమై వచ్చు లీ
లాత్తశ్రీరఘునాథవంశశిశుదివ్యధ్యానశిష్యాకృతుల్

మ. నిభృతాశ్వంబులు రామచంద్రమృదుపాణిస్పర్శచే వేగవ
ల్లభముల్ నాడులఁ జక్కిలంతలయి హేలావాయువీచీప్రచా
రభృశప్రోద్గమనంబులన్ జనెడు ధారారేచితస్కందిత
ప్రభుసర్వాంగవిచిత్రరేఖలు సముద్రశ్రీశుభాకారముల్

మ. కనదక్షిప్రవిభాస్వరుండు నొగ లెక్కన్ డెక్కపైఁ గాలువె
ట్టినఁ జాలున్ రఘుమూర్తి రథ్యఖురధాటీఘట్టనోద్వేగకు
ట్టనధాత్రీవిలుఠత్పరాగసురఘంటామార్గముల్ గాఁగఁ బో
వును గాకుత్స్థరథంబులన్ సురలమావుల్ లజ్జచేఁ గుందఁగన్

మ. పదులున్ ముప్పదులున్ శతంబులును వేల్ బాణంబు లెంతెంతలో
నొదుగున్ ముష్టికి నెంతలోనఁ జనెడున్ వ్యూహంబు లింతింతలో
నది పన్నించును మార్చు నింకొకఁడుగా నగ్రేసరుం డౌచు నే
పదమున్ దానయి కానవచ్చుఁ బృతనాభాగంబులం దెల్లెడన్ ౪౦౨

మ. కడునేర్చెన్ రఘురామమూర్తి పటుఖడ్గక్రీడఁ గారించుటల్
పిడియున్ శత్రుకరాసులన్ బిడులచేఁ బీకించి వాటొడ్డుటల్
నడుమన్ శత్రుకరాసులన్ నఱకుటల్ నర్తించుటల్; చూపి యొ
క్కెడ నింకొక్కెడఁ గొట్టుటల్ పొడుచుటల్ కేడించుటల్ రాచుటల్

మ. పరశుప్రోజ్జ్వలభిండివాలపరిఘప్రాసాసిసందీప్తతో
మరముఖ్యాయుధసంప్రయోగమున సామర్థ్యంబు సాన్వర్త ము
ద్ధురుఁడై నేర్చెను రామచంద్రుఁడు మృగేంద్రంబు బోలె గర్జించినన్
కరిసంఘంబులు మొగ్గతిల్లఁబడు సంఘంబుల్ విదీర్ణంబులై

శా. ప్రీతిన్ రాముఁడు నేర్చినన్నియును నేర్చెన్ లక్ష్మణుం డాత్తబా
హాతీవ్రత్వము సూపువేళ నధికుం డాతండొ యీతండొగా
నేతృత్వంబునఁ దత్ప్రయోగముల శాంతిం బొల్చు నాకారమున్
జేతం బొప్పును రామచంద్రునకు; విక్షేపంబు సౌమిత్రికిన్

మ. తొడుగన్ వేయఁగఁ దీయఁగా భరతశత్రుఘ్నుల్ సమస్తంబునన్
వడితో నేర్చిరి రామలక్ష్మణులత్రోవన్ గించిదూనంబుగా
నడిసంద్రంబులు నాల్గుగాఁ బ్రళయగంధాంభోదముల్ నాల్గుగా
విడివడ్డన్ రఘుబాలకుల్ నిలువ రే వీటన్ మహాశూరులున్

మ. తమరై రాఘవు లర్థశాస్త్రమును వార్తాశాస్త్రమున్ నేర్చి గౌ
తమముఖ్యర్షికృతస్మృతిప్రవిలసద్ధర్మంబులన్ నేర్చి రు
త్తమధీమంతులు కామసూత్రముల తాత్పర్యార్థముల్ నేర్చి సా
ధుమతుల్ పాఠము సేసినా రుపనిషత్తుల్ బ్రహ్మసూత్రిష్యులై

మ. తమపూర్వుల్ రఘువంశరాజులచరిత్రల్ చిత్రముల్ వ్రాసి చి
త్తములన్ బొంగుదు రా నృపాత్మజులు ముత్తాతన్ దిలీపున్ వశి
ష్ఠమునీంద్రాశ్రమధేనుపాలనపు నిష్ఠన్ గొల్లవేషంబుతోఁ
దమితో నిందుమతీసమేతు నజునిన్ దాతన్ ద్రివేణీగతున్

మ. రయధీశాలి రఘూద్వహుండు మతిధారావేగసంసారి శు
క్లయజుస్సుల్ పఠియించుచుండి జనకక్ష్మానాథు నాస్థానమం
దయి సౌర్యుండగు యాజ్ఞవల్క్యకృతవాదాశ్చర్యముల్ భావనా
మయతం జూచుచు నందె యున్నటుల సంభావించుఁ జేతోగతిన్

మ. మనసై రాముఁడు మైథిలేయపరిషన్మధ్యంబునన్ యాజ్ఞవ
ల్క్యుని వాదాద్భుతమట్టియద్భుతము నాలోచించుఁ జేయంగఁ జే
సినచో నట్టిది మైథిలేయసభలోఁ జేయన్; లెన్ వేదముల్
వినుతించున్ మిథిలాసభాగతమహావృత్తాంత మంచెంచుచున్

మ. ఘనులై వారొకవిద్య నేర్చి మఱియొక్కం డేమొ నేర్వంగలే
దని చెప్పంగను నౌనె? యా వయసునం దాలాట్ప్రజ్ఞల్ గడిం
పను వీలౌనె యనంగ వీలగునె? సర్వజ్ఞంబునన్ సర్వకా
రణమౌ వెల్గును దేశకాలములు కార్యంబుల్ ప్రతారించునే?

మ. పదిరెండేడులు వచ్చినన్ రఘుసుతుల్ ప్రౌఢోగ్రదోర్దండులై
మదనాగాకృతులై మహాంసులయి శుంభజ్జృంభితోరస్కులై
యుదితోదగ్రమృగేంద్రమధ్యులయి రంభోరుప్రభావంతులై
సదయుల్ శౌర్యనిధుల్ వినూత్నరఘువంశస్వాములై యొప్పఁగన్

మ. పదిరెండేడులు సాఁగినన్ రఘుశిశుల్ ప్రారంభసౌముఖ్యస
మ్ముదితోత్సాహపరంపరాపరిణతంబుల్ తేజముల్ ప్రోవులై
యొదుగంబేర్చిన మేనులన్ శిశిరవాయుప్రోన్నమన్నూతనాం
బుదముగ్ధాకృతులై చరించి రమృతంబుల్ దృష్టి వర్షించుచున్

మ. పదిరెండేడులు నిండినన్ రఘుసుతుల్ పర్వేందుబింబాననుల్
మదకుంభీనసరోషు లుజ్జ్వలితసింహప్రోజ్జ్వలుల్ పోయి నా
ల్గుదెసల్ రాజులనుండి కప్పములు గైకోసాగి రాశాంతవ
ల్గదుదాత్తరథస్వనంబులు పతాకల్ భీతిఁ గల్పింపఁగన్

మ. చెలువుల్ చెల్మలు నుబ్బగా మఱల వచ్చెంబో వసంతంబు క్రొం
జిలుముల్ చెల్మలఁ బండఁగా మఱలఁ దెచ్చెంబో వసంతంబు పి
చ్చిలముల్ తేనెలు కాల్వలై సొగసు హెచ్చెంబో వసంతంబు వె
న్నెల పండ్రెండగు రేకలన్ దగె హిమానీకాంతిబింబంబునన్

మ. కదలంగా మధుమాససన్నిహితశుక్లద్వాదశీచంద్రుఁడున్
జదలం జల్లనివెల్గులన్ మెదపె దోషాహారిదీప్తిన్ దటా
కదళత్కైరవవల్లరిన్ వెలలు మొగ్గన్ భావిసంపర్కసూ
చిదరస్పృక్కిరణోల్బణత్వవిభవశ్రీస్నిగ్ధముగ్ధాకృతిన్ ౪౧౬

మ. తలిరుంబ్రాయపు రాచవాండ్రు కృతగోదానవ్రతుల్ పంచచూ
డులు వాగ్బాహుపిచండసంయుతులు వ్యాటోపుల్ బహిస్సంధ్యలున్
దళితాశీవిషభుక్శిఖండసదుపానచ్ఛత్రులున్ ఛాత్రతా
కలనాతుష్టవశిష్ఠులున్ రఘుధరాకాంతార్భకుల్ పొల్చుచున్

మ. పటుబాహాపటుమూర్తి స్వామి ధనురభ్యాసంబు నిత్యంబు సే
యుటయున్ గైకయివచ్చి చూచుటయు 'నోహోతండ్రి! యాబాణమి
ట్టటు నట్టట్లని' చిత్రమార్గములు లక్ష్యంబుల్ విదారింపఁ జె
ప్పుట చేయించుటయుఙ్ ముదంపడుటయుఙ్ బొల్చెఙ్ వనీవీథికఙ్

మ. తన విల్లేగతిఁ బట్ట నమ్ము నెటు సంధానింపఁ గైకేయిశా
సనమే శాసన మా ప్రభూత్తమునకుఙ్ జక్కంగఁ గైకేయి 'విం
టిని నీ ప్రక్కఁగ నమ్మిటుల్ వదలుకొంటేఁ దాఁకు నం'దంచుఁ జె
ప్పును లక్ష్యంబును దాఁకు రాముఁడును నవ్వున్ నవ్వుఁ గైకేయియున్

మ. ఎలమిన్ దా నిది వేళపాళ యని లేదెల్లప్పుడున్ రామచం
ద్రులు తానున్ దన కార్ముకంబు వడిఁ జేరున్ గైకయీసౌధభూ
ములఁ దత్సౌధస్థాపవృక్షనివహంబుల్ లక్ష్యముల్ దూయు లో
పల రా మంథర పోవ మంథర భయభ్రాంతిన్ సివాలాడఁగన్

శా. తా హాస్యాద్భుతశీలి రాముఁడు పృషత్కంబుల్ ప్రయోగించుచో
హాహాకారము లేచు మంథరను రాయన్ బాయఁగా నేయుఁ ద
ద్ధాహాకారము లెంతగా బలియునో హాస్యంబుఁ దానంతగా
బాహాస్ఫాలనమూర్తి చేయు రఘురాడ్బాలుండు గగ్గోలుగాన్

సీ. డొక్కబుఱ్ఱవిధాన డోకుడుజుత్తుతో
డొల్లగుమ్మడివోలె డొల్లుకొంచు
గూనుతో మఱుగుజ్జు గునగునఁ బరువెత్తు
రాముండు నవ్వి పరాక్రమించుఁ
ద్రొక్కటపడి కైకతోఁ జెప్పికొను బోయి
మంథర రఘురాము మక్కళింపుఁ
గైకేయి నవ్వుఁ జిక్కని చొక్కపున్నవ్వు
మంథర కోపించు మాఁగి మాఁగి ౮౨౨

యొక్క నీయందె పరిహాస ముజ్జ్వలించు
రామభద్రుఁ డెంతటి తపోరాశి వంచు
నవ్వు కానట్లు మఱియును నవ్వినట్లు
చంచలించును జేతు లాడించి కైక

మ. సుడియన్ బ్రత్యణువున్ బ్రవేగధుర మాంచుం బంచకల్యాణి సా
వడిలో నూరక కట్టివేసిన నసృగ్బాధోల్బణంబైన కై
వడి నిల్పోపక రామభద్రుఁడు ధనుర్వైదగ్ధ్యసాఫల్య మే
ర్పడు మార్గంబుల కోసమై వెదకు సౌత్రశ్రీ లహో లిప్తలన్. ౪౨౩

ఖండాంతము

గీ. శివ! భవన్మూర్తి పుల్కలై చెలఁగుగాత
మిద్ది యవతారఖండంబు నెద్ది వినను
మనసుపడియెను దాఁ జంద్రమౌళినృపతి
నా వలన సత్యకవివిశ్వనాథు వలన

చ. అరయఁగ నూహశక్తి తనయంతన తాను ఘటిల్లునో పురా
భరిత మనంతసంస్కృతిశుభంబునఁ జేకుఱుఁగాక యట్లు చే
కుఱిన శుభంబుతోడ నొనగూడిన పూర్వపుఁబున్నె మాదుకో
స్ఫురణ ఘటిల్లుఁ బావనవిశుద్ధము త్వద్గతభావ మాత్మభూ!

పంచచామరము.

శిరస్సురావళీసరిచ్ఛుచిస్థితిప్రశీతలా!
ధురాధరద్వియద్ధరిద్విధుస్థిరారసాతలా!
యురుప్రశాంతిమూలకంద! యోగిహృత్పరాయణా!
విరావసర్వలోకతుంద! శ్వేతపర్వతాయణా!



# అహల్యా ఖండము

క. శ్రీకార్తికేవినూత్నను
మాకారక బాలచంద్రమఃకోటీరా!
యేకాంత భావ రేఖా
శ్రీకోమల యోగిసాధుహృదయకుటీరా!

గీ. అర్ఘ్య మర్ఘ్య మర్ఘ్యమ్ము పాద్యమ్ము పాద్య
మవనిపతిఁ జెప్పఁబంపుఁడీ! యవనిపతికిఁ
జెప్పఁబంపుఁడి! ప్రభువు వశిష్ఠమునికిఁ
దెలియవలయు బ్రహ్మర్షికిఁ దెలియవలయు

సీ. కక్ష్యాంతరములఁ జక్కఁగఁ ద్రోవ వదలుఁడా!
ద్వారపాలకుల మొత్తములవారు
ఇరువంకలను బరాబరులుగా నిలువుఁడా!
చాలులై వెండిబెత్తాలవారు
రహిని గర్పూరనీరాజనం బెత్తుఁడా!
కంకణా లులియ హెగ్గళ్ళవారు
వింజామరమ్ములు వీవుఁడా! వినయమ్ము
కందళింపఁగఁ గంచుకాలవారు
ఎవరయా? ప్రతీహారు లా యెవరో గాని
యవనినాథునకును గబు రందవలయు
నింక నిచ్చటనే యుండిరేమి మీరు?
రాజఋషి బ్రహ్మఋషి గాధిరాజసుతులు

శా. అంతర్వంశికు లిట్లుగా గుడుసులై యంతంతఁ ద్రొక్కుళ్ళుగా
నింతంతం జని సౌవిదల్లకజనుల్ హెగ్గళ్ళు దౌవారికుల్
బంతుల్ దీరిచి కొల్వఁగాఁ బనిచి భూపాలుఁ బ్రబోధింపఁగా
సంతఃపత్తన మేగి తెల్పఁగ నృపుం డావిర్భవద్భక్తియై

వ. ఒక్కనిమేషంబులోన జాబాలి కశ్యప సుయజ్ఞ వశిష్ఠు లరుగుదేర
దశరథుండు సపురోధసుఁడై విశ్వామిత్రున కెదురుపోయి

ఉ. దూరమునుండియే నగవుతో వినయంబును భక్తి తోఁచఁగా
దోరపుఁగంపమై యొసఁగు దోసిలితో సవిధంబుఁ జేరి గం
భీరతయుఁ బ్రసన్నతయు మించిన మౌనిమొగంబుఁ గాంచుచున్
ధారణినేతయున్ విధివిధానముగా నిడె నర్ఘ్యపాద్యముల్

ఆ. అంత బయలుదేరె వింతగా వందిమా
గధకులంబు సుముఖాళి నుండి
సంయమీడ్వశిష్ఠసంయతసంయుగా
హంయమునితపశ్శుభంయునుతులు

ఉ. నీ ఫణితుల్ విచిత్రములు నీయెదమెత్తన వేఱయా! శున
శ్శేఫుని ప్రాణరక్షణము చేసిన చేఁతయె చేత విఘ్నవే
ళాఘడితీవ్రవేగజటిలత్వదుదారవచస్సు దుష్టధీ
శోషముఁ దీయు లేపనముసూ! బలసూదనసంస్తుతాకృతీ!

ఉ. మాసరమైన వేలుపుల మత్సరబుద్ధి యదెంత బుద్ధి? శీ
ర్షాసననిత్యయోగికిఁ ద్రిశంకున కింకొక వేల్పువీడు సీ
కోసలుదేరు కన్నుఁగవఁ గూడిన జాలియె మూర్తికట్టె నా
యాసముకాక యేల నెదురైరో జగమ్మున నీకు నెవ్వరేన్

వ. అని పొగడుచున్న మాగధులను సమందహాసశిరశ్చాలనమ్మున
వారించి రాజు ననామయం బడిగి రాష్ట్రకోశసుహృద్బంధుల
యందలి కుశలం బడిగి వశిష్ఠుల వంకఁ జూచిన

క. జ్యోతిర్గర్భములై తగు
నా తబిసుల కన్నుగవలు నాశ్లేషసప
ర్యాతరళాంశువులై శివ
తాతిస్ఫోరకము లయ్యె దర్శనపథముల్

వ. అంత విశ్వామిత్రుండు తక్కినఋషులను యథోచితంబుగ మన్నించి
యందఱను గలసి మందమందగమనంబుల రాజగృహంబులు
చొచ్చి యం దుపవిష్టులైన ౧౨

క. ముని రాజుఁ గాంచి నీచే
ననుష్ఠితం బగుఁగదా మహామతి! దైవం
బును మానుషంబు నయి పొ
ల్చిన కర్మంబనుచు నవ్వ క్షితిపతి యనియెన్

క. మానుషకర్మము మానఁగ
మానవదేహంబు చెడెనె? మానికులపతీ!
పూని యిఁక దైవికం బనఁ
గా నీ వచ్చుట కడింది కాదటవె ప్రభూ!

ఉ. అచ్ఛపుజాలిగుండె మొదలైన మహావిభవాచ్ఛమూర్తి నీ
వచ్చుట యూషరావనికి వర్షము వచ్చుట; పుట్టుపేదకున్
గ్రొచ్చిన కొండ్రలోన నిధి కొఱ్ఱునఁ దాఁకుట; లుప్తబీజమై
లొచ్చునఁబడ్డ వంగడములో నిసు వొక్కఁడు తోఁచుటో ప్రభూ!

ఉ. ఈ జగమం దుదాహరణకేనియు నిన్ను వినా ఘటిల్లునే?
రాజఋషిత్వమున్ వదలి బ్రహ్మఋషిత్వముఁ గొన్న దీప్రమా
తేజపుఁబ్రోవు నీ యనుమతిం బడి యద్భుతముల్ ఘటిల్లెఁ జే
తోజితవేధ! నా గడపఁ ద్రొక్కినదే పదివేలయా జటీ!

శా. నీవై సేరుట నా గృహంబులు త్రివేణీసంగమస్నానపు
ణ్యావిర్భావము గల్గె నాయెడల గాయత్రీమహాదేవి శ్రీ
సావిత్ర్యాకృతి ద్రష్టృభేదముగ సాక్షాత్కార మిప్పించె నే
లా వేదమ్ములు నాల్గు నాలుగు మొగాలం బాడిన ట్లయ్యెడిన్

ఉ. ఉంఛఋతాధ్వజీవనుల కో ప్రభు! మీకును గాని కల్గునా
వాంఛలటంచుఁ గల్గినను వాంఛలు గల్గకమున్న వేచి శ్రీ
లాంఛను లాదితేయు లవిలంబనులై సమకూర్తు రెవ్విధిన్
సంఛితవాంఛు లియ్యెడకు సాఁగుట మా రఘువంశపుణ్యముల్

క. ఊరకయ వచ్చియుంటిరు
కోరిక యొక్కండు నన్నుఁ గోరుఁడు నేనుం
దీరిచెద జన్మసఫలతఁ
గూరుచుకొన వచ్చినందుకున్ దీర్ఘమతుల్

క. ఇది యడుగవచ్చుఁ గాదని
మది నెంచకుఁ జేదిదైన మామకపుణ్యా
స్పదము హఠాత్స్ఫురితము నీ
వదనంబుననుండి రానె వలయును స్వామీ!

ఆ. ఆర్చువాఁడ వీవ తీర్చువాఁడవు నీవ
నేను దీర్తు ననుట నీదు కరుణ
సర్వకర్తృకత్వసంపన్నిధాన మం
చెఱుకఁ గలిగియుండుటే కదయ్య!

వ. అనుచున్న రాజుమాటలకు విశ్వామిత్రుండు సంతోషము పట్టరాక

క. రఘుకులమర్యాదార్హ్యాము
నఘావదారణము నైనయటు లాడితి నీ
మఘవజ్జగదవనకళాఽ
జఘన్యతకు నీ యుదాత్తసంపదకుఁ దగుఁ

సీ. పాప మెన్నేండ్లకో పడయఁజాలవు సంతు
తుదకేమొ రత్నపుఁదునుక కలిగె
నే మునియాశ్రమ మ్మేగిన నీకుమా
రుని గూర్చియే చెప్పికొనుచునుంద్రు
పసివాని బాగడుట పాటిగా దైనను
నింతని నీభాగ్య మెట్లు చెప్ప
నా పనిఁ జెప్పెద నాపైని ముందు నీ
సుతు రామభద్రుని జూడవలయుఁ
గబురుపంపు మనంగ భూకాంతుఁ డంత
రామభద్రుని బిలిపించె రామభద్రుఁ
డరుగుదెంచెను లక్ష్మణుం డరుగుదెంచె
నతని వెంబడి వినయుంబు లతిశయిల్ల

ఉ. ఓయి రఘుప్రవృద్ధనయనోజ్జ్వలశీతమయూఖ! వారు గా
థేయులునూ! వశిష్ఠులకుఁ దీటగు తేజపుఁబ్రోవు తత్పదా
బ్జాయతవందనంబుఫల మన్నది రెండవ స్వర్గసృష్టి దీ
ర్ఘాయతమంత్రలబ్ధవరుణాచ్ఛకృపావినికృత్తమృత్యువున్

వ. అని తండ్రి పలుక రామలక్ష్మణు లిరువురును గాధేయపాదాభి
వందనం బాచరించిన

క. రాముఁడు నమస్కరించుచు
నా మునిపాదములు తాఁకినంతటన తనూ
రోమాంఛువు లానంద
శ్రీమత్పులకాంబుభంగధృతి ముని పొంగెన్

సీ. గాధేయుచూపులు కమలపత్రాభిరా
మములైన రామునేత్రములఁ గలియు
గాధేయుకన్నులు కదలి వశిష్ఠుల
స్తిమితనేత్రములను జేరఁబోవు
గాధేయుచూపులు కమనీయరామ మే
ఘమును మేన శంపాభకాంతు లొలయు
గాధేయుకన్నులు కదలి వశిష్ఠ శం
పాలోచనైక్యభావంబు నందు
రామచంద్రుని మధురదర్శనములోన
నిరువురు మునీంద్రులును బ్రహ్మఋషిత గాధి
సుతునకు వశిష్ఠు లిచ్చిన శుభసమయము
నందుఁగన్నను నధికసౌహార్దులైరి

క.ముని దృష్టి లోన మలఁచుచు
మనుజేశ్వరుఁ గని వశిష్ఠమౌనిం గని త
క్కినవారింగని యొకక్రొ
త్తనవ్వు నవ్వు చిటులనియె ధాత్రీపతితోన్

మ. ఎవరయ్యా! రఘురామచంద్రులకుఁ గానీ యస్త్రవిద్యాగురుల్
నవబాహాపటుదీర్ఘదండునకు నీ నా వద్ద శిష్యత్వ మొ
ప్పవలెన్ శ్రీరఘురామబాహుపటిమల్ ప్రాశస్త్య మందన్ వలెన్
వివృతంబుల్ మునికోటియజ్ఞతతి నిర్విఘ్నత్వ మొప్పన్ వలెన్ 30

చ. మొనసి భృశాశ్వదత్తములు మూల్గుచునున్నవి నాకడన్ మహా
స్త్రనిభృతవిద్య లల్లై రఘురామునకై యవి యెల్ల నిచ్చెదన్
మనుజమహేంద్ర! పంపుము కుమారుని నా వెనువెంట; నూరకే
యనలము దాచుకొన్న ఫలమా? క్రతుయోగ్యము కావలెంజుమీ!

ఉ. చిత్తము చిత్తమంచు నృపశేఖరుఁ డానమదాస్యహాసుఁడై
యొత్తిగిలెన్ నిషణ్ణతను; నొత్తిడిఁ జేసెను మౌని; రాజు లో
నుత్తలమందుచున్ బ్రభు! ప్రభూ! బ్రతుకంతయు వాచి కన్న యీ
పొత్తులబిడ్డఁ బాయ నిలుపోపనయా! నిముసంబునేనియున్

ఉ. రాముఁడు నాకు స్నానమగు రాముఁడు నాకు జపంబు ధ్యానమున్
రాముఁడె యెల్ల నా బ్రతుకు రాముఁడు నన్నును గన్నతండ్రి యీ
రామువినా నిమేష మవురా మనఁజాలను గాదయేని నీ
రాముని వీడి యీ యఖిలరాజ్యము గాధిసుతా! గ్రహింపవే!

మ. వసుధేశుం డిటులన్నయంతటన విశ్వామిత్రు నాస్యోద్గతం
బసకృద్ధాసము చిళ్ళచిళ్ళలయి రాజాంతఃపురం బంతటన్
ముసరెన్ మౌనియు నిట్లు చెప్పె బళిరా! భూపాల! నీ వేదియై
న సరే యింతకుమున్న యిత్తునని యన్నావే కదా! దాతవై

క. నీ కొడుకును గైకొని చని
మా కాకలి యంచుఁ దిందుమా? పిచ్చినృపా!
మాకడఁ బ్రశస్త మస్త్ర
వ్యాకృతి కల దద్ది నేర్పి పంపెద మింతే!

ఉ. ఇమ్మగు విద్యనేర్పెదము నింకను నా కొక చిన్నమెత్తు కా
ర్యమ్మును జేసిపెట్టవలె నాపయిఁ బూవులలోనఁ బెట్టి కై
కొమ్మని నీ కుమారుఁ డిడుగో నని నీక యొసంగువార మా
పిమ్మట నీవుగా నతని వీడవలెన్ మఱి మాకు నేటికిన్

ఉ. నీచులు దైత్యజంతువు లనేకులు కారు మఱిన్ సుబాహుమా
రీచు లటంచు నిద్దఱు నసృక్పిశితంబుల నింపి యజ్ఞకా
ర్యాచరణంబు బద్ధమతులై సవవేదికఁ బాడుచేసి క
ట్టా! చెడఁజూతు రుగ్రవికటప్రకటావిలచిత్తవృత్తులై

ఆ. ఒక్కసిద్ధిఁ గోరి యొగి నెన్నిసార్లు నే
మొదలుపెట్టినాఁడ నది సవంబు
నెన్నిసార్లు వార లెరియించిరి సవంబుఁ
దుదకు విసుగుపుట్టి వదలినాఁడ

క. ఆదేశమ్మే వదలితి
నా దైత్యులు వీర్యవంతు లద్భుతశక్తుల్
కాదని శపింతు నన్నన్
గా దా జన్మంబు కోపకలుషిత మగుటల్

క. అమరఁగ నదిగాకయుఁ గో
పము వచ్చుట లేదు తొంటివలె నాకు నృపా!
కమలప్రసూకుమారుఁడు
ప్రమాణము వశిష్ఠమౌని వాక్కునయందున్

ఉ. ఈ జులపాలజుత్తుగల యీపసిబాలుని నే నెఱుంగుదున్
రాజ! యొసంగఁగావలయు రాముని నాకయి దైత్యలోకప్రా
ణాజిరబద్ధపీఠుఁ డయినట్టి యముం డితఁ డా దితిప్రసూ
తాజిన మంత తా నొలుచు నద్భుతశౌర్యనిధాన మీతఁడున్

ఉ. దైత్యతనూవిదారణవిధానపటిష్ఠుఁడు రామమూర్తి దౌ
ర్గత్యము గల్గె దైత్యులకుఁ గాలము చేరువయయ్యె వారికిన్
సత్యపరాక్రముండు రఘుశాబకుఁ డేను నెఱుంగుదున్ దప
స్థిత్యమృతాత్మదీధితి వశిష్ఠుఁ డెఱుంగును దక్కమానులున్

శా. శ్రీరాస్యుండగు తండ్రికిన్ బహువిధశ్రేయంబుఁ గూర్తున్ ద్రిలో
కీరారాజ దుదార కీర్తివిభవ క్రీడానిధిం జేయుదున్
మూరింబో మమకార మేమిఫలమో? భూపాల! దైత్యాసుబా
ధారీధోగ్రభుజాద్భుతున్ గొడుకు నంతఃపత్త్రిన్ నిల్పినన్

చ. అది పదినాళ్ళయజ్ఞ మిఁక నాగుటకైనను వీలులేదు నీ
కుదురు త్రిలోకపారిషదకూటములందుఁ ప్రశస్తి కెక్కఁగా
మది కలదేనిఁ బంపుము కుమారు వశిష్ఠులఁ దక్కమంత్రులో
ప్పొదల ఘటిల్లఁ జూచికొని పుచ్చుము భావిమహోవిధాతవై ౨౨

క. అని రామచంద్రుఁ గని నా
యన! నీ వియ్యెడన యుంటివా? పో! నీ త
మ్ముని గూడి యాడుకొనెదో?
జననీగేహముల కేగి సంచర్యింతో?

వ. అనిన రామచంద్రుండు సెలవుఁగైకొని లక్ష్మణునితో నిష్క్రమించిన

క. ప్రాణములు లేచిపోయిన
మానవపతి కంతలోన మానివచస్సం
తానము శ్రవోగతంబులు
గా నించుక యూర్పుఁగొంచు క్ష్మాపతి యనియెన్

మ. పసివాఁడే పసివాఁడు రాఘవుఁడు నా ప్రాణంబులోఁ బ్రాణ మా
నిసువుం గాంచఁగఁ బడ్డ కష్టములు తండ్రీ! విస్మృతిం గాంచ లే
నన లీ నాఁటికి నేను; నీ కరుణ కట్టా! యెంతదూరమ్ముగా
మసలున్? వచ్చెనో లేదో రామునకు శంస్యమ్ముల్ పదార్థముల్

ఉ. తా మమకారమే యనుము తక్కిన ముగ్గురొ కెత్తు వాఁ డొకె
త్తో ముని! నాకు; వాని విడి యోర్వఁగఁజాలను గోసలేంద్రక
న్యామణి యోర్వ దెవ్వ రెటులైనను గైకయి యోర్వఁజాల దా
రాముఁడు లేని నాదు గృహరాజియుఁ జీకటికోణముల్ మునీ!

ఉ. లొట్టలు తల్లి క్రొంబాదుగులోఁ జిఱుముట్టియుఁ గ్రుమ్మ దూఁడనాఁ
జిట్టని జేతఁబట్టికొని సింహఘటాలి నెదుర్పఁజూచె దీ
బొట్టెకు రామచంద్రునకు ముష్కరబుద్ధులు కూటయుద్ధులున్
దట్టులు నైన రక్కసల తంతుల కెక్కడి కెక్కడో మునీ!

శా. ఔ నే వచ్చెద యజ్ఞరక్షణకు నా యక్షౌహిణీపూర్ణ మా
సేనం దెచ్చెద యోధసంతతులు నా సేనాగ్రయాయుల్ ప్రచం
డానీకోగ్రులఁ దెచ్చెదన్ దనుజయుద్ధాప్తిన్ ధనుష్పాణినై
ప్రాణమ్ముల్ గలవట్టుఁ బోరెద సవారక్షాప్రతిజ్ఞాబ్ధినై

గీ. కాదు కూడ దటంచు రాఘవుని గొంచుఁ
బోవ నెంచెద వేని నో మునిమహేంద్ర!
పూని చతురంగయుక్తమా సేనతోడ
నన్ను నైతమ్ము రానీవె నాథమాని!

ఉ. పువ్వులఁ గొట్టినన్ సొలసిపోయెడు రాముఁడు యుద్ధభూమిలో
నెవ్వఁడు? వాఁడు నేర్చినది యేమి మహాధనురస్త్రవిద్య? యా
యెవ్వరు విఘ్నకృద్దితిజు లెవ్వనిపుత్త్రకు లేమివారు? నేఁ
జివ్వకు దూసి వారలను జెందుట కేమి యుపాయ మొప్పెడిన్

క. ఆతల నెఱింగి యోగ్య
స్థాతవ్యముగా బలంబు సమకూరిచి యా
నీతమగుట వలయుఁ గదా
చేతోమర్మముగ నాకుఁ జెప్పఁగదె ప్రభూ!

వ. అనిన విశ్వామిత్రుం డిట్లనియె

భుజంగవిజృంభితము.

పౌలస్త్యప్రోద్భూతుం డా రా
వణుఁడు దితిజకులపతి బ్రహ్మాదత్తవరంబులన్
త్రైలోక్యంబున్ బాధించున్ భూ
తవితతి బెగడుకొనఁగ దైత్యాసైన్యభయంకరుం
డాలోచింపన్ వాఁడే యజ్ఞా
యతననిరతకుపితుఁడు నాకరాజవిరోధి వాఁ
డాలంబంబై యజ్ఞధ్వంసం
బనుమతి సలిపెదరు దురాగ్రహోనతదర్పులై

వ. వాఁడు సాక్షాద్వైశ్రవణభ్రాత; వీ రిద్దరు మారీచసుబాహులు;
వానికి దగ్గరచుట్టములు

మ. అనినన్ రాజును నివ్వెఱం గనుచు; వాఁడా? వాఁడు భీతిప్రథా
వనయక్షాదిక దేవయోనిపటుగ్రీవాదేశనిక్షిప్తతే
జననిస్త్రింశుఁడు; వానిఁ దాఁకుటకు నేఁ జాలన్ మఱెవ్వండు చా
లును? వాఁడే మఱి మూఁడులోకములఁ జాలున్ జంపఁగా నొంపఁగా

ఆ. వాని కెదురు తీర్పవలదు శ్రీరాముని
నల్పభాగ్యు నన్ను నాదరింపు
నీవె గురువ వౌదు నీవె దైవతమౌదు
కుఱ్ఱవాఁడు సమిదకోవిదుండు

వ. ఆ సుందోపసుందుల కొడుకులు యమసదృశులు; నా కొడుకును

బంపించను; వారిలో నొక్కనితోనైన నా సైన్యములతో యుద్ధ
మాడ నేర్తునని రా జూరకుండిన

క. మౌని భ్రూయుగమధ్యం
బానతధూమాసితప్రభాంశుకలితమై
లోని కుపితాగ్నిపిశునం
బై నరపతి కన్నుదోయి యటమటఁ బొందెన్

గీ. హద్దులో ఘూర్ణితంబులై యంబునిధులు
నాంతరాణుఘట్టితములై యద్రివితతి
యనలకించిదుల్బణముగా నాకసంబుఁ
బెరిగి వచ్చు పొంగులను నాపికొని తిరిగె

మ. అవునయ్యా! యవు నిత్తు నంటి మొద లీ యంతంబునం దీయనం
టివి; పోని! రఘువంశయోగ్యమగునో నీచేఁత! నీకున్ సుఖం
బవు నీ బంధులు నీవునున్ సుఖము పెల్లై యుండుఁ డేఁ బోదు మా
నవనాథా! సుఖమాత నీకును బ్రతిజ్ఞాభంగపుణ్యాబ్ధికిన్

వ. అని విశ్వామిత్రుఁడు కుపితవిధురచలితాంగుఁడై సభాసదనంబు
వదలిపోయిన రాజు త్రొక్కటంపడుచు సుమంత్రుని గాంచి నీవు
పోయి యెట్లైన మునిని బ్రసన్నుని గావించి తెమ్మని పంచిన
సుమంత్రుండు గాధేయు వెంటఁ జనియె; గాధేయుండు విధురగమ
నంబున నేగి ప్రథమకక్ష్యాంతరంబునఁ గూర్చుండిన మంత్రి పోయి
బద్ధాంజలియై యాయనయొద్ద నిలఁబడిన మౌని పెడమోమైయుండె;
నిట సభలో

ఆ. పతి వశిష్ఠుఁ గాంచి ప్రాంజలియై యేమి
స్వామి! యేమి బెడద వచ్చిపడియె!
గాధిసుతుఁడు ప్రథమకక్ష్యాంతరముఁ గూడ
దాఁటిపోవకుండ దారిఁజూపు

క. వైకుంఠ మెత్తిగిలినను
వైకుంఠమె యొడ్డుకొనఁగవలయును మోహా
వ్యాకులితచిత్తు నన్నున్
గైకో సాకంగ నీకుఁగా కెవరికయా!

క. అనిన వశిష్ఠుం డిట్లను
మనుజాధిప! నీవు తొలుత మాటయొసఁగి తా
వెనుక వెనుకాడ నేటికి
నినకులమర్యాద యగునటే! యిది తాతా!

ఆ. మొదట నిత్తునంచుఁ బిదప నీకుండుట
యశ్వమేధయాగహతము సేఁత
మొదట వాపిఁ ద్రవ్వి పిదపఁ బూడ్పించుట
యీవు ధర్మమూర్తి విదియుఁ దగునె

మ. అకృతాస్త్రుండో కృతాస్త్రుఁడో రఘుసుతుం డా గోత్రయాగాధిసూ
తికి శిష్యాకృతిఁ జేరిచూచుటకుఁ గా దే రాక్షసుల్ గాని; కౌ
శికుఁ డెవ్వండని? సర్వధర్మకలనాశ్రీమూర్తి; పుంజీభవ
త్ప్రకటామోఘతపస్సు; బుద్ధినిధి; వీర్యప్రస్ఫురజ్జ్యోతియున్

వ. తొల్లి యతండు రాజ్య మేలునప్పుడు భృశాశ్వుం డితనికి సర్వా
స్త్రంబులు దయచేసె; భృశాశ్వునిభార్యలు దక్షప్రజాపతికూతుండ్రు
జయయు సుప్రభయు ననువారు నైకరూపంబుల మహావీర్యంబుల
దీప్తిమంతంబుల జయావహంబుల మహాస్త్రంబుల రక్షస్సైన్యవధా
ర్థంబు గనిరి; విశ్వామిత్రుం డివియన్నియు నెఱుఁగు; మఱియు
నపూర్వంబులు దర్శించుటయందును శక్తుండు

ఉ. ఆతఁడు నేర్చినస్త్రముల నన్యులు నేర్వరు; నీ కుమారకున్
బ్రీతి ననుగ్రహింప మదిఁ బేర్చి యతం డిటు వచ్చెఁగాని కా
దా తనయంతఁ దా సమదదానవసామజకుంభపాటన
వ్యాతతసింహమూర్తి యతఁడై యిట నేటికి వచ్చు భూమిపా!

చ. అనుచు వశిష్ఠు లాడ ముదితాంతరుదారసముజ్జ్వలత్తనూ
తనుతరమూర్తి భూమిపతి తాఁ గబురంపెను రామునిన్ సల
క్ష్మణుని; వశిష్ఠమానికృతమంగళవంతుల మాతృపాదపూ
జనమధురాస్యచంద్రముల జ్మాపతి యిద్దఱ రెండుచేతులన్ ౭౨

ఉ. నైకొని మోదవీచిమృదుకంపనుఁడై తొలియేనుఁగుమ్మమున్
దాకొనియున్న కౌశికుని దగ్గరఁ జేతులు పీడి పుత్త్రులన్
మోకలఁ బ్రేమ మూర్ధములు మూర్కొని మానిని జూపఁగా నుష
శ్శ్రీకమలాననుల్ మునిని జేరిరి వారు వినమ్రదేహులై

సీ. సుంకులా జులపాలజుత్తులవారలు
మూపుల నమ్ములపొదులవారు
ఎగుబుజంబుల వ్రేలనగు విండ్లవారలు
నడయాడు పరికాడునడలవారు
ఉడుముచర్మపు వ్రేలితొడుగులవారలు
ముడిచిన పిడిబాకునడుమువారు
కావిరంగుల గూడకట్టులవారలు
మొగముకుంకుమ నిల్వుబొట్లవారు
రఘుశిశులు గాధిసుతుని జేరంగఁబోవ
జలజలవిసళ్లు పూలవానలును గురిసె
వేలుపులపీటి మద్దెలల్ వీగుదెంచె
సంకువుల బుంబుములివులు సాగుదెంచె

క. వెనుదిరిగి చూడఁ డా ముని
చనఁజొచ్చెను వెంటవెంటఁ జనె రాముఁడు ల
క్ష్మణుతోడ నయోధ్యబహి
ర్వనములు వెనుకఁబడె నిముసపాటున నంతన్

ఉ. స్కందవిశాఖు లిద్దఱును స్థాణుని వెంబడి నేగినట్లు శ్రీ
స్యందిముఖాశ్వినేయులును సారసగర్భుని వెంట నేగి న
ట్లందపుఁబ్రోవులా దశరథాత్మజు లిద్దఱు గాధిసూతివెం
టం దపనీయపాదవికటస్ఫురణంబుల నేగఁ జొచ్చినన్

క. వెనుకకుఁ దిరుగఁడు తలుముచుఁ
జనును ద్వారాయానవిధృతిఁ జనుచో భూభృ
త్తనయులు త్రిశీర్ష భుజగగ
మనవల్గనసుందరసుషమామధుమూర్తుల్

క. వెనుకకుఁ దిరుఁగఁడు తలఁచుచుఁ
జను ముని దాశరథు లాత్మన త్తేజస్సం
జనితసుషమాదశదిశా
కనత్ప్రభాక్షీరనిధి చకచ్చకితాంశుల్

క. వెనుకకుఁ దిరుగఁడు తలఁచుచుఁ
జనియెడు మునిరాజు రాజశాబకము లురో
జనినవమధుర స్వేదాం
బునిపీతానిలతరంగమోహనమూర్తుల్

క. వెనుకకుఁ దిరుగక చనచనఁ
జనుదెంచెను సరయు వంత సరయూనదిద
క్షిణతీరము చేరిన నా
రని వేగమున వెనుదిరిగి; రామ! రఘుపతీ!

చ. అని ముని పిల్చి 'రామ' యను నక్షరముల్ చలితాధరంబునం
దునన కవుంగిలించుకొనునో యన మెల్లన నప్పళించి కై
కొనుము జలంబు మూర్తమును గొంచెములో నయిపోవుఁ బ్రాప్తవే
శను గ్రహియింపర మ్మతిబలాబల లన్ జను రెండువిద్యలన్

ఉ. పీసరవోవ దండ మొకవెంట శ్రమంబు జ్వరంబుఁ దాఁక వు
గ్రాసురులున్ బ్రసుప్తుఁడవునైనఁ బ్రమత్తుఁడవైనఁ దాఁకలే
రీ సకలావకాశమున నెందును నెవ్వరు నీకుఁజాల రూ
ర్జాసువులైన మంత్రముల నందుము రెంటిని రెండు నందినన్

క. ఇవి తల్లులు సర్వజ్ఞా
నవిధానంబునను ద్రోవ నడచుచు వీనిన్
దవిలి జపించుచునుండినఁ
దవులవు నీ కాకలియును దప్పియు శిశువా!

క. తాతా! వీరిద్దరును వి
ధాతకుఁ గూతుండ్రు కీర్తిదాక్షిణ్యజ్ఞా
నాతిశయబుద్ధివై భవ
రీతుల నీసాటిఁ గనఁడు పృథ్వి నెవండున్

క. గ్రహియింపు విద్యలను నీ
కహస్కరుఁడుకూడ నెదురునాఁడఁగ లేఁడీ
దహదాత్మమైన విద్యా
మహోవిధురు నిన్ను శక్యమా? పట్టంగన్

ఆ. వడిగ నంతఁ గాలు కడిగి శుద్ధాత్ముఁడై
యాచమించి రాముఁ డవి గ్రహించె
రాముఁడును గ్రహింప రాజైన మునిరాజు
రాముఁ గాంచెఁ గనుల రాణ తెలియ

ఆ. తరణికులుఁడు సన్నిధత్తవిద్యుం డౌచు
శక్తిమంతములగు సూక్తములను
సుహుతుఁడైన యగ్ని శోభతోఁ జెలువారె
శారదాంబుజాప్తసరణిఁ బొలిచె

శా. శుశ్రూషాపరముల్ రఘూద్వహులు తేజోరాశి గాధేయునిన్
ధీశ్రేయోనిధులై భజించిరి ప్రపత్తిన్ మువ్వురున్ రాత్రియున్
రా శ్రీవాససువాసనాసుఖులు దూర్వాశయ్యలన్ నిద్రితుల్
విశ్రాంతిం గని రా విభావరియుఁ దన్పెన్ వారి సౌఖ్యాబ్ధియై

ఉ. మూర్తము దాటిపోవునని ముందుకు దూసుకవచ్చినాఁడ మీ
కార్తియుఁ గల్గనేమొ? పథమందున వెన్కకుఁజూచినన్ శుభా
వర్తము కాదటంచు వెనువ్రాలనటం చను మానిలాలనన్
నర్తితచేతులైన రఘునాథులు నిద్దురవోయి రంతటన్

చ. ఉరుతరవీచిలోలసరయూశిశిరాంబుసరజ్జలేజకే
సరభరరాజవాయుపరిషత్తులు కొల్వఁగ వచ్చుచున్ విభా
వరిసిరి చల్లచల్లఁగ దివాపతివంశ్యుఁడు రామచంద్రునన్
బరవశమై ప్రశాంతసుఖభావముఁ జూపె సుషుప్తిమిత్రమై

వ. అంత శర్వరి ప్రభాతప్రాయమైన దూర్వాసంస్తరశయానులఁ గాకుత్స్థులను గాంచుచు విశ్వామిత్రుం డిట్లనియె ౬౧

ప్రభాతము.

తొలివెలుఁగయ్యె నిదోయి! లేవోయి! లేవో లే
సలసుతసుప్రజ! సాధు రామచంద్రా!
తొలివెలుఁగయ్యె నిదోయి! కౌసలేయా!
మెలకువ వచ్చెనె నీకు రామభద్రా!

వ. లేచి దైవమైన యాహ్నికంబుఁ దీర్పుండనినఁ దల్లి పిలుపుకన్నఁ బ్రేమార్ద్రమును మృదువు నైన మునిమాటకు మేల్కాని దాశరథులు నవ్వుచు లేచి స్నాతులుఁ గృతోదకులు నిర్వర్తితజపులుఁ గృతాహ్నికులు మునిపాదకృతనమస్కారులు సంహృష్టులునై గమనాభిముఖులైన

ఆ. నడచువేళ మౌనినాథుండు కొంతసే
పిరువురకును నడుమ నేగుచుండుఁ
గొంతసేపు ముందుకుం దూఁగి నడచును
గొంతసేపు వెనుకఁ గూడివచ్చు

క. ఇరువురకు నడుమఁ జనుచో
నిరువురి కేల్దమ్ము లంది యిట్టటు కదపున్
ఇరువురకు వెనుకఁ జనుచో
నిరువురి గమనముల శోభ నెంచుచు నుండున్

చ. కడువడి నేగఁగాఁ ద్రిపథగానదిఁ జేరిరి దానియొడ్డునన్
గడెముగ నేగఁగాఁ ద్రిపథగాసరయూశుభసంగమస్థలిన్
గడుకొని వేలు వర్షములుగా మునులుండిన పల్లెయొండు క
న్పడె రఘుపుత్త్రకుల్ ముదమునం గుశికాత్మజుఁ జూచి సస్పృహుల్

వ. ఇది యెవ్వరి పుణ్యాశ్రమంబిం దెవ రుందు రనిన విశ్వామిత్రుండు నవ్వుచు

చ. సనవిలుకాఁ డటంచు వినినారుకదయ్య; యనంగుఁ డాతఁడున్
మునుపు శరీరధారియె; ప్రభుండగు శంకరు మీఁద దాడివె
ట్టినఁ బ్రభునేత్రకీల వికటించిన మంటలు మాటి మాడిపో
యినవి తదంగసంతతులు నెచ్చటి వచ్చట శీర్యమాణముల్

క. పరిణీతుండగు ప్రభు పయి
మరుద్గణప్రోద్బలమున మన్మథుఁ డరిగెన్
దురుసుదనముఫల మందెన్
బరమశివుని నియమవంతు బాధించుటచేన్

వ. ఈ కథ జరిగినది యీదేశంబునఁ బరమశివుఁ డిందే తపోవంతుం
డయియుండె; నందుచేత నివి యంగదేశంబులయ్యె

క. ఈ యాశ్రమ మా యాశ్రమ
మీయెడ ఋషికోటి నాఁడు నెవ్వారో వారే;
శ్రీయుతులు పాప మను పలు
కే యెఱుఁగరు నిత్యధర్మబుద్ధినిధానుల్

ఆ. రజని యిచటఁ గడపి రఘుకులమణిదీప!
పుణ్యవారిమధ్యభూమియందు
నేఱు తేపు దాటి యేగెద మనఘసం
స్పర్శనం బదెంత బ్రాతి యనుము

క. కృతజపులము స్నాతులమును
హుతహవ్యుల మగుచుఁ బోవు టొప్పు నచటికిన్
మతిశుచుల మగుచు ననుచో
మతిఁ దెలిసిరి వీరిరాక మౌనులు తమలో

వ. తెలిసి ప్రత్యుత్థానంబుచేసి మున్ను విశ్వామిత్రునకుఁ బిఱుంద రఘు
శిశువులకు నతిథిక్రియ జరిపి సర్వర్షులును యథార్హముగ సంధ్య
నుపాసించిరి

శా. ఆ రే యెల్లను గాధిసూతి పరిహాసాశ్చర్యభీకారౌద్రశృం
గారస్థానములౌ కథానకములన్ గాకుత్స్థులన్ సమ్మదాం
భోరాశిన్ మునుగంగఁజేసె శిశువుల్ ముగ్ధాత్ములై తత్కథా
ధారాయోగ్యముగాఁగ నుద్ధతిని దత్తద్భావముల్ పొందఁగన్

ఉ. నాలవజామునన్ గునికినారు రఘూద్వహు లంతలో నుషః
కాలము పారిజాతసుమకాంతులతోడ జపాసుమప్రభా
జాలముతోడ గన్నెరులచాయలతో నవమల్లికాప్రసూ
నాలిమెఱుంగుతోఁ దిరిగినంతఁ బ్రభాతము వచ్చె స్వచ్ఛమై ౧౦౯

వ. కడచినరాత్రియే సరంగులకుఁ గబురంపించి సిద్ధముగా నున్న నావ వద్దకుఁ గృతాహ్నికుని గాధేయుని ఋషు లంద అనుసరించి సరాజ పుత్త్రంబుగా నావ నెక్కించి మార్గ మ్మరిష్టతాతిగాఁ జెప్పిన

క. ముని గాధిసూతి యా ఋషు
లను మఱి నిర్వ్యాజమృదువులన్ బూజించెన్
ఘనవాస్తరంగమన్ భూ
మనీరవత్సాగరంగమన్ దరియించెన్

చ. నది నడిపాయకున్ జనెను నావ మొదల్ మదబంభరధ్వనిన్
బిదపను మర్దళధ్వనిని బిట్టుగ నావయి ఘూర్ణమాన మం
బుదమునుగాఁగ నొక్క ధ్వని పుట్టిన వించునె రామలక్ష్మణుల్
నదిజల మింత చీలిన నినాదమొ యియ్యది యంచుఁ బల్కినన్

గీ. ఎండఁబోసిన చేపల వెండిపొలసు
లెండలో మండిపోయెడు నెమ్మెయైన
యా మొగువనున్న విస్తార మైనవారి
సరయువు దివౌకసాంబుల సంగమమ్ము

శా. కైలాసంబునయందు బ్రహ్మ మనసా కల్పించెఁ గాసార మొం
డేలా దానికిఁబేరు మానససరస్సే యంచు వచ్చెన్ దదు
ద్వేలాంబుల్ సరసప్రవాహములుగా విచ్చేసెఁ గాదే యయో
ధ్యాలంకారము లౌచుఁ జుట్టికొని గాఢాంబుప్రవాహంబులై

గీ. ఆ మహావారి సరయువు నా సరయువు
గాంగవేగాంబువులతోడఁ గలియు నిచట
నా మహాధ్వని యద్దియే రామచంద్ర!
తోయశుభసంగమమునకు దోయిలింపు

వ. అనిన నన్నదమ్ము లిద్దఱును బుణ్యనదీద్వయసంగమమ్మునకు నమస్కరించి దక్షిణతీరంబుఁ జేరి

శా. పోఁబోఁగాఁ బథమెల్లనున్ బొదలునున్ భూజంబు లేపారుచున్
బోఁబోఁగాఁ బెనుచీకటై యడవియై పూరించె ఝిల్లీరవం
బాఁబోతుల్ బలెఁ జిక్కఁగా బలిసి యిట్టట్టడ్డమై త్రోవలో
రాఁబోఁగా మనుబిళ్ళు దూసిచనె ధారావేగసంపాతముల్ ౧౧౪

శా. చక్షుస్సుల్ పెనుచీఁకటిన్ మసకలై సంధ్యానఘృష్టిన్ వనీ
పక్షిశ్రేణివిరావ మేఁచినఁ జెవుల్ బాధిర్య మొప్పన్ దర
త్క్షుత్క్షోభంబులు వ్యాఘ్రగర్జనములున్ ఘోణీమృగేంద్రారవో
గ్రక్షుభ్యచ్ఛ్రవణేంద్రియం బగు మహాకాంతార మేపారినన్

ఉ. అంబరచుంబివృక్షనివహంబులు తిందుకబిల్వకీచకో
దుంబరదేవదారుకమృదుత్వగరిష్టముఖావనీజముల్
కంబువు లూదినట్లు పెనుగాలికి మ్రోసిన శేఖరంబులై
యెంబెరికమ్మ్రగాఁగఁ బథమెల్లను నిండిన మాంస మొప్పఁగన్

ఉ. రాముఁడు గాధిసూతిఁ గని రా నిది యెక్కడిమార్గమో? కనన్
స్వామి! యిదేమి కానన మనన్; ముని యిట్లను; వత్స! పూర్వ మీ
భూమి కరూశముల్ మలదముల్ జనవాసములైన దేశముల్
సౌమనసాభినిర్మితికి సాటువ గల్గిన శ్రీనిధానముల్

మ. వెనుకన్ వృత్రవధాఘ మూదికొన దేవేంద్రున్ క్షుధావిష్టుఁ డ
య్యెను దప్పుండయి బ్రహ్మహత్యఁబడి దేవేజ్యుల్ మహర్షుల్ మహేం
ద్రుని గుంభస్నపితుం బొనర్చిరి మలాధూతంబుగా నిర్మలుం
డును దేవేంద్రుఁడు నిష్కరూషుఁ డగుడున్ దూఁగాడి రాదిత్యులున్

చ. అల యమరేంద్రు దేహమల మంతయు నిచ్చట జారినన్ బ్రభుం
డలఘుతరప్రసన్నుఁడునునై మలదంబులునుం గరూశభూ
ము లని ప్రసిద్ధిఁ బొంద వరమున్ దయసేసెను వీనికిన్ దల
త్తలనయి సస్యముల్ జనపదంబులుఁ బొల్చె నిటన్ సమృద్ధముల్

చ. కృత మతికాల మిట్లె జరిగెన్ దుద నొక్కపు డొక్కయక్షి యా
హతమతి తాటకాభిధ సహస్రమదేభబలాభిరామ; మీ
కతిశయమైన భద్రమగునయ్య రఘూత్తములార ! సర్వదే
వతలును మీ ధనుస్సులను బాహువులన్ వసియింత్రు గావుతన్

క. అది రాక్షసి సుందునకున్
సుదతి యతఁడు మంచివాఁడెనూ! దానిసుతుం
డదయుఁడు మారీచుం డు
గ్రదోఃప్రతాపపరిధి పరిఘుభుజుం డొప్పున్ ౧౨౧

గీ. ఊళ్ళపైఁబడి తినును వాఁడొకఁడు తల్లి
తాటకాకాలనిశి మలదములునుం గ
రూశములు ఘోరకాంతారరూక్షదేశ
మునగను జేసెను జనముల నెగచి యెగచి

శా. ఈదేశమ్ములు నింతయా నడవికా నెన్నేండ్లుపట్టున్ మృగేం
ద్రాదిక్రూరమృగంబు లిం దునికిగానై యుంట కెన్నేండ్లగున్
గాదే తాటక పీటవెట్టి యిచటన్ గాపై ప్రజాశ్రేణి వ్యా
పాదించెం జుమి యన్నియేండ్లలు ధనుర్బాహామహోగ్రాకృతీ !

క. మన దారిలోన నుండెను
దనుజ యచట యోజనార్ధ మాపయిఁ గొంచెం
బున దానిపడక పెడపెడఁ
జనుదు రసలుత్రోవ వదలి జనములు భీతిన్

క. గుదులుగను వనవరాహము
వెదుళ్ళు మేసినటు నమలివేసెను జనమున్
వదలద యింకఁ గరూశమ
లదముల్ నైవేద్య మిడిన లాగయ్యె ననన్

మ. తులుచన్ రాముఁడు నల్పవీర్యులని విందున్ యక్షులన్ వేయియే
న్గుల కున్నంతబలంబు దాని కెటు కల్గున్ నాఁగ గాధేయుఁ డి
ట్టులు చెప్పెన్ దొలుతన్ సుకేతుఁడనియుండున్ యక్షుఁడవ్వాఁడు పు
త్త్రిలు లేమిం దప మాచరింప విధి ప్రీతుం డిచ్చె నీ తాటకన్

చ. కొడుకును నీని యావెలితి కూడగ నింతబలం బొసంగె నీ
పడఁతికి నజ్జయోని తరువాతను ఝర్ఝసుతుండు సుందుఁ డీ
పడఁతుకఁ బెండ్లియాడెఁ బయి వారికి వాఁడు జనించె నూళ్ళపై
బడితినువాఁడు కౌణపత వచ్చెను వానికి శాపహేతువై

ఉ. ధీచణుఁడైన సుందుఁడు గతించిన లోనిబలంబు సుళ్ళుగా
నేచినఁ దా నగస్త్యుపయి కేగెను జంపఁగఁ బుత్త్రుతోడ మా
రీచునితోడఁ దాటక గరిన్ భ్రుకుటిన్ దలవంచి యోరగాఁ
జూచు చగస్త్యుఁ డా వికృతశోషులఁ జేర్చి శపించె నీగతిన్ ౧౨౮

చ. తరుణియు మౌనిశాపవశతన్ వికృతానన ఘూర్ణమానబం
ధురతరనేత్రగోళ మునితో భగవంతుఁ డగస్త్యుతోడి మ
త్సరమున నీ యగస్త్యచరితంబు శుభంబు పొలంబు బీడుగాఁ
బఱచెను గోవులున్ ద్విజులపాట్లకు నంతము లేద యిచ్చటన్

క. తుదిమొదలు లేని విశసన
మిది యింకెన్నాళ్ళు జరుగు టేమోయి శిశూ!
యిది చదియఁగవలె నన్నక
జదియంగావలయు నీదు చాపాగ్రమునన్

మ. అనినన్ రాముఁడు మీలితాక్షుఁడయి కష్టా! యాఁడుదానిన్ వధిం
పను నాచేతికి నమ్మరాదనిన విశ్వామిత్రుఁ డా దోష ముం
డిన నా యందున నుండు ధర్మమగు సంధిం జూడు మ ల్లెంచ భూ
జను లిట్లే హతమారుచుండి రిటు లెంచన్ స్త్రీవధక్లేశమున్

వ. నృశంసుం డనృశంసుం డనక పాతకంబు సదోషం బనక సత్పురుషులు ప్రజారక్షణార్థం బాచరింపవలయు నిది సనాతనంబైన రాజధర్మంబు; ఇది పరమాధర్మ్యరాలు; దీనింగూర్చి ధర్మవిచారణ లేదు; తొల్లి ధారణీదేవిఁ జంపబోవు మంథరను శక్రుండు వధించె; లోకం బనింద్రంబుఁ జేయనెంచిన భృగుపత్నిని వెన్నుండు సంహరించె; అధర్మసహితలైన స్త్రీలు తొల్లి మహాపురుషులచే వధింపనే బడిరి; ధర్మంబు మాకు వదలుము; నీప్రథమమార్గణదర్శనోత్సాహులము మాకుఁ గనువిందు సేయుము

ఉ. అల్ల భృశాశ్వునుండి సకలాస్త్రములున్ ననుఁ జేర నస్త్రముల్
తల్లులు రెండునౌ నతిబలాబలలున్ నిను నన్నునుండి శ్రీ
వల్లులు చేరె నేను గురువన్ గురుదక్షిణ యిమ్ము తాటకా
భల్లము నాకు రాఘవనృపాలకగేహమణిప్రదీపికా!

మ. అనినన్ రాముఁడు దోయిలించి ప్రభువా! యట్లే పొనర్తున్ నినున్
నిను విద్యాగురు నేను గాదనుట లేనే లేదు; మాతండ్రులున్
ననుఁ బంపించెడు వేళ నీ వచనముల్ నానాత్రయీమౌళిమం
డనముల్ గాఁగ సమాదరింపు మని యన్నారున్ మహఃపేటికా!

మ. ఇదె గోబ్రాహ్మణరక్షకోసమయి యా యీ దేశసౌభాగ్యసం
పదకై మద్గురుదక్షిణార్థమయి యీ పాపాత్మురాలౌ దాటకన్
జదియింతున్ జదియింతు నంచును ధనుర్జ్యావల్లి శబ్దించినన్
హ్రాదసేతుభ్రమవారినిస్వనముగా నార్చెన్ దిశాసంతతుల్

ఉ. తల్లులితంబులైన సినదంబుల కవ్వనవాసు లెల్లఁ గం
పిల్లిరి తాటకాశ్రవణవిధిక దిద్ధిరదిద్ధిరై క్రుధా
ఫుల్లతనూరుహాంఘ్రపులఁ బుట్టిన మంటలతోడ లేచి జ్యా
వల్లిరవంబు దిక్కుఁబడి పర్వులు వెట్టుచు వచ్చె నుగ్రతన్

క. దాని వికృతంపు మోమును
దాని వికారమ్ము మేను దాఁ గని రాముం
డైనం దమ్ముని గని ల
చ్ఛీ! నీ వా యసురఁ జూచితే యని నగుచున్

క. దీనిం జూచుచె వదలున్
ప్రాణంబులు పిఱికిగుండెవాఁడైన న్మఱిన్
దీని మఱి చూఁడుదానిని,
వానెతఁ జంపను నఱకెదఁ బాదకరములన్

మ. అనుచో బాహులు బిట్టు చాచికొని క్రోధావిష్ట గర్జంతి రా
మునిపై మూఁకుచు వచ్చెఁ దాటకయు హుంమూర్ఛాకృదుగ్రస్వనా
ననుఁడై దండము సద్దువెట్టి ముని యంతన్ స్వస్తియా రాముల
క్ష్మణయుగ్మంబున కన్న నద్దనుజ మూర్ఛాగ్రస్తయై క్రుంగుచున్

ఉ. అంతట లేచి కాళ్ళులను హస్తములన్ బెనుదుమ్ము రేపి భూ
కాంతసుతద్వయాస్యములుఁ గన్నులు గప్పి శిలాభిపాతవి
క్రాంతిని జూపెఁ దాటకయు రాముఁడు కోపముఁ బొంది తచ్ఛిలా
వంతము వర్షమున్ సిశితబాణపరంపర వ్రక్కలింపఁగాన్

క. మఱలను జేతులు చాచుచు
దఱుముకొనుచు వచ్చుచున్న దానవిచేతుల్
నఱకెను రాముఁడు రోఁజుచు
జెఱభియుఁ దానుగ్రబాధచే ధర దొరలన్ ౧౮౧

క. ముక్కును జెవులుం గోసెను
జక్కన ప్రక్కగను బోయి సౌమిత్రి యదిన్
జిక్కితి నని పెనుమాయా
ఫక్కిం గనరాక యశ్మవర్షముఁ గురిసెన్

క. ఒకవేయిరూపములతో
నొకవేయివిధాల వచ్చి యుండినచో నుం
డక మండినచో మండక
యొక వేయివిధాల నలఁచె నుగ్రత వారిన్

ఆ. గాధిసుతుఁడు భూమికాంతునితనయులు
నుపలవర్షమునకు నొదిగికొంచు
మునిగి మునిగి వృక్షమూలముల్ సేరిరి
యీఁగి యీఁగి పొదరుటిండ్లు సనిరి

చ. ఒకతరుమూలమం దొదిగియుండిన రాముని గాంచి కౌశికుం
డకట ! భవద్ఘృణాఫలము నందితిమయ్య రఘూద్వహా ! యదిన్
ప్రకటితశాంబరీకుటిల; వచ్చెడు సంధ్యయు రాక్షసుల్ నిశా
ధికబలు లింక దీనిని వధింపక తప్పదు యజ్ఞహంత్రినిన్

క. అన శబ్దవేధిబాణం
బున రాముఁడు దాని యున్నపొడ వేధించెన్
దనుజయు మాయాసేనా
సనాథ యయి రాజసుతుల సామ్ముఖ్యంబున్

ఆ. ఒలసినంత రాముఁ డొకబాణమున దాని
యురముఁ గాడనేసె నురము శరము
గాడినంత దనుజ కాళ్లులు విలవిలఁ
దన్నికొంచుఁ జచ్చె ధరణిని బడి

గీ. పక్షితతి ఱెక్కలార్చి చప్పట్లుగొట్టెఁ
దరువితానంబు వివశమై తలల నూపె
దూరముననుండి యడవిజంతువులు చూచి
యద్భుతంపడె రాము బాహాపటిమకు ౧౮౧

ఉ. కౌశికుఁ డంత రాముని ముఖంబును మూర్ధము ముద్దులాడి యీ
దేశము తాటకాభయముఁ దీర్చితటంచును బొంగి పొంగి తం
డ్రీ! శవమారభూమిఁ జని యీనిశ యీవనమందె పుత్త్ర మీ
యాశరిబాధ పోయినదయా ! యిట నుండఁగవచ్చునే గదా !

వ. ఈరేయి యిచట నిద్రింతము; తెపటికి నాయాశ్రమంబుఁ జేరుదు
మనిన

క. అల నొక తటాకనికట
స్థలమునఁ గృతసాంధ్యులగుచు స్థండిలశాయుల్
జలజాప్తవంశపృథుకము
లలఘుతరోత్సాహవంతులై నిద్రింపన్

ఉ. రాక్షసిగుబ్బులన్ వనపరంపర ఘూర్ణితమైన కోనగాఁ
బ్రక్షుభితంబులై బెగడి పర్వులు వెట్టిన జంతుసంతతుల్
కుక్షికి నిండుగా నిదురకుంబడె రాత్రి ప్రశాంతదీప్తియై
శిక్షిత యైనయట్లు వికసించెను జాములలోఁ బ్రసన్నయై

ఉ. అంతఁ బురందరుండును సురాలియుఁ గౌశికునిం గమించి వి
క్రాంతిపయోధికిన్ బరిధి రాముడ కెంతయు స్వస్తియాత నీ
కెంతయు స్వస్తియాతను మునీంద్ర! భృశాశ్వమహాస్త్రముల్ రమా
కాంతున కీయవే యుదయకాలమునన్ సకలమ్ముగాఁ బ్రభూ !

క. అది యేమిచిత్ర మగునో
గద! యొక్కటి యొక్క బాణఘాతంబునకే
యెద పగిలి చచ్చెఁ దాటక
యెది యిచ్చిన నీయరాదొ? యీవే చెపుమా !

క. పృథువులు భృశాశ్వవిద్యలు
శిథిలమ్ములు గాకయుండఁ జేయు మటంచున్
మధుమథనశిశుల నిద్రా
మధుమూర్తుల కంజలించి మగిడిరి సురలున్ ౧౫౫

చ. తెలతెలవారినన్ నికటదేశనివాసులు వచ్చి గుంపు గుం
పులుగ రఘూద్వహుల్ మునిని బ్రోవయి చూచుచు రామచంద్రు న
మ్ములఁబోది విల్లునన్ బెరుకుఁబొందుచుఁ దాఁకుచుఁ బాఁకి కన్నులిం
తలుగను విచ్చి నవ్వుచు ముదంపడి నివ్వెఱయున్ భజించుచో

గీ. తాటకాద్రోహపరిణాహతత్త్వ మెఱిఁగె
రామభద్రుఁడు కాంతారభూమి వదలి
చనిరి వా రంతట శకుంతసముదయంబు
సాధుమధురస్వనమ్ముల సాగనంప

చ. చన జలదేశ మొండయిన నన్ముని యంతటఁ దాటకావధం
బునకును బారితోషికము బొందు మొసంగెద రాఘవా! జలం
బును స్పృశియింపుమన్న రఘుమూర్తి స్పృశించెను నంత మౌని లో
చనములు కోటిసూర్యసదృశంబుగఁ దైజసమూర్తు లొప్పఁగా

వ. మహాదివ్యంబులైన దండచక్ర ధర్మచక్ర కాలచక్ర విష్ణుచక్రం
బులు నైంద్రవజ్రాస్త్రంబులు శైవంబైన శూలంబును బ్రహ్మశిరం
బును నైషీకంబును బ్రహ్మాస్త్రంబును మోదకీశిఖరీనామగదాద్వ
యంబు ధర్మకాలవారుణపాశంబులు శుష్కార్ద్రము లను నశనులుఁ
బైనాకనారాయణాస్త్రంబులు శిఖర మన్న యాగ్నేయాస్త్రంబును
బ్రథన మన్న వాయవ్యంబును హయశిరః క్రౌంచాస్త్రంబులును శక్తి
ద్వయంబును నసురులు ధరించు కంకాళ ముసల కాపాల కంకణా
స్త్రంబులును వైద్యాధరాస్త్రంబు నందకాసి గాంధర్వమానవ
ప్రస్వాపన ప్రశమన సౌరదర్పణ శోషణసంతాపనవిలాపనాస్త్రంబు
లును గందర్పదయితంబును దైవదుర్ధర్షమ్మునైన మదనంబును బైశాచ
దయితమ్మైన మోహనంబును సంవర్తదుర్ధర్షమౌసలమ్ములును
సత్యాస్త్రమ్మును మాయాధరమ్మును బరతేజోపకర్షకంబైన తేజః
ప్రభాస్త్రంబును శిశిరం బను సోమాస్త్రంబును సుదామనం బను
త్వష్టయస్త్రమ్మును భగుని దారణంబును శీతేషువును మానవాస్త్రం
బును గామరూపంబులు మహాబలంబులుఁ బరమోదారంబులు
తేజోమూర్తులై కన్నులయెదుటఁ దిరిగిన ౧౫౯

ఆ. సరగ వేని సర్వసంగ్రహాణంబు నై
వసులకే నశక్య ఘణితి యగునో
యవియు గుంపుగాఁగ నరుదెంచి రాముని
మొదుట మోకరించి యిట్టు లనియె

క. పరమోదారులమును గిం
కరులము రఘునాథ! మమ్ముఁ గై కొని మనిక
దరణికులుఁను శ్రద్ధామతి
గరమును నా మానసములుఁగా మెలఁగుఁ డనెన్

ఆ. అంత నస్త్రములును నంత ర్హితములు గా
మౌనిపాద రేణుమండితాగ్ర
చూడముగఁ బ్రణామశుద్ధుఁడై రాముండు
తైజసాకృతిబలె దారి నడచె

చ. నడచుచు రామమూర్తి మునినాథునితో నొకకొంత యేగి తా
నడచుచు రామమూర్తి మునినాథునితోఁ బ్రభు! యెల్లవేల్పులున్
గడవఁగరాని యస్త్రతతిఁ గాంచితిఁ బో! యుపసంహృతిన్ మఱిన్
బడయఁగరాక యేమిఫలవంతము లయ్యెవికూఁడఁ జెప్పవే!

వ. అనిన ధృతిమంతుండును సువ్రతుండు శుచియునైన గాధేయుండు సత్యవంతమ్ము సత్యకీర్తి దృష్టంబు రభసంబుఁ బ్రతిహారతరంబుఁ బరాఙ్ముఖంబు నవాఙ్ముఖంబు లక్ష్యాక్షవిషమములు దృఢనాభసునాభకములు దశాక్షశతవక్త్రములు దశశీర్షశతోదరములుఁ బద్మనాభ మహానాభములు దుందునాభసునాభకంబులు జ్యోతిషముఁ గృశనము నైరాశ్యము విమలమును యోగంధరహారిద్రములును దైత్యమ్ముఁ బ్రశమనమ్మును శుచియు బాహువును మహాబాహువును నిష్కలియును విరుచియును సార్చిర్మాలియు ధృతిర్మాలియు వృత్తిమంతంబును రుచిరమును బిత్ర్యసౌమనసంబు విధూతంబు మకరంబుఁ గరవీరకరమ్ము ధనము ధాన్యమ్ముఁ గామరూపంబుఁ గామరుచియు మోహమ్ము నావరణమ్ము జృంభకంబు సర్వనాభంబు సంతానంబు వరణంబు నను కామరూపుల భాస్వరుల భృశాశ్వతనయులను నావిర్భవింపఁజేసి ౧౬౪

శా. కాకుత్స్థాగ్రణి ! పాత్రభూతుఁడవురా! కైకొమ్మనన్ మంత్రవ
ర్ణాకారంబుల స్వీకరించెఁ బెలుచన్ రాముండు మోదాబ్ధియై
యాకారంబుల దీప్రభాస్వరములై యానందకందంబులై
రాకాచంద్రనిభంబులై శిఖిశిఖారారాజదుగ్రంబులై

శా. ధూమాకారము లౌచుఁ గొన్ని తమ కేల్దోయిన్ నొసల్పట్టియు
ద్దామప్రాంజలులౌచుఁగొన్ని ప్రభుచెంతన్ నిల్చి యోస్వామి!యో
స్వామీ! యేఁ [illegible] పొనరింపు మన్న రఘురాట్ఛార్దూలమున్ గార్యవే
ళామన్మానసములఁ సహాయు లగుఁ డేలా పొందు నేఁ డంచనన్

క. ప్రభువులు ప్రభుసెలవుం గొని
నిభృతాకారుని బ్రదక్షిణించి రఘుసుతున్
నభమునఁ జ[illegible] శ్రీరాముని
యుభయాక్షులు దీప్తవహ్నులై జ్వలియించెన్

క. రాముని నే[illegible]బింబుల
శ్రీమత్కాంతిప్రసార రేఖాచ్ఛటలం
దేమో యా[illegible]తిం గని
యా ముని [illegible]కుఁ గనుగొంచు నవు నవు వత్సా !

క. ఇవి యెల్లను సౌమిత్రికిఁ
దవిలి యొసఁగు మన స్వామి తమ్మునకున్ దా
నవి యెల్ల నిచ్చె సహృదు
త్సవము ససంహారములగు సర్వాస్త్రములున్

ఉ. విద్యుదరాళమాలి మునివెంబడి నౌర్వశిఖావిమర్ద మ
బ్ధిద్వయ ముగ్రధాతుసముదీర్ణవిచిత్రమనోజ్ఞవర్ణ మ
ద్రిద్వయ మింద్రచాపకబరీపరిభూషితవల్గుయాన మ
భ్రద్వయ మేగె లోవెలి ధురామహదుగ్రప్రచండమూర్తియై

శా. గాధేయుంబడిఁ బంచశీర్షకభుజంగద్వంద్వ మేగెన్ దనూ
సాధిష్ఠాకృతులై మహాదితిజకృచ్ఛ్రప్రాణ లేలిహ్యమా
నాధిక్రూరములై జగత్త్రితయరక్షాధీనచేతోమిల
త్సాధుస్వాదుమనోహరాకృతులునై శాంతామృతాక్షంబులై ౧౭౧

వ. అంత నడవికాని సస్యవంతమైన సమప్రదేశమున నేగుచు రాముండు ముందుఁ జూచి విశ్వామిత్రునితో నిట్లనియె

క. ఆ మొగిలువోలెఁ దోఁచెడు
భూమీధ్రము నంటియున్న భూజాతలతా
శ్రీమద్దేశమ్ము శకుం
తామృతమధురావములను నాకర్షించున్

క. అడవియును వెనుకఁబడియెను
బుడమియు నిది సస్యవంతముం బోలెఁ గనం
బడియెడు నదియును నేదో
జడదారుల యాశ్రమంబు చందం బొప్పున్

చ. క్రమముగ నెంతదూర మరుగన్ వలయున్ మన మింక మీఁదు నా
శ్రమమునకున్ గృతజ్ఞత భరంబయి యజ్ఞవిఘాతియాతుసం
ఘము నెగువన్ మనస్సును వగర్చెడు; నా కనిపించుచున్న యా
శ్రమములు నే పవిత్రమునిసంఘనివాసములో వచింపవే!

వ. అనిన విశ్వామిత్రుం డిట్లనియె

చ. యుగశతముల్ తపశ్చరణయోగమునన్ బ్రభువైన విష్ణు వీ
నగనికటాశ్రమస్థలి ననంతసమల్ వసియించె వామనుం
డగు ప్రభుమూర్తి పూర్వమగు నాశ్రమ మిద్దియె; యుండె సిద్ధిఁ బొం
దఁగఁ దగెఁ గాశ్యపుండును సనాతనుఁ డిం దుపదేష్టయై తగున్

ఉ. ఆశ్రమసిద్ధి కల్గు నిట నందఱకున్ దప మాచరింప సి
ద్ధాశ్రమ మంచుఁ బేరువడె నక్కతనన్ దొలిఁ గాశ్యపాదు లీ
యాశ్రమమందె సిద్ధిఁ గని రిద్దియుఁ గారణమే; ప్రభుండు యో
గాశ్రయణంబు నంది చనునప్పుడు వామనమూర్తి యుచ్చటన్

శా. ముల్లోకంబుల వింటికొప్పునను వంపుల్ వంచి వేల్పున్ సిరుల్
కొల్లల్గాఁ దెఱగంటిబంటుసిరి నొక్కుల్ వెట్టి సర్వాశలన్
జెల్లన్ రక్కసయెల్లి నీడలకుఁ దార్చెన్ దాను వైరోచనుం
డెల్లన్ వేల్పులుఁ గుందగా బలి మహాహిప్రౌఢధార్ష్ట్యంబునన్ ౧౭౯

ఉ. అంత మనోవ్యథావిచలితాత్ములు వేల్పు లనూనపాత్పురో
గంత లధోక్షజుం గనుటకై యిట వచ్చి ప్రభూ! బలిప్రభా
వంతము లెల్లెడల్ నిలువవచ్చునె మాకును గుజ్జువర్ణినై
యంతయొ యెంతయో యడిగియిచ్చిన నిల్తుముగాక యచ్చటన్

చ. అతఁడును నొక్క యజ్ఞమునయందున దీక్షితుఁడై మెలంగు నా
క్రతువు మహాఫలప్రదము కాకయె మున్న త్రివిక్రమా! త్వదా
శ్రితుల స్వకార్యమున్ సవదరింపవలెన్ బలిదైత్యుఁ డిప్డు యా
చితుఁ డనినంతఁ జాలును వ్యజింపఁ ద్రిలోకములైన వామనా!

చ. అని యనుచుండ వేల్పు లపు డచ్చటికిన్ జనుదెంచెఁ గాశ్యపుం
డనలసమప్రభుండును సమాప్తసుదివ్యసహస్రవర్షయో
గనిభృతమూర్తి సాదితి; జగత్ప్రభుఁ గాంచి తపోమయున్ దప
స్తనుఁ దపఊర్జితున్ దపఉదాత్తతమాబ్ధి స్తుతించె నీగతిన్

శా. గుప్తాదిత్యుని నిన్ను నేమి యనిన్ గోవింద! యందున్ దప
స్తప్తంబై యసితచ్ఛవిం బొలుచుఁ గాదా నీ తనూవల్లి కా
లాప్తున్ నిన్ను దిశాప్తు నీ తుదిమొదళ్లన్ గానలేమయ్య నీ
గుప్తిం బొందెద నిన్ను నే శరణముం గొందున్ జిదాకారునిన్

చ. అదితికి నాకు గర్భమునయందునఁ బుత్త్రుఁడవై జనింపవే!
త్రిదశులు నిద్దె కోరెదరు దేవవిభుండును నీవు తమ్ముఁడై
యొదిగిన చెట్టరక్కసల యొత్తిడి తీరి సుఖించు; శోకముల్
గుదులు గుదుల్ సుర ల్త్రోలఁచుకొందురు చిక్కులు తీసినట్లుగన్

మ. ఇది సిద్ధాశ్రమ మాను నీ కరుణచే నీ సిద్ధకార్యంబు సే
యుదు లెమ్మన్న నధోక్షజుం డదితియాస్యోద్గారికాంతిచ్ఛటల్
పదునై తల్లితనంబు క్రొమ్మెఱుఁగులన్ బాలింప నాతల్లి యా
వదనంపుం బద నింత రాచి శిశువై బాలుండునై యొప్పుచున్

మ. సురలుం గాశ్యపుఁ డిట్లె చూచెదరు శ్రీశుం డంతలో వామన
స్ఫురణం బొప్పఁ గిలారునవ్వులును రజ్జుల్ వింత విజ్జోడు సం
బరముల్ జందెమునొంటిప్రోవు గొడుగున్ బాఁకోళ్ళు నాశ్వత్థసుం
దరదండంబు శిఖాకమండలుముఖాంతత్రయ్యధీతిచ్ఛటల్ ౧౮౬

మ. పటుయానంబుల నొప్పి య య్యదితి నంబా! తాను వై రోచనుం
  డటె లోకాద్భుతయజ్ఞదీక్షితుఁడటే యం దేగెదర్ బుత్త్రిలం
  పటతర్ క్రుక్కుకు కంట నీరిడకు మమ్మా! యంచు నా వంచనా
  వటు వేగెల్ బలిసద్మ మచ్చట స్వధాస్వాహోజ్జ్వలద్వహ్నిగా

చ. ఒగి వటు వెంతయందముగ నుండె నటందు వటన్న లక్ష్మణుం
  డగు వటు వెంతయందముగ నైనను నుండు నటన్న రాముఁడుర్
  నగవు మొగంబుతోడఁ బయినర్ గథ చెప్పఁ డటన్న వామనుం
  డెగురుచుఁ బోయి మూఁడడుగు లిమ్మన నిచ్చెను దైత్యరాజునుర్

క. ఇచ్చిన మూఁడడుగులతోఁ
  బచ్చనిదొర పెరిగి పెరిగి పాదము కొలతల్
  హెచ్చించుచు హెచ్చించుచుఁ
  గ్రొచ్చెను ముల్లోక మడుగుకొనలర్ మనలర్

గీ. బలి వసింపంగ మిగిలిన పొలము లేక
  చచ్చిపో నెంచుచుండగా జాలిగుండె
  దొరయు బలిరాజుఁ బాతాళధరణి నుండ
  నిచ్చి ముల్లోక మింద్రున కిచ్చె స్వామి

ఉ. పుట్టుచునే బలిం గనఁగఁబోయిన బిడ్డ మఱట్టెపోయి రాఁ
  డట్టె మఱేమియయ్యె నని యా ఋషి యీ ఋషి నింగికొప్పులర్
  దట్టె నటంచుఁ జెప్ప నరుదారఁగ వించును జూచుచుండు నా
  బొట్టియ కోసమై యదితి పొంచి వగర్చుచు నాఁటినేఁటికిర్

ఉ. ఆ ప్రభు నాశ్రమం బిది మహాశ్రమనాశన మోయి రాఘవా!
  యాప్రభునందు బత్తి నిటనై యిలుఁగట్టితి దుష్టచారులుర్
  దీప్రభుజాబలుల్ దితిజధృష్టులు నిచ్చలు వచ్చి యజ్ఞహా
  వ్యప్రభుగర్చి నెత్తురుల నార్తురు నార్తువుగాక వారలర్

వ. అనునంతలోన నాశ్రమంబు దరిసిన వారి నాశ్రమస్థులైన ఋషు
  లెదురు వచ్చి గాధేయుని బూజించి రామలక్ష్మణులకు నాతిథ్య
  క్రియలు జరిపి లోనికిం గొంపోయిన                                                    ౧౯౩

గీ. ఆశ్రమమ్మును జేరిన యంతలోన
ధృతిని గాధేయునకు యజ్ఞదీక్ష పొలిచె
శ్రీరఘుస్వామి వింటిలో శిక్ష పొలిచె
ద్విజదృశాశ్రేణి విస్మయవీక్ష పొలిచె

చ. అణువణువుల్ దదాశ్రమపథాంతరధాత్రివియత్పథంబులన్
గుణనినదప్రతిధ్వనులకున్ సుడిపొందుచు లక్ష్యభీతి మా
ర్గణసహస్రప్రసారణము గామిని ధైర్యము మైఁ జరించుఁ జి
క్కణములు రామచంద్రుమెయికాంతులు చాదినఁ జల్లపాటునన్

ఉ. ఆ నిశి నొక్కకన్ను దివిజారులపై నిడి యొక్కకంటితో
నూనిన నిద్రలో రఘుకులోద్వహుఁ డాత్మ బలిక్రతుస్థలిన్
దానును వామనుం డగుచుఁ దక్కిన తారిన చాయ నెంచుచున్
దా నయినట్లు మేల్కనియుఁ దానును వామనుఁడౌట యెంచుచున్

చ. మునిసవిధంబుఁ జేరి రఘుమూర్తి యెదేనియుఁ బ్రశ్న సేయ నెం
చిన ముని దీక్షితుండని వచించుచు మౌనమిఁకాఱురాత్రులుం
జనునని చెప్పి యాఱుదివసంబులు మౌనికుఁ బల్కఁ డాఱునా
దినములు దైత్యభీతి యని తెల్పిన మౌనులు రాజులిర్వురున్

గీ. సరి యుషస్సుననుండి యుషస్సుదాఁక
చరమసంధ్యంబడి చరమసంధ్య దాఁక
బద్ధగోధాంగుళిత్రాణబాణతూణ
కార్ముకులు దైత్యలోకభీకరులు నాఁచు

ఉ. అల్ల భృశాశ్వపుత్త్రికులు నైన మహాస్త్రములెల్ల శ్రద్ధమై
మొల్లముగా రఘుద్వయవిముగ్ధమనస్సు చివళ్ళ వేచుచున్
ఫుల్లమహాప్రభన్ జనె సమున్నతుఁ డే నిముసంబులోన నే
భల్లముఁ దీయునో యనుచు భక్తిభయంబులు సందడింపఁగా

గీ. సరగ నాఱవదినమున చరమసంధ్య
యెఱ్ఱనై యెఱ్ఱకాంతులు నెల్లదిశలు
పేరెములువారి యాశ్రమాభిముఖమౌచు
వచ్చుచున్నట్లు తోఁచిన వానిఁ గాంచి

గీ. రామచంద్రుండు సౌమిత్రితో మఱి మఱి
చూచితే కాంతు లిచటికిఁ జొచ్చుటేమి
కదుములుగఁ గట్టి తమ్ముఁడా! కార్ముకంబు
నందున సమాహితుండవై యరుగుమనిన

వ. సోపాధ్యాయపురోహితయు సదర్భచమసస్రుక్కయు ససమిత్కుసు
మోచ్చయయు సర్త్విజయు సవిశ్వామిత్రయు నైన యజ్ఞవేది భగ్గు
మని మండిన

క. అగ్ని యస్రుక్స్రవక్కాంతివి
భగ్నజ్వాలముగఁ గాకమున్న రఘుసుతో
ద్వ్యగ్నమహామాస్త్ర మొక్కం
డగ్ని యస్రుక్స్రవశత లేనిదై యింకించెన్

గీ. రామలక్ష్మణబాణపరంపరాకృ
తమ్మ యోదారుకాయమానమ్ము పొలిచె
యజ్ఞవేదికోపరిగగనాంగణమున
సుహుతమై యజ్ఞకార్యంబు శోభ నొందె

ఉ. అంతట వార్షుకంబులగు నభ్రములై గగనంబు రాక్షసా
క్రాంతి ఫెళాఫెళార్భటులుగాఁ బటుగర్జలు గాఁగ రక్తవ
ర్షాంతవిచిత్రధారలుగ నైన రఘూద్వహు నస్త్రదేవతల్
చెంతలఁ జెంతలన్ విరియఁజేసినఁ జిన్కును రాదు వేదిపై

శా. ఆకాశంబున రెండు భీకరమదేభాకారముల్ గాగ నూ
రీకృన్నైల్యతనుల్ సుబాహుఁడును మారీచుండు హుంకారగ
ర్జాకల్లోలితవాయువీచు లయి సంరంభాత్ములై ఘోరసే
నాకోలాహల మేచి వచ్చిరి నిరంతక్రోధబాధాత్ములై

శా. ఆకాశంబున దైత్యులిద్దఱును నెందాచుందు రందంద సూ
లై కన్పించెను రామకార్ముకము దైత్యద్వంద్వ ముద్వేలదం
ష్ట్రాకోటీవిగళద్భయంకరతరాట్టప్రౌఢహాసుల్ వియ
త్ప్రాకారోజ్జ్వలదుగ్రచంక్రమణులై వర్షింప రక్తాంబువుల్ ౨౦౭

శా. దైత్యుల్ కార్ముకచండమూర్తుల రఘూత్తంసద్వయంబున్ గ్రుధా
హాత్యుద్దీపితచండహుంకృతిపరీహాసంబునన్ దాఁకినన్
సత్యక్రోధుఁడు రామచంద్రుఁడును దా సౌమిత్రిఁ గంచున్ వృథా
దైత్యుల్ చూడుము హుంకరించెదరు వ్యర్థక్రీడనారంభులై

ఉ. గాలికి దూదిపింజలునుగా విదలించెదఁ జూడుమంచు నా
భీలతరోగ్రకార్ముకనివిష్టమహానిలబాణుఁ డస్రపో
ద్వేలచమూవికీర్ణముగ వ్రేసిన దైత్యబలంబు గాలికిం
దూలి యెటేనిఁ గొట్టఁబడి తోఁచదు మిన్నున నెంతదూరమున్

మ. తమసైన్యంబులు తోఁచకుండినను దైత్యద్వంద్వ మాభీలవి
క్రములై రామునిపైకి దూఁకుటకు రా రాముండు మారీచువ
క్షమునం దూసిన మారుతాస్త్రమున రక్షస్సాక్కు నూఱామడల్
భ్రమితుండై చని సాగరంబునఁ బడెన్ బారుష్యవేగంబునన్

క. తప్పించుక పోకుండఁగ
నప్పుడ యాగ్నేయ మస్త్ర మరివోసి యెదన్
జొప్పించె సుబాహు నతఁడు
గప్పున మండి యొకబొగ్గుగా ధరణిఁబడెన్

చ. అల మఱునాఁడు పూర్తియయి యజ్ఞము దీక్ష పరిత్యజించి వి
హ్వాలపదయుగ్ముఁడైన ముని వచ్చి రఘూద్వహుఁ గౌఁగిలించి నా
తల మగునే నినుం బొగడ దాశరథీ ! శరధింబలెన్ దిశా
వలి వలిమంచునిగ్గులకుఁ బట్టితివోయి; నిరీతికల్ దిశల్

క. ఇది సిద్ధాశ్రమ మోయీ !
యిది సిద్ధాశ్రమ మొనర్చి తేమందునయా !
యుదితమహాకార్ముకసో
గ్రదోఃప్రతాపనవవహ్నికా! యని మెచ్చెన్

క. రాముఁడు మౌనిపదంబుల
నామస్తక మంజలించుటయి వంగి ప్రభూ !
స్వామి! యొక శిష్యలేశము
నీ మాదిరిఁ బొగడవచ్చునే యని పలికెన్

చ. ఋషిపరిషత్పరీవృతుని బ్రేమము భక్తియు గౌరవంబుగా
హృషితులు రామలక్ష్మణులు నేగి మునీంద్రుని గాంచి స్వామి నీ
కృపఁ ఫలియించె నింక నిటఁ గింకరు లేమి యొనర్తురయ్య! నీ
విషయమునందు మాకుఁ బనివెట్టెదె యంచును దోయిలించిరన్

వ. అంతఁ బారిషదులైన మును లిట్లనిరి

చ. జనకుఁడు మైథిలుం డొక ప్రశస్తము యజ్ఞము చేయుచుండె మే
మును జనుచుంటి మల్ల సవభూమికి మీరును వచ్చుచుండి రం
దున నొక యద్భుతంబగు ధనుస్సు మహాబలమున్ బ్రచండమున్
మును సురదత్త మా ధరణిపుండును బూజ యొనర్చు దానికిన్

వ. దానిని దేవతలు గంధర్వులు నసురులు రాక్షసులు నెక్కిడలేరు

చ. ప్రభువులు రాజపుత్త్రికులు వచ్చిరి దాని బలం బెఱుంగ సా
రభుజులు కోటివంచుటకె రా దిఁక నెక్కునె యల్లెత్రాఁడు? త
చ్ఛుభదము విల్లు రా జగురుసొంపులధూపములన్ యజించు; మీ
రభయులు దానిఁ జూచెద రహో! బలశాలులు రాజపుత్త్రికుల్

వ. ఆయాగభూతమ్మౌ ధనుస్సు చూతురు గాని యని

గీ. బయలు దేరిరి ఋషులును బండ్లపైని
నగ్నిహోత్రంబు లెక్కించి యంత గాధి
సుతుఁడు నాశ్రమదేవతావితతి సెలవు
వేఁడి నేఁ బోయివచ్చెదఁ గూడి యనుచు

చ. సురనదియుత్తరంబుతటి సుగ్గడితంబులు మంచులా ధరా
ధరమున కేగివత్తు నని తానును వెంబడివచ్చు నాశ్రమాం
తరమృగపక్షిసంతతుల నవ్వులతో మఱలించి మించి వే
గరులగు నెద్దులున్ ఋషులకన్నను ముందుగఁ బోవుచుండఁగన్

వ. బహుదూరంబు పోయి శోణాతీరంబున విడిసిరి; సూర్యదేవుం డస్త
మితుం డగుడు హుతహుతాశనులై మహర్షు లందఱు విశ్వామిత్రుం
జుట్టి కూర్చుండిరి; శ్రీరామచంద్రుండు గాధేయునిముందు నిషణ్ణుం
డయ్యె; అయి కౌతూహలియై ప్రాంజలించి సమృద్ధవనశోభితంబైన
యీ దేశం బెయ్యది?

చ. తపములు గల్గునేమొ! యరుదార మహత్త్వము గల్గునేమొ! యీ
కృపయును గల్గునేమొ! మఱి యే ఋషులందుననే రసోల్బణా
నుపమముగాఁ గథాకథన ముండదు మీవలె; మాకుఁ జెప్పఁడా!
యిపు డన రామచంద్రుఁ డనవెంచి హసించుచు మౌని యిట్లనెన్

గీ. చిన్నికథఁ జెప్పి నీకు నీచేత నొక్క
యేమహాకార్యమోను జేయింతు నింత
యల్పసంతోషి వేమి రామా! యటంచు
నవ్వె ఋషి; యెల్ల ఋషులును నవ్వినారు

క. తల వంచికొనియె రాముఁడు
సొలపున నగ్రజుని వంకఁ జూచెను దమ్ముం
డలఘువు మౌనికథాకథ
నలపనదళదభిముఖీనయనుం డగుచున్

వ. ఓయి రామచంద్ర! బ్రహ్మయోని కుశుం డను మహాతపస్వి కలఁడు;
అతఁ డక్లిష్టవ్రతధర్మజ్ఞుండు; సజ్జన పూజితుండు; ఆయనకుఁ గులీన
యైన వైదర్భియందు కుశాంబుఁడు కుశనాభుఁడు నధూర్తరజసుఁడు
వసువు నను నలుగురు సుగుణోల్బణులు పుత్త్రులు గలిగిరి

మ. దలదుత్సాహుల దీప్తిమంతుల మహాధర్మిష్ఠులన్ సత్యవా
దులనుం గాంచి కుశుండు పుత్త్రకులఁ జేతోవీథి క్షాత్త్రంబు ని
ర్మలధర్మంబును సౌఖ్యపాలనముగా మన్నించుఁడీ ధాత్రిఁ బు
ష్కలతన్ మీరని చెప్పె వారును పితృస్వాంతంబు నుప్పొంగఁగా

వ. మహాతేజస్కుఁడైన కుశాంబుండు కౌశాంబీనగరంబును మహా
త్ముండైన కుశనాభుండు మహోదయం బను పట్టణంబును నధూర్త
రజసుండు ధర్మారణ్యంబును వసువు గిరివ్రజంబును నిర్మించిరి

ఉ. తీరికయైన యీ వసుమతీపతి యౌను వసుక్షితీశ్వరుం
డీ రమణీయముల్ గిరులు నీ సుమనోహరముల్ వనీతతుల్
శ్రీరఘురామ! యైదగు గిరీంద్రములంబడి వేళ్ళు ప్రాకెనా
బాఱెడు మాగధీనదియుఁ బాయలు పాయలుగాఁగ నిచ్చటన్ ౨౩౦

ఉ. నా పినతాత యా వసువు నాయన! నేనిటఁ బిన్ననాఁడు క్రీ
డాపరమాత్మఁడై మసలుటన్ బ్రతియంగుళమైన భూమి సం
థాపరిదీప్తమై పరిచితంబగు నా కిఁట; నిందు గాలులున్
నాపయి నల్లనాఁడు కరుణామయముల్ మృదువాస్నవీమముల్

వ. కుశనాభుండు ఘృతాచి యను నప్సరసయందు రూపవతుల స్వాలం
కృతల యౌవనవతులఁ గన్యాశతంబు నావిర్భవింపఁ జేసిన

గీ. నాఁటు తెలినీటి పడియలు నూఱుమెఱపు
లొక్కమొగి మిన్నుమన్నున నొరసె ననఁగ
నగలతో నృత్యవాద్యగానములతోడఁ
బోయి రుద్యానమునఁ గ్రీడఁబొంది వారు

శా. ఆ లీలావనిఁ గేళివీచి యనిలుం డా స్నిగ్ధలావణ్యశో
భాలాఘాపదలోభనీయతనులన్ బ్రాదుర్భవద్యౌవన
జ్వాలాదీపశిఖాభిరామతనులన్ బర్వేందుబింబాననా
లోలశ్రీరుచితోరణాచ్ఛతనులన్ లోనూరి లోనూరుచున్

ఉ. జాలిగఁ గాంచికాంచి యెద జాలిసొదం బడి డింది డింది కాం
తాలినిఁ జూచి; కోరెదనె యంగన లందఱ మిమ్ము నాంధ్రుగా
నోలిని వందమంది యగుఁ డొప్పుగ నాకన; వారు చప్పటుల్
గా లలిగాఁ గిలాకిలలుగాఁ బెనునవ్వుల చిల్కరింపుగా

గీ. వందమందిమి నీకుఁ గావలెనె యన్న
బిగువుచెడి మోహమున గాలి ముగుదలార!
యేలఁ గాకూడదే? మీరు నెవతె కారె
యందకత్తియ? తప్పక యగుఁ డటన్న

శా. తాతా యంచు నొకర్తు; నోర్తుమొగమందం బెల్ల నొయ్యారమై
నీ తాత్పర్యము వంద చాలుదుమె ? కానీ చాలమేమో? యటం
చీతుల్ కల్గెనె స్త్రీలకం చని యొకర్తీలాగు కైలాగులై
చేతుల్ తట్టుచు నవ్వుచున్ వనిత లిస్సీ!యంచు నీ! యంచునున్ ౨౩౭

గీ. కేకిసలనాడ వాయువు కెరలి నే నె
వండ నని? వాయుదేవుండ వనితలార!
మానుషము యౌవనము లిప్తమాత్ర మింక
నన్నుఁ బొంది యమర్త్యలై యున్నఁ దగదె?

చ. మలయధరాధరోదరకుమారసమీరునితోఁ బటీరగం
ధిలతరుశాఖికాకుసుమనిహ్నుతకుంజతలంబు లందుఁ జె
మ్మలురియుచోటులన్ సమదమాన్మథబంభరగీతి మ్రోయుచో
టులు వెగటే సుఖింపఁగ? నటుల్ ననుఁ బొందుడటన్న వారలున్

చ. ఎద భయమందినట్లు క్షమియింపు మటంచును వారు వారు క
స్తుడలను గోసఁగా నగుచు దోసిలులన్ గుశనాభుకూఁతులన్
మది మము నీ వెఱుంగుము సమర్థుల మీ వనిలుం డటం చెఱుం
గుదుము తపోనిధానునకుఁ గోపము తేకుము మాదు తండ్రికిన్

చ. అడుగుము పోయి మాదు పిత నాయన యిచ్చెనయేని నీ కహో
యుడుగర లాదు మే మనిన నుల్లసపుంబలుకై ప్రభంజనుం
డిడియఁగఁ జేసె తత్తనువు లెల్లను గోపనుఁడై కుదించి వా
రడలుచుఁ దండ్రియిల్లు చని సాస్రవిలోచన లౌచు సత్రపల్

క. బ్రాతి నిలు వెడలకుండినఁ
గూఁతులఁ గనుగొంచు రాజు గుజ్జుల వనటన్
గూఁతయిడి; యేమి తల్లులు!
కోఁతయిడినయట్లు చేసికొంటిరి తనువుల్

క. ఏధర్మ మతిక్రాంత మ
సాధు వెవఁడు మిమ్ము నిట్లు సలిపె ననఁగ నా
గాధ సకలంబుతో సం
బోధించిరి తండ్రి గాలి ముడియించుటలన్

క. కుశనాభుండు క్రుధాపర
వశుఁడై యంతంత బిగియఁబట్టి యెడందన్
గృశతనులఁ గూఁతులం గని
దృశానిభృతరోచి యిట్లు తెలియన్ బలికెన్

క. క్షమ! తల్లులార! క్షమయే;
క్షమ యెంతటి దండు? క్షమయె జన్నము యశమున్
క్షమ సత్యంబును దానము
క్షమచే నావిష్టమగు జగం బఖిలంబున్

ఉ. ఓరిమివంటి దెందు నొకఁ డుండదు మిమ్ముల నిట్లు చూచి నే
నోరిమిఁ దాల్చుచుంటి నన నోరిమి మీరును దాల్చుఁడీ! యిదో
యోరిమి దేవతావిషయమో! యది యెన్నిమడుంగు లుత్తమం
బో! రవణంబా! యంచును దనూద్భవలన్ విడి రచ్చ కేగుచున్

గీ. మంత్రులం గాంచి నాదు కుమార్తెలకును
బేరి సంబంధమును జూచి పెట్టుఁ డనిన
వారు గాంపిల్యపతియైన బ్రహ్మదత్తు
పేరు చెప్పి తన్మహిమలు పేరుకొంచు

ఉ. సోమద యన్న యచ్చరయుఁ జూళిమహర్షి తపంబు సేయుచో
నా మునిసేవఁ జేసి ఫల మందెడువేళ స్తుతించి నిల్చినన్
సోమద కూర్మికౌసుతకుఁ జూళియుఁ బ్రీతుఁడునై వరంబు నీ
వే మని కోరెదో యడుగు మిచ్చెద నన్నను నామె యిట్లనెన్

ఉ. ఒక్కనియాలు గాను; మఱియొక్కఁడు లేఁడు ప్రియుండు నాకు; నీ
దిక్కన నైతి నన్ననుమతింపుము బ్రాహ్మతపోనిధానునిన్
జిక్కనివాని నాకు దయసేయుము పుత్రు ననంగఁ జూళియున్
జిక్కని బ్రహ్మదత్తు దయచేసెను సోమద కంచుఁ జెప్పఁగన్

ఉ. పేరిమి బ్రహ్మదత్తుఁ బిలిపించి సుతాశత మిచ్చె రాజు తాఁ
బేరిమి బ్రహ్మదత్తుఁడును బెండిలియాడెను వారి నెల్ల నా
ధారణినేత హస్తమున దాఁకినఁ దన్మహిమప్రతారితుర
ద్దై రమణీతనూలతలయం దనిలుంఠ వికుంభితుంఠగా

శా. ఆ లీలావతులున్ మనోజ్ఞతనులై యాస్నిగ్ధలావణ్యశో
భాలాతూపదలోభనీయతనులై ప్రాదుర్భవద్యౌవన
జ్వాలాదీపశిఖాభిరామతనులై పర్వేందుబింబాననా
లోలశ్రీరుచితోరణాచ్ఛతనులై లోలాక్షులై యొప్పఁగన్ ౨౪౧

చ. లలితపురాతనామసృణలన్ గుశనాభుఁడు కౌఁగిలించి కూఁ
తులఁ బెనుసారె చీరలను దోకొని పొమ్మని బ్రహ్మదత్తు నిం
డ్లులకును బంచె నచ్చటఁ గడుంగడు సోమద వారిఁజూచి క
న్నులఁ దెలినీటిబిందువులనో సితముక్తలనో వెలార్చుచున్

ఆ చూచి చూచి వారి సుందరమూర్తులు
తాఁకి తాఁకి వారి తలిరొడళ్ళు
మెచ్చి మెచ్చి వారి మేలైనయడకువల్
గ్రుచ్చె గ్రుచ్చె నెదకుఁ గోడలులను

చ. ఒకశతమయ్యుఁ గూఁతులు మఱొక్కఁడు పుత్త్రుఁడు లేక కన్నదో
యికిఁ గను కేఁది పౌత్రియగు నిష్టిని జేసెను దాత! తాతయి
ష్టికిఁ దొలియంకురార్పణము చేసెఁ గుశుండును బ్రహ్మసూతి పు
త్త్రికుఁ గని 'తండ్రి! నీ కొడుకు రాజిలు గాధి నిరంతకీర్తియై'

మ. అని తేజఃపథముల్ గమించి యొకఁడై యాకాశవీథిన్ సనా
తనమై యొప్పెడు బ్రహ్మలోకమును బొందన్ బౌత్రియుం బూర్తినం
దెను నగ్గాధియు ధార్మికోత్తముఁడు జన్మించెన్ దిశాచంద్రికల్
నినుపుల్ కీర్తులు గ్రుచ్చియెత్తి తనుకందెన్ గాధి సాధీయుఁడై

ఆ. ఉషసు తమ్మిమోము నొప్పెడు రఘురామ!
యిందురోచి నవ్వు లేచు తండ్రి!
గాధిసుతుఁడ నౌట గాధేయుఁడను నేను
గుశునికులము నగుటఁ గుశికసుతుఁడ

వ. నాకు సత్యవతి యని యక్కగారు కలదు; ఆమెను ఋచీకున కిచ్చి
తిమి; ఆమెయు భర్త ననుసరించి సశరీరమ్ముగ స్వర్గమ్మన కేగె

ఉ. ఏగిన యామె యల్లె ప్రవహించెను గౌశికి యన్న పేరుతో
సాగరవ్రాఁతగా విమలవాహినియై హిమవద్గిరీంద్రభూ
భాగము నాశ్రయించి యనపాయిని లోకహితార్థ మమ్మహా
భాగిని యొడ్డునన్ బహుళభక్తిని నాశ్రమ మేను గట్టితిన్ ౨౫౮

ఉ. శాంతయు నిన్ను నెంతొ రఘుసత్తమ! యాయమ నన్ను నంతగా
నంతకుమించి చూచెడిది; యాయమ యొద్దన నున్న నన్నుషః
కాంతసరోజషండముల కమ్మని తావులు దిమ్మరించుచున్
బ్రాంతతరంగముల్ చలువ లార్చి కమండలుపూర్ణవారిగన్

సీ. చలికాలమున హిమాచలగంధకావర్త
ముల నీళ్ళలను వెచ్చగిలఁగఁ దెచ్చి
వేసంగిలో మంచుపూసకట్టులనీళ్ళ
లొద్దుము త్తెపుబిందు లొత్తిగించి
తెలవారుచో బ్రాహ్మతీర్థమ్ము కోసమై
గోరువెచ్చనినీరు గులకరించి
యటు కమండలు వొద్దునం దుంచి యిటుచూడఁ
దిరిగిచూచెదులోనఁ దీర్థమెత్తి
తాన మాడంగఁబోయిన తరగ మొత్త
ములను నా మూర్ధమునయందు మూరుకొనుచు
నేచి యేచి మా యవ్వ ఘృతాచికన్న
నలరు క్రొందమ్మికన్నుల నారఁగూరు

శా. నే నేతాదృశవత్సలన్ విడచి తండ్రీ! యొక్క సిద్ధ్యర్థమై
శ్రీనారాయణపూర్వదివ్యచరితన్ సిద్ధాశ్రమాస్థానిఁ బో
నైనాఁడన్ రఘుదేవ! నీదు కృపచే నా సిద్ధియున్ గల్గె నీ
వే నారాయణుఁ డందు; సిద్ధి నిడి తీవే కాన నా పాలికిన్

క. అది యీ దేశపుఁ గథన
మ్మిదియును నా జన్మకథన మీ వడుగుటచే
నిది చెప్పకుండ నాగక
వదలితి సర్వంబు త్వత్కృపాశ్రోతృతకై

క. అనినంత సర్వబుషులకుఁ
గనులుం జెమరించె మేనఁ గంపము పుట్టెన్
వనజాప్తవంశసుతుఁకు
ముని తెలిసెను నంతలోన ముని తెలియుచునే                                                   

ఉ. పెద్దయుఁ బ్రొద్దుపోయెఁ బసిపిల్లలు మీకును జెప్పలంబడెన్
నిద్దురముంపు తోఁచెడెని నేఁటికిఁ జాలు మృగద్విజావళుల్
సద్దు మణాఁగె నల్లెడ నిశాచరు లాడెద రింకఁ బోవుఁడా!
తద్ద యపేతవిఘ్నముగ జారియు జేపగుఁగాక బాలకుల్

శా. మీ యారోగ్యము చూచుకోవలె నయా! మీతండ్రి కష్టంబుతో
నా యెంబో మిముఁ బంప నన్నుబడి యుంచన్నన్ ఋషుల్ సాధుసా
ధ్వాయామస్తుతిసంతతిన్ నెఱపి యూహా! బ్రహ్మకల్పుల్ భవ
చ్ఛ్రేయోరాశికి లేంద్రము లెల్లయను నీ చేతంబు బ్రహ్మభమున్

ఉ. కౌశికి యేమి కౌశికి? ప్రకాశితవారి సరిద్వరిష్ఠ మీ
దేశము మీరుసున్ వెలుఁగు తెచ్చిరి ధాత్రి కటంచుఁ బోయి మా
ర్గాశయనంబులందు నిదురంగని రా రఘుయుగ్మకంబు ధీ
నైశితవృత్తి తోచు మననంబును జేసిరి మౌనివాక్యులన్

ఉ. రాము నెడందలో గిరగిరన్ దిరిగెన్ గుశవంశరాజతే
జోమహిమంబు లచ్చరలశుద్ధమనస్సులు వారి శాంతియున్
శ్రీమతి కౌశికీనదియుఁ బ్రేమనిధానము శాంత యంతటన్
స్వామి కవే యవే తిరుగసాగెను నిద్దురపట్టునంతకున్

కం. శ్రీరామచంద్ర! యిదె తెల
వారెన్ లేవఁగదవయ్య! పైఁబోవలయున్
దూర మను కుశికసుతగం
భీరారావంబు వించు మేల్కని యంతన్

వ. రామలక్ష్మణులు పౌర్వాహ్ణికక్రియలు నిర్వర్తించి విశ్వామిత్రుం
జూచి

క. ఈ శోణ పులినమండిత
యీ శోణ యగాధవారి యెటు దాటఁగనౌ
నీ శోణ యనిన నవ్వుచుఁ
గౌశికుఁ డొక త్రోవ కలదు కాల్నడకైౖ

చ. ఋషు లోకగుర్తుగాఁ జనెద రేను నెఱుంగుదు నాదు వెంట మీ.
రిషువులు వస్త్రముల్ పయికి నెత్తుచు రండని శోణ దాటి యా
ఋషులును రాఘవుల్ పథ మదెల్ల మనోజ్ఞవనంబు లౌటచే
హృషితులు చూచుచుం జనిరి యెంతయు దూరము వేగగాములై

చ. నెఱి నెఱి ప్రొద్దు వచ్చె నడినెత్తికి గంగయు వచ్చె నంబువుల్
తఱిఁదఱి లేచి లేచి చిఱుకల్ కెరటంబులతోడ నంచలున్
గఱి గఱి రాచి రాచి మొలకల్ చిఱుకాంతులు కందళింపఁగా
గిఱికలు పెట్టినట్లు నవకీర్ణములైన జలంబుఁ గాంచుచున్

శా. భిన్నాధాత్రి వళే పితాళ్లకును గంభీరాంబుమూర్తీ! మహై
నస్సంహారిణి! త్వత్కృపీటనిచయాంతర్లీనమై స్త్రింశికా
ర్చిస్సుల్ మాకును రక్షఁగా నిలుపవే శ్రీవారి! నీ దివ్యపా
థస్సమ్మేధిత దేహాయష్టులుగ సంధానింపవే పావనీ!

వ. అని మహర్షులెల్ల కృతస్నానులై పితృతర్పణంబులు సేసి యగ్ని
హోత్రంబులు సేసి హవిఃప్రాశనానంతరంబున

శా. విశ్వామిత్రుని చుట్టుఁజేరిన మహావీరుండు శ్రీరాముఁ డీ
శశ్వద్వారి త్రిమార్గగాప్రథకు నే చందంబునన్ వచ్చె నీ
యాశ్వీనాక్రమణంబులో యను కథాత్తానంతవిజ్ఞాన మే
విశ్వంబుల్ వెలిగించు నా యెడఁద నే విందున్ వచింపంగదే!

క. అన ముని యనె హిమగిరియును
మనోరమానామధేయ మగువ యిరువురన్
దనయలఁ గని రీ గంగను
మునుపుఁ బిదప నుమను బూతమూర్తుల సుతలన్

మ. ఒగి ముల్లోకముఁ ద్రావ నీ రనుచు లేకున్నన్ మహౌఘంబులున్
బాగలై జీబులుకట్టి దమ్మిన నిలింపుల్ దేవకార్యార్థమై
నగరాజున్ దన పెద్దకూఁతు నడుగన్ నాకావనీభోగిరా
డ్జగతీవాహినిగాఁగ నిచ్చెను మహాత్మభృత్తు రాహుత్తునై ౨౭౭

గీ. తోణకిసలగంగఁ జేతుల దూసికొంచు
మణిసిరులగంగ బుజముల మార్చుకొంచు
మోసికొనిపోయిరని నిలింపులు తలంపు
లాస కొసలంట గంగ స్వర్గాభిముఖులు

క. ఏయమ్మ మిగిలెనో మఱి
యా యమ్మయుఁ జిన్నకూఁతు రాత్మనియమన
వ్యాయతి నుగ్రతపశ్చ
ర్యాయతియై వేలకొలఁది నబ్దము లొప్పెన్

క. రుద్రున కొసంగె నామెను
రుద్రాణిగఁ గూఁతు భూధరుండు; నగసుతల్
భద్రాకృతు లఖిలజగ
ద్భద్రాకృతులైరి సర్వవంద్యలు జగతిన్

వ. ఆ తల్లి యట్లయ్యె, నీ తల్లి యిట్లయ్యె; ఇది వారి కథ

క. అరుణగరుదంతసుషమన్
మరాళసతి మింటి కెగురు మాదిరి రక్తాం
బురుహాంచల గంగానది
సురలోకపథంబుఁ బట్టెనూ ! రఘుతిలకా!

మ. అనినన్ రాముఁడు మీ కిదిన్ శ్రమయుగా నొనేమొ? రేయెల్లఁ బ్రొ
ద్దును నట్లే కథఁజెప్ప నైనయది యెందున్ మేము సౌఖ్యంబుగా
వినుటే కష్టము కాదనన్ మునియు నవ్వెన్; నవ్వి కాదోయి! నీ
వినుటే బ్రహ్మరథంబు నా కనియె; నవ్వెన్ రాముఁ డుత్సాహియై

చ. మఱి ధరణీధరేంద్రుని కుమారిత యాయమ పెద్దయామె; పెన్
జఱియలు మీఱి తండ్రి గిరిచాయలు దాటి సురాళి వెంబడిన్
బఱచినయామె; ముజ్జగము వాఁగులు తీర్చిన బాటసారి యే
తెఱఁగున నయ్యెఁ జెప్పవుగదే మునిలోకశిరఃపరిష్క్రియా! ౨౬౪

ఉ. గాధిసుతుండు చెప్పె శితికంఠుఁడు పార్వతిఁ బెండ్లియాడి సం
బాధముతో తపస్సులును బండిన స్వామి సతీస్పృహాళువై
యా ధవళంపుఁదేజమును నా యసితంబగు తేజముఁ నిరా
బాధముగాఁగ దివ్యశతవర్షము లల్లె చనన్ జనన్ జనన్

క. ఋభువులు గగ్గోలై యా
ప్రభువులు ప్రసహిష్ణుతకును బట్టని వేనిన్
ప్రభవింతురోకో యని యా
త్మప్రభువుం గయికొని కపర్ది దరిసి వినమితుల్

క. దైవములకు దైవమ వీ
దేవాళిం గరుణఁ గనఁగదే! నీ తేజం
బీ విశ్వంబు ధరించును
నీ వుమతో బ్రాహ్మ్యవిధిని నిలుము తపస్వివై

శా. నీ తేజంబు వినిగ్రహించినను దంద్రీ! పట్టలే మందునన్
నీ తేజంబును నీ తపస్తనువు నందే నిల్పవే యన్న నా
భూతేశుం డటులే సుఖింపుఁ డయినన్ బాంగారి యుద్గీర్ణమా
నీ తేజంబు ధరించు నెవ్వఁ డనినన్ బృందారకుల్ భక్తితో

క. అడిగెదమ యొప్పికొనునో
పుడమి యనఁగ నొప్పికొనియెఁ బుడమియు శితికం
ఠుఁడు తన తేజము పుడమిన్
విడిచెను గిరికాననాంతవీథులు పఱవన్

క. జిఱిగొనిన వెలుఁగురాపిడిఁ
దఱివడి తేజోఽసహిష్ణుతన్ ధర వడఁకన్
దెఱగంట్లు హుతాశను న
క్కఱకుం దేజమ్ముఁ బూనఁగాఁ బ్రార్థింపన్

ఆ. పూని తేజ మగ్ని చే నభివ్యాప్తమై
శ్వేతపర్వతంబు క్షితి జనించె
శరవణంబు బ్రహ్మధురమును జనియించె
నెందుఁ గార్తికేయుఁ డొందె రూపు

చ. తెలచి యుమామహేశ్వరుల దేవతలున్ ఋషులున్ యజించి రా
వల నుమయున్ సమన్యువు నపత్యమునన్ విగృహీతయై సురా
వలిఁ గనకంటి జేగురులఁ బట్టి స్వదారలయం దపత్యవున్
ఫలమున మీరునుం దొలఁగి బాయుఁ డటంచు శపించె నుగ్రయై

శా. అంతం ధాత్రిని జూచి యానె యన నానానంటి మాతృత్వపున్
సంతోషంబునఁ బాయఁబెట్టి బహుశాఖాశాఖాలతో భిన్నులా
కాంతుల్ గల్గఁగఁ బొమ్మనెన్ శపితులై కన్నుల్ ప్రవాశ్యామికా
క్రాంతిన్ జూచి సురావళిన్ మృడుఁడు వేగన్ దత్స్థలిం బాయుచున్

క. పడమరఁగ నేగి హిమగిరి
గుడికిఁ దిరిగి యుత్తరంపుఁగొమ్మ గిరిజతో
మృడుఁడు వసియించెఁ గొడిమను
నుడుగక తప సాచరించు చుండగ నిచటన్

చ. జడిజడిగా నురభ్రసమజంబుల కైవడిఁ దోలె వృత్రుఁడున్
మడఁకలుగా సుపర్వులసమాజము మేల్పడవాలు లేకయున్
నడుపఁగ వేల్పుసైన్యములు నాథుఁడు లేక కృశింపుచుండి బి
ట్టడలుచుఁ బద్మయోనిఁ గని సాగ్నిపురోగములై సురావళుల్

క. ఇడిన పడవాలు తేజపు
కడలై యిందాక రూపుకట్టఁడు ప్రభువా
మృడుఁడు తపమేచు మజి యీ
తడకును నీవేమి చెప్పెదవు చెప్పుమనన్

చ. హిమగిరిరాజకన్య వచియించిన శాపము రిత్తవోవునే
కొమరులు మీకుఁ గల్గ రదిగో శివతేజము నగ్ని గాంగవా
రి ముడిచెనే జనించును నరిందముఁడౌ పడవాలు నాతనిన్
హిమగిరిరాజకన్య సుతుఁడే యనునట్టుగఁ గూడ గాంచెడిన్

క. అని బ్రహ్మ యనిన దేవత
లును గైలాసమున కేగి లోహితమూర్తిం
గని వహ్ని దేవకార్యం
బునకు నియోగింప వహ్నిమూర్తియుఁ బెలుచన్

క. తెఱగంట్లతోఁటకోరడి
నఱిముఱి నొరసి చను వారి నారసి పడవాల్
గుఱుమగు జడముడిదొర జే
వుఱు తేజము గర్భమందుఁ బూనవె యంచున్

ఉ. ఓ పరమంపువారి! యిదియున్ బ్రియమారఁగ వేల్పుపిండు సే
నాపతికామ్యచే నడిగినా రన గంగయు దివ్యమూర్తియై
యా పరమంపుఁదేజమును నందిరఁ గుల్యలు స్రోతసుల్ వృష
చ్ఛ్రీపరిపూర్ణవేణికలు చెందిన తేజము నుమ్మలింపఁగా

ఉ. వాహిని పట్టలేక హుతవాహ! యిదేటికి ప్లుష్టమయ్యె నా
దేహము నోర్వఁజాల నన దేవపురోహితుఁ డౌనయేని నీ
వే హిమవత్పదంబు నొలయింపుము తేజమునా విసృష్టమై
బాహిరిలంగ స్రోతసులు ప్రౌఢము తేజము గంగ త్రోసినన్

వ. ఇట్లు వెలార్చిన గర్భంబు మావి రాగియు నుక్కును దగరంబును సీసమ్మును నై యనేక ధాతువు లుద్భవించె గర్భమ్ము దూసినచోటఁ దప్తజాంబూనదం బయ్యెఁ దదాది సువర్ణంబునకు జాతరూపం బను పేరు కలిగె; గర్భంబు శిశువై కేవ్వున నేడ్చినఁ బాలిమ్మని దేవతలు కృత్తికల నడిగిరి; వారును దమకుఁ గొడుకు దొరకినదే చాలునని పాలిచ్చిరి; ఆ బిడ్డయు గంగాగర్భమునుండి స్కన్నుఁ డగుటచే స్కందుండును కృత్తికలు పాలిచ్చుటచేతఁ గార్తికేయుండు నయ్యె

ఉ. ఆర్వురపాలు త్రాగుటకు నాఱుమొగమ్ములు పెట్టి త్రావె నా
శర్వుని తేజ మొక్కదివసంబునఁ ద్రావిన పాలచేవచే
గర్వితదైత్యయూథములు క్రమ్మరిలం బడఁజేసె స్వామి స్వ
స్సర్వదళంబు వృత్రునగచాట్లను నొడ్డుకొనంగ నైనదిన్ ●

మ. సదయుం డాశ్రితపారిజాతము సుమీ స్కందుండు తద్భక్తు లా
పదలన్ మెట్టరు నాయువుం బరమమై పౌత్రుల్ ప్రపౌత్రుల్ వెదా
వెదగాఁ దామరతంపరై తుదకు దివ్వేన్ స్కందసాలోక్య మం
దెద రోయీ రఘురామ! చాపముఖసందిగ్ధాసురాసువ్రజా! ౩౦౮

సీ. జడముడివేలుపు సంబరంపడె రామ!
ప్రమదమందెను శైలరాజదుహిత
ధారణీదేవి మోదము పట్టరాదయ్యె
లలి నగ్నియును సబలాటపడియె
మందాకినీదేవి చిందాడెఁ దెలినీళ్ళ
తెల్లుతోఁటయు గండరిల్లిపోయె
ఒక్కొక్కతె యెడంద యుప్రాణములు గాఁగఁ
గందళించిరి కృత్తికాచయంబు
ఒక్కతనయుండు కలిగిన నుర్విజనుల
యుబ్బు పట్టంగవచ్చునటోయి స్వామి!
స్వామి కలుగ నిందరకును సంబరంబు
తనుకఁ గొడుకన్న వస్తు వెంతటి ప్రియంబొ?

చ. అడిగినదేమొ చెప్పకువె యా యితర మ్మఖిలంబు చెప్పుమా
యుడుగక యల్లె వించుఁ బడియుందురు శ్రోతలు నిద్దియేసుమీ
గడునరియాఁ గథాకథనకౌశల మేమి యటందు రన్న రా
బుడుతలు రామలక్ష్మణుల మోముల నవ్వులు ప్రోసె మువ్వురై

గీ. అసలుకథఁ జెప్పెదను వినుఁ డంచు వాని
పుడమిపడఁతికిఁ బెట్టిన పునుగుబొట్టు
కల దయోధ్య యటన్న చక్కనిపురంబు
మీ రెఱుంగుదు రే యన వారు నగుచు

గీ. మే మెఱుంగుదు మన వాని మేలు మేలు
మీ రెఱింగినఁ గథలోని మేలిసగము
నెఱుఁగుదు రె యంట యప్పుర మేలుఁ దొల్లి
యనఁగ ననఁగను సగరుఁ డన్నట్టి రాజు

వ. ఆయన కిద్దఱు భార్యలు; పెద్దయామె కేశిని; ఆమె వైదర్భుని కూఁతురు; రెండవయామె సుమతి; ఆమె యరిష్టనేమికూఁతురు; కేశిని ధర్మిష్ఠ సత్యవాదిని; సుమతి మహాసౌందర్యవతి; ఆమె గరుడి చెల్లెలు

గీ. ఆతఁ డనపత్యుఁడై సభార్యముగ హైమ
నగములో భృగుప్రస్రవణంబునందు
భృగుమునికి వందయేండ్లు లర్చించె భృగువు
నాయన కపత్యలాభ మా నంచుఁ బలికె

క. నీ వెలఁదులందు నొక్కతె
నీ వంశకరుండు పుత్త్రునిం గనుఁ బెఱయా
దేవియు షష్టిసహస్రసు
తావిర్భావమున దీప్తయా నని పలికెఁ

చ. తరుణులు నంజలుల్ మునిపదంబుల నుంచి యొకం డెవర్తె కొ
నఱువదివే లెవర్తె కన; నయ్యది మిమ్మును బట్టి యొక్కఁడున్
గురుతరవంశవర్ధనుఁడు కోమలు లాపయి నింకనైన యె
ల్లరు బహుకీర్తిమంతులు బలప్రభవిష్ణులు మీరె కోరుఁడా!

క. అనఁ గేశిని కులవర్ధనుఁ
దన కిమ్మనె సుమతి తాను దక్కినవారిం
గొనె మునిఁ బ్రదక్షిణించుచుఁ
జనెను సభార్యుండు రాజు స్వపురంబునకున్

వ. కేశిని కసమంజసుం డను పుత్త్రుండు గలిగె; సుమతి కొక గర్భ
తుంబంబు గలిగి యది షష్టిసహస్రశకలంబులై ధాత్రులు ఘృతకో
శంబులఁ బెంచిన దీర్ఘకాలంబున నా శకలంబులు రూపయౌవన
శాలులైన పుత్త్రులైరి; ఆ యసమంజసునకు వీర్యవంతుఁడైన
యంశుమంతుం డను పుత్త్రుండు గలిగె; నయ్యసమంజసుండు

గీ. ఊరిలో నున్న బాలుర నొకని నొకని
గుంపుగాఁ బ్రోగుచేసి తోకొంచుఁబోయి
సరయువున ముంచి ప్రాణనిష్క్రమణదాఁక
పీరమద్దెళ్ళ కేరింతగా రమించు

వ. పసిబాలురఁ గొనిపోయి సరయువు నడిపాయలోనికిఁ ద్రోసి యొడ్డున
రొండిని జేతు లిడుకొని పకాపక నవ్వుచుండును

గీ. ఈతియై పౌరులకు ధూమకేతువైన
పుత్త్రకుని రాజు వెడలించెఁ బురమునుండి
యతనికొడుకు ప్రజాహితుం డంశుమంతు
డతిప్రియుంవదుఁడును సాధువైన బిడ్డ

వ. వేదజ్ఞుండైన యా సగరుండు యజింతు నని నిశ్చయించి సోపాధ్యాయ
గణుండై యశ్వమేధం బారంభించి

సీ. ధూర్జటిమామగా రూర్జస్వలుండైన
వెలిమంచుమలరాజు వింధ్యశిఖరి
నిక్కించి కొమ్ములు నింగిలో నొక్కరొ
క్కరు తాము చూచికొందురు సతంబు
నా చూపులును బడినంత మేరయు యజ్ఞ
కర్మకు మిగులయోగ్యమగు నేల
యా చోట సగరుండు యజ్ఞ మారంభించె
యయు నంశుమంతునియందు మెలఁగె

ఉక్థ్యదివసంబునం బురుహూతుఁ డాస్ర
పంబు తనువొంది తగ ధనుష్పాణియైన
ఘనభుజుని అంశుమంతుని గన్నుగప్పి
యపహరించెను మేధీయమైన హయము

క. యయుహర్త సంహరింపుము
హయముం గొనితెమ్ము కాక యజ్ఞచ్ఛిద్రం
బయి మీకు మాకు నశివము
హయముం గొనితెమ్ము ఛిద్ర మరికట్టి నృపా!

వ. అని పురోధసు లాడిన రాజు

చ. అగు సగరుండు కర్త యయుహర్త యటన్న వచస్సు పుట్టె నే
మిగ హయహర్త యింకఁ గుసుమించునొ యర్వదివేలమంది కొ
సగను నొకొక్కయోజనము సాగరమేఖలఁ ద్రొచ్చి యాతఁ డా
పగతుని దెచ్చి నా యెదురఁ బట్టుఁడు పుత్త్రకు లంచుఁ బంపినన్

చ. చని సగరాత్మజాతులు ససాధనఖంబులఁ ద్రవ్వఁగోలలన్
గుసపములన్ బృహత్కముల గొఱ్ఱుల ధారణిఁ గ్రొచ్చి క్రొచ్చి క్రొ
చ్చిన బహుజంతువుల్ చిదిసి చీలి శిరమ్ములు వ్రస్సి మూల్గు లే
చిన నినదంబు మిన్ను లొరసెన్ విరిసెన్ మహిదేవిపావడల్

ఉ. రాఁజిన కోపవహ్నికల రాజులు సర్వది వేలయామడల్
గోఁజునఁ ద్రవ్వి త్రవ్వి యెలగోలుగ గోలగఁజేసి ధారణిన్
గాఁజరలున్ లతాతరు లెగాదిగఁ ద్రోచి శ్రమంబు పెల్లుగా
రోఁజుచుఁ దండ్రివద్దఁ జని త్రొక్కట పొందుచుఁ దీవ్రమూర్తులై

ఉ. ఈ మహి వ్రక్కలించితిమి యెచ్చటనుం బొడగానరార యే
గోమునసైన గుఱ్ఱమును గుఱ్ఱపుదొంగయు నన్నఁ దండ్రి పో
రే మఱి త్రవ్వఁ డశ్వ మెగిరెన్ వినువీథికి తెక్కలొప్ప నీ
భూమిన యెందు దూరెనొకో? పోయి రసాతల మెల్ల వ్రచ్చుఁడా!

ఆ. ఇల్లె హాయము తోఁచు నెందాక నందాఁక
నేను దీక్షితుండ నిలుతు నిచట
నిల్లె హాయము తోఁచు నెందాక నందాక
మీరు త్రవ్విచూడుఁ డార నార

చ. చిలువలు క్ష్వేళమూర్తులగు జిహ్మగరాజులు నశ్వరాజు నే
కలుగుల లాగిరో? దితిజకాండము గుఱ్ఱముఁ గొంచుఁబోయి యే
వెలుఁగులఁ గట్టిరో? వెదకి పృథ్విని జొచ్చి గ్రహింపుఁ డంతెగా
కలఘువులే! హాయం బెచట నైనది కానమటంచుఁ జెప్పఁగా

వ. అని రాజు పుత్త్రులం దఱిమిన

చ. అగిలిన పాదులంబడి మహాగిరిరాజము లూఁగెఁ గ్రొచ్చుచో
రగిలినమంటలన్ భుజగరాజులనాల్కలు తూలె నంతఁ బ
న్నగులును దేవతల్ దితిజనాథులు బ్రహ్మను జేరి స్వామి! యీ
జెగడును నే గతిం దొలఁగఁబెట్టెదొ చెప్పవె లోకనాయకా!

చ. అల సగరుండు దీక్షితుని యజ్ఞహయంబును వృత్రహుండుగాఁ
దొలఁచెను సాగరుల్ సమదదోర్బలశాలులు ధాత్రి యెల్ల వి
హ్వాలముగఁ ద్రవ్విపోయుటకుఁ బంతముపట్టిరి మాకునెల్ల దు
ర్బలులకు వీరిచేతఁ దలప్రాణము తోఁకకు వచ్చె నక్కటా! 330

మ. అనినన్ బ్రహ్మయు భీతిలేదు పదఁడా! యీ వాసుదేవుండు చి
చ్చునునై కాపిలమైన మూర్తిని ధరించున్ గృత్స్నయీ ధాత్రి యీ
తని కన్జిచ్చునఁ గాలిపోయెదరుగాదా సాగరుల్ పొందు పొం
డన దేవాదులు హృష్టులై చనిరి యంతన్ సాగరుల్ త్రవ్వుచున్

మేదిని.
గుములుగఁ దూర్పుదిక్కుఁ బడి గ్రొచ్చుచున్ విరూపా
క్షము తొలిదిగ్గజంబు శిరసా ధరన్ వహింపన్
శ్రమమున మస్తకంబు గదురన్ గదల్ప భూకం
పము గలిగెన్ సభూధ్రవనపాళి బిట్టు తూలన్

క. సగరసుతుల్ గజరాజున
కగలిచని ప్రదక్షిణించి యంజలి యిడి వె
న్కఁగఁ ద్రవ్వకొంచుఁ బోయిరి
పెగులని బండలును దండ్రవేటులఁ గూలన్

మేదిని.
గుములుగ దక్షిణంపుదిశఁ గ్రొచ్చుచున్ మహాప
ద్మము యముదిక్కు సేన్గుఁ గని మానవేంద్రుపుత్రుల్
సుమహితశైలమూర్తి క్షితి సాక్కి మోయుదానిన్
తమకము విస్మయంబు నరుదారఁ గాంచి యంతన్

క. సగరసుతుల్ గజరాజున
కగలిచని ప్రదక్షిణించి యంజలి యిడి ప్ర
క్కఁగఁ ద్రవ్వకొంచుఁ బోయిరి
నొగులని బండలను గోళ్ళ నొక్కి విద్రుచుచున్

మేదిని.
గుములుగఁ బశ్చిమమ్ము దెసఁ గ్రొచ్చుచున్ జనన్ గొ
మ్మ మెదపుకొంచు సౌమనసమున్ గనంబడెన్ బ
శ్చిమదిశయేన్గు దాని పెనుచేవఁ గాంచి యాశ్చ
ర్యము గని దంతపుంగొనసనై రాచి పట్ట ధాత్రిన్ ౩౩౬

క. సగరసుతుల్ గజరాజున
కగలిచని ప్రదక్షిణించి యంజలి యిడి వీ
లుగఁ ద్రవ్వుకొంచుఁ బోయిరి
తగిలిన బండలను గాలఁ దాఁచుచు వీఁకన్

మేదిని.
గుములుగ నుత్తరంబుదిశ గ్రొచ్చికొంచు భద్ర
మ్మమరఁగఁ దద్దిశాగజము నందుఁ గాంచి దానిన్
హిమమృదుపాండురంబు క్షితిసెత్తి కుంభసీమన్
గమలసుమంబువోలె సుఖకాంతిఁ బూనుదానిన్

క. సగరసుతులు గజరాజున
కగలిచని ప్రదక్షిణించి యంజలి యిడి ముం
దుగఁ ద్రవ్వుకొంచుఁ బోయిరి
రగిలిన బండలను నార్ప రాచి కరములన్

క. విసువును దాపము కోపం
బెసఁగఁగ నీశాన్యదిక్కు నెగువంగఁ గసా
కసిఁ బార లెత్తిపోయఁగఁ
గసవుగ మహిగర్భమ్ము త్తికలు పెళ్ళలుగా

చ. పెనుబయులై క్రుధానయనభీకరులై సగరాత్మజుల్ కనన్
బెనుపరి దూరమందు మునివృత్తియునై కపిలుండు తా సనా
తనుఁడును నాద్యుఁడల్లమునిదగ్గర మేయుచు నున్న మావు నో
లిన తమకష్టమంతయు ఫలించిన యట్లుగఁ గాంచి సాగరుల్

క. అదిరదిర ! కనులు మూసిన
యది మదిరాపారవశ్యమా? లోఁజూపున్
నుదు రోరయుటయా? బికిరపుఁ
జదురులు తీర్చుటకుఁ దట్టు చాలదె నీకున్

ద. సవహాయ మేల రోరి? యని షష్టిసహస్రములౌ నృపాత్మజుల్
తవిలి పృషత్కముల్ శిల లుదారమహీజములం గ్రహించి మా
నివరుని పైకి దూఁకుచు ఖణిల్లని యార్చుచుఁ బేర్చు చేగినన్
వివృతములైన నేత్రముల వీరిని దాఁ గపిలుండు గాంచుచున్ ౩౮౩

క. రోసమ్మున హుమ్మనఁగా
నా సాగరులెల్లఁ దనువులం దగ్నిశిఖా
భాసురజిహ్వాజ్వాలలు
దూసినతో భస్మసాత్కృతుల్ గా నయినన్

ఉ. ఎంతకు రామిచే సగరుఁ డెంతయుఁ బుత్త్రుల వేచి వేచి ధీ
మంతుని నంశుమంతుఁ గని మన్మని నాయన! నీవు పోయి వృ
త్తాంత మెఱింగి రమ్ము పినతండ్రులతో హయమున్ గ్రహించి ర
మ్మింతకుఁ బొమ్ము సాయుధుఁడ వేగు పథ మ్మెటువంటిదో యనన్

వ. అంశుమంతుండు కార్ముకియై ఖడ్గియై పినతండ్రులు త్రవ్విన మార్గం
బున నేగుచు

ఉ. దారిఁ బిశాచయక్షసురదానవరాక్షసపక్షిభోగులౌ
వీరులఁ గాంచికాంచి పృథివీపతినప్త నమస్కరించుచున్
వారలచేతఁ బూజితుఁడు వచ్చి దిశాగజరాజులన్ నుతి
శ్రీరుచిరాననుండయి యజించెను దోసిలులన్ గ్రహించుచున్

చ. ప్రభువులు మీరు మీ భుజము పట్టియనూ దిగిపోదు ధాత్రి యా
ప్రభువులు పోత్రియున్ గమఠరాజును శేషుఁడు కోఱచే శిలా
నిభమగు వీపుచేఁ గుసులునించు ఫణానివహంబుచే బలెన్
శుభతనులైన మీరు మధుసూదనమూర్తు లటంచుఁ జెప్పుచున్

వ. దిగ్గజరాజు లందఱఁ బ్రదక్షిణించి యందఱఁ బినతండ్రులు పోయిన
త్రోవ యడిగి యందఱవద్ద సెలవుఁగైకొని వారందఱు హయ
లాభంబు నాశీర్వదింపఁ బోయిపోయి

చ. అలిపిరులై మరుద్విధుతమై చిఱుబూదిపొరల్ వెలార్చు ది
బ్బలు మనుజాకృతిస్ఫురణవంతము లర్వదివేలు గాంచి తాఁ
దెలతెలపోయి కన్గొనలఁ దేరిన నీళ్లుగాఁగ నల్లెగా
నిలఁబడి చూచి క్రుంగెను మనీషిశిరోమణి యంశుమంతుఁడున్

చ. కుమిలి యెడందలోన నొకకొంతకుఁ దేరి నివాపవారిఁ దా
నమరఁగఁ జిన్నతండ్రులకు హర్షము సేయఁగ నెందుఁజూచి నీ
రము కనరాక చొచ్చికని రాజితమారవియత్తు తెక్కలన్
దెమలుచు వైనతేయు నరుదెమ్మని బిగ్గన కేకపెట్టినన్ ౩౫౧

క. అతఁడును మిన్ను డిగినఁ
దాతా! యని యావటిల్లెఁ దా గరుడి వృథా
చేతము నొవ్వఁకు దైవము
రీతికి; దైవంబుఁ బరిహరింతురె యెవరే

వ. నాకు మాత్రము మేనల్లుండ్రు కారో? నేను మాత్రము దుఃఖించ లేనో? వీ రప్రమేయుఁడైన కపిలునిచేత దగ్ధులైరి; లౌకికజలపరిప్లుతు లైకాని వీరు స్వర్గతిఁ బొందరు, హిమగిరిజ్యేష్ఠదుహిత గంగానది గాని వీరిని బరిప్లుతులఁ జేయఁజాలదు

ఆ. మఱియు సఘులవిత్ర మందాకినీదేవి
పాయ విడిలి యిందు వచ్చెనేని
లోకకాంతములగు శీకరాంబువులచేఁ
దడిపెనేని నదియ తర్పణంబు

క. గుఱ్ఱముఁ గైకొని చనుమా
బిఱ్ఱునఁ గూర్చున్న తాత ప్రియమగు జన్నం
బఱ్ఱునఁ గొనసాగింపుము
కుఱ్ఱా! యని గరుడి మింటికోసలఁ జనియెన్

గీ. అంశుమంతుండు యయువుతో నరుగుదెంచి
తాతకును విన్నె సర్వవృత్తాంత మతఁడు
విని యథాకల్పమును యథావిధిగఁ గతువుఁ
బూర్తి చేసి యయోధ్యకుఁ బోయి వంత

క. ఆ పెద్దకొడుకు నల్లె
యీ పిన్నలు వేలమంది యిల్లె యా ధా
త్రీపతి ఊంపవుఁగోఁతయు
నాప యయిన నష్టఁ గాంచినఁ దీరెడునే

క. అమలమతిఁ దల్లి హారుసతి
సుమనైనం దపము సేసి యుర్వికి రప్పిం
తుముగాక వేయియరలం
దమరులు దాచిన సురాంబువా? యిట వచ్చున్                    3 శ్రీ

గీ. ఏమి చేయంగవలయునో యెఱుఁగరాక
సంశయాధీనుఁ డగుచుఁ ద్రింశత్సహస్ర
వర్షములు రాజ్యముం జేసి స్వర్గమేగె
సగరుఁ డంశుమంతునకు రాజ్యంబు వచ్చె

వ. అంశుమంతుడును మహాత్ముండైన తనపుత్త్రునందు దిలీపునందు రాజ్యం బుంచి హిమగిరిశిఖరంబున నిఱువది వేలయేండ్లు గంగ కొఱకై తపస్సుచేసి స్వర్గతుఁడయ్యె, నంత దిలీపుండు

క. ఏ రీతి గంగఁ దెత్తును
నేరీతి బితాళ్లు స్వర్గమేగెద రకటా!
యారీతి తెలియ దంచును
నారాట మ్మొడద నెక్కువై తపియించెన్

గీ. ఆ దిలీపుం డనేకముల్ యజ్ఞములను
నమరులకుఁ బ్రీతిఁ గల్పించి యమరగంగఁ
దిగియఁజాలక తుదకును దిగులుపొంది
వ్యాధిచే స్వర్గదేశమ్ము నధిగమించె

గీ. అతఁడు ముప్పదివేలేండ్లు లవని యేలె
నతనికొడుకు భగీరథుం డంత రాజ్య
మునకు వచ్చెఁ దపోనిధి పుణ్యమూర్తి
పరమధార్మికుఁ డఖిలదిగ్భరితకీర్తి

ఉ. తా ననపత్యుఁడై యొకటి తాతలకై సురగంగ ధాత్రికిన్
దేనని యొక్కటిన్ బరమధీనిధి రెండుదిగుళ్లు గాఁగనై
పూని వ్రతంబు సర్వమగుభూమిని మంత్రులయందు నుంచి తాఁ
గానలకుం దపస్సులకుఁగాఁ జనె బద్ధజటానిటాలుఁడై

శా. గోకర్ణంబున నూర్ధ్వబాహుఁడయి సంగోరైన యాహారముల్
ప్రాకామ్యాత్తతపోజితేంద్రియుఁడునై పంచాగ్నిమధ్యంబునం
దా కాలట్టులె చేయి యట్లుగనె వేయై వర్షముల్ తత్తపో
వ్యాకీర్ణాగ్నికణంబులుం జెదరి మిన్నంటెన్ మహాతారలై ౩౬౫

క. ఆ తపము సౌరపురి గ్రీ
ష్మాతపమై యుడుకఁబెట్ట నఖిలసురతతుల్
ధాతఁ గని చెప్పికొనఁగా
నాతఁడును భగీరథుఁ గన నరిగె సురలతో

గీ. అరిగి యోయి భగీరథా! యాఁగు మాఁగు
మీ తపోవహ్ని యెగఁదట్టి యిగురుచుండె
సౌరగంగయు; నీదేదొ కోరికయును
బయటపెట్టుము బిట్టుతపమ్ము మాని

సీ. అనిన రాజర్షి మార్తాండమండలికిని
దననేత్రములకు మధ్యమున నాల్గు
తలలై పలుకుచున్న దైవమై తొట్రుపా
టున నంజలించి యే మనెదు స్వామి!
యోయి లోకేశ్వర! యో సర్వనాభ! వ
రం బిత్తు వటె కృపారాశి! రమ్ము
ము త్తరంబులనుండి యుత్తలం బయ్యె మా
తండ్రియుఁ దాతయుఁ దాతతాత

యీ భవత్కృప నిజమగునేని దరణి
కులులు సాగరుల్ సౌమతేయులును గట్టి
యున్న తెలిబూదిదిబ్బలు నుడుకులార్చు
మడుగు సురగంగ కెరటాలు కడుగవలయు

గీ. నాకు సంతతి లేక యిక్ష్వాకుకులము
నంబు లుపలంబుకడ నాగినట్టు లాగె
నేచి యీ రెండునుం బ్రవహింపవలయు
ననిన బ్రహ్మయు నింతగాఁ గనులు విచ్చి

చ. అవునవు నెంతకోరితివి యైనను నీతపమే నలంతియా?
యవునవు నైనఁగాని సకలావని చిల్లిపడున్ రసాతలం
బవుఁ దొలికొట్టినట్టులగు నా సురగాంగఝరీజ్వలజ్జ్వల
ద్వివృతమహార్భటీప్రళయవీచిక లుమ్మడిఁ గ్రుమ్మరించినన్ ౩౨౦

చ. ఒకశివదేవుఁడైన జడ లూచి గ్రహింప గ్రహించుఁగాని యా
ప్రకటితవేగ మే పరులుఁ బట్టరటంచు నదృశ్యుఁడౌచు గం
గకుఁ గబురంపె నోసి గిరిగర్భమ! ధాత్రికి డిగ్గుమమ్మ! యే
యొకఁ డని కూరుచుంటి వతఁ డొక్కఁడు వచ్చె భగీరథార్థితా!

క. ఔ ననెనో కా దనెనో
యానని గర్భోక్తియో ఫలాలాపంబై
కాని మ్మనుచు భగీరథుఁ
డూనెను దీవ్రమగు తపసు నుగ్రునికొఱకై

వ. ఒక్కకాలి బొటనవ్రేలిపై నిలచి యూర్ధ్వబాహుండు నిరాలంబుండు వాయుభక్షుండు స్థాణువత్తు నయి యొక్క యేడాది యుగ్రతపశ్చర్య నడపిన స్థాణుండు

గీ. చాలు నోయి నరశ్రేష్ఠ చాలుఁ జాలు
బొటనవ్రేల్మా నుకట్టదు పూండ్లుగాఁగ
మజ్జటాజూటి సురగంగ మడతు నని యె
నతనిశిరసున ధుని గభిల్లనుచు దూఁకె

గీ. తచ్ఛిరస్సుప్రష్టిగాఁగఁ బాతాళమునకుఁ
జనెద నని లోన నూహించె సౌరగంగ
యవమతి నెఱింగి సౌరగంగాంబుఝురము
నిడియ బిగియింతు నంచు నూహించె మృడుఁడు

చ. గణగణ వచ్చుచున్న సురగంగను గాంచి భవాని స్వామికిన్
బెణుకులు పుట్టునో మెడను వేగవశంబున స్వామియంగముల్
వణఁకి యిలాస్థలిన్ జదికిలంబడునో యని యప్పగారి యా
తొణకిన లేవగించుకొనె దూఁకుడు మాన దటంచు నెప్పుడున్

ఉ. పెద్దది యక్కయుండ నిటఁ జిన్నకుమారిత పెండ్లియాడె నా
పెద్దది గద్దెయై యసలె పెండిలి వద్దని కూరుచుండె నా
యొద్దనె దీని నుంతు నని యుగ్రుఁడు సింహాసటాచ్ఛటాజటల్
ప్రొద్దు నవోదయాంశువులు పోసినయట్లుగ విచ్చి నిల్చినన్ ౩౨౨

సీ. శంపాసహస్రాభ చండకాంతిచ్ఛటా
మేయవారావర్త మెఱసి మెఱసి
ప్రళయకాలాంభోదపటలీవిసిస్వనా
మోఘగర్జాభంగి మొరసి మొరసి
సప్తసాగరమహోత్తారపాథశ్ఛటా
విధృతభంగాభంగి విరిసి విరిసి
కోటిప్రపాతవార్ధాటీనిరాఘాట
తుంగోగ్రతరవారి దూఁకి దూఁకి
స్వర్గముననుండి శివునిమస్తకముదాఁక
ఘూర్ణితైరావణాస్యమై కురిసి కురిసి
శివజటాజూటికామహాసీమలో గు
భిల్లు మని వచ్చి పడె తిరుగుళ్ళ గంగ

సీ. మకరమత్స్యకుళీరకూర్మాహిః మఠవా
రములచే నవజీవరాశి యగుచు
మణిరత్నమౌక్తికమరకతవైడూర్య
ములచేతఁ బుష్కరమూర్తి యగుచు
కనకసీరేజాతకల్హారమాలికా
ద్రుతమేఘపుష్పాచ్ఛరూప యగుచు
అద్భుతరౌద్రవీరానందకృద్వారి
ధారమై ఘనరసాకార యగుచు
అతితరతరంగహస్తశస్తాభిరామ
ప్రస్రుతిని సర్వతోముఖప్రతిభ యగుచు
శివజటాజూటికామహాసీమలో గు
భిల్లు మని దూఁకి పడె తిరుగుళ్ళ గంగ

చ. ఒకజలబిందు విట్లు పడుచుండఁగనే యడుగంటి యన్యబిం
దుకములచేతఁ దాడితము ధూతమునై పయికేగి యందుఁ బ్ర
క్కకుఁబడి యంచుచుట్టు తిరుగంబడి చిందిమలంగి చేరి నీ
టికి బుడ్డగై జలంబయి కడిందిగ నిల్చె పరిభ్రమించెడున్ ౩౮౦

క. అశ్వార్బుదాధికంబులు
నిత్యపరిభ్రమితజీవనీయప్రుషత్సం
స్తుత్యపరిషత్సహస్రవి
హృత్యధిదేవత వియజ్ఝరిణి శివజూటిన్

గీ. ఒక జటలలోయలోఁ బడి యుఱిమి యుఱిమి
యంతు గనబోయి కనలేక యంతఁ దిరిగి
యొకజటాస్నిగ్ధతామ్రమవర్ణోరుశోభఁ
జిక్కి తిరుగుళ్లుపడి తెమల్చికొనలేక

చ. తన పరిణాహసంజనితదర్పము క్రుంగి కపాలభృజ్జటా
వనిపరిణాహచింతఁ బడి వాగులుచుట్టి పరిభ్రమించు గం
గను గనలేక చింత శితికంఠుని గూర్చి పునస్తపఃశ్రమం
గనిన భగీరథున్ శివుఁడు గాంచి జటన్ సడలించె నింతఁగా

వ. ఆ సడలింపులో నేడుసందు లొప్పిన నా యేడుసందులనుండి గంగ యేడుపాయలుగా వచ్చె; హ్లాదిని పావని నళిని యన్న మూఁడు పాయలు శివజలలు శుభలు ప్రాగ్దిశం జనె; సుచక్షువు సీత సింధు వన్న మూఁడుపాయలు శుభోదకలు ప్రతీచిం బట్టె; ఆయేడవపాయ భగీరథు ననుసరించె

గీ. కనకకింకిణులన్ గలుగల్లురన్న
సితపతాకాచ్ఛవిన్ మిన్ను జీల్చుచున్న
కలితవల్గత్తురంగముల్ కట్టియున్న
తేరుపై ముందు సాగె భగీరథుండు

గీ. లీల శివమాళి బిగి సడలించుకొన్న
తోణికిసల నీటితరఁగల దుముకుచున్న
చిన్నిగాలుల తాఁకిడిఁ జిందుచున్న
జలములై వెన్కవచ్చె వేల్పులసరిత్తు

వ. ఒకవేళ తమ కులోద్భవుం డెవ్వఁడైన గంగ నావిర్భవింపఁజేసిన నామెఁ దేవలసిన త్రోవఁగాఁ దమపూర్వు లేర్పఱిచిన గుర్తుల వెంబడి నిమ్నధాత్రిగా భగీరథుండు రథము పోనిచ్చె ౩౮౭

ఉ. గంగయురా వసుంధరయుఁ గమ్మనితావుల యూర్పు పుచ్చుచోఁ
సంగద నెండలై నెఱియలైన ధరాస్థలి నీళ్లు పీల్చుచున్
ముంగలఁ గొంతసేర జలముల్ స్పృశియింపక చెమ్మగిల్లుచున్
లొంగిన నేలయున్ దొలుత లోఁ తొకయించుక నీలమండలై

మ. వెనుకన్ వచ్చెడు పెద్దవాహినియు నావిర్భూతపాథోనితాం
తనినాదోత్కటతీవ్రమై భయదయాదస్సంఘపుచ్ఛాగ్రతా
డనవల్గద్భ్రమమై పరస్పరవిఘట్టప్రోత్థకల్లోలపా
వనవాశ్చుంబితసారమార్గ మయి తీవ్రంబై విడంబించెడున్

మ. తెలివాకంబడి మింట నంటి చనగా దేవర్షి గంధర్వయ
క్షులు సిద్ధుల్ మణిభూషణాంగులు దివృక్షుల్ శ్రీవిమానస్థు లం
జలి నారగ్వధపల్లవాగ్రరుచిరచ్ఛాయాతనుల్ వచ్చి రు
త్పలవీక్షాసుమదామ లచ్చరలు శంపావాహినీమూర్తులై

సీ. మహియందునను శింశుమారమీనంబులు
నలి శింశుమారమీనములు మింట
మహియందున మరాళమహితగరుచ్ఛట
శారదాభ్రంబులచాయ మింట
మహియందుఁ బాండురాంభశ్ఛటాసంహతి
యప్సరస్తనురోచిరాప్తి మింట
మహిని వారిజషండమహితదీప్తిచ్ఛట
సారంగనాముఖాబ్జములు మింట
దూఁకి మహి నేగు సురగంగ తోడుగాఁగఁ
దూఁగి సురలేగుదెంచిరి తోడునదిగ
సాగరుని పెండ్లికూఁతును సాగనంప
బ్రాతిఁ బుట్టింటివా ర్వెంటవచ్చినట్లు

ఉ. అందముగా హొయల్ వెడలునట్లుగ నొక్కొకచోఁ దరంగపా
ళిం దుమికించుచున్ విధురలీలను నొక్కొకచో నొకొక్కచోఁ
జిందుచు వక్రమై నిడివి చెన్నులపాయలుగా నొకొక్కచో
మందముగా ద్రుతమ్ముగ శ్రమమ్ముగ సౌఖ్యముగాఁగ నేగఁగా

గీ. భవుని మైజాఱినట్టిది పావనంబు
తోయము స్పృశించి భక్తిమై దోయిలించి
యాచమించిరి సర్వదివౌకసులును
సర్వవసుధానివాసులు సంతసమున

ఉ. నాకనివాసులై శపితులై ధర జాఱినవారు వచ్చెఁబో
నాకజలంబులంచుఁ బడి స్నానములాడి పవిత్రదేహులై
నాకనివాసులై చనిరి యంతట గంగ చలత్కబంధవీ
చీకమనీయమార్గవివశీకృత యేగెను దంపడించుచున్

చ. వెలలి భగీరథేశు వెనువెంబడిఁ బోవుచునున్న గంగ త్రో
వల నొకమౌని జహ్నుఁడనువాఁడు యజించుచు నున్న స్రుక్స్రువం
బులఁ దరలించుకొంచుఁ జనెఁ బొంగులనీళ్లలవెంట జహ్నుఁడు
జ్వలితవిలోచనుండు సురవాహినిఁ జూచుచునుండఁ ద్రావినన్

ఉ. అంతకుముందు నేలయును నాకసమున్ గయికోని తీవ్రవా
థోఽంతచలత్తరంగవివశాద్భుతవాహిని బొట్టులేక తా
నంతట బద్దె గీసినటులై యటముంగల నెండునేలయున్
వింతఁగఁ బింగలన్ బురదపిండలిగా నయినంత సివ్వెఱన్

వ. సురలును ఋషులు హాహారవంబులు చేసిన భగీరథుండు వెనుదిరిగి
చూచి

క. తనకనులను దా నమ్మక
ధుని తనుబడి యసలువచ్చెనో లేదో యం
చని సురలు గుర్తుగా వ
చ్చినదని తెలిసికొని శోకచిత్తుం డగుచున్

చ. తనదగు వంగడంబున కథాసకలంబును గోచరించి బి
గ్గన నిముసంబులోఁ గడుపు కాలువయై యిది యేమిపాపమో
వెనుజనివచ్చు నేఱు కనిపించదు తండ్రులుఁ దాతలుం గడిం
పని మడుఁ గే గడింతునె? త్రపారహితుండను వెఱ్ఱిబుద్ధినై ౩౯౯

చ. మృదుఁడును బ్రహ్మ నన్నుఁ గికురించుట యేటికొ యల్పమానవుల్
గడువడిఁ బొమ్మ పొమ్మ సురగంగను నీ కిడరాదనాఁ దలం
దిడికొని చేతులన్ మగుడనే? యది యేటికొ? యింతదూరమై
మడుగును నింకఁజేయుటలు మామక భాగ్యము లేమిచెప్పుదున్

వ. అయ్యో సురనదిం దెచ్చితి ననుకొంటి నని దుఃఖించు భగీరథు
నకు సురలు జహ్నుని జెప్పిన భగీరథుండు జహ్నుపాదంబులపై
వ్రాలి

ఉ. ఇంకొక వేయియేండ్లు ప్రభు! యే నినుఁ గూర్చి తపింతుఁగాని నీ
వింకకు సారవారి; విడు వే! యది యెంత ప్రయాసమయ్యె నా
వంకకురాఁగ నీ సురలవంక! తరంబులు నాల్గు మేము ని
ట్టింకులు నింకినాము ప్రభు! యీ నది కంచుఁ బితాళ్లకోసమై

క. అని కాళ్లవ్రేళ్లఁ బడినన్
ముని గుండియ కరఁగి కొంచుఁబో కొంచును బో
ధుని జహ్నుతనయ సుమ్మా
ధుని సారాపగయ కాదు తోకొనిచనుమా!

చ. అని చెవినుండి దీప్తసహసార్భటి రివ్వుమటంచు నేన్గుపా
యను వెలలించె మాని విధురాహతమత్స్యఝులీప్రవేగపు
చ్ఛనిహతపుష్కరభ్రమవిసారినిరంతరవేణికాచిరం
తనజలమూర్తి యమ్మునిఁ బ్రదక్షిణ మొప్పగ నేగఁ జొచ్చినన్

క. వెనుకకుఁ జూచుచుఁ జూచుచుఁ
దనయరదము నెక్కి యేగె ధాత్రీపతి యా
వెనుకం జనియెన్ జాహ్నవి
తనస్రోఁతయె యఘుశతంబు దండింపంగన్

శా. ప్రీతిన్ గంగ భగీరథానుగయుఁ జేరెన్ సాగరున్ సాగరుల్
ఖ్యాతిన్ ద్రవ్వినచో రసాతలమునం దావిర్భవించెన్ నృపుం
డా తాతల్ పడియున్నదిబ్బలు గనెన్ స్రాత్రుండు సాలోచనుం
డా తీర్థంబులు దిబ్బలున్నయెడలం దల్లాడెఁ గల్లోలముల్ రంఁ

చ. అఱువదివేలరాజసుతు లద్భుతదేహులు తైజసంబులై
మెఱసెడిమేనులం దిరిగి మింట విమానములన్ భగీరథున్
దిఱిపము పెట్టినావు సురతీర్థము; పుత్త్రుఁడ వౌదు వీవ యీ
యఱువదివేలయేండ్లకును నైన నటంచును మెచ్చుచుండఁగన్

గీ. అచ్చటికి బ్రహ్మ వచ్చి యోయయ్య! నీదు
పిన్నతండ్రుల నర్వదివేలమందిఁ
జనికి గంగాంబులు తరింపఁ జేసినావు
కులమును సముద్ధరించితి వలఘుచరిత!

క. ఎన్నాళ్ళు సాగరాంబువు
లిన్నేల తుదళ్ళు పట్టి యెగచుచుఁ జనునో
యన్నాళ్ళు దేవతాకృతు
ల న్నాకమునందు నుందు రా సగరసుతుల్

క. ఈ గంగ పెద్దకూఁతురు
భాగీరథి నీకు; మూఁడుబాటల రెంటన్
నీ గురుత కల్గె నామెకు
నీ గురులకుఁ బితరులకును నీళ్ళు వదలవే!

శా. నీవే కల్గవలెన్ సురాపగయుఁ దా నీ చేతఁ బాతాళలో
కావిర్భావము పొందగావలయు నం చన్నాళ్లు తాతల్ తప
శ్శ్రీవారాసుల మత్సమానుల తపశ్శ్రీ యింత కైకోదు నీ
వావిర్భూతుఁడవైతి తెచ్చితివి గంగాంబుప్రవాహంబులన్

ఉ. ఈ సురవారి నీయెడల నెంత కృపామతి! నీ తపస్సు నా
కోస ముమామహేశ్వరునికోసము; ధూర్జటి మాటయిచ్చె నం
తే సురగంగయున్ విడిలెనే గద స్వర్గపుబాడ్డు; నీవుగా
నీ సురగంగ కా యమయు నింతఁగ నీకు సమార్ద్రు లేటికో?

గీ. అన భగీరథుఁ డిట్లనె నస్మదీయ
మైన తపసెంత? నాతండ్రు లాచరించి
నట్టి తపములఫలము నా యందుఁ బొంది
శీఘ్రఫలవంత మైనట్టి చెలువుగాక

వ. అనిన బ్రహ్మయు నట్లే యట్లె నీ పితరుల కీ నీజలంబులఁ దర్పణంబు లిమ్మని యంతర్హితుండైన నానీతామరవాహినినై ధర్మాయతనం బైన భగీరథుండు యథాక్రమంబుగ యథాన్యాయంబుగఁ బిత రులకు నీళ్ళువదలి యయోధ్య కేగి సింహాసనం బెక్కిన

గీ. రాజుకాడు కొటచేతనే రాజుగాక
రాజితజగత్ప్రతిష్ఠావిరాజమాన
తేజుఁడై రాజు రాజుగా; భూజనంబు
రాజనంబులు పండించి రా జగాన

వ. శ్రీరామభద్రా ! నీకు స్వస్తియగుఁగాక తండ్రీ !

శా. సంధ్యావేళ యతిక్రమించెదుఁ దపస్స్వాధ్యాయముల్ సేయ నా
సాంధ్యమ్ముల్ నెఱవేర్పఁ గృత్యములు దీక్షావేళ ప్రాప్తించెదుర్
వంధ్యమ్మై చనఁ దేజముల్ దితిజు లే వంకం బరిభ్రాంతులై
సంధ్యం గాంతురు భీతి సాగరకథాసంధాపవిత్రీకృత

వ. ఆరాత్రి యొక్కరాత్రివేళ గాధేయుండు మేల్కొనియుంటఁ జూచి శ్రీరామచంద్రుఁ డిట్లనియె

గీ. మానిజనమాళిమండన! మామకీన
భాగ్యరాశి! భగీరథు పల్కినట్టి
తండ్రుల తపఃఫలము వచ్చి తనతపంబు
నాదుకొనె నన్నమాట లోకాద్భుతంబు

వ. అనిన లక్ష్మణుండు లేచి కూర్చుండి

క. ప్రభు! యెంత యాస్తికత్వము
ప్రభు! సాగరులకును నెంతపట్టుదల? తుదిన్
ఋభువుల యాపగ నెంతై
న భూమికిన్ దేనె తెచ్చినారు గదయ్యా !

వ. అనినఁ దక్కినఋషు లందఱు మేల్కొనియే యుండినారు కాఁబోలు లేచి

గీ. జామిపువులోని కేసరచ్ఛవి వహించి
ప్రాచి తెలివెల్గుగీతలు పారుదెంచె
నేమి సాగరుల్ వార లదేమి ప్రభులు?
ఏమికథ? యేమిచెప్పుట? యేమిసాగసు?

వ. అని మఱలఁ గొంచెము శయ్యాగతులై

మ. పొరిఁ బ్రాచీసితపుండరీకవనముల్ పుష్పించెఁ గింజల్కభా
సురకాంతిచ్ఛట లెఱ్ఱవాగులయి కచ్చుల్ విచ్చుగా నా మొగి
ళ్లొరయన్ దుట్టతుదల్ ఛటావితతి వెల్గొందన్ జరీయంచులై
చెరివెన్ గ్రొమ్మొగ్గి లడ్డమేగిన ద్విజశ్రేణీమనోజ్ఞాకృతిన్

వ. అంతఁ గృతాహ్నికుఁడైన రామచంద్రుండు గాధేయునితో నిట్లనియె.

శా. నీకై రేవున నౌక సిద్ధముగ నుండెన్ బుణ్యభాగీరథీ
శ్రీకాంతాంబులు లేఁగరళ్ళగుములై ప్రేయఃకథాకృష్టలీ
లాకారమ్ముగ నిన్ను వేచెడిని హేలార్ఘ్యప్రదానక్రియా
స్వీకారమ్మను గాంచవే మునిశిరస్సీమంతముక్తామణీ!

మ. అనినన్ నవ్వుచు గాధిసూతి బళిరయ్యా బాలకాకుత్స్థ! మా
మునిమూర్ధంబుల నట్టకట్టినజడల్ పోఁద్రోచి సీమంతముల్
తనకన్ బాపటఁదీర్చి యాపయిని ముక్తారత్నముల్ పెట్టె దీ
వనుటే నా తలపైని ముత్యములునై యాముక్తమయ్యెన్ శిశూ!

వ. అనిన నందఱును భాగీరథిం దరించి యుత్తరపుగట్టు చేరి స్వర్గోపమమ్ము దివ్యంబు రమ్యంబునైన యొకమహానగరంబుఁ గాంచి రామచంద్రుండు

గీ. శ్రీవిశాలమనోజ్ఞమా సీ విశాల
నగర మేదన గాధిసంతాన మంత
శ్రీవిశాల! విశాలాపురీవరంబు
రాఘవా! యిద్ది యనిసంత రామమూర్తి

గీ. శ్రీవిశాలవిశాలాపురీవరంబు
నేలు రాజర్షి వంశ మదేది స్వామి!
యాదిచెప్పవె నీ నోటినుండి వచ్చు
సిరిపలుకు క్షీరవారాశితరఁగచిలుకు

వ. అనిన విశ్వామిత్రుం డిట్లుచెప్పె; పూర్వము కృతయుగంబున వీర్య
వంతులై సుధార్మికులైన యదితికొడుకులును మహాబలులైన దితి
కొడుకులును సవతితల్లిబిడ్డలు నజరామరుల మెట్లగుదు మని యాలో
చించి కలశపాథోధిఁ జిలికి రసము తెత్తు మని

గీ. మందరముఁ గవ్వముగఁ దెచ్చి దందశూక
పతిసి వాసుకిఁ దెచ్చి కవ్వంపుఁద్రాఁడు
గాఁగ రెండుపక్షము లిఱుగడలఁ జేరి
కలశపాథోనిధానంబుఁ జిలికినారు

గీ. వాసుకిభుజంగశిరములవైపు దైత్యు
లూని మథియించుచో దేహ మొరిపిడిఁబడి
యెచట నందినఁ గఱచిన నచటఁ బాము
దైత్యు లెందఱో మృత్యువక్త్రంబు సొచ్చి

గీ. వాసుకిభుజంగపుచ్ఛంబు వైపున దితి
కొడుకులు గ్రహించి రాపిళ్లకున్ భుజంగ
పుచ్ఛతాడితులు నదితిపుత్త్రు లెంద
ఱో జలధిఁ దూలి దెబ్బల గాఁజువాఱి

మ. అటు లాశీవిషపుచ్ఛతాడితులునై యాదిత్యు లాశీవిషో
త్కటదంష్ట్రాపరిలీఢులై దితిజులున్ గైకోక యట్లే మథిం
చుట వేయేఁడులు సేయఁగా జలధియంచుల్ ప్లుష్టపాథోభ్రమ
చ్ఛట యాదోనికరంబు చచ్చిపడి దృశ్యం బయ్యె బీభత్సమై

ఉ. అందఱు పట్టి లాగఁగ మహాహి శిరమ్ములు చిమ్మికొంచుఁ బ
ట్టందక దూసినన్ దితిజు లందున నందునఁ దూలి వ్రీలఁగన్
మందరమంథరాశ్మములు మంటలు పుట్ట మహాహి కోఱవెం
టం దిగువాటులం గఱచినన్ బెనుబండలు వ్రీలుచుండఁగన్ ౮౩౭

మ. అహిదంష్ట్రావిషవహ్ని భూమిధరగండాశ్మప్రభూతాగ్ని సం
దహదుగ్రంబు వినూత్నమా గరళమైనన్ మిశ్రమై తచ్ఛటా
విహృతిన్ గాలులు పాఱినంతయెడఁ ద్రెవ్వెన్ భూతసంతాన మా
యహితాడున్ గిరికవ్వమున్ వదలి ప్రయ్యంబాఱఁగాఁ గాశ్యపుల్

గీ. ఓయి శివ! యోయి శంకర! యోయి రుద్ర!
యోయి సురలోకబంధు! యెందుంటి వోయి!
యని యఱచి బిట్టబిల్లుగా నదవదించు
నట్టి దైతేయు లాదిత్యు లఱపువెంట

శా. ఆవిర్భూతుఁడు శంకరుఁడు పిలుచన్ హాలాహలం బంజలిం
ద్రావెన్ బట్టి వెలార్చి చుక్క విడక కంఠన్ స్వామిగర్భస్థమా
జీవశ్రేణియుఁ జచ్చిపోయితిమయా జీవేశ! శంభూ! యటం
చావుల్ దేరినఁ గంఠమందె యదిమెన్ హాలాహలం బంతటన్

గీ. కవ్వపుంద్రాడునకుఁ జేలికడై మొసంగి
గువ్వకోలుగఁ బెనుకాలకూట మార్చి
నివ్వటిలు నీదు ప్రేమంబు; నీవు మాకు
దివ్వెలై కాక చీఁకటిఁ దెరలలేము

గీ. అని మహాదేవు స్తుతియించి యాదితేయ
సమితి దైతేయసమితి రసంబుఁ గూర్చి
మఱల గిరి నిల్పఁబెట్టి చిల్కిరి పయోధి
మఱల నహిరాజుఁ జుట్టి చిల్కిరి పయోధి

మ. ఒకవేయేఁడు లదేపనిం జిలికినన్ బ్రోద్భూతమై క్షీరధి
చికదంబంబులఁ జిక్కనల్ పలుచనై క్షీరంబు నీరంబు వో
లికగాఁ దేలికయైన మందరము తూలెన్ వారిభంగంబు లూఁ
దక మట్టమ్మునఁ గ్రుంగి పాతుకొనెఁ బాతాళంబు గర్భంబునన్

క. పెగలింపలేక యిరుదెస
లగడుగుడిచి; మఱల రుద్రు నాహ్వానింపన్
మొగమోటమువడి శ్రీహరి
జగదీశ్వరుఁ జేరి యోయి స్వామీ! శౌరీ! ౪౪౪

చ. ఇది మొదలా? భవత్కరుణ కేమను నట్టులుసాచు టెట్లె వే
డెద మెది వచ్చినన్ దిగఁబడన్ గిరిమట్టము లేవనెత్తు జా
లి దొరవు నీ కృపాభరము లే దమృతమ్మును లేము; నేమి సే
సెదవొకొ సేయవే! యనిన శ్రీహరి తాను బయోధి నీఁదుచున్

మ. సిరిఁ గాల్సేతులు నీటిలోఁ గుఱుచలై శ్రీనీలమేఘాభసుం
దరదేహంబును ముద్దయై గళము మూర్ధంబింత సన్నంబు గా
హారువా వీపును సుబ్బ డిప్పయయి భూధ్రాంతంబునన్ ద్రవ్వకొం
చరిగెన్ నీళ్ళలలోనికిన్ జలధి కంతా పెద్ద తాఁబేలుగా

శా. పాలోడన్ గిరిశృంగకాననదరీప్రత్యంతభూభృద్వృష
త్పాళిన్ క్షీరకృతాభిషేకశివరూపం బొప్పఁగా మందరం
బాలో లేచిన లేచుటే తడవుఁగా నాదిత్యులున్ దైత్యులున్
వ్యాళాధీశ్వరుఁ జుట్టి చిల్కిరి ప్రభూతానందదీప్తాస్యులై

చ. చిలుకుచు నుండఁగా నుదధి క్షీరము చిందిన బిందు లద్భుతం
బులును విచిత్రరూపములు పొందెను క్షీరమయంబులౌఁ గమం
డలువులు శంఖచక్రమకుటంబులు దండములై పయోధిలో
పలి వనమాలి భూషలను బాయఁగఁ ద్రోచినయట్లు లేచుచున్

వ. అంత నమ్మహోదధినుండి శంఖచక్రకుండలధారి దండి సకమండలువు హస్తంబున నమృతకుంభమ్ము పూని ధన్వంతరి యుదయించె; నమ్మహాప్రభువునకు సకలరుజాజరామృత్యువులు సాంజలులై నమస్కరించుచుండ నంత నద్దేవాసురులు మఱల

చ. చిలుకుచునుండఁగా నుదధిక్షీరముచిందుటు లోకమోహనం
బులు రమణీయరూపములు పొందెడు క్షీరమయంబులైన త
మ్ములు తెలిసంకువుల్ కలశముల్ వరివెన్నులు తమ్మితూండ్లు ము
న్నొలసిన వాహినీగతము లూచి పయోధి వెలార్చినట్లుగన్

వ. అంత నమ్మహోదధినుండి పుండరీకనేత్రలు శంఖగళలుఁ గలశపయోధరలుఁ గదళీజంఘలు మృణాలబాహులును నైన యఱువది కోట్లయచ్చరలును వారి పరిచారికలును నావిర్భవించిరి; అమ్మహాభాగ లందఱును సాధారణలై దేవదానవుల కపరిగృహీతలై లోకంబులు వెల్గించిరి; అంత కాశ్యపులు మఱల

చ. చిలుకుచు నుండఁగా నుదధిక్షీరము నుర్వులు దేరి యెట్టనౌ
వెలుఁగులు చిమ్మి పైపయిని వీచెడు గాలికి సొక్కు దెచ్చి తా
నిలువక తూఁగి తూఁగి హవణించె సహస్రసమావికీర్ణ ముల్
జలములశక్తి తప్పవడి చక్కఁగ నిల్వఁగ లేనిచాడ్పునన్

వ. అంత నమ్మహోదధినుండి నన్నెవరు గ్రహింతు రెవరు గ్రహింతు
రని వారుణీదేవి యావిర్భవించె; నామెను దైత్యులు మాకు వల
దనిరి; దేవతలు గ్రహించిరి; అద్దాన దైతేయులు నాఁటినుండి యసు
రులుఁను దేవతలు సురలునైరి; అంత సురాసురులు మఱియు బిట్టుగా
క్షీరనిధిఁ ద్రచ్చిన నా పాలనీటికెరటాలు గుఱుసులు వాఱి వాఱి

సీ. ఉచ్చైశ్శ్రవంబునా నొక తెలిమావైన
నది యింద్రుఁ డాఁచె వాహనముగాఁగ
గుములుగానైన చిన్కులు చెట్టుగట్టిన
నది కల్పవృక్షమై నాకమెక్కె
గిర్యధస్స్థానావకీర్ణాంబువుల పడె
మంజిడి వర్ణమై మాఁగుదేరి
మాలౌషధీస్పర్శమున గట్టిపడి కౌస్తు
భంబైన నురమున నవధరించెఁ

గేశవుఁడు; పాలచిన్నరి కెరట మొకఁడు
నిందిరాదేవియైనఁ దానే గ్రహించె
భార్యఁగాఁ గేశవుఁడు; నంత పాలకడలి
నుండి జనియించె నమృతమహారసంబు

క. పుట్టిన యమృతము కొఱకై
కొట్టికొనిరి సురలు నసురకోటి యసురులన్
గిట్టించిరి సురతతు లెగఁ
దట్టిన వారుణిమదంబు దర్పము కొలదిన్

వ. అంత మోహిని యన్న మాయ నాపాదించి విష్ణు వమృతంబు
నపహరించె ౨౫౬

ఆ. పరమవైష్ణవులును భాగవతులునైన
సురల కిచ్చె రసము హరి పరముఁడు
అమృతపానవశత నమరులై యాదిత్యు
లసురకోటినెల్ల నదుపుపెట్టి

ఆ. అసురకోటినెల్ల నాస్కందనంబునఁ
గాలు ద్రవ్వి త్రవ్వి కనుపుకొట్టి
యెచటి యెచటి వారి నేరి చంపిన సర్వ
మైన ధాత్రి సురలధీన మయ్యె

వ. సర్వఋషులతోడను యక్షగంధర్వసిద్ధచారణులతోడను బురంద
రుఁడు ముల్లోకములకు రాజై సుఖంబుగ నేలుకొనుచుండిన

క. దితి కడుపుకోఁత నతిదుః
ఖితయై లోలోనఁ గుమిలి కృశియించి నిరా
దృతిఁ బోయి సవతిబిడ్డల
గతిమాలినగంజిఁ ద్రావఁగాఁ దన బ్రదుకై

క. బ్రదుకుటయు నొక్క భరమై
యదితిదయాధర్మభిక్షమై గుడుసులుగా
మది మారీచుం గాశ్యపు
సదయునిఁ దనభర్తఁ గని సుచాందీనోక్తిన్

చ. తగవును జూడుమీ! సవతితల్లికుమారులు నింత చేదుగా
నగుదురయేని నే పురుషుఁడైన గ్రహింపఁగనేల నిద్దఱన్
మగువల నేరికైనను గుమారుఁడె మీకన నల్లయాంద్ర కె
ట్లగునో తలంపవే యెవతె యాత్మజుఁ డాయకకే కదా ప్రభూ!

మ. అనినన్ గశ్యపుఁ డౌనె యౌనె దితి! నే నాదిత్యులంబోయి నీ
తనుజశ్రేణిని జంపుమంటినటె? లేదా నీవుగా నేది కో
రిన నే నిత్తు వరంబు నన్న; దితి మారీచుం బతిం గాంచి యిం
ద్రునిహంతన్ సుతు నిమ్ము నాకును దపింతున్ జువ్వె నేఁ గాశ్యపా!

శా. నాగర్భంబున నింద్రహంత యగు సంతానంబుఁ గల్పింపవే
చేగన్ వేయిసమల్ తపించెదను దాక్షిణ్యంబు కన్పింపవే
నాగర్భంబునకోఁత యెంత కడిఁదో నారాపి డేపాటిదో
యీ గాలించెడుశోక మాఁగుటకు స్వామీ ! చాల నేవట్టునన్
చ. పరమతపోవిధాత భగవంతుఁడు కాశ్యపుఁ డల్లియాఁ గదే
తరుణి ! సహస్రమబ్దము లుదారత సేవ్రు తపస్సుచేసినన్
జిరమగుకాల మింతయు శుచిత్వము పాయక యుంటివేన్ బురం
దరహననక్రియాపటువు నాతుక ! పుత్త్రుని గాంతు వమ్మనన్
వ. ఆమెయుఁ బతిహస్తసమ్మార్జితయై స్వస్తిబ్రువాణుఁడైన పతి
యాశీస్సు పొంది నారచీరలు నగ్నిహోత్రమ్ములు దర్భలు హవి
స్సులుఁ గొంచుఁ గుశప్లవనంబున కేగి మహాతపశ్చర్యానిరూ
ఢయై గర్భశోకాపనోదదీక్షాపటువై యుండె నిట నింద్రుండు
ఆ. దలితపోఽర్థ మెఱిఁగి తతసిద్ధికృతనియ
మం బెఱింగి యుపచయం బెఱింగి
మించి వచ్చు టెఱిఁగి వంచనయో మార్గ
మంచుఁ దెలిసి వినయ మతిశయిల్ల
వ. తానును గుశప్లవనంబున కేగి
సీ. ఉభయసంధ్యల నగ్నిహోత్రమ్ము సరిచూచి
కొనగలదర్భలు కోసి తెచ్చి
విమలమౌ జలములు సమకూర్చి యర్పించి
యశ్వత్థసమిధల నాహరించి
త్రవ్వి దుంపలు వేళ్ళు తఱితో సమర్పించి
యందిచ్చి జపమాల హస్తములకు
పాదసంవాహనపరత శుశ్రూషించి
మడిచీర లెండించి మడత పెట్టి
తల్లి కునికిననైనను దాను గునుక
కమ్మ కనుమూయఁ గనుమూయ కమరరాజు
సర్వకాలంబుఁ దత్పరిచర్యయందె
సొక్కుచున్నట్లుగాఁగ శుశ్రూష సలిపె ౪౬౯

చంద్రిక.

పది కోట్లఁతగ వేయివర్షముల్ కదలెను శిశురక్ష గల్గఁగా
మది సురపతిసేవ మక్కువై యెదయు హర్షితమౌచు నిట్లనెన్

చ. కడువడి నింద్రహంతయగు గర్భముఁ గోరితి నే మునిన్ గడుం
గడు మది సంతసించితిని గావున నీ పరిచర్యఁ జేసి నా
కడుపుననున్న బిడ్డ నినుఁగాని వధించెడువాఁడు గాక యె
క్కుడు జయశీలి యౌచు మిముఁ గూడి త్రిలోకము లేలుగావుతన్

శా. నీ యాయుస్సును నీదు రాజ్యమును దండ్రీ! నిత్యమై యింద్రుఁగా
కీ యాశీస్సు ఫలించుగాత మని తా నిట్లే వచింపన్ దితి
ప్రేయోభావముఁ గాంచి యింద్రుఁడును సంప్రీతాత్ముఁడై మ్రొక్కఁగా
నీ! యంబా పటుగర్భమత్సరత గానీ వీడఁ డింతేనియున్

గీ. కాళ్ళవైపు తలాడగాఁ గన్ను కూరు
కొంచు వచ్చిన దితియు నిద్రించె నంత
పవలు రెండుజాముల వేళఁ బట్టరాని
పాపపున్నిద్ర యామెకుఁ బవలువచ్చె

గీ. ఆమె యశుచిత్వ మెఱిఁగిన నాకరాజు
నామె ప్రశ్రయమ్మునఁ గొంత యదవదపడి
మొగి దశోనసహస్రాబ్దములును వేచి
దక్కినట్టి రంధ్రము దిగఁద్రావ లేక

గీ. ఆమె యుచ్ఛ్వాసపథమున నంతరమ్ము
సొచ్చి గర్భస్థపిండమ్ము వ్రచ్చిపోవ
నేడు కణుపులుగాఁ గొట్టె నేడ్పు లొదవ
బాలకంఠంబులన్ దితి మేలుకొనియె

ఉ. దారకు నేడ్పు లేచిన శతారమునన్ హతు లొప్ప మా రుదో
మా రుదయంచు శక్రుఁడు కుమారునిఁ జెప్పెడుచో సుషుప్తియున్
దీరఁగ లేచి చూచి దితి దేవపతీ! శిశుఁ జంపకోయి రా
రా! రుధిరంపుఁబిండమును వ్రక్కలుసేయకు మోయి శూరుఁడా!

క. అను తల్లిమాటయందున
వినయము గౌరవముచేత వెడలెను శక్రుం
డును వెడలి తల్లిపాదం
బునఁబడి క్షమియింపు మంబ! పుత్త్రుని ! నన్నున్

గీ. కాళ్ళవైపు తలాడఁగాఁ గన్నమూయ
నశుచివాటను రంధ్రమ్ము నరసి యింద్ర
హంత నేఁడుగ నఱికితినమ్మ! యిదియు
నీ కృపాప్రశ్రయమ్మున నేను జేయ

గీ. సాహసించితి క్షమియింపఁ జను ననంగ
దితియు నతిలోకఘునగను దుఃఖితయు నైన
శక్రుఁడును భీతిఁ గనియె నే శాప మిచ్చు
నో యటంచును దితి కొంత కూరడిల్లి

చ. మును నినుఁ జంపువాని కయి పూనితి నే వ్రత మిప్పు డట్టి భా
వనయును లేదు నే నశుచిభావము పూనినయప్డు నీవు చే
సినయది తప్పుగా దయిన సేయుము నా యొకకోర్కె యే డగున్
దునుకలు నేడు గాలిపెనుత్రోవల రాజులఁగాఁగ నిల్పవే !

వ. నీవును మా రుదో మా రుద యంటివి గావున మరుత్సప్తస్కంధ
ములకు స్థానపాలకులుగా వీరగుదురుగాక ! యొకఁ డింద్రలోకచారి
యొక్కండు బ్రహ్మలోకచారి మూఁడవవాఁడు వాయు వనుపేర
దివియందునను దక్కిననల్వురు నాల్గుదిశలందును నీ వాగన్వర్థతా
సిద్ధిగా మారుతు లని చరింతురుగాక యనిన నింద్రుండు

గీ. తల్లిపాదంబులందునఁ దలను వాంచి
యెట్లు నీ వంటివో తల్లి యట్లె యగుత
మంచుఁ దల్లియుఁ గొడుకును నమరపురికి
జని సుఖించిరయా ! రామచంద్ర ! తండ్రి !

క. ఈ దేశమ్మున నే రా
మా! దితియుఁ దపస్సు చేసె నమరపతియు నిం
దే దితిగర్భముఁ జీల్చెను
నా దితి యిందే క్షమించె నమరేశ్వరునిన్

గీ. రెండునెలల పిండంబు జాఱిన జగంబు
లోనివారు శోకము పట్టలేనివారు
ఇంచుమించు వేయేఁడులు నెదిగినట్టి
పిండమును బ్రయ్యె దితి యోర్చెఁ బెద్దతల్లి

వ. అనిన శ్రీరామచంద్రుం డిట్లనియె

క. ప్రభు! ప్రభు! యోరిమివంటిది
త్రిభువనములయందు లేదు ధృతియుఁ క్షమయుఁ
శుభతమములైన గుణములు
ప్రభు! ప్రభు! గుణగణములందు రాజపదంబుల్

వ. అనిన విశ్వామిత్రుండు నౌనయ్య యౌనయ్య యోయి శ్రీరామచంద్ర ! తాటకాప్రాణహరణపుణ్యావాహినీభగీరథ ! సుబాహుప్రాణజలధిమందర! మారీచప్రాణరక్షణ ! క్షమాగుణనిధి! యనిన శ్రీరామచంద్రుం డిట్లు పలికె

గీ. ముని భృశాశ్వుని విద్య లిచ్చినది ఘనమొ!
మునిపతీ! యీ కథాళి చెప్పినది ఘనమొ!
రాఘువుని రామచంద్రుని బ్రదుకునెల్ల
నేలుచుంటివి నీ కృపాలోలదృష్టి

వ. అనిన నవ్వుచు విశ్వామిత్రుం డిట్లనియె

సీ. పరమధార్మికుఁడు నిక్ష్వాకు వలంబుస
యనునామెఁ బెండిలియై విశాలుఁ
గనె నా విశాలుండు కట్టె నీ పురి హేమ
చంద్రుఁ డఁట వాఁడు విశాలసుతుఁడు
ఆ హేమచంద్రుని యాత్మజుండు సుచంద్రుఁ
డతనికి ధూమ్రాశ్వుఁ డాత్మజుండు
ధూమ్రాశ్వునకును సుతుండు సృంజయుఁడు సృం
జయుబిడ్డ సహదేవుఁ డయపయోధి

యల్ల సహదేవుసుతుఁడు కృశాశ్వుఁ డతని
తనుభవుఁడు సోమదత్తుఁ డాతని సుతుండు
రామ ! కాకుత్స్థుఁ డనియెడు రాజు; సుమతి
వాని కొడు కిప్పు డీ రాజధాని నేలు

గీ. కులవిధాత యిక్ష్వాకుని యలఘుకరుణ
నఖిలవై శాలికులును దీర్ఘాయువులును
వీర్యవంతులు ధార్మికుల్ సూర్యతేజు
లును నరిందములు మహాత్ములును గుమార !

వ. ఈ రే యిందు వసించి జనకుని రేపు ప్రొద్దునఁ జూడఁబోదు మనిన

శా. మత్యుద్విగ్నత నేగి చారులు వచింపన్ భక్తితోఁ శ్రద్ధతోఁ
ప్రత్యుత్థానము సేసి యా సుమతి విశ్వామిత్రు నర్ఘ్యక్రియా
స్తుత్యాదిన్ సపురోధసుం డరిగి సంతుష్టుండుగాఁ జేసి సా
మత్యం బొప్పగఁ దక్క నెల్ల ఋషులన్ మన్నించి యర్చించుచున్

శా. తా మిక్ష్వాకులు తాతతాతలకుఁ దాతల్ మెట్టినా రయ్య యీ
భూమిన్ వారు తపోనిధాను లది యెప్డో నేఁటికిన్ దాదృశుల్
స్వామీ! మీరలు మెట్టినారు నిది మీ సామర్త్యమో ? పూర్వపు
ణ్యామేయాచ్ఛఫలంబొ ? నాదయిన ధన్యత్వం బకూపారమా

సీ. నడక యేన్గులమృగేంద్రములది యాకృతి
వ్యాఘ్రపుంగవముల యదియు నంద
మది జయంత కుబేరులది కన్నుదీర్పు క
ల్హారనీరేజంబులయది ; యీ కు
మారు లెవ్వరు? దేవతారూపవంతులు
కత్తి తాల్చినతీరు గార్ముకంబు
పట్టిన తీరును గట్టినతీరు తూ
ణీరయుగ్మము సమానీతమైన
గంగ వ్యోమభూమిగత రెండుపాయలో?
స్కందుఁడును విశాఖుఁ డిందు చనిరో?
సృష్టిమూలహేతు విష్టి రెండయ్యెనో?
ప్రభువు లేల నడచివత్తు రొక్కొ?

మ. ఎవరో సెప్పుడు పూజసేయుటయె లేదేఁ గౌఁగిటం బట్టుటో
సవరింతుల్ బరిచర్య యన్న మునిరాట్సార్దూల మానందనం
భవబాష్పంబుల వీరు దాశరథు లప్పా! రాముఁడున్ లక్ష్మణుం
డవు నా జన్మము దీర్చినా రసురసంహారక్రియాదక్షులై

క. అన సుమతి దశరథాత్మజు
లనియా! విన్నాను సర్వమగు వృత్తంబుల్
మునినాథ! యింక నొకత్రో
వను బోయితి కాదు నాదు భాగ్యము పొంకెల్

వ. అని యథాశాస్త్రంబుగ నర్ఘ్యపాద్యంబు లిచ్చిన రామలక్ష్మణు
లద్భుతంపడిరి

క. ఆరేయి యచట నుండిరి
స్వారాజ్యమునం దొసంగు సత్కారమ్మె
శ్రీరామలక్ష్మణులు పర
మారూఢముదంబురాసులై చలితాత్మల్

శా. స్వామీ! యింతటిగౌరవంబు మఱి యీ సత్కార మే మోర్వఁగా
లే మిచ్చోటుననుండి తె పుదయమే లేవన్ వలెన్ నాఁగ న
వ్వై మౌనీంద్రుఁడు నల్లె పోదము విశాలాధీశుఁ డితండె కా
దా ముత్తాతలనుండి యీవఱకు రామా! యిట్టివా రేసుమీ!

శా. శిక్యంబుల్ గొని రైతులేగెదరు రాజీవాక్ష! కోటేరులై
శక్యంబా వచియింపఁ ద్రోవఁ గనవా శాలేయవై ? హేయమ
షిక్యంబుల్ బహుపూర్ణసస్యములు కంటే యీధరానాథు లా
స్తిక్యంబుల్ సుకృతంబు లా పగిదిగా క్షేత్రంబులం బండెడుల్

వ. అనిన వారా ప్రొద్దున లేచి కృతాహ్నికులై సుమతి బహు
దూరంబు సాగనంపి యొకజలాశయంబు కడ మానిసి మానిసి వద్ద
సెలవుఁగైకొని మగుడ లేక మగుడ లేక వెనుదిరిగి చూచుచుఁ జూచు
చుఁ జనిన

గీ. దారిఁ జనినంతవఱకు నందఱు విశాల
మెచ్చికొనుటయు సుమతిని మెచ్చికొనుట
యాదరము మెచ్చికొనుటయు నంతిపురము
మెచ్చుటయు సేవకాళిని మెచ్చికొనుట

గీ. చాలదూరమ్ము చనగాఁ దమాలవృక్ష
బహుళమైనట్టివని యడ్డువచ్చినంత
నిచటికి విశాలరాజ్యమ్ము లిచటినుండి
యమలగుణ ! శాంతమతి ! విదేహములు రామ!

మ. నెఱి నిక్ష్వాకువునుండి వారు నిమినుండిన్ వీరునున్ మైథిలుల్
మఱి వైశాలికులున్ దమాలవని యీమధ్యంబునం దెల్లమై
గుఱుతై కానుగుచెట్లకై పొదలకై కూడన్ వివాదం బటం
చెఱుఁగన్ బోరు తమాలకానన మ దిట్లే యెన్నియేం డ్లుండెనో !

క. వైశాలికనరపాలుర
ధీశబలతఁ జూచివచ్చితివి మిథిలాధా
త్రీశులను నెఱుఁగఁబోయెదు
రాశి యయిన పున్నెము లగు రాజుల రామా !

మ. అల వైదేహులఁ గూర్చిగాని రఘురామా ! చెప్పఁబోగాఁ బొగ
డ్తల వైయర్థ్యము కల్గు నన్న నుడివెంటన్ మానులుం జూచి యా
తెలిమేడల్ వెలుఁగైనదే మిథిలకాదే యన్న నౌనన్న మా
నులు కేల్మోడ్చి నమస్కరించి రసమానుల్ బ్రహ్మవిద్యాగురుల్

ఉ. ఎప్పుడు చూతునో మిథిల యెప్పుడు వాజసనేయసంకథల్
తప్పక పొల్చుకొందునొకొ ! ధర్మపుబొడ్డును బ్రహ్మబుద్ధి నే
నెప్పుడు చూతునొక్కొ ! మిథిలేశు నటంచును రామకన్నులన్
గుప్పున వచ్చె బాష్పములు కోసలు దేరిన వెల్లముత్తెముల్

ఉ. రాముఁడు పల్కకే చరచరన్ నడచెన్ మిథిలాసమీపమం
దే మునిపల్లియో యుపవనీడితధాత్రిఁ బరిత్యజించి తా
నా మునియేగెఁ గావలయు నంతయు బీడయి పర్ణశాలయున్
గోమతి కూలిపోయెఁ బురుగుం గనిపించదు చుట్టుపట్టులన్ ౫౦౯

సీ. ఈ కావి కొనకేల యేగెనో తరుశాఖఁ
గాషాయమును బీలికలుగ వ్రేలు
నీ నీరు కొనకేల యేగెనో క్కో కమండ
లువు నీరు మురికియై నవురుమాయు
నీ తోలు కొనకేల యేగెనో కృష్ణచ
ర్మము వానకెండకు మాఁగిపోవు
నీ మాల విడి యేల యేగెనో స్ఫటికముల్
వ్రీలి యట్టిట్టుల విరిసిపోవుఁ
బాడువడి హోమకుండముల్ పూడిపోవు
బీడువడి యగ్ని వేదులు గాడిపాఱుఁ
బొదలలో నొక్క కుందెలు పొడయు లేదు
చెట్టుపైఁ జిల్క యాడిన చిన్నె లేదు

గీ. కడుఁ బరిభ్రష్టమైన యోగంబువోని
యాశ్రమముఁ జూచి రామునియక్షులందు
బాష్పములు గుత్తులై రామభద్రుముఖము
హరి వదలిచన్న వైకుంఠమట్లు తోఁచె

వ. వైకుంఠదేహాళీదత్తసంగతకస్తూరికారంగవల్లీమంగళాభిరామం బైన శ్రీరామచంద్రుని మొగంబు హిమాచ్ఛాదితోషఃకమలమ్ము వోలె నైనఁ గాంచి గాధేయుండు

గీ. తండ్రి తండ్రి! బాష్పములు నేత్రముల తుదల
గుబ్బటిలనీయఁబోకు నా గుండె చెదరు
గౌతముని యాశ్రమ మ్మిది గౌతముండు
సుఖముగా నుండె దీప్తతేజోవిధాత

ఉ. తీవ్రతపశ్శిఖావిమలదీధితి గౌతముఁ డొక్కహేతువై
సువ్రతభగ్నకారి యగు చోటును దీని శపించి యేగెనం
తే వ్రతిమౌళి తాను నెటకేనియుఁ బోయి తపస్సు చేయునో
తీవ్రకృపామనోజ్ఞపరిధీ! వినిపించెదఁ దన్నిమిత్తముల్ ౫౧౪

క. వినవే యన రాఘవుఁడున్
గనుఁగొనలఁ దేరి హాసకలితాననమో
హనమూర్తి యంజలించిన
మునిపతి యాననము నవ్వు మొలకలు గాఁగన్

ఉ. గౌతమమౌని సాధువు నఖండతపస్వి లతాంగితోఁ నహ
ల్యాతరళాక్షితో నిచట నాశ్రమమునై పటుధర్మమూర్తియై
ప్రీతుల నెల్లచో నదుపుపెట్టి హృషీకములన్ మలంచి ప్ర
స్ఫీతహృదగ్నియై తపముఁజేసెనయా! బహువర్షపూగముల్

ఉ. అందపుఁగోన యామెయు నహల్యయు గౌతమమౌనియున్ శతా
నందు సుతున్ విదేహనరనాథులయింట్ల పురోధసున్ మహా
నందుఁ దపోనిధాను మునినాథుని గాంచిరి వేల్పు లాశ్రమా
ళిందములం జరింతు రమలీకృతమానికృపానలంబులై

మ. ఒకసిక్తింబడి వేలువర్షములుగా నున్నన్ దపోమూర్తియై
యకటా గౌతము డట్టివేళను నహల్యాబుద్ధియై యింద్రుఁ డా
యకతోఁ గేళిని దీర్ఘకాలముగ మోహాగ్రస్తుఁడై కోరుచున్
సకియం జూడఁగఁ బల్కరించఁ దటి తోఁచన్ రాక యెన్నాళ్లకున్

గీ. మునితపమునందుఁ గనిపెట్టి మునియవోలె
వేషమును గట్టి యాశ్రమవీథి కేగి
యోసి యోసి యహల్యా! యిట్లొక్కసారి
రావె! యనఁగ నహల్య; పురందరుండు

ఉ. కట్టినవేసమున్ బలుకుకై వడి చూపులరీతియున్ మదిం
దట్టి వినూత్నవైఖరిగఁ దా బహుకాలముగాఁ బురందరుం
డట్టె తనుం గనుంగొనుట నా కనుగోసలు గుర్తుపట్టి యా
గుట్టును బైటపెట్ట కిదిగో ఋతుకాలము కాదు కాదనన్

క. కాముకులకు ఋతువగుటయుఁ
గామి యగుట కలదె యోసికామిని! యన్నన్
జో! ముని చూచిన నీకును
స్వామీ! నాకును మఱింత ప్రాణాంతకమౌ

వ. పౌమ్మన్న నింద్రుం డెఱింగిన దెఱఁగెనే యెఱఁగె నని విడివడి

మ. ఇది నీకై యదియెన్నియేండ్లు దిగులయ్యెన్ నా కహల్యా! యనన్
మది హేలార్థముగాఁ గుసుళ్లయిన యా మంజూషికారత్న మా
నదనా యియ్యది? కోడికూసెనె? యనన్ నాకేశుఁ డానందమున్
గదురన్ నవ్వుచుఁ బోయె నంతటన చీఁకట్లెగుదెంచెన్ వడిన్

చ. నిశి నిశి యెల్ల నింద్రునకు నీలసరోరుహలోచనావచో
నిశితమనోహరార్థవిపణీకృతధీకునకున్ మనోఽనుగా
విశదతనూసమార్ద్రవినివేశనవర్శ్యసధీఘురీసహ
స్రశకలితాక్షిగోళునకు సాగియు సాగదు కోడి కూయదున్

గీ. ఇట్లు కాదని లేచి సురేంద్రుఁ డటుల
నే చతుష్షష్టిసకలకళాచతురుఁడు
తన శిరస్స్థమాణిక్యమ్ము తామ్రమైన
చూడముగ నొప్పి తానుగాఁ గోడి కూసె

చ. ధృతమునివేషుఁడై బయలుదేరిన నా నిశిఁ గృష్ణపక్షసం
గతమగు ద్వాదశిన్ బలుచగా వెడలెన్ గడరాత్రి వెన్నెలల్
ధృతమతి గౌతముండు నరుదేరెను మందిరనుండి చూచె ని
ర్గతుఁడయి మాసినద్దమునఁ గన్పడనౌ ప్రతిబింబ మట్లుగన్

ఉ. తన్ను ద్విధాకరించిన వృథామతిఁ గాంచి క్రుధామతిన్ బలే
పన్నితి వోరి లౌకికుఁడ! భామిని నీ కనులన్ విలాసముల్
కన్నది నేను బాపములు కన్నది నేఁటికిరా ఫలించె నీ
తెన్నున ఛాందసాకృతిని దెచ్చెద వేమి సుఖంబు జారరా!

క. తనర సురాపానార్థము
చనుచున్ బీతాంబరంబు సవరించినటుల్
ననుఁ గూర్చి యేలఁ గట్టితి
విని వేసము దుష్టధీనివిష్టాఘోహా!

శా. ఏరా! నీవిటు వచ్చినావు సరి యా యిల్లాలు పౌలోమి నీ
కై రాపిళ్ళుగ వేచియుండెడును గాదా! యామెనుం గూర్చి యే
మారంభించిన మాటయే కలుషమా నాత్మీయులౌ దారలుం
గారా! యొక్కటియైన కోర్కెఁ బది సంకల్పింతు మిథ్యామతీ!

చ. పశువులఁ గాంచియైనఁ గనవా? ఋతుసంగతి యేక కామినీ
వశముఁ గపోతరాజుఁ గనవా? త్రిదశేశ్వరతానిరూఢి యా
పశువును బక్షికన్నఁ జెడఁబట్టెద వింద్రత శాశ్వతంబురా?
ప్రశమితవాంఛమైన యొకపాటి వెలుంగు నెఱుంగ వింతకున్

చ. దార నని యందగాఁడ నని దోచి యొసంగెద నంచు నీవు కా
పురములు కూల్చినన్ బికిరపుం బ్రదుకైన జనంబు లాంద్రకున్
విరహితులై శరీరసుఖవేదనఁ గాంచఁగరాదొ నీకు మైఁ
దిరిగిన జీవుఁ డచ్చుటను దిద్దఁడొ యీసొలపుల్ కుపీడకా!

చ. ఒకచిఱుభేద మేమిటికి నుగ్రులు లందఱ దేహనిర్మితుల్
ప్రకటితరీతి నొక్కఁడగు పద్ధతియే యిఁక దేనిఁ జూచి యీ
వికృతపుఁజేఁత దేనిఁగని వెక్కిళి పట్టెదొ? దానిరూపముల్
వికృతముగాగ దేహమున వేయి ధరింపుము నిత్యదర్శివై.

మ. అదియే ధ్యానముగాఁగ నుండెదవు నీ వా హేతువై నీకు నే
నదియే శిక్షను జేసితిన్ జనుమురా యన్నన్ బ్రహామూర్తియై
త్రిదశేశుండును మేనఁ బళ్ళికలుగాఁ దేరన్ వలన్ మైన నో
ప్పిదమై కప్పిన పల్లెవానివలె రొప్పెన్ స్వర్గమార్గంబునన్

వ. అంత గౌతముండు భార్య నహల్యం బిలిచి పోవుచున్న యింద్రుం
జూపించి యిట్లనియె.

క. త్రిదశపతికిఁ ద్వాదృశ లగు
మదవతు లోకవేయిమంది మసకలు కలిగెన్
త్రిదశపతి దివానిశ లని
చెదరం డిక నిత్యభోగచిహ్నితుఁడు సుమీ!

ఉ. నా తప మట్టు లుంచు మది నాదు దరిద్రత చాలు నాకు నా
యీ తనుయష్టిలోన మఱి యేడగులోకము లేలువానిలో
నే తమకమ్ము కల్గు నదియే యది వేయిమడుంగు లెక్కువై
నీతియు న్యాయమై వెలుఁగునే సురరాజును కాలిగోటికా ౫౩౬

ఉ. పేదతనంబులోనఁగల పెక్కువ సత్కులమందుఁ గల్గు మ
ర్యాదయు నీవెఱుంగ వవురా! యొక జాతివి గమ్మటన్న నా
పైదలి భీతినొంది మునివల్లభుఁ గాంచి ప్రభూ! క్షమింపవే
రాఁదగు జాతనం బయిన రాపిడి తగ్గవలెన్ మనస్సులో

మ. పృతనాసాహుఁడు వేయియేఁడులుగ స్వామీ!నన్నుఁ గాంక్షించెదున్
మతి నిన్నాళ్ళను బిగ్గపట్టితి నిలింపస్వామి సాయంతన
స్మృతిగుప్తాకృతి వచ్చి నన్నడిగె నే నావేళ మోహంబు నొం
దితి నీ మోహము తీరఁగావలయు గాని జాతి నెట్లొదునో

శా. ఈ మోహమ్ముఁ దొలంచి నీసతిగ నన్నేలన్ వలెన్ జాయిగా
స్వామీ! యుండు మటన్న నుండెదను వర్షంబుల్ పదార్వేలుగా
నీ మోహమ్ముఁ దొలంచవే యనినఁ దన్విన్ గౌతముం డీ శిలా
సామాన్యం బొకయద్భుతంపుఁగ్రియ నైశ్చల్యంబు ప్రాప్తించెదున్

ఉ. ఎప్పుడు నీదుమోహ మది యెల్లయు విచ్చునో రామచంద్రుఁడై
యప్పుడు వచ్చు స్వామి యని యాముని యేగె హిమాచలంబునన్
అప్పగనై యహల్య తన జాతితనంబుఁ దొలంచు సామికై
యిప్పటి కిందె యుండెను సుమీ! యని గాధిసుతుండు చెప్పినన్

క. సౌమిత్రి రామచంద్రుని
ప్రేమయు గౌరవముఁ దొలుక వీక్షింపఁగ శ్రీ
రాముని ముఖమున లజ్జా
శ్రీమంథరమధునదంబు చిందులు ద్రొక్కెన్

చ. పిలపిలనొచు నంత వినిపించె శుకీకలవింకశారికా
కులకలరావముల్ తరునికుంజలతాళులఁ గూహుకూహుసం
కులనినదార్భటీమధురకూజితకోకిలకాకలీస్వరం
బులు గగనంబునం దెగిరిపోయెడు సారసహంసరావముల్

సీ. నేత్రపర్వముగ నిండిన పూలచివురుల
వృక్షశాఖలఁ గావు లెండుచుండె
నట్టె దైవతగంగఁ బట్టితెచ్చిన కమం
డలువారి శుభ్రమై వెలుఁగుఁ జిమ్మె

నవనవలాడి కృష్ణమృగాజినం బంత
యప్పుడే పఱచినయట్లు తోఁచె
వృక్షశాఖలయందు వ్రేలాడు జపమాల
స్ఫటికాచ్ఛకాంతులు చౌకళించె
హోమకుండంబులం దగ్ని యుజ్వలించెఁ
దీర్చిన బ్రుసీమనోజ్ఞ వేదికలు నొప్పె
నోయి! రఘురామ! రామచంద్రా! యిదోయి
స్వాగత మటంచు వినవచ్చెఁ బలు కొకంఠ

చ. కలకలనాడు తోరణవికాసపు ముంగిటి పర్ణశాలలో
వెలువడి గౌతముం డమృతవీచిక నవ్వున వచ్చి యెల్ల సహా
నులకును నర్ఘ్యపాద్యములు నూత్నసపర్యలుగా నొసంగి క
న్నులబడి యాత్మయే యుఱుకునో యన రాముని జూచి చూచుచున్

గీ. ఓయి రఘురామ! రామచంద్రా! యిదోయి
స్వాగతము కన్నతండ్రి! సుస్వాగతమ్ము
నీ కొఱకు వేచియున్నారు నీరజాక్ష!
పర్ణశాలాంతరమ్మున భక్తజనము

వ. అందఱు నాశ్రమసరస్సున మాధ్యాహ్నికక్రియలు నిర్వర్తించి భోజ
నంబునకు రండనిన వారును స్నానమ్ములాడి యగ్నిహోత్రంబులు
చేసి పర్ణశాలాభ్యంతరమ్మున బంతులుదీర్చి పఱచిన పర్ణంబుల
ముందుఁ గూర్చుండిన

సీ. ఒకచేత పంచభక్ష్యకములుఁ బరమాన్న
మిరవొందుచున్న పళ్లెరముఁ బూని
యొకచేత గాంగవారికమండలువు పూని
యన్నపూర్ణాదేవి యనఁగ వచ్చి
చేతి పళ్లెరమును క్షితితలంబున నుంచి
యిఁక నొక్క పళ్లెర మెత్తి కప్పు
రంబు వెల్గించి నీరాజనం బెత్తి యో
శ్రీరామచంద్ర! దాక్షిణ్యమూర్తి!

రామ! రఘురామ! దశరథరామ! యో య
యోధ్యరామ! జానకిరామ! యోయి తండ్రి!
యసురసంహారరాము! పట్టాభిరామ!
యనుచు నీరాజనం బొసంగిన దహల్య

సీ. పేదయింటికి దివ్వె పెట్టినయట్లుగా
నారచీరలు గట్టి క్షీరజలధి
కన్యకామణి వచ్చు నైవడి హిమగిరి
కూఁతురు భూతేశుకోఁ నొఱకు వ్రతము
పూనినన్నై వడిఁ బొలుపారెడు నహల్య
నీరాజనంబెత్తి నీరజాక్ష!
కరుణవారాశి! భాస్కరవంశవారాశి
పొడిచిన నీహారముగ్ధరోచి
రామ! రఘురామ! దశరథరామ! యో య
యోధ్యరామ! జానకిరాము! యోయి తండ్రి!
యసురసంహారరామ! పట్టాభిరామ!
రామ! రఘురామ! రామ! శ్రీరామ యంచు

సీ. జలధికన్యాకుచస్థలిసీలమణి తాళి
బొట్టు గట్టిభవాంబునిధి యొడ్డి
శ్రీవికుంఠపురీధురీభూత మగు పచ్చ
డాలు వాలై యఘశైల మగలి
గరుడిమూపున పదాంబురుహ మ్ముంచిన వీర
ముద్దె హద్దై దోసములు మలంచి
ముక్తికాంతాగళమ్మున హత్తుకొను నల్ల
పూస మోసై పున్నెములు జనించి
రాసులై పేర్చు వాంఛాతరంగములును
బలిసి ఆకట్టు పొందిన పాపములును
సర్వలిప్తల బలిసెడు స్ఖలితములును
బాసి నా గుండె నడకువల్ బలియుచుండె

సీ. మునిగుప్తమహా మనోమూలమై చను వేల్పు
కుజము నాపైc దనకొమ్మ సాచె
పొదుగుధారలవాక పొర్లెడు తెలిగంట్ల
ప్రష్ఠౌహి నాపైని బాలుచిలికె
చల్లని వెలుcగులౌ జాబిల్లి జిగిదిండి
మాoదాళి నాపైని జెందిరించె
కలుషమ్ములను రాపిడులు పెట్టు సురధాణి
శ్రీధుని నామీcదc జిలకరించె
బడలికలు వాసితిని గొమ్మపట్టులందుc
బేర్మిc ద్రావితి క్షీరవార్బిందులందుc
జెంగలించితి రత్నంబు చిందులందుc
జెలcగి మునుకాడితిని గంగచినుకులందు

సీ. సచ్చిదానందముల్ స్కంధత్రయము గుర్తు
గా నున్న యొకచెట్టుగానిచెట్టు
పంచభూతము లను బంచశాఖలు సాగి
యైదుగుణంబుల నవఘళించి
పంచేంద్రియాఖ్యశిఫల్ దిగి యవ్వాని
మొదళుల విషయముల్ మొలకలెత్తి
బుద్ధియు మనసును బొల్చు నహంకృతి
విషయేంద్రియములకు వేళ్ళుపాఱి
యొకమహాగాధ పెంచిన యొక్కcడైన
చెట్టుగాని చెట్టుతనమ్ము జిగివెలుcగున
కంజలించెద నేను నారాయణునకు
రామచంద్రునకును రఘురామునకును

సీ. కమలాకుచోపరికస్తూరికాగంధి
శాటినాగరకత సాగివచ్చె
వైకుంఠమంగళద్వారతోరణపారి
జాతవాసన లిందు సాగుదెంచె

వనమాలికాగంధవాసనాలుబ్ధబం
భరకోటి యిచటికిఁ బాఱుదెంచె
ముక్తికాంతాహాసముగ్ధమందచ్ఛటా
సంతాన మిచ్చోట గంతువెట్టె
నింతసభ్యత నాయెద నేలగలిగె
నీ పరిమళ మేల నా యెద వహించె
నింత ప్రభులోభ మేల నా యెదకుఁ గలిగె
నింత యానంద మేల నా యెద జనించె

సీ. ఋషి నారదతుంబురుప్రౌఢసామగా
నాలాపములు నోట నాడినట్లు
శ్రీఘృతాచీ మేనకాఘులంఘులితమం
జీరధ్వనుల్ నోటఁ జిలికినట్లు
లలి లయానుగగరుచ్ఛలనన్నృత్యత్తార్క్ష్య
చరణరావము నోటఁ దెరలినట్లు
పద్మాలయాహస్తపద్మానుకూల తా
ళామృతధ్వని నోట నలరినట్లు
శ్రీవికుంఠపురీసమావృతసమస్త
భక్తలోకంబు నా యెదఁ బాడినట్లు
శ్రీయుతాకారమై తోఁచు నా యెడంద
నరుదుగా రామభజనమందిరము తోఁచు

సీ. ప్రభు మేనిపైగాలి పైవచ్చినంతనే
పాషాణ మొకటికి స్పర్శ వచ్చె
ప్రభుకాలిసవ్వడి ప్రాంతమైనంతనే
శిల కొక్కదానికిఁ జెవులుగలిగె
ప్రభుమేనినెత్తావి పరిమళించినతోన
యశ్మంబు ఘ్రాణేంద్రియంబుఁ జెందె
ప్రభునీలరత్నతోరణమంజులాంగంబు
గనవచ్చి ఱాతికిఁ గనులు గలిగె

౫౫౬

ఆ ప్రభుండు వచ్చి యాతిథ్యమును స్వీక
రించినంత నుపలహృదయవీథి
నుపనిషద్వితాన మొలికి శ్రీరామ భ
ద్రాభిరామమూర్తి యగుచుఁ దోఁచె

వ. అనిన శ్రీరామచంద్రుండు లేచి యహల్యాపాదంబులకు నమస్క
రించిన

గీ. సర్వమానికంఠసంపదుదీర్ణమై
స్వస్తి స్వస్తి రామచంద్రునకును
స్వస్తి స్వస్తి మానిసంతోషమూర్తికి
ననుచు మంత్రపుష్ప మనిరి నోట ౫౫౯

## ఖ ం డా ం త ము

గీ. ఓయి నా ప్రాణనాథ! శివా! యిదియు న
హల్యఖండంబు నీ కృప కగునుగాక!
పార్వతీశోభనాద్రి గర్భంబు రచన
యల్ల ముక్త్యాలపతి వినదైన రచన

ఉ. ఐహికముగ విరక్తిఁ గొని యాత్మపదార్థపరార్థనై చికీ
ర్షాహనశీలమా నెడదఁ దూఁగిన తూఁకువ నీవు క్రొత్త రూ
పై హావణించుటో! హృదయమందిన మేలిమి యైన తేకువో!
ఓ హర! రెంట భేద మని యొప్పని నీదు నను గ్రహంబొకో!

**మేఘవిస్ఫూర్జితము.**

స్థిరాంశు ప్రస్విన్నామృతకరవియద్దేశచూడామనోజ్ఞా!
పురాళీప్రధ్వంసాద్భుతతరభుజాభోగకేళీసమజ్ఞా!
మరుత్పాళీకేళీగిరికృతధనుర్మండలీలగ్నవిష్ణూ!
సరజ్జ్వాలాహాలాహలవిషమహాసహ్యరేఖాసహిష్ణూ!



# ధనుష్ఖండము

క. శ్రీయోగిరాజహృత్కమ
నీయసుధాస్యందికోన్మనీచరమకళా!
తోయదమృదురేఖాశో
భాయుతరుద్రాక్షకాంతిభాగహిమగళా!

సీ. రఘువులకోవక్షీరధిచందమామకు
వింటి కోసలయందు విజయమగుత
కౌసల్యబిడ్డకుఁ గన్నతండ్రికి విదే
హాధీశసభలఁ గల్యాణమగుత
తాటకాప్రాణసంతానద్విజిహ్వున
కఖిలమార్గమునందు నభయమగుత
యఖిలేశ్వరున కహల్యాప్రాణదాతకుఁ
త్రిభువనంబులయందు శుభములగుత
గౌతమర్షి తేజము కూడుకట్టియున్న
యీ యహల్య ప్రాణములలో నెగయుచున్న
శ్రద్ధలును భక్తులును బరిస్పందములును
తండ్రి వెన్నాడి శుభములు తార్చుగాత

ఉ. నాయెదలోని నెత్తురులు నాఁగను గైరికధాతు వోయి తం
డ్రీ! యది నీ ముఖాబ్జమున నెల్లయుఁ బ్రాణముతోడఁ బెట్టెదన్
ప్రేయపుబొట్టు దీని సవరించుచు నుంటిఁ గోసల్ మలంచి నీ
పై యఖిలామరుల్ సకలమార్గములన్ బరిరక్ష సేయఁగా

సీ. ఓ యమ్మ భూదేవి! యీయయ్య రఘుశిశు
బడలబెట్టకు మమ్మ యడుగులందు
ఓ వాయుదేవ! రఘూద్వహు శ్రీరాము
సొక్కిపోకుండఁగఁ జూడుమయ్య

ఓసి తేజోభూతమా ! సామి తేజమ్ము
బొడ్డు దీధితులను బొక్క నీకు
ఓ యగ్ని! యీ కౌసలేయుండు పసిపాప
కడలనాల్గింటను గాచియుండు
ఓ జలాధిదేవతలార! రాజశిశువు
నీ రసాధిదేవత చూడుండీ! సమస్త
రసపథంబులయందున రాపులేక
స్వామి మిథిలేశుసభలకు సాగుచుండె

వ. అని యహల్యాదేవి శ్రీరామచంద్రుని ముఖంబున విజయతిలకం బుంచి ఋషు లెదురుచూచుచున్కి నిట్లనియె

సీ. నా ప్రేమ యిద్ది యెన్నాళ్ళిట్టులే యుండు
కదలిపోవయ్య రాఘవకులేంద్ర!
ఎన్నాళ్లు తిలకంబు నిల్చి తీర్చుచునుందు
మునులు వేచెదరయ్య ముద్దుబిడ్డ
ఈ సాగనంపుట కెప్పు డంతుండదు
వహ్ను లెత్తిరిసుమీ బండ్లపైని
నా ప్రేలి యెఱ్ఱదనాలకుంకుమ యారఁ
డా విదేహముల కీ వరుగవలయు
నాయనా! యచ్చటను శతానందుఁ డుండె
నీవు నా బిడ్డ వగుట వానికిని జెప్పు
నీవు నా తండ్రి వగుట వానికి వచింపు
నీవు నా దైవమగుట వానికిని దెలుపు

మ. అలవైదేహియు శ్రీయుఁగాఁ దిరిగి పోనా వేళఁ గా లి
ర్తులు మీ జంటలు గౌతమాశ్రమముగాఁ ద్రోవం జనంజూడుఁ డా
శిలయా నొక్కతె వేచియుండు నిట రాజీవాక్షు! మీకోసమై
యలరుంభక్తియె పేని చీర లని మీకై కట్టపెట్టంగనై

క. అని పంపలేక పంపిన
మును లాలస్యంబునకును ముగ్ధులుగానై
చని రీశాన్యదిశంబడి
జనకుని యజ్ఞాయతనము చనుదెంచె నట్ల

సీ. శ్రవణపేయంబుగాఁ జనుదెంచె స్వాహావ
షట్కారదీర్ఘ ఋక్సంతతులును
ఘ్రాణతర్పణముగాఁ గదలివచ్చె నవాజ్య
హావిరుత్థధూమ మేఘాళిపౌరలు
నేత్రాభిరామమై నిగిడితోఁచెను సర్వ
దేశసమాగతద్విజకులంబు
సంకులం బయ్యె నెచ్చటఁ ద్రోవ బహుశత
శకటీప్రపూర్ణ యాజ్ఞికధరిత్రి
యంత గాధేయుఁడును వివిక్తాభిరామ
మైన యొకసర స్తీరంబునందు బండ్లు
దించి యట రావికొమ్మలు వంచి త్రుంచి
యెడ్లకును మేఁతవేయించి యెసఁగునంత

క. మునివృషభురాక తెలిసిన
ననఁగి శతానందఋత్విగాళిపురస్థుం
డును వచ్చె జనకభూపతి
వినయము కనుగోసలందు వియ్యంబులుగా

ఆ. ఋత్విగాళి దీప్తఋక్సాన్యనముఖరులు
ఋషిమహేంద్రు నర్ఘ్యమిచ్చి పూజ
సేయ ఋషియుఁ బూజసేఁతఁ బొంది నృపాలు
నడిగె. రాజ్యక్రతునిరామయములు

వ. అంత రాజు కృతాంజలియై యెల్ల ఋషులను బరిచారికాసీతాసనం
బుల సుఖనివిష్టులం గావించి ౧౨

క. నీ వచ్చుటచే యజ్ఞము
భావితఫలవంతమయ్యెఁ బ్రభు వరు దేరన్
దేవతలు నిలిచి రిచ్చట
నీ వచ్చుటచేఁ దరించెనే నా జనువే

వ. ఓయయ్య మునిదేవ! యజ్ఞంబునఁ బంద్రెండవదినంబు శేషహోమంబు సుత్యాహోమంబున దేవతలం జూతువుగాని యని మఱల నంజలించి

శా. శ్రీ వక్షస్స్థలమందు డిగ్గినగతిం జెల్వొంది గాఢోరసుం
డావిష్కారము నందియున్న ధరణీనాకావనస్ఫూర్తిషు
ద్గ్రీవాబాహుముఖాభిరాముఁడు దరశ్రీస్మేర రేఖాజగ
ద్భావాకర్షణశీలుఁ డీ వటువు శోభారాశి యెవ్వండయా?

శా. గోధిప్రౌఢజగన్నిరాకరణమా గోమొప్పఁ దూణీరముల్
గోధాత్రాణము ఖడ్గముం ధనువుఁ గైకొంచున్కి రాజన్యవం
శాధారంబగు మూర్తిఁ జెప్పెడును మోమందంబు దర్పంబునన్
గాధేయా! రఘువంశభూపతుల ప్రాగల్భ్యంబు సూచించెడున్

వ. ఈ పిన్నవాఁడన్నిరీతుల నన్నగారిం బోలియుండె; వీరెవ్వ రన్న గాధేయుండు

శా. వీరా! వీరు విదేహరాజ! మిథిలావృద్ధశ్రవా! యాజ్ఞవ
ల్క్యార్యాఘోజ్జ్వలశిష్యతాజలధి! బ్రహ్మజ్ఞాని! సీరధ్వజా!
ఈ రాజన్యకుమారులున్ దొరకినా రెచ్చోటనో నాకు నా
తోరా నే నొకచోట వెన్దిరిగి చూతున్ వీరు గన్పించినన్

చ. అపు డొక యజ్ఞదీక్షితుఁడనై సవవిఘ్నకృదుగ్రులైన కౌ
ణపులయు బాధ యెక్కుడయినన్ గొనిపోవుచు నుంటి వీరి; మా
ర్గపుఁబిడుగయ్యె నంత నొకరాక్షసి; తాటక దానిపేరు; నీ
నృపసుతుఁ డొక్కబాణమున నేసిన రాక్షసి చచ్చె భూమిపా!

వ. అనినఁ దాటకోపద్రవం బెఱింగిన సభలోని ఋషులందఱు నాశ్చర్యపోయిరి; అంత గాధేయుండు ౨౦

ఉ. నీచులు దైత్యు లిద్దఱయి నించిన మాంసముగా సుబాహుమా
రీచులు పంక్తికంధరుని ప్రేరణచేతను నాదుయజ్ఞ మా
హా! చెడుచుండినన్ ప్రభువులై చనుదెంచిన వీర లిద్దఱున్
గాచిరి యాతురాత్రులునుగాను బవళ్లునుగాను దండ్రులై

గీ. ఆ సుబాహుని నాగ్నేయమైన విశిఖ
దాహమున మింట మింటనే తగులఁబెట్టె
నే పృషత్కంబొ మారీచు నెగురఁగొట్టె
నాతఁ డేమయ్యె నీ పఱ కయిపు లేదు

గీ. ఒకఱాయి యేమొ స్త్రీయై
చకితాక్షులమైన మాకుఁ జోకట్లుగ నా
యక యీతనిం బలిధ్వం
సక! స్వభు! వైకుంఠ! యనుచు సన్నుతిపట్టెన్

వ. అంత నిచ్చటికి వచ్చితి మనిన సభయంతయు నాశ్చర్యంబును సంభ్రాంతియుఁగా జనకపురోహితుండయిన శతానందుండు వించు వించు లేచి లేచి

శా. ఏమీ! యమ్మ శిలాతపస్వినియుఁ దా నీకుజ్జ కా ల్ద్రాకినన్
శ్రీమన్మోహనమానుషాకృతిని దాల్చెన్ జెప్పవే గాధిసూ
తీ! మా తండ్రియు రామచంద్రుఁ డితఁ డౌనే రాఘవుం డేమి నో
మో! మాయమ్మ యహల్య యిప్పటికి నోప్పెన్ శాపనిష్కారమై

ఉ. అది యటులయ్యెనేన్ దశరథావనినాథులబిడ్డ లీ ప్రభుల్
సదయుల తండ్రిగౌతముల శాపము నిష్కృతి యట్లు లౌటచేఁ
బొదలఁగఁ దల్లికిన్ నికటభూమిఁ బురోధసుఁ డౌచునుంట సు
మ్మిది మిథిలేశులొద్ద నిది మీ కృపసూ! కుశవంశభూషణా!

ఉ. త్రోవను గాంచుచే మదిని దోఁచెను నా కది యేల చెప్పఁగా
దేవరహస్య మంచు ముని తిన్నగ రామునివద్ద కేగి యా
నీవటె యయ్యా! యీ యడుగు నీదటె? యీచిఱునవ్వు నీదటే?
నా వలనుం గనుంగొనవె! నా హృదయాంతరరత్నదీపికా! ౨౭

వ. అనుచు నఖశిఖాపర్యంతము రామచంద్రునిఁ ద్రావుచున్న కన్ను లతో శతానందుం డేమొ యేమో యడుగుచుండినంత రామ చంద్రశతానందు లిద్దఱుఁ బరస్పరస్నిహ్యామాణు లైనంత జనకుండు

చ. అగు రఘువంశయోగ్యమగు నాకృతి యిద్దఱియందునన్ దగుం దగుఁ బటుదోరమందమగు దర్పము చేసినచేత యద్భుతం బాగి సకలంబు నం దొదిగియున్నది వీరును యజ్ఞదర్శనా నుగులయి రాక యీ క్రతువునన్ ఫలవంతము నేఁ గృతార్థుఁడన్

చ. దశరథరాజు నాకు నరుదారఁగ మిత్రము వాని యింతలో శిశువులఁగాంచి నా మనసు జెందెడు మోదముఁ జెప్పఁజాల నో కుశికసుతా! యనుంగుకొడుకుం గన నా పతి దైన నొవ్వుగా ని శతగుణంబుగా ఫలము నెక్కొనె; జన్నము నేను జూచితిన్

వ. వీరి నామధేయంబు లెట్టివనిన గాధేయుండు పెద్దవాఁడు రామ చంద్రుండు పిన్నవాఁడు లక్ష్మణుం డని చెప్పి రామచంద్రుండు కౌసలేయుండు లక్ష్మణుండు సౌమిత్రి యనె నంత రామచంద్రుండు లక్ష్మణునికంటెఁ బెద్దవాఁడు తృతీయాంబాపత్యంబు భరతుండును లక్ష్మణునితోడి కవ శత్రుఘ్నుండును గలరు; మేము నలువుర మన్న దమ్ములమనిన

క. ఆలాగటోయి తండ్రీ!
యేలాగూ? దశరథునకు నీ నలుగు రకే!
నాలుగుతునుకలు నీదగు
నాలాపమె మిత్రు విన్నయటులై యొప్పెన్

వ. అని రామలక్ష్మణులను జేరఁదీసి రామచంద్రునిమూర్ధంబు మూర్కొని నంత శతానందుండు గాధేయుని రామచంద్రునిం గనుంగొంచు విషాదానందవాక్యైక—

గీ. ఓయి మునిలోకశార్దూల! యోయి గాధి
తనయ! యో బాలకాకుత్స్థ! దశరథాత్మ
జాత! యో కౌశికా! యోయి సత్తపోని
ధాన! యో రామచంద్ర! యో తరణికులుఁడ! 38

ఉ. అర్ఘ్య మొసంగెనా జనని యాకృతిఁ బొంది మహాశిలాతపో
ధైర్యము మాని పాద్యమును దాను నొసంగెన ? రామచంద్ర ! నీ
కర్ఘ్యము పాద్య మిచ్చెనటె? యమ్మ తపోనిధి యా శిలాతపో
ధైర్యము వేయియేండ్ల కరుదారఁగ మానెనటే కృపామతీ !

క. విధి చెడ్డదోయి రఘుకుల
పృథుకా ! యది చివటిదాఁక వెడలించవలెన్
పృథుతరము మహాతేజము
విధురము దురనుష్ఠితంబు విధిచేత గదా !

మ. ఇది యేనాఁటికి నేమగున్ దెలియ దోయీ రామ! యెన్నేండ్లుగా
బ్రదుకో యన్నిసమల్ నెలల్ దినము లిప్తల్ లిప్త రక్షింపఁగాఁ
దుది నీ జీవితమెల్ల శ్రేష్ఠమగు; లేదో యొక్క విఘ్నంబుచే
నిది పాపంబున నంటి యట్లె యగు స్వామీ! యెల్లకాలానకున్

మ. అది కృచ్ఛ్రంబు తపంబు తుట్టతుద కేలా వచ్చు నిర్విఘ్నమై
యదియున్ వచ్చునొ రామచంద్ర! విధిచే నా రీతి నుద్దిష్టమై
పొదలున్ గాధితనూజుఁ డీ ప్రభువు సంభూతోగ్ర తేజోమహా
స్పదమై యొప్పు నటన్న నవ్విధియనుష్ఠానంబు పుష్పించుటే

ఆ. అనిన గాధిసూతి యానా శతానంద!
గౌతమా! బలిష్ఠగతియు విధియ
యదియు ననుమతింప కగునె రాజర్షి యు
నయిన బ్రహ్మఋషియు నగుట యగునె ?

క. అనిన శతానందుండును
మునినాథా! యమ్మ రామమూర్తింగని యే
మనినది? తనభాగ్యము నే
మనినది? ప్రభుఁగూర్చి యేమి యనినది చెపుమా !

శా. వ్యోమజ్యోతిరుదారమండలసభాపుష్పంబు నాతండ్రి యో
స్వామీ! స్వామిని రామచంద్రుఁగని పూజాసత్కృతుల్ చేసెనా?
స్వామిన్ మత్పితృపాదులన్ రఘుకులస్కందుండు మూర్ధంబు త
చ్ఛ్రీమత్పాదములందు నుంచి వినయశ్రీ లొప్ప మన్నించెనా? ౭౧

శా. ప్రత్నాఖండలరత్నమోహనతనూప్రౌఢచ్ఛటాసంతతుల్
నూత్నాంభోధరరమ్యు రాఘవుని కాంతుల్ పందిరుల్ కట్టెనా?
ప్రత్నాంశుల్ విరజిమ్మి మేల్కొను తపఃప్రహ్లాన్నమై సర్వముల్
యత్నంబుల్ రఘురాముఁడే యతిథిగానై యాశ్రమం బందునన్

వ. అనిన శతానందునితో గాధేయుం డిట్లనియె

క. మునినాథ! యచటఁ దపములు
మునుజను వెలుఁగైన గౌతముండు జననియున్
బునరుద్దీపిత తేజ
స్సనాథబంధురతపోవిశాలయుఁ గాదే!

గీ. అచట నున్నది స్మృతికర్తలైన గౌత
ములును జన్నది శాపవిమోచనోగ్ర
తేజు లగు రాఘవులును నాతిథ్యవిభవ
వర్ణనము సేయుటకును నెవండ నేను?

మ. కను లున్నం జెవు లున్న సచ్చటివిభుల్ కన్నన్ గథల్ విన్న నే
తనువో పూతముకాదు? నే జనువో కృత్స్నంబైన సృష్టిప్రభా
ఖని పున్నెంబులు ద్రవ్వకోదు? కనులం గన్నీరు మున్నీరుగాఁ
దనువుల్ దర్భలమోళ్లుగాఁ బులకరింతల్ గల్గె మీ యింటిలో

వ. అనిన శ్రీరామచంద్రుం డిట్లనియె

ఉ. నే నొక రాజబాలకుఁడ నీవును జూచిన మానిరాజు వ
య్యా! నిను నన్నగా రనిన నా జననీపదమా నహల్యలుం
గాని యొకింత బాధ్యుఁడను గాను సుమీ మఱి నేను; నన్నుఁ గ
న్నానని యామె యామెఁ గనినా నని నేనును నెంత న్యాయమో!

గీ. నా నొసట నిద్దఱే యుంచినారు విజయ
తిలకము లయోధ్యలో బయల్దేరువేళ
నమ్మ కౌసల్యయును; గౌతమాశ్రమమున
నమ్మ కన్నఁ బ్రేముడి నహల్యయును నాకు

క. అని యానందాశ్రువు లొలి
కిన రాఘవుఁ గౌఁగిలించి కేకాగుంజ
ద్వననీలకంఠపింఛ
మ్మున వెలుఁగులు చిమ్ము లోచనాంశులు గాఁగన్

గీ. రామ! రఘురామ! దశరథరామ! యో య
యోధ్యరామ! జానకిరామ! యోయితంత్రి!
యసురసంహారరామ! పట్టాభిరామ!
రామ! రఘురామ! రామ! శ్రీరామచంద్ర!

క. ఈ వెంతవాఁడ వౌదువొ?
యీ విశ్వామిత్రమౌని యేలా నిన్నుం
దా వెంటఁదెచ్చు రాఘవ!
యీ విశ్వామిత్రుఁ డెవరొ యెఱుఁగుదు వటవే?

క. ఈ కౌశికుం డొకండును
గాకుత్స్థా! బ్రహ్మయటులుగా నితఁ డిటుఁగా
లోకముల సృష్టి సేయుదు
రాకసమున గోళకంబు లవి యుదయింపన్

క. మఱుబ్రహ్మ బ్రహ్మ యనుటయె
తెలియదు లోకంబునకు ధృతిని నీ ముని యీ
వెలుఁగు వెలిగించెనో తప
ములవహ్నులు ప్రజ్వలించి ముల్లోకములన్

క. నీ కన్న ధన్యతరుఁడున్
గాకుత్స్థా! లేఁడు; గో ప్తగా గాధిసుతుం
డే కాచుచుంట నిన్నను
నీ కన్న మహావిధాత నెటి నుండఁడయా!

క. ఈయన కథఁ జెప్పెద విను
మీయన తొలినాళ్ళ రాజ్యమేలెను బహుదీ
ర్ఘాయుతవర్షమ్ములు ధ
ర్మాయతమతి నేలి యేలి యా యేలుతఱిన్

ఉ. ఊహ యొకండు కల్గి ధర నుండిన సర్వపురీనృపాలసం
దోహము సర్వపర్వతనదుల్ మునులాశ్రమముల్ గనంగ న
క్షౌహిణి సేనఁ గూర్చి చనుచుండి చరించె సమస్తధాత్రిఁ బూ
జాహరులై నృపాలకులు సన్మునులున్ దను గౌరవింపఁగాన్

వ. ఇట్లు పోవుచుఁ బోవుచు నొక్కనాఁడు

సీ. తరులచే దేవకిన్నరసిద్ధచారణ
దానవయక్షసంతతభుజంగ
దరులచే సమదదంతావళమృగరాజ
హరిణశార్దూలసౌహార్దదీప్తి
సిరులచే బ్రహ్మఋషిత్రిదశర్షిప
ర్ణానిలవారిభక్షాగ్రశైక్ష
గురులచే జపహోమనిరతహృషీకసం
యమనదీక్షావ్రతిహారులచేతఁ
బుష్పితానేకవృక్షసంభూతమధుర
వాసనాకృతఘ్రాణతర్పణముచేత
మహితమైన వశిష్ఠాశ్రమముఁ జేరి
బ్రహ్మసూనుముని దర్శించెఁ బార్థివుండు

క. కని బ్రహ్మలోకమందున
వనజోద్భవు పాదములను వాసవునోలిన్
మునిపాదమ్ముల వ్రాలినఁ
గని యమ్మునిపతియుఁ బ్రీతి గాధేయునకున్

ఉ. స్వాగతమంచు నాసన మొసంగి ఫలంబులు వేళ్లు నిచ్చి య
భ్యాగతపూజ సల్పి సుఖమా నరపాలక! భృత్యకోటి ని
న్నే గణుతింతురే కదవె? యీవు బలంబును గోశమున్ యథా
యోగముగాఁగఁ జూతువుగదోయి! సపత్నుల గెల్తువే! యనన్

ఉ. ఆ యమృతాదరమ్మునకు నంజలిఁ గైకొని చిత్తమంచు గా
ధేయుఁడు త్వాదృశల్ ఋషులు తెచ్చిన దివ్యతపఃఫలంబుగా
నా యెడ నన్నియున్ సుఖసనాథము లంచన నిద్దఱున్ సప
ర్యాయుతులై పరస్పరముదావహసాధుకథావచస్కులై ఉ౨

గీ. కొంతసే పున్నయంతన క్షోణిపతికిఁ
బరమసుప్రీతుఁ డైనట్టి బ్రహ్మకొడుకు
నోయి యోయి విశ్వామిత్ర! యోయి నేన
యీ బలంబున కాతిథ్య మేర్పరింతు

క. ఈ నీ వతిథిశ్రేష్ఠుఁడ
వీ నీకును నీదుసేన కే నాతిథ్య
శ్రీ నెఱపుదు నుండు మనన్
దానును గాధేయుఁ డిదియుఁ దగునట వె ప్రభూ!

ఉ. ఎచ్చటిసైన్య మొక్కఁడును నిద్దఱునా? యది యెంతమంది నీ
విచ్చిన కందమూలములె యెంతకునైనను జాలుఁ గాఁదటం
చచ్చముగాఁగ భోజన మటం చిడె దేనియు నాశ్రమంబునం
బచ్చనియాకునున్ మిగులుపాటికి రా దనఁగా వశిష్ఠులున్

క. నగి కాదు కాద యుండు మ
న గాధిసుతుఁడును నది యవినయ మగునేమో
తగ దంచు నొప్పికొనియెను
భగవంతుండైన మునియుఁ బ్రహ్మాన్నుండై

సీ. ఓయమ్మ కల్మాషి! నా యగ్నిహోత్రార్థ
హవ్యసంపాదనీ! యరుగుదేవె!
యని పిల్వ నంతలో నాశ్రమసంకల్ప
ధేనువు తా నరుదెంచె శబళ;
ఓయమ్మ శబళ! గాధేయుండు కుశనాభు
పౌత్రుండు నాత్మభూపుత్త్రుఁడైన
కుశునివంగడములో నిసుగు వచ్చెను వాని
సైన్యంబునకుఁ దృప్తి సంఘటిల్ల
లేహ్యచోష్యపానీయపాళియు రసాన్న
సమితి సత్కారసంతతి సంతరింపు
మమ్మ! నాయందు నీకుఁ గలట్టిప్రేమ
కనుగుణంబుగ నా కోర్కి కనుగుణముగ

గీ. అని వశిష్ఠులు చెప్పిన యంతలోనఁ
గామధేనువు పొదుగు పాల్కారి కారి
పడెలు పడెలుగఁ గట్టిన పడియ పడియ
కుల్య కుల్యగ జాఱిన కుల్య కుల్య

క. ఒక్కటి యన్నపురాశి య
ఒక్కటి భక్ష్యములరాశి యొక్కటి సూపం
బొక్కం డిక్షురసాపగ
యొక్కఁడు దధికుల్య మధునవోజ్జ్వల యొకఁడై

క. ఒకపడియ ప్రిదిలి గుడమై
యొకసగమును షాడబంబు లొకసగమైనన్
జకితులు విశ్వామిత్రుని
సకలచమువు మృష్టభుక్తిసంతర్పితులై

వ. సాంతఃపురుఁడు సబ్రాహ్మణపురోహితుఁడు సామాత్యుండు విశ
మిత్రుండు మృష్టాన్నతృప్తుండై వశిష్ఠునింగాంచి భగవంతుఁడా!
పూజ చేతఁ బూజితుండ నైతిఁగాని

ఆ. శబళ శబళగాదు సద్రత్నమగు గద!
రాజుగాని యెందు రత్నహారి
యొక్క వేయియూల నొసఁగెదఁ గైకొని
ప్రభువ! నా కొసంగవలయు శబళ

వ. అనిన వశిష్ఠుండు వేయికాదు పదివేలుకాదు వందవేలుకాదు;
యెత్తు బంగారముఁ బోసినను శబళ నీయను; శబళ నన్ను వదలిపో
నది కాదు; ఇది నాకు హవ్యంబు; ఇది నాకుఁ గవ్యంబు; ఇది నా
ప్రాణయాత్ర; అగ్నిహోత్రబలిహోమంబులు స్వాహాకారవషటా
రంబులు నిష్టాపూర్తంబులు సర్వంబును నాకు శబళ

ఆ. ఆత్మవంతునకును యశమట్లు కల్మాషి
త్యాజ్యకాదు నాకు ధారుణీశ!
యీమె నన్ను వీడ దామెను నే వీడ
నామె నాకు నేను నామె కింతె

వ. ఆమెను నేను బరిత్యజింపమి కెన్నేని గారణంబులు గల వన

సీ. బంగారపునడుముపట్టలు బంగరు
మెడపట్టెడలు జిగి మేల్మిహారాన్ను
పూజలయంకుశమ్ములతోడి పదునాల్గు
వేలయేన్గుల కీయవే! యటంచు
నడిగె భూపతి; యీయ ననె మౌని; దేశజా
తములైన వేయివందలు హయములు
రంగురంగుల గోవులం గోటి యిచ్చెద
శబళ నిప్పింపవే! సాధుమూర్తి!
యనియె; నీ యిచ్చవచ్చిన యన్నిమణులు
హేమమును గోమ్ము శబళ నా కీవె! యనియె
మా కిదియ దర్శ మిది పౌర్ణమాస మిదియె
యజ్ఞములు విద్య; కాదు కాదనియె మౌని

గీ. పూని యేరీతి నొప్పింపరాని మౌని
నడుగునది యేమి? యను గాధికొడుకు నాజ్ఞ
బంట్లు ధేనురత్నము మెడపలుపుతోడ
లాగి తోలిన శబళ తోలంగఁ జూచి

ఉ. నన్ను మహాత్ముఁడైన మునినాథుఁడు వీరికిఁ దోలిపెట్టునా?
యెన్నఁడు నన్నుఁ బాయని మునీంద్రుఁడు నేటికిఁ బాయు నన్ను? నీ
యన్నిటి కైనదానిని ననాగసురాలిని భక్తురాలి నా
సన్నుతమూర్తి యేల విడఁజాలు నటంచును దుఃఖమూర్తియై

ఆ. ముట్టెయెత్తి డుస్సిపోఁజేసి శృంగముల్
వంచి మెడను దుసికిలించి పలుపు
వెనుకఁగాళ్లఁ జిమ్మి మునుగొమ్ములం గ్రుమ్మి
భృత్యకోటి శబళ యెగచి చిమ్మి

క. ఎగఁబడి మునికడకుం జని
యుగడున గర్జించుకొంచు నంభోదముగా
భగవంతుముందు నిలచుచు
భగవంతుఁడ! నన్ను నీవు వదలితె? చెపుమా! ౮౦

గీ. క్షితిపతిజనమ్ము లేల లాగెదరు నన్ను
నేల తోలెద రనినంత ఋషియుఁ దల్లి!
యేల వదలెదవమ్మ! ని న్నేను దోష
రహిత నానందమూర్తిని విహితసేవ

గీ. విశ్రుతుండౌ రాజు నిన్నుఁ దోలికొనిపోవు
నాతఁ డక్షౌహిణీపూర్ణుఁ డధికబలుఁడు
క్షత్రియుఁడు; దుర్బలుండను బ్రాహ్మణుండ
నేను; నే నేమి సేయుదునే? యనంగ

గీ. ఏమి యేమి? క్షత్త్రియబల మెక్కువగునె?
బ్రహ్మబలము తక్కువగునె ప్రభువ! గాధి
సుతుఁడు వీర్యవంతుఁడె యగుసువ్వె; నీదు
తేజము దురాసదంబు గాదే మహాత్మ!

ఉ. చాలును నీదు బ్రహ్మబలసంభృత స న్నియమింపు మింతలో
నోలి నృపాలుసైన్య మొకయొడ్డను బట్టఁగఁజూతు నన్నుఁ ద
ల్లీ! లలితంపుమూర్తి! సృజియింపవె శత్రుచమూనిబర్హణో
ద్వేలరుజాప్రతాన మని పెట్టిన యా ఋషియాన వెంబడిన్

విశ్వదేవి.
అంభారావోత్సృష్టంబులై పహ్లవోగ్రో
జ్జృంభమ్ముల్ సైన్యంబుల్ ధురీణంబు లంతన్
భుంభుంధ్వానంబు ల్గాఁగఁ బుట్టెన్ ధరాభృ
ద్గంభీరానీకంబున్ విఘాతంబు చేసెన్

క. తనకనులముందుఁ దనదగు
ననీకినియు నాశమైన నస్త్రంబులతో
నినిచిన తనువులఁ బాప్లవ
మనీకమును గాధిసూతి హరియించె వడిన్

ఆ. కుపితశబళ రోమకూపంబు లందుండి
యవనశకులకోట్ల నాహరించె
ఘోరముఖుల దీర్ఘఘోరాసిహస్తులఁ
గన కేసరాభ కాంతితనుల

కుసుమవిచిత్రము

శకయవనాళుల్ సకలధరిత్రిన్
వికటగతిన్ ద్రెవ్విన నరపాలుం
డకుటిలబుద్ధిన్ హతులను జేసెన్
శకచమువుల్ భాస్వరశరవహ్నిన్

క. తల్లీ! యని పిలచెను ముని
తల్లీలాహూతి వెంట ధైనుక మంభా
కల్లోలరవము వెలువడెఁ
గల్లోలారవము వెంటఁ గాంభోజులునున్.

సీ. పొదుగు వెంబడిఁ బప్లవులు శస్త్రపాణులు
యోనిశకృత్తులనుండి యవన
శకులును రోమాంధుసంభూతులై మ్లేచ్ఛు
లును మహోహారీతులును గిరాతు
లావిర్భవించిన సాశ్వమత్తేభసై
న్యముగ విశ్వామిత్రు నస్త్రవహ్ని
నందఱు మడిసిరి యంతఁ గౌశికుతనూ
ద్భవులు దుర్వారులు వందమంది
బ్రహ్మయోని మాని పైకి నేగిరి నిశి
తాసిఖడ్గబాణహస్తు లగుచు
నాథమాని యంత నవ్వె వశిష్ఠుండు
ప్రౌఢబాణకరుల వారిఁ జూచి

క. చిద్రుపలు చిద్రుపలు గానై
యద్రువగ హాసంబు చల్లనగు వహ్నులుగా
నెద్రిచిన నృపసంతానము
విద్రుపలుగాఁ జల్లబూది వెల్విప్రోవులుగాన్

ఆ. బూదియైన కొడుకుముత్తంబు గాంచి వ
శిష్ఠు నెగుప సాహసింపలేక
దృష్టి సన్నగిలిన ఱెక్కలు విరిగిన
పక్షి యగుచుఁ బెన్రుతపానిరూఢి ౯౨

వ. అవధిలేని పరుగునకుఁ దూలిపోయిన పంచకల్యాణివలెఁ జెట్టుమొదటఁ
బీటవెట్టి కూర్చున్న శలలీప్రోథఘాతంబుల వీసరవోయిన సింహంబు
వోలె నిర్వేదంబుఁ బొంది మఱలిపోయి

చ. మిగిలిన యొక్క పుత్త్రికుని మేదిని నేలఁగఁ జెప్పి యక్షప
న్నగసురరాజకిన్నరసనాథము మంచుమలం దపస్సు ప
న్నగధరుఁగూర్చి చేయఁగ ననంతసమల్ వృషభధ్వజుండు తా
నుగఁ జనుదెంచి కౌశిక! కనుల్ తెరు మేమి మనోరథం బనన్

మ. అనినన్ గాధిసుతుండు నాకుఁ బ్రభువా! సాంగంబు సోపాంగమున్
వినమత్సర్వరహస్యయుక్తము ధనుర్వేదంబు నిప్పింపవే!
నను దేవేశ్వరయక్షరాడ్దనుజగంధర్వప్రభల్ చేరఁగాఁ
గనవే! యన్న వృషధ్వజుం డరిగె వేడ్కం దీర్చి కైలాసమున్

గీ. పో వశిష్ఠునిపని యయిపోయె నంచుఁ
బరువు లిడు చేగె నాశ్రమప్రాంతమునకుఁ
దత్ప్రయుక్తాస్త్రములచేత దగ్ధమయ్యె
నంతలో బ్రహ్మఋషి వశిష్ఠాశ్రమమ్ము

ఆ. అమ్ముఁదీసి మఱల నమ్ము జోడించులో
నెచటివార లచట నెల్లఋషులు
కాలికొలఁది పాటె గగ్గోలుగానైన
పల్లె యెల్లఁ జవిటిపఱ్ఱ యయ్యె

నశనందిని.

కనుమూసి కన్దెఱచులోఁ గడు వశిష్ఠుం
డనె భీతిలేదు పదఁడా! యనుచు గాధే
యుని నీవు లేవు కుటిలా! యుదరుపాటా?
మునిపల్లె మంట నిడె దో ములుచ! యంచున్

చ. తన యమదండసన్నిభ ముదగ్రలయాగ్నినిభంబు దండమున్
గొని పయికెత్తెఁ గౌశికుఁడుఁ గోపమునన్ నిలుమంచు బిట్టు నా
ర్చిన ముని నిల్చినాఁడనుర నీ! కుటిలోద్ధత! క్షత్త్రబంధు! నీ
ఘనమగు నస్త్రగర్వమును గాల్చెదరా! యసిగర్వదూషితా! గా

క. ఔరౌర! బ్రహ్మబలమును
నీ రుధిరాపాన రాజ నిర్వీర్య బల
ప్రారంభ మంత సేయదు
గా! రమ్మన; రాజు విడిచె నాగ్నేయంబున్

సీ. అది సాగరంబునం దంబుబిందువువోలె
నెస బ్రహ్మదండనిపీతమయ్యెఁ
దెఱపి లేకుండ గాధిసుతుండు వారుణం
బును రౌద్రమును నైంద్రమును నిషీక
మును మానవంబును మోహనంబును బాశు
పతము గాంధర్వంబు స్వాపనంబు
సరగ జృంభణమును సంతాపనవిలాప
నములు మాదనశోషణములు దార

ణంబు వజ్రము బ్రహ్మపాశంబు కాల
వరుణపాశముల్ పైనాకశరము లేయ
నడచె దండంబు శుష్కంబు నార్ద్ర మన్న
రెండు పిడుగు లేయంగ హరించెఁ గట్టి

సీ. విస్మయకోపభావితనేత్రుఁ డౌచు వి
శ్వామిత్రు డంతఁ బైశాచమైన
యస్త్రంబుఁ గ్రౌంచదండాస్త్రముల్ విష్ణుచ
క్రంబును ధర్మచక్రంబుఁ గాల
చక్రము వాయవ్యశరమును మథనంబు
హయశిరశక్తిద్వయమును ముసల
కంకాళయుగ్మంబుఁ గాలాస్త్రవైద్యాధ
రత్రిశూలములు ఘోరమగు కంక

ణంబుఁ గాపాలమును బ్రయోగంబుచేసె
మానిదండంబు నా యెల్లవాని మ్రింగె
నోయి శ్రీరామచంద్ర! మహోనిధాన!
సర్వకార్ముకవిద్యాప్రశస్తహస్త!

క. అంతట సర్వాస్త్రంబులు
శాంతించిన గాధిసూతి చండారుణనే
త్రాంతుఁడు బ్రహ్మాస్త్రము హ
స్తాంతమునం బూనె లోక మల్లాడె శిశూ!

ద్రుతవిలంబితము.
సురలు దేవఋషుల్ పరివల్గిత
స్ఫురణ నట్టిటు పోలిరి భ్రాంతులై
తొరఁగి గాధిసుతుండును నస్త్రమున్
బరగఁ జేసెఁ గృపాళుమునీంద్రుపై

చ. చిఱచిఱ బ్రహ్మదండము గ్రసించెను దానిని నెల్లయస్త్రముల్
మొఱఁగియు దేనికిన్ వికృతిఁ బొందని స్వామి వశిష్ఠుఁ డంతలో
నెఱకులు క్రుమ్మినట్లు హావణించె సముద్గతరోమకూపముల్
గఱగఱ మంటలై యెఱుపు గ్రమ్మిన రౌద్రమనోజ్ఞమూర్తియై

గీ. బ్రహ్మపుత్త్రుని చేతిలో బ్రహ్మదండ
ముగ్రకాలానలజ్వాల లుమియఁ జొచ్చె
నంతటిమహాగ్నియును బ్రాహ్మమైన తేజ
మందు నింకించెను వశిష్ఠుఁ డధికశక్తి

ఆ. ఒండు విఱిగి నీర మొగిఁ దేరుకొన్నట్లు
సాధుమౌని సుప్రసన్నుఁ డయ్యె
సర్వఋషులు సేయు సంస్తోత్రముల చేతఁ
బరమమైన తనతపమ్ము చేత

ఉ. ఏర్చెడు కోపవహ్నికల నెల్లఁ గుదించి వశిష్ఠుఁ డంతలోఁ
దేర్చిన శాంతిమై యరుగ దిమ్మయి కౌశికుఁ డంతనంతఁ బె
ల్లార్చిన శ్వాసమై బళియురా! నిఖిలాస్త్రము లొక్కకట్టయై
తీర్చిన బ్రహ్మదండము నెదిర్చెడిపాటికి రావె యంచునున్

సీ. ఛీ! క్షత్రియబలంబు ఛీ! క్షత్రియబలంబు
నస్త్రబలంబు ఛీ! యస్త్రబలము
బల మన్నచో బ్రహ్మబలమే బలం బగు
బల మన్నచో బ్రహ్మబలమె బలము

నేను నింతటఁ బ్రసన్నేంద్రియ మానసుం
డై మహోగ్రతపంబు నాచరింతు
నదియ యొక్కండు బ్రహ్మత్వకారణ మని
యింత చేసియుఁ గోప మేల రాదొ
యీ వశిష్ఠున కేను నిట్లే తపస్సు
చేసి కోపమ్ముఁ దెప్పింతుఁ జివరిదాఁక
నీ వశిష్ఠున కని బ్రహ్మఋషిమహేంద్రు
నందునను బద్ధవైరుఁడై యరిగె రామ !

గీ. అనిన శ్రీరామచంద్రుండు మనసునందు
నాకును వశిష్ఠుబ్రహ్మదండంబు రక్ష
నాకు గాధేయు నస్త్రసంతతులు రక్ష
యనుకొని యనంతరం బేమి యంచు నడిగె

వ. అంత శతానందుం డిట్లు చెప్పె; విశ్వామిత్రుండు దక్షిణదిశ కేగి ఘోరతపస్సు చేసె; అప్పు డాయనకు హవిష్యందుఁడు మధుష్యందుఁడు దృఢనేత్రుఁడు మహారథుఁడు నను పుత్త్రికులు సత్యధర్మపరాయణులు కలిగిరి; అంత నొక వేయియేం డ్లయిన బ్రహ్మ వచ్చి నీవు రాజర్షి వైతి వని చెప్పి యంతర్హితుం డయిన

శా. విశ్వామిత్రుఁడు నాత్మలోఁ గుమిలి యీ వేయేండ్లు రాజర్షికా
శశ్వత్తీవ్రతపంబు సేయు టని లజ్జాబుద్ధి గాఢవ్రతుం
డై శ్వాసంబు బిగించి నిశ్చలుఁడు నై యబ్భక్షుఁడై లీనవ
హ్న్యశ్వత్థాకృతియై నిగూఢతరదివ్యజ్యోతియై యుండఁగన్

ఉ. వాలికమాటలున్ బెళుకువట్టినచూపులు జిల్గు జుత్తు లో
వ్రాలిన యొప్పు లెట్టనిసెరల్ గనుదమ్ములు కప్పు మైజిగుల్
పీలిక గోచిపాతలును వెన్క నెదో యొక రాజలక్షణం
బై లులితాక్షముల్ గిరగిరై చని గోసఁగి వచ్చి యొక్కఁడై

గీ. మానిపాదంబులన్ వ్రాలి మామకీన!
నన్నుఁ జేపట్టవే యన్నఁ గన్నుగొనలఁ
గరుణ తొలుకాడ లెమ్మని గాధిసూతి
నిభృతనేత్రంబులన్ నిదానించి చూచి

క. నీవు త్రిశంకుఁడవా? మఱి
యీవేసం బేమి యన్న; నిటువచ్చెఁ బ్రభూ!
నా వెనుకటి శాచటికపు
తీవియు సర్వంబు డీల్వడెఁ గదునాఢీ!

గీ. కులగురువుచేతఁ దత్పుత్త్రకులయుచేత
నిట్టులెతిని నొక దీష్ట మిష్టిఁజేసి
బొందితో స్వర్గమునకును బోదు సల్ల
యిష్టి నీరునుగాని చేయింపుఁ డంటి

గీ. దానిఫలమునఁ బుల్కసుఁ డైన నేను
ము న్ననృత మాడినది లేదు ముందు నాడఁ
బోవునది లేదు వే(గతువులు పొనర్చి
తర్పితులఁ జేసితిని దేవతలను మున్ను

చ. ప్రజలను క్షత్త్రధర్మపరిరంజితులం బొనరించితిన్ మహో
యజనములన్ సుపర్వులకు నన్నము నెట్టితి భక్తితో గురు
వ్రజమున సేవఁజేసితిని వచ్చిన దీ ఫల మో మునీంద్ర! యే
యజనము బొందితోడఁ జననో సురలోకము? దాని గోరికన్

క. ఎవరని జన్నములంబడి
తవిలిన కోర్కులఫలంబు దార్చికొనరు నా
యవినయము కాక యనినన్
వివృతాఖుఁడు మాని చెప్పు విస్మృతి ననిసన్

వ. త్రిశంకుం డిట్లనియె

మ. ప్రభు! నే నేగి వశిష్ఠులందు సశరీరస్వర్గవాంఛాఫల
ప్రభవంబౌ నవయాజకత్వ మొనరింపంగోర నన్ దోలె నా
ప్రభు వీ కోర్కి యయుక్తమంచు గురుపుత్త్రశ్రేణి వాంఛించితిన్
ఋభులోకమ్మును జేర మానుషపుమూర్తిన్ యజ్ఞకార్యార్థినై

క. లజ్జావనతాంగుఁడనై
హృజ్జాతనిరాకృతిప్రహీణాత్ముఁడనై
తజ్జాతుల పాదంబులు
మజ్జనముగ బొప్పవారి మన్నించి ప్రభుల్

గీ. గురునితరువాత మీరలు గురుని యంత
వారు పొమ్మని త్రోచె దీప్తోరుమూర్తి
నను వశిష్ఠులు మీ పాదనలిన మొక్కఁడె
నాకు శరణన్నఁ బరిహాసనద్ధముఖులు

గీ. ఔర దుర్బుద్ధి! గురులు కాదనుటయును మ
ఱీవు నను డించి మమ్మాశ్రయించుటయున
యెల్ల యిక్ష్వాకులకు గురు వీశ్వరుఁడు
సత్యమూర్తి వశిష్ఠులు చనుము చనుము

క. ఆయన కాదన్నదియూ
మాయొడఁ జేయించుకొందు మఱి త్రైలోక్యం
బాయనయధీన మాయన
కా యనమానంబు సేఁత? యరుగు మరుగుమా!

క. ఇటు తొంగిచూడకుము పో
కుటిలా! యన నాకుఁ గల్గెఁ గోపము మీరై
ఘటియింప రేని నన్నులు
పటువులు ఘటియింతు రంటి వాగ్విధృతి మెయిన్

గీ. కేరడపుమాటకుం గోపగించి వారు
నన్నుఁ గోసంగిఁగ శపించినారు స్వామి
నాఁటి రే జిట్టజుట్టును నల్లమేను
నెఱ్ఱగుడ్డలు బడియె నా కేమి చెప్ప

శా. న న్నే తాదృశుఁ జూచి మంత్రులును నానాభృత్యులున్ దూరమై
చన్నన్ నీపయి నిల్పికొంచుఁ దుది యాశన్ స్వామి! యేకాకినై
నిన్నే ధ్యానము చేసికొంచు నిటఁగానీ వచ్చితిన్ ముంతువో
నన్నున్ దేల్తువొ దైవమున్ బురుషయత్నం బొగ్గి మార్పింపవే!

గీ. శ్రీదయామూర్తి! పొమ్మన్నఁ బోదు నేను
బూని యజియింపఁ జేసి స్వర్గానికైనఁ
గమరి వాశిష్ఠులట్లు గూడెమునకైన
నెటుల మొగ్గింతువో త్రాసు నీవె నాకు

చ. అనిన హృదంబుదంబున దయారసవాఃప్రపథమోదబిందులై
నిను గ్రహియించితిరి విమలనిష్ఠయు ధర్మముఁ గల్గు నీకు ని
క్కన నది చేతి కందుఁగద కృచ్ఛ్రమొ వేల్పుల వీడు పుల్కసుం
డును నగు నిన్నె పంపెదఁ గనుంగొను మచ్చటి కింతలో నృపా!

వ. అని పరమధార్మికులైన తనపుత్త్రులం జూచి

సీ. తండ్రి హావిష్యంద! తండ్రి మధుష్యంద!
నాయనా దృఢనేత్ర! నన్నుఁగన్న
తండ్రి మహారథ! తీండ్రమైనది చూడుఁ
డా! త్రిశంకునకు మీ రరిగి యెల్ల
ఋషులను బిలచిరండీ! నాదు మాటగా
ససుహృత్సశిష్యకసర్త్విజముగ
నెవఁడైనఁ గాదనెనేని నాతోఁ జెప్పఁ
డది వచ్చి మీరును నరుగుఁడంచు
శిష్యులను బుత్త్రకుల బంపఁ జెలఁగి వారు
నాశ్రమ మ్మాశ్రమమ్మున కరిగి వారు
దేశమును దేశమున కేగి తిరిగి వారు
వాయువేగమనోవేగవల్గనముల

క. ఋషిఋషిని బిలిచివచ్చిన
ఋషులును నాననిరంతరీకృతసామ
వ్యుషితసకలాఘులై పా
రిషద్బ్రాహ్మణులు వచ్చిరి త్రయీవదనుల్

గీ. అంతఁ బుత్త్రులు శిష్యులు నరుగుదెంచి
తమ కొసంగినయాజ్ఞ యాదల వహించి
యెల్లఋషులను బిలిచితి మేము గాని
యా మహోదయవాశిష్ఠు లనిన మాట

సీ. క్షత్త్రియయాజక చండాలయజమాన
క్రతువున భోక్తలుగారు సురలు
ఈ తిండిఁ దినఁబోవు ఋషులు పాంక్తేయులో
యీ ఋషులకు స్వర్గ మెత్తుపడదొ

ఛీ యంచుఁ గోపరంజితనేత్రులై యని
రా మహోదయుఁడును నల వశిష్ఠు
పుత్త్రులు నని నిల్వఁ బురపురఁ గ్రాఁగి యే
మీ! సర్వత్రైజనరాసులైన
మునుల యాజకత్వమ్మునఁ బుల్కసుండు
సేయు యజనంబునన్ ఫలసిద్ధి లేదొ
యింత ధర్మంబుఁ దెలియని యీ యనాథ
మునుల శపియింతు నని జలంబులు గ్రహించి

గీ. న న్నదుష్టుని నిందించినాఁ డెవండు
నా మహోగ్రతపం బాడినాఁ డెవండు
వాఁడు వాఁడు నిర్దగ్ధుఁడై భస్మమగుత
మనుచు నీళ్లులు వదలెఁ గోపాత్తబుద్ధి

వ. అనిన మహోదయుండును వశిష్ఠపుత్త్రులు వందమందియు భస్మీ భూతులైరి; గాధేయుండు కోపంబుఁ బట్టఁజాలక వీరు కాలపాశనీతులై యేడువందలజన్మములు గుణపక్షాదులుఁ గుణపదాహకులు శ్వమాంసాహారులు వికృతులు విరూపు లగుత మని మఱల శపించి

ఆ. ఈ మహోదయుండు నేల దూషించె న
న్నదియ కారణముగ నాతఁడును ని
షాదజన్మ మెత్తి సత్యదయాధర్మ
దూరుఁ డగు నటంచు దూరువెట్టి

మ. ఋషిమధ్యంబున నీ త్రిశంకుఁడును దా నిక్ష్వాకుదాయాది సా
ధివ ప్రోజ్జ్వలయజ్ఞకర్తయును దృప్తిం బొందితిన్ వీనికై
హృషితుల్ మీరలు వీని మానుషపుమూర్తిన్ స్వర్గ మెక్కింపఁగా
గృషిభూతంబగు యజ్ఞముల్ సలుపుఁ డుర్వీదేవభూతేశులై

క. అనిన భయంపడి యెల్లరు
మునులును మన కేల యితఁడు ముక్కోపి యితం
డును నైక్ష్వాకువు కాని
మ్మని యారంభించి యజ్ఞ మా యా క్రియలన్ ౧౪౦

గీ. వెస యథాకల్పముగ యథావిధిగ సర్వ
కర్మలును జేయ యజ్ఞభాగంబు కొఱకు
గాధిసూతి సుపర్వులగముల( బిలచె
లేచి యొక దైవతమును రాలేదు దాన

మ. వ్యవధాక్రోధుఁడు తా జడల్ మలచి విశ్వామిత్రుఁ డంతన్ హవిః
స్రువముల్ హస్తముతోడ నెత్తి సువచస్కుండై త్రిశంకున్ ధరా
ధవ! యీ వీరలు వచ్చి రాక యగునే త్రైవిష్టపం బీవు మత్
స్రువమున్ గైకొని పొమ్ము కాదనుటలుం జూతున్ దపోదృష్టిచే

శా. రాజా! నీవును బొందఁజూతు సశరీరస్వర్గమున్ మత్తప
స్తేజం బింకను స్వార్జితంబు గల దా తేజంబుపొంటెన్ సుర
భ్రాజిష్ణుత్వము పొందుమంచు స్రువ మభ్రం బంపు వీచెన్ లతా
శ్రీజంఘాలుఁడు తాఁ ద్రిశంకుఁడును జేరెన్ స్వర్గ మా వీపుతో

క. చీ చీ! పో పో! చండా
లా! చీ! పొమ్మన్నరవము లంతటఁ దలక్రిం
దై చెడి పడుచుఁ ద్రిశంకుఁడు
వాచఱచుట తోఁచె యాగపద్యము మింటన్

ఉ. వంచితుఁడై త్రిశంకుఁడును వ్రాలుచు స్వామి! యిదేమి నన్నుఁ బం
పించినయంత లేదనుచుఁ బెట్టిన కేకకు నందె నిల్వు మీం
వం చని యానపెట్టె ముని; యాతఁడు నందున నిల్చె; నంతఁ గో
పించిన గాధిసూతి కలిపించెను వేఱొకస్వర్గ మచ్చటన్

శా. శ్రీమన్మోహనమోహనాకృతిగఁ దోఁచెన్ దక్షిణాకాశవీ
థీమార్గంబున నంతలోఁ బ్రవిలసత్తేజోనిధుల్ నూత్నతా
రామాలాపరిదీప్తసప్తఋషిచక్రద్యోనవాంభోధుని
శ్రీమన్నందనపారిజాతతరురాజిప్రౌఢసంతానముల్

ఉ. వేఱొకయింద్రు దేవతల వేఱ యొకళ్ళ సృజింపఁ బోవుచో
నూఱట మాని దేవతలు నుమ్మలికం జనుదెంచి గాధిజా!
తేఱుము శాపవిక్షతుడు దేహముతో సురవీథి కెక్కునే?
బీఱువదున్ దపస్సులును బేర్మలు తద్గతముల్ మఱెక్కినన్ ౧౪౭

చ. అనినను గాధిసూతి యవ్వ నౌను త్రిశంకున కేను మాట యి
చ్చినయది పొల్లువోఁదగదు సృష్టియొనర్చిన తారలుఀ ఋషుల్
చనవున నిల్పఁజూడుఁడు త్రిశంకుని భద్రముగాఁగఁ జూడుఁడీ
యనుమతి నిండు నా కన సురాళియు నొప్పికొనెఀ సమస్తముఀ

క. వైశ్వానరమార్గబహి
శ్శశ్వజ్జ్యోతిస్సు లగుచుఁ జెలఁగెడు గాతఀ
విశ్వామిత్ర! త్రిశంకుఁడు
శాశ్వతుఁడై యింద్రువోలెఁ జనియెడుగాతఀ

క. అని యెల్లదేవతలు నే
గిన యజ్ఞము పూర్తిచేసి కృతమతు లగుచుఀ
జనిరి ఋషులు నా తండ్రీ!
యినవంశతుషారదీధితీ! రఘురామా!

చ. తల యొరిగించి లక్ష్మణుఁడు దానును గౌతమువంకఁ జూచెఁ గ
న్నుల మృదుహాసమేదురమనోజ్ఞనవాంశులు కోర్కెగూడ్లుగా
వెలలిచె రామభద్రుఁడు నవీనకుతూహలరమ్యవేగవా
క్కులు మునులెల్ల నా పయిని గోరెద మేమి ఘటిల్లెనో యనఀ

వ. మఱల శతానందుం డిట్లనియె

ఉ. లాభము లేదు విఘ్నబహుళం బని యామ్యదిశఀ ద్యజించి యిం
ద్రాభుఁడు గాధిసూతి చనె నంతఁ దపోఽర్థము వారుణాశకుఀ
శ్రీభరితంబు తీర్థజలసేవధి పశ్చిమదిక్కునఀ వ్రత
క్షోభితపాలితేంద్రియుఁడు ఘోరతపం బొనరించె నచ్చటఀ

చ. తపముల గూడుగా సముదితంబగు తేజపుఁబోవుగాఁగఁ గా
యపసుపుగా నిమీలితశుభాక్షములం దగియుండ నొక్కనాఁ
డపుడ విలోచనంబులను నంతన విచ్చి కనెఀ విముక్తబం
ధపదనమీపధాత్రిని బ్రణామము సేసెడు నొక్కకుఱ్ఱనిఀ

క. కని నాయన! నీవెవరవు
నను నేటికి నాశ్రయింతునా; నతఁడును నో
ముని! వేఱ యొక త్రిశంకుం
డను నసుమతియైన వినుతు నాత్మీయకథఀ

క. నిచితసుకృత! భృగుతటమున
ఋచీకుఁ డను ఋషివృషభున కేన్ మువ్వురిలోఁ
బ్రచురముగ నడిమికొడుకను
బచరించితి సేవ గురులపాదములందున్

వ. మధ్యముఁడ నైన నాపేరు శునశ్శేపుఁడు

ఉ. పాపము నేను దత్ఫలముపంటకు యజ్ఞ మొకండు దా నయో
ధ్యాపతి యంబరీషుఁడునునై పొనరింపఁగ వాసవుండు శ్రీ
గోపనుఁడై పశున్ వెలుచుకొంచుఁ జనన్ సపయాజకుల్ వెసన్
భూపతితోఁ బశున్ వెదకఁబోమ్మని రట్టిటు కీడు పాయఁగన్

క. ఆ రాజు వెదకి వెదకి మ
హారణ్యంబులు పురంబు లద్రులు పల్లెల్
గూరి భృగుతుందమున మా
యూరికిఁ జనుదెంచె వెదకుచుండి దిశదిశల్

క. బ్రహ్మర్షిని మా తండ్రి న
జిహ్మగుఁడై రాజు సేవసేయుచు నాలో
బ్రహ్మవిఘాతము సెప్పిన
బ్రహ్మర్షియు సానుభూతి. పచరించుటచే

గీ. ధైర్యముం జేసి యడిగెను ధాత్రిపతియు
మా జనకు యజ్ఞవిఘ్నంబు మాన్పుటకును
నరపశువు గావలయు మానినాథ! యొక్క
వందవేల్గోవు లిత్తును బదులుగాఁగ

చ. ఇది క్రతువిఘ్నసంహరణమే ఫల మద్దియుఁ గొంత చేసు నే
నిదియును యజ్ఞకర్మ మనియే యిది ధైర్యముచేసి యాడెదన్
మదిగలదేని మీ యొకకుమారు నటంచును నాడియాడ న
ట్లాదుగఁగ నాడ మజ్జనకుఁ డూఁగె నొకించుక మాటవెంబడిన్

శా. మాలో జ్యేష్ఠునియందు నిచ్చలును బ్రేమంజేయు మా తండ్రి తా
నాలోచించి యొసంగఁజాల ననె జ్యేష్ఠాపత్యముంగాని భూ
పాలుం డందొక త్రోవఁజూచి తెగువం బాటించి మాయమ్మతో
నీలాగం చనగాఁ గనిష్ఠసుతుఁ గానీ యామె కాదన్నచో   ౧౬3

క. పరిశేషన్యాయముచే
గురువుల వాగ్బలముచేత క్షోణీపతి నిరం
తరము మనలసీని నిరా
దరణముచే యజ్ఞపశుత తప్పనిసరియై

గీ. ఓయి స్వామి! యస్మాకీనమై యుదార
మగు విశాలపశ్చిమపుష్కరాశ్రమంబు
తన యదృష్టమ్ము కాక యీ దారి నేల
యుండునో? శునశ్శేఫున కో మహాత్మ!

ఉ. బిట్టుగఁ గార్యవంతులును బేదలు ధాత్రిని గొప్పవారితోఁ
జుట్టఱికంబుఁ గల్పికొనఁజూతురు సత్యవతమ్మ నీదు తోఁ
బుట్టువుఁ బట్టి నేను నొకమూలను జుట్టమ నంచుఁ జెప్పెదన్
బట్టిన నీదుచేయి త్రిదివంబయి ముట్టినఁ బట్టువీడదున్

సీ. అనినంత హృదయమేఘాంచలకరుణార
సాసారనేత్రజిహ్వాంతుఁ డగుచు
పశుభూతుఁడా! నీకు వచ్చిన భయము లే
దని పుత్త్రికులఁ జూచి యంతలోన
తండ్రి హావిష్యంద! తండ్రి మధుష్యంద!
నాయనా! దృఢనేత్ర! నన్నుఁగన్న
తండ్రి మహాంధ! తా శునశ్శేఫుఁ డ
న్నట్టి యీ యెల్ల విన్నారుగాదె
యేగి మీలోన నొక్కరుఁ డితనిబదులు
గాఁగ యజ్ఞపశుత్వంబు గండు బాబు
లతనిఁ జూడుఁడి యెంతగా నావటెల్లు
ననిన నొక్కఁడు నొక్కఁడు నంత నంత

క. ఎవ్వనికొడుకో తీపియు
మవ్వపుఁ దనకొడుకు చేదా? మఱి యిది తగవో?
యెవ్వనికి వానిప్రాణము
నెవ్వగ కాదో త్యజింప? నీవ తలఁచుమా! ౧౩౮

మ. అనినన్ మానియుఁ గోపవిహ్వలితనేత్రాంతుండు ధర్మంబు చె
ప్పిన మీ కింతయుఁ బట్టదే? కరుణ యే వీసంబు మీ గుండెలన్
దనుకంబోదె? యిదేమి పుత్రకులు! మద్వాక్యంబునం గౌరవం
బును లేదే యిదె మిమ్ము నే సుకృతకర్ముల్ ధర్ములం జెంచితిన్

శా. ముల్లోకంబులు బ్రహ్మదండమున నిల్పన్ స్వామి; యా స్వామిపు
త్రు లీలాగతకోపవహ్నికల దగ్ధుల్ గాఁగఁ గావించితిన్
చెల్లంబో పరిహీణధర్ముల దయాశ్రీమాలి వాశిష్ఠులన్
మల్లాడంగను లేదు వారియెడఁ బ్రేమల్ లేవు మీయందునో?

ప్రమాణి.
శ్వమాంసభోక్తలై చనన్ సమల్ సహస్రముల్ చనుం
డమందదర్పులై వృథా భ్రమన్ మనుష్యపాళిలో

క. అనుచు శపించి శునశ్శే
ఫుని గని పాశములఁ గట్టి మోహానరక్తా
ర్ద్రనిరంతరమాల్యసిచయు
నిను యూపమునం బిగింప నిలుచున్న యెడన్

ఉ. గాథలు రెండు చెప్పి యివిగాని యుషర్బుధుఁ గూర్చి పాడుమీ
నాథుఁడవై హృషీకముల నాయన! సిద్ధి ఘటిల్లు నన్న నా
గాథలు స్వీకరించి వడిగాఁ జని శ్రాంతిని దీరియున్న ని
ర్బాధుని నంబరీషుఁ గని రా! యిదివేళయు మించె భూమిపా!

గీ. ఎదురుచూతురు యాజకులేమొ నిన్నుఁ
గడుపు చెడకుండఁబో నగుఁగాదె యన్న
హర్షియై యంబరీషుండు యజ్ఞవాటి
కేగెఁ దా శునశ్శేఫుఁడు నేగుదేర

క. సంబరమున వారును ర
క్తాంబరధరుఁజేసి యూపమందు శునశ్శే
ఫుం బట్టిరి గాథాద్వయ
సంబోధము చేసె నతఁడు సంయమబుద్ధిన్

ఉ. ఇంద్రుఁ డుపేంద్రుఁ డిద్దఱును నెంచిన గాథలలో రహస్యముల్
సాంద్రములైన స్తోత్రముల సమ్మదులై చనుదెంచుచుఁ ఋచీ
కుం ద్రసితుఁ గ్రహించి యొడఁగూఱిచి దీర్ఘతరాయువుఁ గృపా
తంద్రులు నంబరీషునకుఁ దత్క్రతులాభముఁ గల్గఁజేసినన్

గీ. వేయిరెట్లైన ఫలలాభవిస్తృతికిని
నంబరీషుండు సంతోష మందె నంత
దీర్ఘమైన యాయుస్సు పొందిన ఋచీకుఁ
డంతకన్నను సంతోష మందె నంత

వ. అంత విశ్వామిత్రుం డచ్చట వేయియేండ్లు ధర్మాత్ముఁడై తపస్సు చేసి వ్రతస్నాతుఁ డయిన దేవతలును బ్రహ్మయు వచ్చి నీవు ఋషివైతి వని చెప్పి దేవలోకంబులు చేరిన

క. ఇన్నాళ్ళుఁ జేసిచేసియు
నన్నా! ఋషి ననెడు మాత్రకా నే ననుచున్
గన్నులుమూసి మఱలఁ దప
స్సు న్నెఱపెన్ శితమైనచూడ్కి నిలుపుచున్

వ. అంత.

సీ. మాకందతరుశాఖికాకోకిలాలాప
కౌతూహలాకారకలనఁ జేసి
ప్రాతస్సమాయాతశీతానిలాధూత
సాధుపల్లవహస్తసంజ్ఞఁ జేసి
రేఖాభవద్వారిశాఖానదీవేణి
శాస్రంసితదుకూలకాంతిఁ జేసి
సామోదకల్హారసంఫుల్లనీరేరు
హాకేకరాత్తమోహనతఁ జేసి
తరుణశాలీనకోమలాతపవిసారి
హృదయవాంఛాస్రవత్ప్రేమరేఖఁ జేసి
శకలితమరాళకూజహాసంబుగా వ
సంతనవశోభ వచ్చె నప్సరసవోలె

ఉ. ఆ యెడ మందహాసకలితాననదీధితిఁ గాంచుచున్న గా
ధేయుని నేత్రమార్గపరిధీకృత మోహన మోహనాంగ రే
ఖాయతమానగోపనవికంపితముగ్ధతరాంగుళీగృహీ
తాయతసిక్తచేలకలితాంచితకాంచిపదాభిరామయై

సీ. ఎడమమూపు గ్రహించి కుడిచేతఁ గుచమండ
లము గోపనముసేయు లలితరేఖ
కుడిచేతఁ బిఱుఁదుపై నడుముపైఁ దడిచీర
లాగునో యన్న విలాసదీప్తి
కను లోరగా వంచి క్వచిదక్వచిద్దృష్టి
పాతంబు సేయు విభ్రమముసొంపు
మువ్వంకలుగ నిల్చి బొట్టనవ్రేలూఁదు
నెడమపాదము నాట్యహేల బెడఁగుఁ
బొరలిపోవునట్లు పుష్కరతీర్థంబు
నందు స్నానమాడి యంబు లోడు
కేశపాశదీప్తి కేడించు మేనక
యన్న సురవధూటిఁ గన్న కను.

ఉ. త్రిప్పక చూచి గాధిజుఁడు దెప్పరమై తల గోళ్ళ దువ్వుచున్
గప్పిన యాడు మీసలును గడ్డముఁ దర్జనిఁ బాయఁద్రోచుచున్
విప్పగు ఱొమ్ముగా నిలచి విభ్రమవార్ధి చేర నేగఁ గన్
ఱెప్పలు మూయ రిద్దఱును హృత్సదనంబు కవాటముల్ బలెన్

ఉ. నవ్వెను మాని యచ్చరయు నవ్వెను నవ్వులలోన నర్థమై
యవ్వరవర్ణినీమణిని నా ముని యూరక నానిపోయె దే!
విప్పిన కేశముల్ పిడుపుపెట్టుదునా? యని యుత్తరీయపున్
రువ్వులచెంగులన్ మృదుశిరోరుహముల్ పెనవెట్టిచుట్టుచున్.

గీ. ఆమె వారించి తుడుచుకో నామె తివురు
నతఁడు వారించి తుడువఁగా నతఁడు తివురు
చేతులం దీయుచుఁ బెనంగఁ జివరిదైన
ఫలము తడికౌఁగిలింతగాఁ బరిణమించె

చ. తుడిచిన దెవ్వరో తుదకుఁ దోఁచదుగాని లతాంగిమాత్రముల్
బొడియగు చీరఁ దాల్చి విడుపుంగని మానియొడిల్ శయించెఁ గ్రొం
బడగలువోని హస్తములఁ బట్టిన మానిబుజంబుగా నెదల్
పొడిచిన చూపులై వలపుపుక్కిలులై చన నొక్కరొక్కరుల్

క. నీ వని నీ వని యందురు
నీవునరుం జైని నెఱుఁగ నేర రనంగా
భావజభావన మోహప
థావధిగా స్వాదుతామహావధి గాఁగన్

మ. చెలి నా ప్రాణము నీవు నే ననఁగ నా సీమంతినీరత్నమున్
జెలి నా ప్రాణము నీ వనంగ; నదిరా సింగారి వౌదంచుఁ జె
క్కిలిపై నొక్కచిటుక్కునం జిటికయై క్రిందాచు మీదాచు వా
రల కేళీవిభవంబు పట్టదుగదా రామా! జగన్మోహనా!

ఉ. ఇచ్చటఁ బర్ణశాలకల దే చెలి! యిద్దఱముల్ వసింతమా?
పచ్చని వింటిజోదు మనబంటయి పల్లవఖడ్గహస్తుఁడై
యెచ్చటఁ గాపుగా నిలుచునే యన నంతటి రక్ష యున్నచో
నిచ్చట నీవు నుందువును నేనును నుందు ననెన్ లతాంగియున్

ఉ. రాజితమైన మోహము నిరంకుశమై కుశికాత్మజుండు కృ
ష్ణాజినముల్ గమండలువు నగ్నులు దర్భలు మూలఁద్రోచి శా
లాజిరభూమి వన్యకుసుమాలిపరాగప్రణీతరంగవ
ల్లీజగతీనిరంతరనిలీనరమాస్పదగాఁ బొనర్చుచున్

సీ. వెదురుగొట్టాల నింపిన యిప్పపువుకల్లు
తెచ్చియచ్చరకు నందిచ్చువేళ
నరుణవర్ణాభిరామానేకవృక్షని
ర్యాసముల్ పారాణి రాచువేళ
ఘనసారచందనకర్పూరతరుఖండ
ములు ధూపములు వేసి వెలుచువేళ
నుదురువాసనలతోఁ బొదలఁ బూచిన వన్య
పుష్పముల్ కొప్పులో ముడుచువేళఁ

దానె యిచ్చియిచ్చి తానుగా రాచుచుఁ
దానె వెలిచి వెలిచి తానె ముడిచి
యెదుట నిలిచి కీవి యెల్లయు నొడలియం
చులను దేర నవ్వి చూచుచుండు

సీ. కోకిల కొమ్మలోఁ గూసిన నీ వటే
నన్నుఁ బిల్చితివంచు నవ్వు మాని
తుమ్మెద పొదలోన ఝుమ్మన నిది యేమి
మణితమే యని మేలమాడు మాని,
వనశిఖావళము విప్పిన పింఛమును దడి
తుడుతునే యని కొప్పు విడుచు మాని
యిట్టి ముంగిట నిల్వ నేమి చూపులె యంచు
నలివకన్నులు ముద్దులాడు మాని
యూకు గదల భయమటంచును దనకును
నువిద కవుగిలింత నొదుగు మాని
మాని మానికాదు మమతచే వాచాల
సార్వభౌముఁ డయ్యె సౌర్యరత్న!

సీ. తన పాద మామె పాదము జతగాఁబెట్టి
యస్మత్పదంబు మోటని వచించు
తన హస్త మామెహస్తము మీఁద బోర్లించి
నీచేయి లేదని నిహ్నవించు
నామె ప్రక్కగ నిల్చి యగు నా బుజము దాఁక
వచ్చితివే యని పలువరించు
చెక్కిలిఁ జెక్కిలిఁజేర్చి గడ్డము గుచ్చు
కొన్నదా యని గుచ్చిగుచ్చి యడుగు
నానుకొని కూరుచుండి నీ యచ్చమైన
రత్నకాంతితనూప్రభారాశి క్రమ్మి
నా తనూకాంతి గూడ రత్నములప్రభలు
చిమ్మె నని చిల్కరించును జికిలినవ్వు

ఉ. శ్రీసతిఫుల్లగల్లపరిచిహ్నితకుంకుమపత్రభంగవి
న్యాసితరమ్యవక్షు! రఘునాయకబాలక! రామచంద్ర! కై
లాసముపైని దేవుఁడును లాచిన కామిని యందుఁ గల్గులి
ప్సాసముదగ్రుఁడైనఁ బసివాఁడును బోలెఁ జరించునే కదా!

గీ. పంచలను గాపుగా నున్న పంచబాణు
చాప నిస్వానముల నిద్ర చాలకున్న
నే దినంబున కా దినమ్మె యుషస్సుఁ
బ్రథమసంధ్య సుషుప్తిలుప్తంబు లయ్యె

గీ. ఆఱుఋతువులు మానిభయంబువలనఁ
బూలతో లేఁతయెండలజాలుతోడఁ
జివురుతో లేఁతవెన్నెలసవురుతోడ
నాశ్రమమున వసంతమ్మె యభినయించు

క. ఆమనియును మేనక యొకఁ
డై మెలచిన మానియాశ్రమాంతరతరువుల్
కోమలపల్లవసుమమా
శ్రీమధురోచులనె వెల్వరించుచు నుండెన్

ఉ. ఈ మధుమాస మొక్క పదియేఁడులు సాగె నవారుణచ్ఛవిన్
గోమలి యప్సరస్సతియు గుర్వీణియై తరుపాళి పల్లవ
శ్రీమతి యీనె కట్టి సవరించిన పచ్చనియాకుఁ బిందెలుం
గా మసలం గనుంగొనిన గాధిజుకన్నులు జెల్లువెన్నులై

వ. ఒకనాఁడు ప్రొద్దున నాశ్రమపురస్థతరుణనారికేళవలయంబులు లెక్కపెట్టి

మ. పదియేండ్లా! బళి! మేన తాలిచిన గర్భం బేమిచేయున్ నన్నున్
బాదుగం జేయునో యాఁడపక్షివలెఁ? నే మూఢుండ; నీవట్టు నా
యెదఁ గామంబును గ్రోధమున్ విడువదే! యేనా? వశిష్ఠున్ క్షమా
సదనున్ వైరముపట్టి బ్రహ్మనిభునిన్ సాధింతు యోగీశ్వరున్ ౨౦౧

ఉ. అల్ల త్రిశంకునాఁటిపగ యంతయుఁ దీర్చెను నాకరాజతం
డెల్లతపంబునందు ఘటియించును విఘ్నము స్వర్గరక్షకై
చెల్లును న్యాయమై యదియుఁ జేసియ మేనక దేమి తప్పు? తా
నల్లసుపర్వరాజు నదుపాజ్ఞల లోనిది యెంతచూచినన్

క. ఎల్లయు దోసము నాదగు
నుల్లంబున నున్న దెవరినో శపియింపన్
చెల్లరె కోపమె యగు నది
వెల్లగుఁ గామంబు నొందువిటుగునె యనుచున్

చ. అనుకొనుచుండ నచ్చటికి నచ్చరయున్ జనుదెంచి మౌనిమో
మును గని సర్వమున్ దెలిసిపో నిలువెల్ల వణంకిపోయి బీ
తునఁ గనుదోయి వాల్చి యధోముఖియై కరయుగ్మ మంజలిం
గొని నిలుచున్న యామెఁ గనుగొంచును గౌశికుఁ డిట్లుగా ననున్

శా. ఓసీ! యచ్చర! నీవు బీతువడ దేలో తన్వి! నీయందు నా
దోసం బున్నది గర్భరూపముగ; నీ దోసంబు త్రేతాంత మా
యాసంబైనను రక్షసేయఁగదె మేనా! కణ్వాఁడ న్మౌని వ
న్యాసీమన్ విడుమీ! శపించుమనె బేలా! నాదు దోసానకున్

క. పని యేమో దేవతలది
వనితా! కూలికినిగాని వచ్చినయట్లు
య్యును నెడఁదలోఁతు లిచ్చిన
నిను నేల శపించవలయునే మధుమూర్తీ!

ఉ. లౌకికభోగతృప్తి శబలత్వము మాలిన గుండెతోఁ దప
స్స్వీకృతి విఘ్నకారి; ఫలసిద్ధియుఁ గల్గునె యోసి యచ్చరా!
నాకును నీ పొసర్చిన ఘనంబగు మే లెటువంటి దింక నే
కోకిలకూఁత నా దయిన గుండియ లాగదు సువ్వె బాలికా!

గీ. అసలు కోకిల యేమొ నా కర్థమయ్యె
నీ కృపాలేశమునఁ జేసి నీరజాక్షి!
యింక ననుమతి యిచ్చిన నేఁ దపస్సు
మార్గముల నేగి యేగి బ్రహ్మర్షి నగుదు

గీ. కోరి ప్రత్యక్షమన్మథగురువ వైతి
కోరక పరోక్షవైరాగ్యగురువ వైతి
లంజియా! యెంతక్రిందికి గుంజినావొ
యంతపైకిని జను మార్గ మరసినావు

శా. మేనా! నేనును బద్ధవైరుఁడను సుమ్మీ! బ్రహ్మసూమానితో
మేనా! నవ్వకు సువ్వె నాదుకథ నా మీ యప్సరఃపాళితోఁ
గానీ చెప్పి; బలారి ని న్నడిగినం గానీ మ ఱేమందు వే
నైనన్ గామము కోసివేసితి నటం చా స్వామితోఁ జెప్ప వే!

వ. అని విశ్వామిత్రుఁ డెటకేనిఁ బోయిన నచ్చరయు నంతలోన పరిస్ఫుటగర్వచిహ్నయై దేవలోకంబున కేగి సురరాజుతోఁ జెప్పిన వాసవుండు భయం బందె నంత

ఉ. కౌశికుఁ డుత్తరాద్రిఁ జని కౌశికితీరమునం దపస్సు న
య్యాశఁ జరించు వేల్పులు భయంబునఁ దూఁగఁగఁ జేయఁజొచ్చె నా
కౌశికితీరమందు నధికంబుగ సాగెను వేయియేండ్లు న
ర్వాశలు డించి యింద్రియములందు నియంతగ నిల్చి శాంతిమై

ఉ. దేవత లందఱున్ జని విధిం గని స్వామి! మహర్షి కావలెన్
గావలె గాధిసూతి యదిగాక తపోవిరతిం గనండు మా
కావులు దేరుఁ బ్రాణములయందున రాఁగదె యంచుఁ జెప్పినన్
దేవత లేగు దేర నను దేరి పితామహుఁ డూఁగి వచ్చుచున్

ఉ. స్వాగతమోయి నీకును మహర్షికి గాధిజ! లెమ్ము నీతపో
వేగముచేత నా యెడఁదఁ బ్రీతుఁడ నైతి నటన్న దుఃఖమో
దాగతి లేని మూర్తి య్యయి యమ్ముని యంజలిఁబూని నిల్చి నే
నాగి మహర్షి నో? ఋషినో? యయ్యది యేమిఫలంబు చెప్ప వే!

వ. నేను జితేంద్రియుఁడ నయితినేని నదిచెప్పుము; కాకున్న

చ. మఱలఁ దపంబు చేసెదను మామకమై చను భాగధేయ మే
తెఱఁగునఁ బోవునో యనుమతింపు మనన్ జలజాసనుండు నీ
కఱపున లేద యింద్రియనికాయము; దానికినై తపించున
క్కఱ కల దింక నీకు నని క్రమ్మఱిపోయిన సత్యలోకమున్

వ. బ్రహ్మయును దేవతలును గ్రమ్మఱిపోఁగా విశ్వామిత్రుం డూర్ధ్వదే
హుండు నిరాలంబుండు వాయుభక్షుండై

క. నాలుగు నెగళ్లుగా నై
నాలుగుదెసలందు సూర్యనారాయణుఁడై
కాలి శిరస్సున గ్రీష్మ
జ్వాలీఢతపోగ్నితప్తుఁడై తపియించెన్

క. వేఁడిమిఁ బగుళ్ళు చూపిన
పేఁడిన తనువందుఁ జేయిపెట్టఁడు తాఁకన్
వాఁడికిరణముల భగ్గని
వేఁడివెలుఁగువాఁడు నోఱుపెట్టినకొలదిన్

క. వర్షము వచ్చిన నొడ్డని
శీర్షమ్మును దిస్సతనువు చిటపటజల్లుల్
వర్షములు మ్రోఁతగాలులు
ధర్షణముం జేయ నిలిచి తడిసి తపించున్

క. అలచి ఘెడేలున వడగ
ళ్లులు తీవ్రత నాఁచికొట్టులోపలఁ జినుకుల్
శిల లట్లు దిమ్మచఱచిన
చలిగాలులు పదనుకొఱకు సానలువెట్టన్

క. చలికారున జలపాత
మ్ముల క్రిందను నిలిచి బిగిసిపోయిన యొడలన్
దలచక తపించు ముని రా
త్రులుఁ బవళులు యత్నతో నిరుద్ధాత్ముండై

క. పలిగాలి కన్న శీతాం
బులె వెచ్చన చినుకు చినుకు మొగిడిన నడుమన్
జలిగాలి కోఁత వెట్టును
చలిగాలికిఁ బట్టు విడుపు సర్వాంకషమై

క. ఈ గతి సహస్రవర్షము
లాగతియు ననాగతియును ననక తపింపం
గా గాధిసూతి తపములు
చాగిన నొత్తిగిలు స్వర్గసంపదఁ గనుచున్

శా. రంభం గాంచి సురేశ్వరుండు ప్రతి యీ రా జేమి రాజౌనొ? యా
రంభంబందునఁ ద్రుంపజాల నిదియున్ రారాపులై సాగెడిన్
రంభా! గాధిజుఁ డప్సర స్తనసుఖప్రాచీనుఁ డీవై తప
స్సుం భంగింపఁగఁ జూడకున్న నగునే? శోభాంగపల్యంకికా!

మ. అనినన్ రంభయు దోసిలొగ్గి ప్రభువా! యంఘ్రిద్వయం బంటెదన్
నను నీ దివ్యసుధర్మలోనఁ గొలువున్నన్ నీకు ప్రేఁగయ్యెనా
ననుఁ బంపింపకు గాధిసూతి యనిన్ నా ప్రాణముల్ పోవు కో
పనులం గోపనుఁ డా మహాప్రభువు నన్ బంపింప కే వేడెదన్

క. అన నింద్రుండును ఛీ ఛీ!
నిను నొక్కతె గాని పనుతునే యట నే నుం
దును బుష్పబాణుఁ డుండును
వినదల్పికి మధురభావ వేషణి యుండున్

క. ఇది మేనకకును నీర్ష్యా
పద మగునో యనియె రంభ; పదపద! మునులున్
ద్రిదశసతులు జంటగుదులు
గుదులుగఁ గట్టి రటె వెఱ్ఱిగుండియదానా!

వ. పదపద మని చిలుకపౌజును గోకిలబాకాలునుగా నందఱు గౌశికీ
తీరంబుఁ జేరి

క. ఆ నాఁడు శిశిర మంతం
బైనన్ బాధః ప్రపాతమ్ముగుఁ గౌశికికు
ల్యానీరము వదలి కవో
ష్ణానతతరుణాతపముల నారెడు మునికిన్ ౨౩౦

సీ. చుఱచుఱ నెఱ్ఱనై చూచెడు చివురాకు
చివురాకు వెనుకఁ బొంచిన లతాంత
బాణుండు విసరగాఁ బట్టిన పిడిబాకు
పిడిబాకు రివ్వున విసర దూసి
సన్న సవ్వడివోని సన్ననిపికివాకు
పికివాకుతో మేళవించి సన్న
గొంతురాగముతోడఁ గులుకు నచ్చరసోకు
పిఱుపీకుగా నొక్కపెట్టఁదోఁచి
తోఁచు టాలస్యముగఁ గింకిణీచిణచిణ
నినదకనదబ్జపదసమానీతమధుర
గీతికారసవార్ధి పొంగిన తరంగ
మచ్చరయుఁ గన్నులను హృదయమునఁ బొడువ

ఉ. క్రాఁచిన శూరతానిధియుగాఁ జను మానిసి శత్రుదత్తమై
యేఁచిన కత్తిదెబ్బ పడి యంతట బాధయు బాధ వెంబడిన్
ద్రాఁచువిధాన లేచిన విధంబున మానియుఁ దాడియెత్తునన్
జాఁచిన మేనుగా నిలచి చండతరాక్షసుల సగ్నిఁగ్రక్కుచున్

శా. కామక్రోధములం జయించుటకు సంకల్పించి కాయంబు నా
నామార్గంబుల శోషపెట్టుకొనుచో నాయందు వైరంబుగా
నేమో పాడెద వేమొ యాడెదవు నీయెల్లం దుటారింపులున్
గోమేదన్ బదివేలయేండ్లు శిలవై కూర్చుండవే యంచనన్

గీ. తనదు చివురాకుబాకు జాఱినది తెలియ
కుండఁ బరువెత్తెఁ బుష్పబాణుండు తాను
గోకిలయు రివ్వునం దూసికొంచుఁ బోయె
లాలితాన్యవనీరసాలముల కొఱకు!

ఉ. జంభవిరోధి కన్నులను జాచిన వామకరప్రకోష్ఠసం
ధిం భరియింపరాక చనెఁ దెన్నునఁ దూలుచు వ్రాలిపోవుచున్
రంభయు మానిపాదముల వ్రాల వశిష్ఠుఁడు బ్రాహ్మణుండు వి
శ్వంభరమూర్తి నా దయిన శాపము పాయఁగఁ ద్రోచుపో యనన్

శా. శైలీరూపముఁ దాల్చె రంభయును విశ్వామిత్రుఁ డంతన్ ద్రపా
శైలీరూపము పొంది యింద్రియములన్ స్వామిత్వ మేపాటిదో?
నాలోఁ గ్రోధము పాయ దే విధమునన్ నాపైని నాకున్ బ్రభు
శ్రీలాభంబు ఘటిల్లునో యని యెదన్ జింతాసమాక్రాంతుఁడై

గీ. ఇంకఁ గోపము తెచ్చికో నింక నసలు
పెదవిఁ గదుపను శ్వాసమ్ము విడువఁబోను
ఎంతవఱకు బ్రాహ్మణ్యము నేను గనుదు
నంతవఱకును నది నిశ్చయం బటంచు

వ. శాశ్వతులైన నను లిప్తే యుందును; నిరాహారుఁడనై యనుచ్ఛ్వాసంతు
డనై యుందును; దపించుచున్న నా దేహమును నశించ దని ప్రతిజ్ఞఁ
జేసి

ఉ. హైమవతీదిశన్ గదలి యంతటఁ దూర్పునకేగి సప్రతి
జ్ఞామతి వేయివర్షములు సల్పెఁ దపంబును దత్తపోఽంతమం
దా ముని మేను జర్మమును నస్థులుగా మిగిలెన్ గృతవ్రతుం
డా మెయిఁ బ్రాశనంబునకు నన్నము గూర్చి యారగింపఁబో

వ. ఇంద్రుండు వగ్గుపాఱునివోలె నకనకలాడు కుక్షితో వచ్చి

శా. గాధేయుం గని యన్నమేమియునను గానీ తినంబోదువా?
పాథేయంబును లేక చత్తునుసుమప్పా! యాతిథేయంబు గా
నాధారం బగు నన్న మిచ్చెదవయే నాయాసముం బాసి నీ
గాథం జెప్పెద వేయియూళ్ళ ననినన్ గాధేయుఁ డా సర్వమున్

గీ. క్షితిసురున కిచ్చి మిగిలిన మెతుకు లేక
యారగింపక మౌనవ్రతావలంబి
యట్లె మఱలఁ దపోగతుఁ డయ్యె రామ!
ఆఁకలియు దప్పియును నిశ్చయాత్ముఁ డుఱఁడు

ఉ. శ్వాసము బిగ్గఁబట్టి వరుసంబులు వేయి తపించె నాగతిన్
గౌశికుఁ డంత మూర్ధమునఁ గాటుకరేఖగ సాగిసాగి ధూ
మాసితరేఖ సాగిన భయంబున భుజగముల్ ససంభ్రమా
యాసము పొంది రాననములందు వివర్ణత పేఁడు రేగఁగా ౨౮౩

గీ. వ్యాకులత్వంబుఁ బొందె దిశాళి సాగ
రములు క్షోభించె భూమీధరములు పగిలె
క్షోణి కంపించె వాయు వ్యాకులతఁ బొందె
భాస్కరుండును నిష్ప్రభత్వంబుఁ జెందె

ఉ. అంతట సత్యలోకమున కంపము దేవత లేగి యూకగా
వంతులుగాఁగ నొక్కొకరు వారిజగర్భ! బిగింపు మానవే!
యింతట గాధిసూతియును నెయ్యది గోరిన నది యీవలెన్
బొంతన యగ్నిపర్వతమువోలె ఫెడేలున నిప్పు ప్రేలునో?

కర్ణాట చతుష్పదలు.

లులితునిం జేసితిమి లోభపెట్టితిమి
కోలకోలంజేసితిమి క్రోధపెట్టితిమి
తలఁకు పొందఁడు మునియుఁ దపసు మానఁడును
చిలుకైన వృజినంబు జేర దా మునిని
ఆతఁ డేయది కోరు నది యీయమేని
భూతములు లోకములు ద్రుంగిపోయెడును
ఆతఁడే సురలోక మర్థించెనేని
జేతిలోఁబెట్టినను నేగి లే దెందు
నాశమగుదు నటంచు నట్టాట లేదు
కౌశికుఁడు లోకముల గాల్చివేసెడిని
ఈశ! జగదీశ! పరమేశ! సర్వేశ!
కౌశికుం డడిగినదిగాని యిప్పించు

వ. అని దేవతలు గోలపెట్టిన విధాతృండు దేవతలుం దానును వి
శ్వామిత్రుఁ జేరనరిగి

శా. మాకున్ సంతస మయ్యె స్వాగతము బ్రహ్మర్షీ! యికన్ జా
డ్యైకాగ్ర్యంబున కంతుజూచితివి బ్రాహ్మణ్యంబు సాధించి తీ
నీకున్ దీర్ఘతరాయు విచ్చితిని గానీ మానముల్ వీడుమీ
నీ కిష్టంబగు చోటి కేగు మిఁక మానీ! నీవు బ్రహ్మర్షి వే

శా. నీకున్ స్వస్తి యటంచు బ్రహ్మ వలుకన్ నిర్హ్రాదగంభీరవా
చాకూలంకషవృత్తులై దివిజులున్ జాల్డాలు గాధేయ! నీ
లోకాశ్చర్యకరంబు నెంతయును జాలుంగాఁ దపం బీవు మా
కే కా దెవ్వరికైనఁ బూజ్యుఁడవుగా దే? యన్న గాధేయుఁడున్

వ. లేచి యందఱకుఁ బ్రణామం బాచరించి నాకు బ్రాహ్మణ్యంబును దీర్ఘాయువును బ్రాప్తించినచో నన్ను వేదములు వషట్కారమును వరించుగాత

సీ. ఎవ్వఁడు క్షత్రత్రయీసర్వవిజ్ఞాత
సద్బ్రహ్మవేదనిష్ణాతు డెవఁడు
బ్రహ్మదండాపీతపార్వతీహృదయేశ్వ
రాత్తాస్త్రవిద్యామహస్కుఁ డెవఁడు
కోపమ్ము తాపమ్ము శాపమ్ము పాపమ్ము
కొన తెఱుంగని నిండుకుండ యెవఁడు
ఎవ్వఁడు మత్తపోహేతు తేజోమూర్తి
నన్ను పీడిన మానినాథుఁ డెవఁడు
శ్రీవశిష్ఠుండు తా దయచేసి నన్ను
బ్రహ్మఋషి వైతి వనియాడ బ్రహ్మఋషిని
నీ భవత్కృప నిజమగునేని నట్లు
చేయుఁ డన దేవతలును వశిష్ఠుఁ జేరి

క. నలినమ్ము నలినగర్భుఁడు
నలినజసూతియును భిన్ననామంబులు పే
రులుగాక మూఁడు నొకపరి
గలిగినవి సనాతనములు గాదే స్వామీ!

క. సృష్టిస్థితిలయముల దగు
స్పష్టియు లేనట్టి స్వచ్ఛమే సత్యము నీ
దృష్టి యది; నీవు కరుణా
దృష్టిం గాధేయు ననుమతింపవె స్వామీ!

వ. అనిన వశిష్ఠుండు కమండలుపాణియై ప్రాగ్దిశ నావిర్భవించి గాధేయా! నీవు బ్రహ్మర్షి వైతి వనిన విశ్వామిత్రుండు ౨౪౮

సీ. ఏమిా మహోరాశి! యేను బ్రహ్మర్షి నా?
యనినంత నౌను బ్రహ్మర్షి వంచు
ఏమిా జగన్నాథ! యేను బ్రహ్మర్షి నా?
యనినంత నౌను బ్రహ్మర్షి వంచు
ఏమిా తపోమూర్తి! యేను బ్రహ్మర్షి నా
యనినంత నౌను బ్రహ్మర్షి వగుదు
నీవు బ్రహ్మర్షివే నిక్కంబు సందేహ
మింత లేదని పచియించె నవ్వ
శిష్ఠుఁ డానందపులకితచిత్తవీథి
గాధిసూతి వశిష్ఠునిఁ గౌఁగిలించె
గాధిజాతు వశిష్ఠుఁడు కౌఁగిలించె
శివుని శ్రీపతి శ్రీపతి శివుఁడు వోలె

మ. శ్రీరాజన్నవకంఠనాదములు యక్షీకిన్నరీగీతిదూ
తీరీతి ప్రవణంబుగా వెలలి చిందేఁ మర్ధళస్వానవీ
చీరోచిః ప్రకటోల్బణంబులుగ విచ్చెఁ నర్తకీదేహపా
షీరాశీకృతచంద్రికల్తనుక నూచేఁ స్వానుతావాహినుల్

వ. అంత నృత్యాభిరామమూర్తియై

క. అప్సరసయైన మేనక
లిప్సామధుమూర్తి కాకలీకలకేకా
వీప్సాకీర్తనఁ బాడెఁ గ
కుప్సమ్మార్జనము భావకూలంకషముః

సీ. రఘువంశప్రాణధారాభూతముగ్ధమో
హనఘంటహాసబాహాటమూర్తి!
బాహాటవంశచాపప్రౌఢవహనశో
భాధికకృతాన్యభూపాలమాళి!
యమృతకుల్యామోహనాపాంగరేఖాప్ర
సన్నాక్షిభాధునీశారమూర్తి!
నీశారరమ్యబాహాశాఖికానుమే
యాధికబలదీపితాంగకేళి!

నాయనా! రామచంద్ర! మందస్మితాస్య!
గాధిజుఁడు బ్రహ్మఋషియైన కథయు నిదియ
తపము ధర్మంబు వీర్యంబు తాము మూర్తి
సొంపుఁ గన్నవి యీ గాధిసూతిగాఁగ

వ. అని శతానందుండు విరమించిన జనకరాజు కృతాంజలియై విశ్వామిత్రుం గాంచి

గీ. అనుగృహీతుఁడ ధన్యుఁడ నధికదీప్త
తేజ! నాయజ్ఞమున కరుదెంచు నూహ
నీవు గాంచుట; నా జన్మ పావనంబు
నిన్ను దర్శించుటయె పాపనిష్కరణము

ఉ. నీ వొక వెల్గుకంబమవు నీగుణముల్ జగతీమహౌఘసం
ప్లావనదక్షముల్ మృదుకృపామతి! నీకథ దివ్యబోధ! నా
భావన దాఁటిపోయెను; భవత్కథలోని మహత్త్వముల్ విన
నీ వరుదేర నా క్రతువు నింగిని నిల్చె మహర్షిచంద్రమా!

గీ. ఇంతమంది సదస్యులు నీ కుమార
యుగ్మకము వినుచుండ మహానిధాన
మైన నీ కథావిస్తృతి గాని వినిన
నా నిరంతమోదముఁ జెప్పలేను స్వామి!

మ. ఇవి రెండుర్ గడుఁ జిత్రమైనయవి స్వామీ! నాకునుం ద్వత్కథా
శ్రవణంబుర్ రఘురామచంద్రముఖభాస్వద్దర్శనంబుర్ హృదం
తవికీర్ణంబయి లాగుచున్నయవి యైనర్ వేళయున్ మించెడున్
రవి మధ్యాహ్నగతుండుగాఁ దిరిగె కర్మప్రాప్తకాలంబుగాన్

గీ. నాకు మీదివ్యమగు దర్శనంబు మఱల
రేపుప్రొద్దున; నియమవారితుని నన్ను
మీరు క్షమియింపవలయు నమేయమహిమ!
స్వప్రశస్తకథాపరితుష్టాళితాఘ! ౧౬౫

మ. ఇది మీయిల్లు; భగవత్కృపామహిమయే యీయజ్ఞ; మీయిల్లనీ
యది; యెందుంటిరో మీరు నెందు దిగిరో యీయెందు లోపంబులే
నిది యీ గౌతము లే భరించెదరు మౌనిశ్రేష్ఠ! యీ భూసురుల్
సదయుల్ వచ్చిరి నీదు వెంటఁబడి నా సంతోష మంతున్నదే!

వ. మీకందఱకు వచ్చిన నివాసంబునందె స్వాగత మని నవ్వి సోపాధ్యా
యుఁడు సబాంధవుఁడై విశ్వామిత్రునకుఁ బ్రదక్షిణముఁజేసి యేగిన

గీ. మునిశతానందుఁ డానందమూర్తి గాధి
సుతుఁడు సిద్ధాశ్రమస్థులు క్షోణిసురులు
దిగినయెడఁ బర్ణశాలలు తీర్చి సర్వ
మైన వీళ్లులు గలిపించె నంతలోన

సీ. అగ్నిహోత్రములకు ర్చిమకుండముల్
త్రవ్వించి వేదు లందముగఁ దీర్చి
రాజభోజనయోగ్యరస పదార్థంబులు
పంపించి సూదకపాళితోడ
నగ్నులు దెచ్చినయట్టి బండ్లను నీడ
లందుఁ జేర్చి యనడుహాంబులకును
జొప్పఁ జూచి తటాకశుద్ధవారిని జేర
మెట్లు చెక్కించి సమిద్ధరీతి
రామలక్ష్మణులును మునిరాజు సర్వ
భూమిసురులును నానందమును వహించి
యంత నిర్వర్తితాహ్నికులైరి దినము
జరఠలురదాతపములతో సందడించె

వ. అంత నేకాంతమ్మున శ్రీరామచంద్రుండు లక్ష్మణునితో నిట్లనియె

క. ఈ ఋషు లెవ్వరుచెప్పిన
సారకథాకథన మొక్కచాయనె నడచుఁ
పీ రంతద్రష్టలు బహు
ధారూపితసూక్ష్మతరకథాంశులు సుమ్మా!

గీ. నీ వి కొక్క సంగతిఁ జూచినావె వత్స!
అన్నియంశమ్ములును జెప్పినట్టితీరు
వేఱు; మేనకకథతీరు వేఱుగాదె
యనిన; నౌఁనె లక్ష్మణుం డమృతమూర్తి

సీ. పగిలి తీవ్రానిలావర్తోత్థకార్పాస
క మ్మెండుజిల్లెడుకాయవోలె
సదరి లాజార్ధతప్తాంబరీషాంతర
కృతవల్గనము వడ్లగింజవోలెఁ
బ్రిదిలి సుధార్ధవారినిషిక్తగాఢోష్ణ
రశ్మియా సున్నపుఱాయివోలె
విఱిగి హసంతీనివిష్టాధికాగ్నిత
ప్తము తోడుపెట్టినపాలువోలె
వేడితగ్గియు నడిజాము వాఁడి చెడక
గోడిపాసియుఁ దాపమ్ము మోడి విడక
యాదినదశాచైత్రమాసాపరాహ్ణ
జరఠలుఠదాతపమ్ములు సందడించె

సీ. ముకుళీభవద్రక్తమోహనాంభోజాత
పత్రాగ్రకాంతిసంబంధకములు
గేహానిర్గచ్ఛత్సతీహారిపాదలా
క్షాముగ్ధవర్ణసంఘర్షణములు
కింశుకానోకహాకీర్ణప్రసూనసం
బాధశోభాపరిమంజులములు
మాకందతరుపేటికాకిసాలయనీల
శోణకాంతిచ్ఛటాక్షోదకములు
ప్రవిలసత్కోకనదనవప్రథమపత్ర
సత్రపారాగవల్లికాసంశ్లథములు
పర్ణశాలాకదంబకపటలనీవ్ర
గళనమృదువులు సాంధ్యరాగములు నడచె ౨౭౮

సీ. ఉలిపిరు లాచు బిట్టుప్పని యూఁదినఁ
దేలుగాఁ దెరలెడు సుంపు లగుచు
నలిపిరు లాచు వెన్నెలపుల్లు చప్పరిం
చిన నాల్క తాకని సిరసు లగుచు
మెరమెరలాడి క్రమ్మిక లేని మొగ్గల
మొనల వెన్నెలతీఁగ మొలక లగుచు
విరవిరలాడి ప్రసవ్వీన పూపమొగ్గల
పలుచపేటలవోలెఁ బసరుఁగుచుఁ

జలిమిరులు లేని వెలుఁగుల దౌకళింపు
వెలిమిడింబోని కాంతుల వెక్కసింపు
గాఁగ వచ్చిన శుక్లపక్షమ్ము విదియ
వెన్నెలలు కానిపించి కన్పించ లేదు

సీ. తారుణ్యదేహశ్రీద త్రదీపమ్ము పెం
డ్లముమోజుపడి కోకిలమ్మ కూసి
గగనవైకుంఠమంగళతోరణార్షమం
డలరత్నమగు నరుంధతి వెలింగి
వైదేహయజ్ఞశాలాదీప్తవహ్నిమం
డలి యాజకర్షి మండలము కాచి
అఖిలమహర్షితేజోవధూతాఖిల
దోషాచరేశ్వరుల్ తూలిపోయి

సంగతసమీరశిశిరసంచారతర్పి
తాఖిలదివాభీత ప్రజనాళి పొలిచి
అల్ల యామిని యామిని యొల్లనొక మ
హాపురుషజీవితమువోలె నవఘళించె

సీ. ఛిన్నచాపస్వనస్థితి మూఁడువిఋపులై
కుటిలభుగ్నక్రీడఁ గోడి కూసె
వెలుఁగునాగేళ్ళఁ ద్రవ్వీన తూర్పుపొలములై
సాధుసస్యశ్రీ యుషస్సు పండె

ఒకమహాకృతి దిశాళికిఁ బూఁతయిడినట్లు
దిక్కోణావలభులు తెల్లవడియె
సాధుసాధుప్రశంసారావములువోలెఁ
గలనిస్వని శకుంతకులము కూసె
తాండవోగ్రరుద్రతరుణీనవారుణ
చరణకాంతిఁ బ్రథమసంధ్య పొలిచె
బారసాగి పద్మబంధువు మం జేహా
రక్తభార్గవీధరంబు చెఱిపె

వ. అంతఁ గృతాహ్నికుఁ డయిన జనకుండు విశ్వామిత్రుని రాఘవులం
బిలిపించి యథావిధి నర్చించి

శా. నీకున్ స్వాగత మేమి చేయుమనెదో నీ యాజ్ఞగాఁ జేసెదన్
నాకున్ దైవము బంధువున్ సఖుఁడవైనన్ నీవెగా సత్తపః
ప్రాకామ్యంబున కాదిముద్ర వనినన్ బ్రహ్మాదియై కౌశికుం
డాకాంక్షాపథ మెంతో చెప్పదికదా! యంచున్ ధరాపాలుతో

ఉ. ఈ రఘువంశబాలకుల కిద్దఱకున్ శివచాపదర్శన
స్ఫారవిచిత్రవాంఛ తుదిపట్టదు; దానిని దెచ్చి చూపినన్
వీరును జూచిపోయెదరు వీరమనోజ్ఞపథావతారు లు
ర్వీరమణా! యనంగఁ బృథివీపతి నవ్వి వచించె నీగతిన్

గీ. కన మహావీర్యమును మహాధనము నాత్మ
దీప్తతేజోదురాసదం బుత్కృష్ట
యజ్ఞధాత్రి సీతాభవ మైన కన్య
శుల్కకర్షణ మీ ధనుస్సు మునినాథ!

మ. అచటన్ బూర్వము దక్షయజ్ఞమున దేవాళుల్ హవిర్భాగము
త్సుకులై పేర్చి పినాకపాణికి నొసంగం జూడమిన్ రుద్రుఁ డా
రిచి యీ దీప్రధనుస్సుకొప్పున విదిర్చెన్ వేల్పులన్ వేల్పు లూ
గి చెడంబారి భయంబునన్ హరున కంగీకారమున్ జూపఁగన్

గీ. ధనువుతోడి ప్రయోజనంబును దొలంగి
యమరులకుఁ గాన్కగా నిచ్చె హరుఁడు దీవ్ర
మును మహావీర్యమును మహాఘనము నాత్మ
జనిత తేజోదురాసదంబును మహాత్మ!

క. నిమికని నాఁటన మిథిలా
క్షమాపతియు దేవరాతు సన్నిధి న్యాసం
బమరులు నుంచిరి యీ చా
పము నొకనిధి యయ్యె మాదు వంగడమందున్

శా. ధాత్రీద్రవ్యమహాపరిమళసనాథన్ భూమిసంజాత నే
ధాత్రీశుండను గుణంబునన్ ధనువు సంధానించు నాతండుగాఁ
బాత్రుం డంచును సీత నిచ్చుటకు సంభావించితిన్ గాని యే
ధాత్రీశుల్ ధను వెత్తనైనను నశక్తత్వంబె చూపించుటన్

క. కూఁతు నిట వీర్యశుల్కను
ప్రాఁతి ధనూరత్నమును ధరాపతితతికిన్
లోఁతైనదానిఁ గాంచుచు
లాఁతితలం పెట్టు లన్నలా! యది కలుగున్

ఉ. వచ్చినరాజులున్ ధనువు వంచినపోడిమి లేదుగాని పై
పెచ్చుగ రోఁత నాపయినిబెట్టి ధృతిన్ మిథిలాపురంబుపై
వచ్చిరి దండుతో సమదవైఖరిఁ బేదలయిండ్లు గాల్చి శ్రీ
ముచ్చిలి పట్టణం బఖిలమం బెనుగోలకుఁ దెచ్చినంతటన్

శా. ఏనున్ జూచితి వారు కోపమటె యల్లే పోదురేమో యటం
చేనుం జూచితి వారు పోదు రని యొక్కండౌ; పోలేదు వా
రేనుం దర్పితదేవతాజనితవాహిన్యుగ్రుఁడై తోలితిన్
నానాదిక్కులకున్ ధరిత్రిపతిసంతానంబు శూరావలిన్

క. ఇది యీ ధనుస్సుకథ తా
నిదియును రాఘవుఁడు వంచెనే నిచ్చెద నా
త్మదుహిత యీ రఘువులతో
డిది సంబంధంబునుం గడిందియగుఁ గదా!

గీ. అంత ధనువును దెప్పింపు మనియె మౌని
సచివులంగాంచి తెండనె జనకరాజు
సచివులును దెచ్చి భూపతిసన్నిధాన
మందు నర్పించి సచివులు నరిగినంత

సీ. దీర్ఘకాయులు బలాధికులైదు వేలమం
ది జనమ్ము లాగుచుఁ దెచ్చినట్టి
యొక యష్టచక్రమౌ శకటి నొప్పిన యయః
పేటికాంతరమునఁ బెట్టినట్టి
గంధాగురుద్రవ్యకలితపూజావత్తి
చిహ్నితమై ప్రకాశించునట్టి
సాశ్చర్యభక్తిభయశ్రద్ధముగ నిల్చి
చూపఱు మూకలై చూచునట్టి
ధనువుఁ గనుగొంచు జనకుఁడు మునిమహేంద్రు
యక్షరాక్షసదేవతాధ్యక్షభుజగ
మానవేంద్రులు గొనరానిదైన ధనువు
చూచినారుకదయ్యా! యంచును వచించె

క. మీ యిష్టము తెప్పించితి
నాయుష్మంతులను జూడుమనవే! యనె గా
ధేయుఁడు రాముని గాంచె వి
ధేయుఁడు రాముండు నేత్రదీధితు లేచెన్

సీ. అన్నయా? తమ్ముఁడా? యని నెక్కిరింపుగా
మనిసిచాటుగఁ జేసి యనియె నొకఁడు
యేదియెట్లైన దండెత్తివచ్చుట యంచు
నుండడటం చనుచుండె నొకఁడు
ఏమహాప్రభువైన నెక్కుపెట్టనె వలె
నాయ నీయన యేమొ యనియె నొకఁడు
యేదియో లేకపోయిన రట్టుపొందిన
ధనువు తెప్పించునా యనియె నొకఁడు

రామచంద్రుండు ధనువుఁ జేరంగఁబోయి
తెఱచి మంజూష ధనువుపై దృష్టిసాఱవి
కౌశికునివంకఁ జూచి ప్రకాశమాన
మందహాసాభిరామాస్యమండలుండు

క. ఇది మొదలు తాఁకెవన యె
త్తుదునో పయి నెక్కువెట్టుదునో యత్నింతుఁగా
ముదల; యనిన గాధేయుఁడు
సదమలరఘువంశజలధిచంద్రమ! రామా!

గీ. తాటకాప్రాణపథనిరాఘాటమూ ర్తి
కోటిమారీచధునన బాహాటశక్తి
క్షుద్రదైతేయకోటిసంస్ఫోటభయద
తాఁకవే యింతయే చాలు ధనువుసతాను

వ. అని విశ్వామిత్రుండనినంత శ్రీరామచంద్రుండు తత్సభాభవననికష
ప్రాగ్విశాసౌధంబు పైయంతస్తున నంతఃపురస్త్రీల కదలిక గుర్తుపట్టి
తలయెత్తిన

సీ. ఇద మిత్థ మని నిర్ణయింపఁగారాని దే
కోర్కియో రూపుఁ గైకొన్నయట్లు
జన్మజన్మాంతరసంగతమైన యా
శాబలం బవధికి సాగినట్లు
ప్రాణముల్ బయటికివచ్చి ముగ్ధాకార
మొనయించి దర్శన మిచ్చినట్లు
తనసృష్టిలోని యుత్తమభావ మానంద
ముగఁ బొంగి బింబమై పొడిచినట్లు
లలయరుంధతియును నహల్యయును గోస
లాత్మజాతయు మువ్వురి యానసముల
కన్నను బవిత్ర మగుచు శృంగారభావ
మొడిసిపట్టిన ముఖచంద్రుఁ డొకఁడు తోఁచె

సీ. పునరుద్భవద్దంతముగ్ధమోహనరుచి
ప్రకటరేఖాహాసభావపరిధి
బాల్యయౌవనదశాపరిణాహసంధిత్ర
పాముగ్ధనేత్రశోభాపయోధి
పుష్కలాభివ్యక్తముగ్ధచిక్కణకపో
లశ్రీరకాంతివేలాసుధాబ్ధి
శతసహస్రమనోజచాపలస్తకమహో
భావపుంజీభూతఫాలవీథి

యై దృగింద్రియగతపరమార్థ మగుచు
హృదయదఘ్నమై రక్తఘురీవిలీన
వేగమాధుర్యపరసీమయై గవేషి
తార్థసంప్రాప్తియై దర్శనాఢ్య మొదిగె

ఉ. శ్రీరఘురామచంద్రునకుఁ జిత్తము జానకిపైఁ గరంబు వి
స్ఫారశరాసలస్తకముపై యుగపత్క్రియఁ జిత్రమయ్యె నం
ధారతఁ గోటికెక్కిన గుణంబు బిగించుట లాగు టెంతయున్
నేరఁడెఱుంగ నొక్కసడి నిండిన శబ్దము కల్గు నంతకున్

సీ. మంజూషలోనె యమర్చి కోణం బందు
నొక్కి త్రాటం గొప్ప నెక్కువెట్టెఁ
గాంబోలు మంజూషికావినిర్గమనంబు
వేళకే జ్యావల్లి బిగిసియుండెఁ
దాళప్రమాణమౌ ధనువు జానకిదృష్టి
కడ్డమ్ముగా వచ్చునంచు నెంచెఁ
గాంబోలు నడ్డంబుగా ధనుస్సును బూని
పిడ్డిబాకువలెఁ ద్రాడు ప్రీల లాగె

నతనిదృష్టికి జానకి యాఁగలేదు
అతనికృష్టికి శివధను స్సాఁగలేదు
సీత పూజడ వెన్నుగా శిరసు వంచెఁ
జెఱకుగడవోలె నడిమికి విఱిగె ధనువు

శా. నిష్ఠావర్ష దమోఘమేఘపటలీనిర్గచ్ఛదుద్యోతిత
స్పృష్టైరమ్మదమాలికాయుగపదుజ్జృంభత్స్వరూపాంబరం
హిష్ఠస్ఫూర్జథుమండఘుమ్ఘుమారావాహినవ్యక్రియాప్రౌఢి ద్రా
ఘిష్ఠంబై యొకశాన మంటెట నెసంగెఁ గిస్నచాపంబునన్

శా. హేరంబోన్నతసారపూర్వకర్ణవివరప్రాకారిత్వమై ఘుణ్మృఖ
స్ఫారద్వావదశనేత్రగోళవిస్మృతిప్రాకారిత్వమై శైలక
న్యారాజన్నవఫాలమండలవిభుగ్న క్రీడమై యుచ్చల
ద్దీర్ఘగ్రప్రముఖంబుగా ధనువు మ్రోఁగెన్ శైవలోకంబులన్

శా. నృత్యన్మంజులతారహారకబరీనిష్యందిముక్తామణి
ప్రత్యగ్రప్రసవాక్షిసంకలనదీవ్యత్కుంభరాభీప సా
హిత్యప్రౌఢనవాప్సరోనటనసాహిత్యప్రశస్త్యాచ్ఛిద్ర
గ్గీత్యాకారమనోజ్ఞమై ధనువు మ్రోఁగెన్ స్వర్గలోకంబులన్

శా. దర్పస్వీకృతిహానవిశ్లథసరుంధద్దుష్టదైత్యాంగనా
సర్పద్వీరచమూపతశ్లథనమై ప్రసంస్కృటీకోటికా
కూర్పాసప్రకటోగ్రసాధ్వసవధూగుర్వీణ్యాభిద్రాఘ్యమై
దర్పాడంబరమై ధనుస్సు మొఱసెన్ దైతేయలోకంబులన్

శా. స్ఫీతాష్టాపదవిద్యుదుజ్జ్వలపయఃపీయూషధారాఘునీ
నీతాస్వాద్యతరప్రగల్భవచనస్నిగ్ధాననాంభోజసం
ఘాతీర్థంకరమాగధోల్బణము నానామేదినీరాట్సభా
గీతిస్వాదుమనోజ్ఞమై ధనువు మ్రోఁగెన్ రాజలోకంబులన్

ఉ. మేలుగ గౌతమాశ్రమము మీఁదుగ నల్ల విశాల మీఁదుగన్
లోలత మానిలోకనృపలోకములం జనె వార్త రాముఁడు
ద్వేలభుజాభిరాముఁ డరవిందవిలోచనుఁ డన్న వార్త యా
భీలసురారిమండలవిభీషణమూర్తి యటన్న వార్తయున్

గీ. ఎంతవఱకు ధనూరావ మెల్లదిశల
నప్రతిహతమ్ముగా నార్చె నంతవఱకు
జనము లెల్ల దిమ్మెక్కిన శ్రవణకుహర
బలవివశమానసులు నిలంబడిరి శిలలు

క. ఆయజ్ఞధాత్రికర్షణ
మై యొసఁగిన హృదయభార మంతయుఁ దీరన్
శ్రీయుతుఁడు జనకభూపతి
యాయతనిశ్వాస మొక్కఁ డంతట వదలెన్

క. జనకుఁడు గాధేయునకుం
బ్రణామ మొనరించి రామభద్రునివంకం
గనుగొని యొక్కనిమేషము
తనసచివులఁ గాంచి యనియె ధాత్రీపతియున్

ఉ. నేనును బ్రహ్మవేత్త ననె నిల్పెను నన్నును గర్భలేశర
క్షానిధి నంట నే నని నిజంబుగ నాయనప్రేమ యా యయో
ధ్యానరనాథు ప్రేమయును నాతనిగౌరవ మేమి చెప్పఁగాఁ
దానును నాకు వియ్యమగుదానికిఁ దానె పునాది వేసెనో

శా. నాకున్ బ్రాహ్మవిధిన్ సమర్థ్యమును సంధానించెఁ గావన్ననున్
నాకన్నన్ గడువృద్ధుఁ డెంచగఁ ధరానాథుండు నేనన్నచో
నా కౌతూహల మంత గౌరవము కట్టా ! భావిసంబంధసం
జ్ఞాకంబై హృదయంబు దాచిన యవిస్పష్టోహ మే కావలెన్

సీ. కుశికనందనతపోగుప్తులై రామల
క్ష్మణు లిందు వచ్చిరి తనకొడుకులు
శివధనుస్సును విఱిచి రటంచు దశరథుం
డుం గుఱ్ఱలస్థితి యెఱుంగవలయు
సిద్ధాశ్రమమ్మునఁ జేసిన యాగర
క్షణము మారీచశిక్షణము దెలిపి
యటమున్న తాటకాప్రాణఘాతమ్మును
మలదకరూశభూములయు బెడఁదఁ

దొలఁగఁ బెట్టుటయును గౌతములయహల్య
లుపలభావమ్ము వీడుటయును మొదలుగ
వినిచి యష్టమినాఁటికే పెండ్లివారు
గూడి యిట వచ్చునట్లుగాఁ జూడవలయు

గీ. ఉభయపక్షమ్ములం దీయనో ప్రతిగ్ర
హింపనో గాధితనయుండె యెల్లవారికి
ప్రభువు కుశికాత్మజుని యాజ్ఞ బడసి జరింపు
డా ప్రభువు చెప్పినం బోన నగు నయోధ్య

వ. అని జనకుం డనుచుండ

మ. వినుచుం గౌశికుం డయ్యో! తత్క్షణము పంపింపవలెన్ గాదె వం
చిన యే కోర్కియు నెండి ప్రమోదయిన నాచిత్తంబు నీ మాట విం
చును తా బాడిదబోద వోలెం బవురించున్ జానకీరామచం
ద్రుని గన్నారంగం గాంచిపోవుదును నేనున్ నోచనే యంచనన్

చ. జనకునిమంత్రు లెంతమతిశాలులొ! రాముడు విల్లు చేర నే
గిన తొలికీవిం జూచుచును కేవల మీయన విల్లు వంచు నం
చును మది నిర్ణయించిరి విశుద్ధమనుష్యులు ధారిబత్తముల్
గొని చనుదేర మాతలను గోరరి యాజ్ఞయుంగా మహాత్ములై

మ. రయరేఖాహయపుంఖరింఖితపథుల్ రాజీవబంధూజ్జ్వలా
న్వయచూడామణిం జేరనేగిరి భటుల్ నై దేహుం డానందత
న్మయుండై గౌతమునిం బురోధను శతానందున్ విలోకించి ధీ
నయవంతుం డిటులన్ వచించెం బ్రభువా! నా తమ్ముడున్ రావలెన్

సీ. అని కుశికాత్మజు నరసి యో తపముల
ముద్ద! నా తమ్ముడు బుద్ధిరాశి
బహుధార్మికుండు కుశధ్వజుండు నాతోంబాటు
వత్సరాఘవముఖవనజదర్శ
నానందమును బొందనౌం గదా సాంకాశ్య
పుర మేలుచుండె సోదరుం డతండు
నొద్దునం గుమ్మిన యుసిరికతోటల
యిక్షుమతీనది యే పురంబు
పరిఖ సాంకాశ్యమదియు నాపురమునందుం
గలండు నా తమ్ముం డాతండు క్రతుభరంబు
పూనంగలవాండు పిలిపింతు నేను వాని
నంచు గౌతముతో నిట్టు లనియె మఱల

ఉ. సీతను గ్రిందనంచు నొకచెల్వొన దించెడువాఁడు కాఁడు న
ట్లే తనచంక కెత్తికొని యెల్లెడలన్ జనుచుండువాఁడు తా
నాతఁడు రామచంద్రుని రయంబునఁ జూడవలెన్ గుశధ్వజుం
జేతము చూడకుండ నొక చిన్నము నిల్చుటలేదు గౌతమా!

వ. అనిన శతానందుండు వేగరులగు దూతలం బంపినఁ గుశధ్వజుండు మఱునాఁటికే తనభార్యతోఁ గూఁతులైన మాండవీశ్రుతకీర్తులతో వచ్చి శ్రీ లంతిపుర మేగఁ దాను సభకు వచ్చి

సీ. రామభద్రుని మహాప్రతిభాతనువుఁ గాంచి
గాధేయమృదుపదకమల మంటి
రాజబాలుని ముఖాంభోజదీధితిఁ గాంచి
గౌతము నభివాదకలన నెఱపి
లక్ష్మణాగ్రజు దృశాశ్లక్ష్ణకాంతులు గాంచి
జనకభూమీశు దర్శనముఁ జేసి
తరణివంశ్యుని స్నిగ్ధతనువు సర్వముఁ గాంచి
మైథిలేయుల పరామర్శఁ జేసి
యన్నదమ్ముల కెదురుగా నరుగుదెంచి
నిలువ వారిద్దఱును శిరంబులను వంచి
సన్నతులు పెట్టినంతఁ గుశధ్వజుండు
నిరువురను రెండుచేతుల నిఱిసికొంచు

వ. శ్రీరామచంద్రుని సర్వాంగములయందుఁ జేసిన హస్తస్పర్శచేఁ దన సౌఖ్యానుభూతిఁ దెలియఁజేయుచుఁ గుశధ్వజుండు వేగమ్మగా నంతఃపుర మ్మేగి నవ్వుచుఁ దన కెదురువచ్చిన సీతంగాంచి తానును పకాలున నవ్వి యామెను దగ్గరకుఁ దీసికొని తొడపై నెక్కించుకొని చిబుకంబు పూని

సీ. ఈ తల్లి యకట చిన్నిపిల్లాలు శివధనుః
కర్షణోగ్రునకు రాఘవసుతునకు
నీ చిట్టి యగునటే యింతకోడలు సూర్య
వంశవృద్ధులకు దీవ్యద్భుజులకు

నీ పాపయటె చింతయివ్వరైన స్నుష వశి
ష్ఠారుంధతులకుఁ దేజోఽనఘులకు
నీ యమ్మ యటె సిరులెత్తినట్టి పతాక
యిక్ష్వాకువంశకీర్తిందిరకును

నని కనుంగోసలం దనయాత్మయెల్ల
వెలికిరాఁజూచి కూఁతును విడువలేక
విడువలేకయ చనె సభావీధి కటఁ గు
శధ్వజునకు రామునియందె సర్వదృష్టి

క. అట దూత లరిగి సరయూ
పుటభేదమునందు గుస్తిఁబొరయు నయోధ్యా
పుటభేదనంబు మూన్నా
ళ్ళటవీనదిసమితి దాఁటి యరిగిరి పెలుచన్

క. జనకునిదూత లటంచును
వినుచునె నరపతి ప్రవేశపెట్టుఁడనియె వా
రును బద్ధాంజలిఁ బ్రశ్రయ
మున జననాథుఁ గనఁబోయి మ్రొక్కిరి రాజున్

వ. మహారాజా! జయము! జయము! మేము మిథిలేశ్వరునిదూతలము, వశిష్ఠగుప్తులగు మహారాజులను శతానందగుప్తు లగు మహారాజులు కుశలం బడిగి

క. శ్రీగాధేయర్షి మహేం
ద్రాగూపరిరమ్యవాక్యుఁడై ప్రభువులతో
నీ గాథ చెప్పఁ డనియెను
చేఁగకలుగు శివధనుస్సు చెందిన వార్తన్

సీ. సుర లిచ్చినారన్న, గిరిజాపతిధనుస్సు
మా యింటనుండిన మానవేంద్రు
లరుదెంచినారన్న, యడిగి ధారణికూఁతు
వీర్యశుల్కను నెక్కువెట్ట లేక

ధను వూగినారన్న; దర్పితులై మిథి
లాపురిమీఁద బలంబుతోడ
దండెత్తినారన్న, దళితభుజాబలు
లై గోడిచెడి పాఱి రన్నవార్త
యఖిలనృపలోకమునకు మీ కవగతంబ
యట యదృచ్ఛాగతుల్ కౌశికానుగంత
లైన మీసుతు లిద్దఱు నరుగుదెంచి
నా కుమార్తెల గెలుచుకొన్నారు రాజ!

వ. అయోనిజయుఁ బెద్దదియు నగు సీతయు నౌరసియుఁ జిన్నదియు
నగు నూర్మిళ నీ కోడండ్రు

క. రా! కొడుకులఁ గాంచెదవును
రా! కోడండ్రను గనంగ రామోపయము
శ్రీ కౌతూహలవేగం
డై కౌశికుఁ డటమటించు నయ్యా నరేంద్రా!

గీ. అని కృతాంజలులై వినయాభిరాము
లగుచు దూతలు నిలిచిన నవనినాథుఁ
డుదరి మేఘోదయంబున నుచ్ఛిలీంధ్ర
ధాత్రివోలిక శ్రవణరంధ్రములు పొడిచి

గీ. సూర్యకులదేవతలు వశిష్ఠులును నన్నుఁ
బంపు మని రేను బంపితి బాలరఘులఁ
గౌశికులు చెప్పినంతయుఁ జేసినారు
గౌశికులు నధికంబుగాఁ జేసినారు

వ. అని యయ్యా! త్రిభువనకులగురువ! వశిష్ఠ! సూర్యవంశభాగధేయ!
వామదేవ! యోయి దిలీపమంత్రి! సుమంత్ర!

క. విన్నారు కదయ్యా! మన
చిన్నలు మిథిలాపురంబుఁ జేరిరి జనకుం
డన్నుల నిచ్చున టే మన
కన్నరనాథులకుఁ బొత్తు లంగీకృతమే?

శా. యోగ్యంబై శుభమైన మార్గములనే యాత్రాకృతిన్ మీరు నా
భాగ్యంబన్ రథమున్ నెలార్చెద రయో! వైదేహసంబంధమున్
యోగ్యంబంచును మీర లెంచెదరయో నోహో ప్రభుల్ వెంటనే
యుగ్యంబుల్ సమకూర్చి పోవలయుఁ గాదో శ్రీవిదేహంబులన్

గీ. అనిన నానాటంచును నఖిలసభయు
నొక్కయుమ్మడి లేచి యొక్కొకరు శకట
ములకుఁ దారులు వేయింప బూజు దులుప
గ్రొత్తరంగులు వేయింపఁ గుతుకపడుచు

సీ. అగ్నిసంగ్రహణమ్ము హవ్యార్థవస్తుసం
పాదనమ్మును జేయుఁ బరిసనంబు
శస్త్రంబులకు నికషమ్ము పెట్టుట రథ
మ్ములు సజ్జములు చేయుఁ గళపళంబు
సాకేతపురరాజ్యసంపద కనునైన
వస్త్రభూషల నేర్చు పదిలపాటు
కిఱ్ఱుచెప్పులు కోల్పుకఱ్ఱలు చెవిజంపు
లాదిగా సమకూర్చు నందగింపు
గాఁగను ప్రయాణసన్నాహకలిత వేగ
రమ్యముఖులైరి నాల్గువర్ణములవారు
నంతిపురమునఁ బురమున సంగసలకు
నే మడతఁ దీయవలయునో యెఱుఁగరాదు

చ. తెలతెలవారినన్ బయలుదేరుట యైనఁ బురంబునందుఁ బె
ద్దలు నొకగుఱ్ఱుతీసినను దామ లతాంగులు సర్దిసర్ది పె
ట్టెలు రవణించుచుండు రొకటే పనిగా నిదురింపఁబోరు ముం
గిళుల రథాలు విప్పి కనుగ్రేవల నిద్రలురాక సారథుల్

వ. అమ్మఱునాఁ డుషఃకాలమ్మునందు

క. అన్యోన్యాహ్వానధురా
నన్యాహతరావబధిరితాశాగతి రా
జన్యభటలోకవిచలన
విన్యాసముచే నయోధ్య వెక్కసమయ్యెన్

వ. అంతఁ గొంతసేపటికి

క. కప్పెడు కప్పెడు చీఁకటి
విప్పని దారిఁబడి చనుప వెడలినరీతిన్
జప్పరములు శకటంబులుఁ
దెప్పలుగా నగుచు బయలు దేరె వరుసగా

క. ముందటిరథముల దీప్తా
మందాననులై కృతాఘమర్షణులు ఋషుల్
ఛందోముఖరాననులై
స్యందిశుభపరంపరానుషంగులు సనఁగా

సీ. దర్భాసనమ్ములుఁ దడియంగవస్త్రముల్
గా వశిష్ఠాదు లగ్రమునఁ జనఁగ
నావెన్క దశరథుం డరిగెఁ బార్శ్వంబుల
భరతశత్రుఘ్నులు బలిసిరాఁగఁ
గౌసల్యకును నిరుగడల సుమిత్రయు
కైకేయి యరదముల్ కదలివచ్చె
నావెన్క శేషపుచ్ఛాభిరామంబులై
పెఱిమెల్లవారలు తుఱఁగలింప

నొకమహాపూరుషుఁడు చేతు లొప్పుగాఁగఁ
జాచి సూర్యనమస్కార మాచరింప
బోరగిలఁబడి సాగినపోరు దోఁచె
నరదములకట్టు విశదధ్వచరుల కపుడు

వ. వశిష్ఠముఖంబు వామదేవగళంబు కౌసల్యాదశరథవక్షంబు భరత
శత్రుఘ్నతదంబాబాహువు పరరాజన్యపరిచారకదేహయష్టియు నగు
నప్పెండ్లిచనుప పోవుచుండ దశరథుండు సుమంత్రునిఁ బిలచి

క. మన మటకుఁ జేరునంతకుఁ
జను దెంతురె? యల్లుమాని శాంతయు ననినన్
మనతోడఁ గలసికొందురు
మనుజాధిప ! దారిలోన మఱి వా రనినన్

సీ. అగ్రయాయుల వశిష్ఠాదుల ఫాలభా
గములఁ దేజోరూపకాంతు లగుచు
ననుయాతదశరథావనినాథ తత్సుత
ప్రతిబింబముల బింబభావ మగుచు
స్త్రీలోకవదనరాజీవసంస్పర్శహే
లాముగ్ధకరవిచాలనము లగుచు
ముగ్ధచ్ఛటాగుణీభూతనానాయుధ
భూషామణీకాంతిపూర మగుచుఁ

గదలినవి బాలమార్తాండకౌంకుమార్ద్ర
మసృణమందారమాలికావిసృమరప్ర
శస్తసుకుమారకాంతిప్రసారణములు
కమలినీకన్యకాత్రపాకారణములు

సీ. ఎదురుగా నేగుచో నెదలపై హారనా
యకరత్నముల కంశు లప్పుపెట్టి
యెడమకుఁ దిరుగుచు నేగుచోఁ గుడిబుజ
మ్ముల నంగదచ్ఛవుల్ గిలకరించి
కుడివైపు తిరిగి యేగుటయందు వామాక్షి
లాలితాపాంగమూలలను గదిపి
యాగ్నేయ మీశాన్యమై యేగ ముప్పాతి
కమొగంబు వెలినీడఁగా మలంగి

సాగి ప్రొద్దెక్కిన కొలంది చండకరుఁడు
దారి మలకలు తిరిగిన దశరథేశు
సైన్యములయందుఁ గాంతిప్రసారచిత్ర
వల్గుగమనంబులన్ వళావళులు జేసె

వ. ఇట్లు పయనంబుసేసి మూఁడవ దినంబున రాహుకాలంబు దాఁటిన వేళ దూరంబున శాంతర్ష్యశృంగు లరుదెంచురథంబులు గుర్తుపట్టి పెండ్లిబండ్లన్నియు నాగిన శబరిపాయ గోదావరి కెక్కినట్లు వారు వీరుఁ గలసికొనినంత 

సీ. శ్రీవశిష్ఠులు ఋశ్యశృంగులుఁ గలసిరి
యంత బద్ధాంజలు లవనిపతియు
నల్లుమానియుఁ గూడి రవనీపతి మునీంద్రు
కుక్షిపై నంజలిఁగూడిన శిర
సుంచి నీకరుణారసోద్భూత మగు రాచ
నిసుగు పెండిలికి మౌనీ! త్వదీయ
మాగమనంబు సర్వార్థలాభం బయ్యె
నన ఋశ్యశృంగుఁడు నవనినాథ!
రామచంద్రుని పెండ్లికి రానె నేను
రాకపోయిన మీ శాంత రాదుగాని
యేను బ్రియశిష్యు పెండ్లికినేమి? రాక
పోవుటేమి? యటంచును మూదలించె

వ. అంతఁ గౌసల్య వచ్చి శాంతం గౌగిలించుకొని ముద్దాడి "తల్లీ నీవు వచ్చితివి; నాబరువు తీరినది; మాడుపట్టున సింతచమురు పెట్టుటకు మంగళహారతి పళ్ళెము పట్టుటకుఁ దమ్ముని దిద్దికొనుటకు నాడ పడుచువు వచ్చితి" వని పొంగిపోయె. సుమిత్రాకైకేయులు శాంతను రాచుకొని తిరిగిరి; పరిచారికలు మందహాసములతో విస్ఫారితనేత్ర ములతో దూరమున వినయ మవలంబించిరి; నమస్కరించిన భరత శత్రుఘ్నుల మూర్ధమ్ములఁ జేయియుంచి శాంత పరామర్శించె నంత

గీ. శాంత కనుసన్నలంబడి సర్వమందు
సాధువుఁ బ్రియంబునై యాజ్ఞసాగె గౌర
వంబు గల యింటి కగు నాడపడుచు రాక
యెంత శోభాయమానమో యెఱుఁగఁబడుచు

సుముఖి.

వెడలి విచిత్రవిచిత్రగతుల్
కడవఁగడంగి కడంగి రథుల్
నడపఁగఁ దూలిన వాజితతుల్
కడచిచనుఁ ముఖక్ష్యప్తకశల్

రథగమనమనోహరము.

అనడుహాములు ధే యం చదల్చినంతన్
గనలి తురంగవల్గుగాఢవేగదీప్తిన్
జని కడచన నశ్వసారథుల్ విలాసా
ననులు రథములాపి నవ్వుచుంద్రు కొంతెల్

వ. ఇట్లేగి మఱునాఁటి ప్రొద్దుట విదేహంబులు చేరినంతఁ దమవిడిసిన సరస్తీరంబునందు నుండి రామలక్ష్మణులు వచ్చుచున్న రథంబులు దర్శించి యెదురుపోగా ముందటియరదంబున నున్న యరుంధతీ దేవి దిగి నమస్కరించిన శిశువులను దంద్రులారా! మిమ్ము మాతా పితలు ద్యావాపృథువులును నహంనహన్ముఖులునునైన ఋగ్వేద దేవతలు నాశ్రయింతురు గాక యని యాశీర్వదించినంత

తరలము.

చెఱువుగట్టున రత్నకంబళిఁ జెన్నుగాఁ బఱపించి యే
డ్తెఱను గౌతముఁ డుండె బండ్లను దించి పెద్దలు సేరఁగాఁ
గఱదలాడుచు గౌతముండును గంధ మిచ్చి సపర్యగాఁ
దుఱఁగలించిన కన్నదోయిని దోయిలించి మహానృపుల్

మహాక్కర.

మా ధరాపతిసుత ధరాసుత మీరు మన్నించిరేని మీకుఁ గోడళ్ళు
భూధరేంద్రులు బాహుశాలులు మీకుఁ బుత్రికారత్నమ్ము నిచ్చెదము
సాధుమూర్తు లనుగ్రహించుఁడు రససాధులు పాసకాలకావళ్లు
సీధువుల్ గొని యనుమతించిన మీకు సీతమ్మ నర్పించిపుచ్చెదము

క. అనిన వశిష్ఠులు కాని
మ్మని పానక మంజలించె నంజలి నృపుఁడున్
గొనె బంగరుబిందెలు నై
కొనిచనె శాంతమ్మ చీరకొంగు విదుచుచున్

గీ. అంత జనకరాజు నరుగుదెంచి యుదాత్త
సమ్మదాభిరామసౌమ్యవదనుఁ
డగుచు నిలచినంత నరసి కృతప్రణా
ముండు నగుచు దశరథుండు వేగ

క. ఒకనెల నిలచిన నీ ర
తకుఁ గల్గినశిశువు మీఁదు జానకిపతి యఁగా
టకు నీకృపావిశేషము
నకుఁ బదునాఱేండ్లు పండినది పంటసుమీ!

మ. అన సీరధ్వజుఁ డానన్దోజ్జ్వలితహాసాంకూరుఁడై కన్యకా
జనకుం డేను గ్రహించు నీకరుణచే సాగుణ్ మదాజ్ఞానిబం
ధన లన్నణ్ నగి కోసలేశ్వరుఁడు విద్యామూర్తి! ఏఁ జేయు సా
చినవాఁడణ్ మఱి నీవు దాత వనిసణ్ చిన్నారినవ్వొప్పఁగా

చ. జనకుఁడు నీవుచెప్పినది సత్యము ధర్మ్యము కీర్తిహేతువౌ
విని భవదీయ మీ పలుకు విస్మయమందితి నైన నేను మీ
రనినది సేయువాఁడ భవదాగమనంబు ప్రమోదహేతు వ
య్యెను మునిలోకనాథు లిట కేగుటచేత వశిష్ఠు లీ గతిణ్

మ. చెదుఁ గల్పాంతమునందు నేనియు వియచ్ఛృంగాటకాగ్రస్థలీ
గుడపుష్పాకృతులైన దంపతులు నాకుణ్ వచ్చి రిల్మంగిలం
దడుగుల్ వెట్టిన మోక్షమట్లుగ వశిష్ఠాబంధతుల్ పండి క
న్నడిగానీ తొలివిత్తనంబులగుఁ బుణ్యంబుల్ కనంబోమగా

క. మీఁరనిన నాయెడం గల
గౌరవభావం బదెంత కన్పడునో స
త్కారముల మీకు స్వాగతి
ప్రారంభించిన జనుస్సుపర్యంతంబున్

ఉ. బంధుర మే పురాతపసు పంటకు నోగ్గినా రాఘువాళిసం
బంధము గల్గె మాకు నిమిషంగసమందున బాహుశాలితా
సింధువులైన నీసుతులఁ జెందిన కీరితిజ్యోత్స్న నీదురో
మాంధువు లందునన్ జలువలై పులకల్ ఘటియించుచున్నదో

క. రేపు తొలివెలుఁగు రేకలు
ప్రాపించినయంత నవనభారము తీరున్
నీ పుత్రులపరిణయశో
భాపర్యాప్తంబు నీదు భావమ్ము నగున్                                                                                    ౩౬౭

వ. అని వారి వారి విడిదులకుఁ బంపించిన

కమలనగీతి.

జనకునింట దశరథేశు సౌమ్యభావ మెంచి తనర
జనకు సౌమ్యతఁ గని దశరథేశు నింట
మనసులందు నొకరు నొకరి మార్దవంబె చూచి
యనఘ ముదితులైరి యిద్దఱైన పెండ్లివారు

క. జనకుఁడు నిర్వర్తితమై
చన సవనకలాప మెల్ల సంధ్యాకార్యం
బొనరించి మొగుడుకొను యా
మిని మునివెన్నెలసుఖంబు మేన వహించెన్

గీ. పెండ్లివారికి గౌరవప్రీతికరము
గాఁగ ప్రథమయామంబెల్ల ప్రమోఁగుచున్న
శతధనుష్మద్భుజాగ్రవిస్ఫారితవిశి
ఖాసనజ్యాలతాధ్వాన మావరించె

వేగవతి.

మొగి నెచ్చటఁ గ్రమ్ముకొనున్
జ్యావల్లిరవంబులు పాదులుగాఁగన్
నిగుడున్ ముసురై నినదంబుల్
సంవేల్లితరుద్రుని వింటిరవంబుల్

మ. ధనురాస్ఫాలనకర్కశధ్వను లుదాత్తంబుల్ సమాక్రాంతముల్
చను దిగ్వీథుల నెచ్చటన్ రఘుకులస్కందోగ్రబాహావిదా
రణభాస్వద్ధనుర్నినాదములు నారంభించి యచ్చోటఁ బో
వును దత్పూర్వతరంగసంతతి పునఃపుష్టోగ్రశబ్దాహతిన్

గీ. శతధనుష్మద్భుజాగ్రవిస్ఫారితవిశి
ఖాసనజ్యాలతాధ్వాన మావరించె
మఱలఁ బ్రత్యూషశబ్దాయమానసాఖ
శాయనికగీతితతులతో సాగుడెంచి

శా. స్ఫీతాష్టాపదవిద్యుదుజ్జ్వలపయఃపీయూషధారాధునీ
సీతాస్వాద్యతరప్రగల్భవచనస్నిగ్ధాననాంభోజసం
ధాత్రీర్ధఁకరమాగధోల్బణము నానామేదినీరాట్సభా
గీతిస్వాదుమనోజ్ఞమై ధనువు ప్రోగెన్ రాజలోకంబులన్

వ. అంతఁ దెలతెలవేఁగుతో జానకీవివాహదిదృక్షువులైన హితభూపాల
సంతానంబు లరుగుదెంచిన

క. వాజుల శ్రవోయుగళిమ
ధ్వాజిరరమణీయమణివితానాంశులుగా
శ్రీజనకరాజు ముంగిలి
పూజాపుష్పము లుషస్సు పొడిచెన్ దఱచై

గీ. సారసహితుండు సూర్యుఁ డనూరుసహితుఁ
డగుచుఁ బ్రాగ్రత్నపీఠిక నెగసినంత
రహిఁ గుశధ్వజయుతుఁడు సీరధ్వజుండు
నవమణిస్నిగ్ధసింహాసనమున నుండి

గీ. మంత్రిని సుదామనాఖ్యుని మందలించి
రోయి సఖుఁడ! నీవేఁగఁగా నొప్పుఁగాదె
యాత్మజులతోడ దుర్ధర్షుఁడైన దశర
థేశు నైక్ష్వాకుఁ గొనిరాఁగ నిచ్చటికిని

క. అనిన సుదామనుడుం
జని యినవంశ్యుల విడిదు లేగి నృపు శిరసా చే
సిన ప్రణతిగ రఘుకులవ
ర్ధన! సామాత్యుండు రాజు రమ్మనుచుండెన్

మ. గురువుల్ మంత్రులతో సభాస్థలమునన్ గూర్చుండి నీ పుత్త్రులున్
గురువుల్ నీవును రండటంచుఁ బిలచెన్ క్షోణీశ! వైదేహు డం
చురువాఁ బ్రేమ సుదామనుండు వలుకన్ బ్రోద్దామసమ్మోద ని
ర్భరుఁడై కోసలరాజు వచ్చితిమయా వైదేహునాస్థానికిన్ ౩౮౩

గీ. అని సబాంధవుఁడై నృపుఁ డరుగుదెంచె
నంత నంత సోపాధ్యాయుఁ డరుగుదెంచె
నంతనంత సపుత్త్రికుఁ డరుగుదెంచె
నంతలోన వియ్యంకుఁడై యరుగుదెంచె

క. వారల వీరల కలయిక
పారావారప్రవాహపారావార
స్ఫారతరమోదసంగమ
మై రోచిర్వానదీ ప్రియై రాజిల్లెన్

ఉ. ఒత్తుగ వాకిటన్ ఘనరవోద్ధతిస్సై రథనేమినిస్వనం
బార్తి జనంబు వాకిటికి నొగ్గిన నవ్వులమోముగా యుధా
జిత్తరుదెంచెఁ గైకయుఁడు చిన్నికుమారునిమేనమామ రా
జత్తతి నూత్నమైన శుభమందినయట్లుగ సంతసింపఁగాన్

గీ. అంత నంద అన్యోన్యప్రేమార్ద్రముగను
గౌరవోదాత్తముగను సత్కారమంది
యల యుధాజిత్తు జనకున కంజలించి
దశరథుని గౌరవప్రేమ తనుకఁజూచి

ఉ. కేకయరాజు మిమ్ము నడిగెన్ బహుధా కుశలమ్మనామయ
శ్రీ కలరెల్ల రచ్చటను జన్నలపెండిలిచూచి మన్మనిన్
జేకొని రమ్మటంచుఁ బనిచెన్ ధరణీశుఁడు నన్న యోధ్యలో
మీకయి చూచివచ్చితిని మేదినినాయక! యంచుఁ జెప్పఁగాన్

మధ్యాక్కర.
సానందపరిణయసాధుసామ్ముఖ్యసంభాషణముఁగఁ
బూని వశిష్ఠులఁగూర్చి భూపతి ముగ్ధుఁడై పలుక
గా నెంచులోన ముంగిటను ఘనమేఘగర్జయుగాఁగ
ధానుష్కధనురుగ్రరావధార్ష్ట్యంబు దర్పంబు తోఁచె

గీ. దశశతధనుమ్మదుగ్రసంధానచాప
రోపవల్లీ నినాదంబు రూక్షమయ్యె
బాలరాఘవు శివధనుర్భంగరవము
దిగ్దిగంతంబులందుఁ బ్రతిధ్వనించె

శా. హేరంబోజ్జ్వలశూర్పకర్ణనినదహ్రీంకారియై షణ్ముఖ
స్ఫారద్వాదశనేత్రగోళవివృతిప్రాకారమై శైలక
న్యారాజన్నవఫాలమండలవిభుగ్నక్రీడమై యాశ్చల
ద్ధీరుగ్రప్రమథంబుగా నగుచు ప్రోఁగెన్ శైవలోకంబులన్

క. గగనమునఁ బిండులుగఁ బడి
ఖగతతి కుతిలపడి వలయగతి నఱచుచుఁ బో
మృగములును నోరు దెఱచుచు
జగతిం డెక్కలు మలంగి సంకటపడియెన్

చ. మొగిడి మహాత్పయోధరసమూహము క్రమ్మె నభస్స్థలంబునన్
చిగురుల మేఘగర్భములు చీల్చెను శంపలు అంపిలెన్ భుగా
భుగ మని ప్రీలివచ్చు నుఱుముల్ పెనుగాలి యొకండు రేగి బి
ట్టుగఁ దృణకాష్ఠధూళిని సుడుల్ కలిపించుచు లేచె మింటికిన్

క. గజములు ఘీంకృతిఁ బర్వుచు
గజిబిజిగా నేగె వాజిగమి మొగ్గతిలన్
రజమున ముట్టెలు ముట్టగ
బజీతు లయ్యెను బరాగపటలము నిండెన్

గీ. అంత శాంతించె మేఘము లంతఁ బక్షి
వితతి సౌమ్యారావములుగా వెడలె మింట
సాగి వర్షాశరత్తులు జంటగాఁగ
నొత్తికొనివచ్చినట్టు లుద్వృత్తరీతి

వ. అంత దశరథుండు వశిష్ఠవిశ్వామిత్రులకుఁ గేల్మొగిడ్చి

చ. శుభ మని నేను నాదు ప్రియసూనుని పెండిలిమాట యాడఁ బో
నభమున మేఘముల్ మొరసెనా! విహగంబులు తూలియాడెనా!
ప్రభువులు మీరు నాకులము పంటకుఁ దెచ్చితి రీతిబాధలే
దు భరము మీ భుజంబులను దొట్టిన దేమి పౌనర్తురో యనన్

గీ. వారు మొదటఁ గొంత వక్రతయైనను
ఋజుత కల్గు ననుసరించివచ్చి
ప్రళయ మట్లు వచ్చుఁ బై దేలిపోవు లే
దయ్యె భీతి రాజ యనిన యంత ౩౯౮

శా. నిష్ఠావర్షదుదార మేఘపటలీనిర్గచ్ఛదుద్యోతిత
స్ఫేష్ఠేరమ్మదమాలికాయుగపదుజ్జృంభన్మహాఘోరబం
హిష్ఠస్ఫూర్జథుషండమండలరవాహీనక్రియాప్రౌఢి ద్రా
ఘిష్ఠమ్మై యొకరావ మంతట నెసంగెన్ వాకిటన్ ఘోరమై

శా. ఫాలంబందున బ్రాహ్మతేజము దృశాబద్ధోగ్రరక్తచ్ఛటా
భీలక్షత్త్రనితాంతభీకరతయున్ బెల్లై పదన్యాసకే
ఖాలీలాపరిధూతసద్ధరణిభృద్గంభీరపక్షద్వయో
ద్వేలోద్దామవిదీర్ణచంక్రమణసందేహాస్పదాక్రాంతిగా

శా. కల్పాంతావిలనీలసాగరతరంగప్రోజ్జ్వలద్బాడబా
నల్పాగ్నిచ్ఛట వల్కలాంచలధురానాట్యప్రచండక్రుధా
జల్పాకోగ్రత సాగివచ్చె ననఁగా చండాగ్ని విశ్రాంతిమై
నల్పిష్ఠం బగుచున్ బుసఃకృతమరుద్వ్యాధూతిచే మండునాన్

గీ. రవముతో యాగపద్యసంరంభ మొప్ప
కడక భార్గవరాముండు నడచివచ్చె
నుభయహస్తగృహీతమహోగ్రపరశు
భారబాణబాణాసనఘోరమూర్తి

సీ. తాళప్రమాణమౌ తనుయష్టి కలవాఁడు
జలధినుర్వులవోని జడలవాఁడు
అఖిలాంగములను రుద్రాక్షముల్ కలవాఁడు
కాంతిపిండుల యెఱ్ఱకనులవాఁడు
ఫాలభాగంబున బ్రహ్మతేజమువాఁడు
చేతులం దాయుధశ్రీఁ గలాఁడు
కైలాసమునువోలెఁ గదలించరానివాఁ
డఖిలసంహారకాలాగ్నివోలె

దుస్సహంబైనవాఁడు విద్యుద్గణోప
మం బయిన చాపధృతివాఁడు మహితమైన
తేజమునఁ గన్ను లొలయించి తేరి చూడ
రానివాఁడు వచ్చెఁ బరశురామమూర్తి

ఉ. వచ్చిన భార్గవుం గని సభాస్థితు లెల్లరు నిల్చినట్టివా
రెచ్చట నిల్చి రచ్చటనె యొల్లయుఁ బ్రాణము క్రుంగిపోవఁగా
విచ్చిన ఱెప్పలున్ మొగుడువెట్టక యుండిన భార్గవుండు హా
సోచ్ఛలదాస్యుఁడై ధనువు నూది గుణధ్వనిఁ జేసెనంతటన్

చ. తెలివి ఘటిల్లి యందఱును దేఁపువ నర్ఘ్యము నర్ఘ్యమంచు వి
హ్వాలతను నద్దెసల్ గనుచుఁ బాద్యము పాద్యము పాద్యమంచుఁ గ
న్నుల భయరేఖగాఁ జని మనోధృతి తూలిన గౌరవంబుగా
జలముల నర్ఘ్యపాద్యములు సల్పిరి భార్గవరామమౌనికిన్

గీ. ఆయనయు నర్ఘ్యపాద్యంబు లంది జనక
దత్తమాణిక్యపీఠికాస్థలి నిషణ్ణుఁ
డైనయంత నెల్లరకును బ్రాణములును
జేరుకొన్నవి శిథిలమై చెడినచోట్లు

సీ. కూర్చున్నయప్పుడుకూడ భార్గవు దేహ
యష్టి రత్నాసన మానుపీట
శిఖరస్థమౌఁ గీర్తిముఖమును మకరతో
రణ మంటుచున్న దీర్ఘతను వొప్పె
నంత భార్గవుఁడు దీర్ఘానంతవిశ్లథ
హాసరేఖాదర్పితాస్యుఁ డగుచు
నెవఁడురా వాఁడు? లోకేశ్వరు కైలాస
పతి పరంజ్యోతి కపర్ది ధనువు
మర్దితముగాఁగ విఱిచిన మగతనంబు
కర్దమముగాఁగఁ బొంగిన కంధితరఁగ
యెవడురా యాతఁడు? ప్రమథపృతనకుఁ బడ
వాలు హేరంబునకు వెల్లబాటుజోదు

శా. క్రీడామత్సరుఁడైన నేను శరముం గీలించి క్రౌంచాద్రిలోఁ
గాడం దూసినఁ జెళ్ళ లూడి చెడు నక్కాలంబునం గూడ నీ
ర్ష్యాడింబోద్ధతి మాన దార్గ్మ్రగములం దా స్వామి కెవ్వండురా?
కూడం గన్నులవిప్పఁ దెచ్చెను ధనుష్కోటీవిభగ్నోద్ధతిన్ ౭౦౮

శా. అభ్యాసోన్నతిభాగజిహ్మగధురాహంకారతన్ నేనుఁగా
బిభ్యత్షణ్ముఖవిఘ్నరాజులను గంపింపంగఁ జేయంగ వా
ల్లభ్యం బొప్పగ నవ్వ తల్లిదగు ఫాలంబందు నీ నాఁటికిన్
క్షుభ్యల్లోకపలత్రాప్రణేతయగు నా క్రొవ్వాఁడి యెవ్వాఁడురా?

మధ్యాక్కర.
ప్రమథులు కైలాసనాథ పాదసంబంధమస్తకులు
ప్రమథులు కోపప్రభావపాటితస్వర్గ్యమస్తకులు
ప్రమథులచేత "నాః" ప్రకటరావమ్ము పల్కించినట్టి
యిముడఁజాలని క్షత్త్రబంధు వెవఁడురా? యెవఁడురా వాఁడు?

ఉ. ఎవ్వఁడురా? త్రిలోచను నహీనమహాధను వెత్తి చేతఁ గ్రొం
బువ్వువిధాన దానిఁ బలుముక్కలు సేయఁగ సాహసింపఁగాఁ
గ్రొవ్వినవాఁడు వాని చుఱుకున్ దెలివిం గని సంతసించుచున్
నవ్వినవాఁడు మత్పరశునవ్యమహాగ్నులపాలు చేసెదన్

చ. ఇరువదియొక్కమాఱు ధరణీశుల మస్తము లూచకోఁతగా
నరకి తదీయరక్తము లనంతము లేఱులుగా స్రవింపఁగా
గురువులకున్ యథావిధిగఁ గొండొకలోటును లేక తర్పణం
బరయ రచించి మండెడు మహాగ్నుల మధ్యమునందు దూఁకెదన్

చ. మరల నికొక్కసారి యిదె మానవనాథుల కంఠసీమలన్
దొరలెడు రక్తబిందువులతో నదులై ప్రవహింపఁ జేసి త
త్సరిదసృగంబుపూరముల స్నానములాడి త్రిలోకనాథుఁడౌ
గురుఋణ మేను వీగెదను కూడి పితౄణము తోడిపాటుగన్

గీ. మఱల నిదె యొక్కసారిగా మానవేశ
సతుల గళసూత్రముల్ తెగి జారిపోవ
నేడ్వఁగావతెఁ గాకమ్ము లెగురవల్లె బు
రములపైఁ బిండుగట్టి పిండములకొఱకు

గీ. అని విజృంభించు భృగురాము నంజలించి
రాముఁడను మీరు భార్గవరాము లగుట
దెలియవచ్చెను దాశరథిని రఘుకుల
రాముఁడను మానికులచంద్ర! ప్రాంజలింతు

మధ్యాక్కర.
ఎవ్వఁడు ప్రమథులనేత హేరంబు హ్రీంకారి యయ్యె
నెవ్వని కతమున స్వామిదృక్తతి యింతగా విచ్చె
నెవ్వఁడు శివఫాలవిధృతిహేతువై యెగసెనో వాఁడు
క్రొవ్వి శివద్రోహపథము కొన్నట్టి కోడీఁడు నేను

మ. అన గంభీరమనోజ్ఞమేఘనినదవ్యాహారమై కర్ణరం
ధ్రనితాంతామృతసేచనంబయి హృదంతఃప్రాణసంతోషణ
స్వనమై భార్గవరాముఁ డున్నతభుజాస్తంభప్రమాణాకృతిన్
గని శ్రీరాముని దృప్తనేత్రహిమరుక్కల్పాభిరామాకృతిన్

గీ. అంతమైన యౌద్ధత్యంబు నంతమైన
వికటచంక్రమణంబును విరిసిపోవ
మఱల నాసీనుఁడై మృదుతరసుహాస
వదనుఁడై బాలరాఘవు వలనఁ జూచి

సీ. నీవటోయీ యోయి! నెట్టికనీల! నీ
వా? శైవధనుసును వంచినావు
నీతాఁకినంతనా? నిగుడు రుద్రధనుస్సు
వెదురుబద్దయు వోలె విఱిగిపోయె
నేలాగు విఱిగెనో నీలకంధరు మహా
ధనువు చెప్పుము నేను వినవలతును
బనిబూని విఱిచితివా! తాఁకి నంతనే
విఱిగెనా? మంజూష వెలికిఁ దీసి
పూనితవ? యెక్కుపెట్టితివా? నితాంత
మైన జ్యావల్లి సంధితమైనదా? యె
దీ! కథారీతిఁ జెప్పుము తిగిచినట్టి
యమ్ము నే లక్ష్యమును దాఁకి వమ్ముచేసె

వ. అనిన శ్రీరామచంద్రుం డిట్లనియె ౪౨౦

మధ్యాక్కర.

చేతిలోఁ బూని జ్యా కోటిఁ జెందింపఁ జెట్టంతవిల్లు
చేతిలో నొదుగునా? లక్ష్యసిద్ధి కజిహ్మాగ మెత్తు
ఈ తీరు? మంజూషనే రహించిన యీ పెద్దవిల్లు
చేత లాగితిని గాబోలు చేతిలో ఛిన్నమై విరిసె

క. ఆమాట వించు భార్గవుఁ
డేమీ! యేమీ! కపాలభృద్ధనువున నీ
కేమి నిరాదృతి? నీ వా
స్వామి ధనుసు చూచునంత పాటికి లేదా?

సీ. చూడనే లేదు మంజూషలోపలి విల్లు
పాణిపద్మంబులఁ బట్టలేదు
సంధింపనే లేదు శరము లక్ష్యమె లేదు
తీసి కర్ణముదాఁకఁ దిగియలేదు
విల్లేమొ ముక్కలై విఱిగిన దేమిలో
కాద్భుతకర్మము నాచరించి
తిది యచింత్యమ్ము సుమ్మీ! బాలకాకుత్స్థ!
నీ వీర్యము జగత్త్రయీవిభేది
యందుకనియే జగమ్మున నాడినట్టి
యాతఁ డాడక యాడెడు నద్భుతముగు
త్వన్మహాబలశాలిత తగును తగును
రాఘవా! నేత్రగోళతర్పణము వీవు

శా. ప్రాఁజీరంబలె విచ్చిపోయెను ధనూరాజంబు మంజూషలో
గోఁజాడం బనిలేదు వేఱ ధనువుల్ ఘోరంబు నేఁ దెచ్చితిన్
నేఁజెల్లా యిది యెక్కువెట్టి శరముల్ నింపన్ వలెన్ నించినన్
నేఁ జూతున్ భవదీయశౌర్యవిభవానేకక్రియావైఖరుల్

క. అప్పుడు వీర్యశ్లాఘ్యున
కొప్పుగ నే ద్వంద్వయుద్ధ మొసఁగెద నీకున్
దెప్పరము ధనువు గుణమును
గొప్పున సంధించి యమ్ముఁ గూర్చి విడువుమీ

వ. అనినంత దీనవదనుఁడై దశరథుండు ప్రాంజలించి పరశురాముం
గాంచి యిట్లనియె

మధ్యాక్కర.

హారి రుద్రధనువును నిజము పుచ్చెఁ గాబోలు లేకున్న
విరియునే? పసివానిమీఁదఁ బెట్టి యీ వేరంబు నీవు
జరిగింతువే? యుభయంబు సంధింపు జమదగ్నితనయ!
యరయంగ నీ దయాధీనమైనది యస్మత్కులంబు

వ. అంత వశిష్ఠుం డిట్లనియె

మధ్యాక్కర.

ప్రభువులు స్వాధ్యాయపరమపండితుల్ భార్గవుల్ వారు
ప్రభవులుగాఁ బుట్టితివి పండితవంశమ్మునందు
ఋభురాజుసాక్షిగా శస్త్రమే త్యజియించితి మాని
సభలోన నాఁడు నీ కిపుడు శస్త్రంబు సంధింపఁ దగదు

వ. అంత జనకుం డిట్లనియె

మధ్యాక్కర.

క్రోధంబు త్యజియించి యెల్లక్షోణియు క్షోణిదేవతకు
సాధువై కాశ్యపునకును సద్దానసత్కర్మ నిచ్చి
యీధాత్రి విడి మహేంద్రగిరి కృతకేతనేచ్ఛుఁడై వచ్చి
సాధింతు వేఁటికిఁ దిరిగి క్షత్త్రిసంక్షయదురాగ్రహము?

వ. అనిన లక్ష్మణుం డిట్లనియె

మధ్యాక్కర.

ఈవిల్లు విఱుచునయేని యేఁ గూఁతు నిత్తు నటన్న
యీ విదేహాధిపుప్రతిన యెన్నఁడో యెన్నఁగా నాఁడు
రావలెఁ గోపమ్ము నాఁడు రావలె రాజులమీఁద
నీ వచ్చు టేటికి? నిప్పు డేటికి నిట్టి యుద్ధమ్ము

వ. అనుచున్న యందఱ నిరాదరించి పరశురాముండు రాముని దిక్కు
మొగంబై నంత దశరథుండు భార్గవా! పసివాఁడు రాముండు లేఁడు
మేమెవ్వరము లేమని కేకవెట్టి చదికిలఁబడి చైతన్యంబు వాసియుండె;
విశ్వామిత్రుండు పల్కక దూరంబునంద నిలుచుండి చూచుచుండె

ఆ. అంతఁ బరశురాముఁ డాభిముఖ్యముగాఁగ
బాలు రామచంద్రుఁ బల్కరించి
యోయి శిశువ! కావ! యోయి దుర్ధరుఁడా!
శైవ మిదియు రెండు జంటవిండ్లు

వ. ఈ రెండుధనుస్సులును శ్రేష్ఠములు దివ్యములు లోకాభివిశ్రుతములు దృఢములు బలవంతములు ముఖ్యములు విశ్వకర్మచేత సుకృతములు

మధ్యాక్కర.
నీ విఱిచిన యట్టి విల్లు నీహారనిభృతాంశుమౌళి
కై వేల్పు లిచ్చిరి త్రైపురాశరప్రాణదాహమ్ము
నా వింటితోఁ జేసె దేవుఁ డా వింటి దగు జోడువిల్లె
యీవు వంచి శరమ్ముగాని యెక్కిడు మిద్ది వైష్ణవము

క. అది యిది సమానసారము
లది యిదియుఁ గపాలివిష్ణుహ స్తద్వయశౌ
ర్యదశాభాజనములు నీ
విది వంచినగాని నిన్ను నెఱుఁగను వత్సా!

క. తొలినాఁటికి దేవతలకుఁ
గలిగెను సంశయము నీలకంఠుఁ డధికమా?
జలజాతనేత్రుఁ డధికమ?
తెలియఁగవలె నంచు బ్రహ్మదేవుని నడుగన్

మధ్యాక్కర.
ఆయనకుం గూడ నెఱఁద నా సంశయమ్మే ఘటిల్లి
పాయక హరునకు హరికిఁ బడనట్లు వైరమ్ముఁ దెచ్చె
నా యిద్ద ఱొక్క రొక్క రాహవంబందు నిర్జింప
నీ యిరువిండ్లనె యెత్తి యెత్తిరి యేచి యుద్ధమున

క. త్రిపురాసురహననజనిత
విపులబ్రహ్మఘ మంటి వివిధాసురబా
ణపరంపరాగ్నిఁ జూడి య
త్రిపువిడుదలవేళ ధనువు స్తంభించినచో

చ. పరశివదేవుఁ డా ధనువుపైఁగల కోపముచే విదేహభూ
నరపతి దేవరాతుఁడు గొనంజనుఁ బొమ్మని పాఱవైచె నా
శరములతోడ నేఁటికిని శైవధనుస్సు విదేహులిండ్ల నీ
కరమున శీర్ణమౌటకును గాదటవే మిగిలెన్ గుమారకా!

క. శివుచేతి విల్లు బిగియుట
శివుఁడున్ గోపంబుచేత జృంభితుఁ డగుటన్
శివుకంటె నధికుఁ డని కే
శవుఁ డూహించిరి సురాళి స్వల్పతరమతిన్

మ. తనకుం బ్రాణముకంటెఁ బ్రాణమగు నద్దేవంబుతోఁ బోరు తె
చ్చిన చాపంబునఁ గోపభావమున నా శ్రీనాథుఁ డావిల్లు గై
కొని పొమ్మంచును భార్గవుండగు ఋచీకుం బిల్చి యిచ్చెన్ ధను
స్సును నస్మత్పితృగేహవీథులనె నిల్చున్ నాఁటికిన్ నేఁటికిన్

వ. ఆ ఋచీకుండు మా తాత, యా దివ్యధనువు మా తండ్రియగు జమదగ్ని కిచ్చె; మా నాయనమ్మ సత్యవతి మీ విశ్వామిత్రుని యప్పగారు క్షత్రియ; మా యమ్మ రేణుకయు క్షత్రియయే

క. నే నచ్చముగాఁ బాఱుఁడ
గాను సుమీ క్షత్రరక్తకాండమ్ములు నా
మై నరములఁ బ్రవహించున్
శ్రినిభృతమనోజ్ఞహాసచిత్రితవదనా!

వ. అంత మాహిష్మతిరాజు కార్తవీర్యార్జునుండు మత్పితృద్రోహంబు సేసిన

క. ఈవింటి కొప్పాతుదలన్
భూవిభుసైన్యంబు నఱికి ప్రోవిడితిని నా
నావసుధేశులఁ దగు దు
ర్భావ మిరువదొక్కమాఱు రాచితి శిశువా!

వ. నీ వా కథఁ జెప్పుమందువేనిఁ జెప్పెద ననిన శ్రీరామచంద్రుండు శిరసువంచి మందహాసమ్మున ననుమతించినఁ బరశురాముం డిట్లు చెప్పఁదొడంగిన లక్ష్మణుండు సమీపించి వినుచుండె ౮౫౦

చ. మృదునివిధాన నా జనకుఁ డేఁటును మా వనసీమ నుండఁగా
నడవికి వేటకై చనిన యర్జునుఁ డెంతయు శ్రాంతిఁ గూరి డీ
ల్వడిన చమూసమేతుఁడయి వచ్చె మదాశ్రమవీథికిన్ గడుం
గడు నతిథిక్రియామధురగౌరవముల్ బొనరించెఁ దండ్రియున్

క. మా యాశ్రమస్థధేను వ
మాయకురా లచ్చమైన మన్ననచేతన్
నేయియుఁ బెరుగును నన్నము
వాయలుగాఁ దినఁగ నిచ్చె వానిచమువులన్

గీ. విభులు తిన్నంత తిని పారవేసినంత
వేసి గట్టునఁ ద్రేఁచిన పృథ్వీపతియు
పృథ్వీపతి సైన్యమును నది యేమి పోవు
కాలమో? కృతఘ్నత కైన కలుష మెంతో?

గీ. ఆవునకు మేలువడి జమదగ్నిఁ గాంచి
మౌని! యీ నైచికిని నీవు మా కొసంగు
మన్న; వారు నిచ్చుట లేదటన్న; రాజు
నెగచి నవ్వి నీ విచ్చున దేమి? యంచు

మ. కనలుం జూపులు వెక్కిరింతలుగ నా క్ష్మానాథుఁ డీ బోడిబా
పని కా వెందు కటంచుఁ దోలికొని పోవన్ ధేను వంభారవం
బునఁ దా నిగ్గుచు నావటిల్లఁగ శిరంబున్ వంచి మా తండ్రి చే
యున దేమో తెలియంగరాక శిలయై యుండంగఁ దా నప్పుడున్

క. నే నప్పు డింటిదగ్గర
లే నడవికి నేగితిన్ మలీమసకృత్య
స్థానమున నేన యుండినఁ
బోనిత్తునె యింటియావు పొగులం గంచున్

క. అది పిచ్చి యోయి రాఘవ!
మదించిన నృపాలకులకు మహితగుణగణా
స్పద మేదియైన రాజులు
గద రత్నగ్రాహు లంచుఁ గబళించుటలున్

క. దర్భలు సమిధలు శిరమున
నిర్భరముగ మోసికొంచు నే నిలు సనఁగా
నర్భకుఁడ! యెందుఁ బోయితి?
దుర్భరుఁ డగు రాజు పెయ్యఁ దోలికొనిచనెన్

క. మీ తండ్రి యేమి సేయును
దాతా! నేనేమి సేయఁ దగుదును ధరణీ
నేతను సైన్యముఁ గాదన
నాతఁడి మము నిలువనిత్తురా? ప్రాణముతో

గీ. అనుచు మాతల్లి యేడ్చినయపుడు నాకు
నెంతకోపము రావచ్చు నీవె చెపుమ!
న న్నుఁడక యెల్లఁ గోపిష్ఠుఁ డన్నమాట
యాడెదరగాని యా ద్రోహ మగునె చెపుమ!

వ. అంత నేను మా పూరిగుడిసెలో నటకపైనున్న యీ ధనుస్సు దీసి
బూజుదులిపి పులిగాపు పెట్టి

గీ. తిన్నయన్నంబు జీర్ణించుకొన్నయంత
సేపు లేదో కృతజ్ఞత నీ! యటంచు
ధనువు నమ్ములుఁ బరశువు దాల్చి యంత
నేను మాహిష్మతీపురి కేగినాఁడ

క. అడ్డము వచ్చిన వారల
గొడ్డలితో నఱకి రాజకూటము చని పే
రొడ్డోలగంబుఁ దీర్చిన
దొడ్డదొరం గాంచి యావుఁ దోలఁగ నడుగన్

చ. కడుఁ గనలేచి కన్నులను గ్రై విలు గొడ్డలి పూనివచ్చి నీ
వడిగినమాత్ర నిచ్చుటకె యావును దెచ్చితిఁ బొమ్ము మూర్ఖుఁడా!
చెడెద వనంగ వానివెయిచేతులు గొడ్డలి గాట్లు కొట్టితిన్
విడువక యాతఁడున్ గనలువెంచి రథంబున బాణతూణియై రఁజర

మ. ఎదురై నిల్చిన ఘోరసంగరమునం దే వాని వేఁజేతులన్
మొదళుల్ బోదలుగాఁగఁ గొట్టితి భుజామూలంబు మొండెంబుగా
నది కైకోక యతండుఁ బర్వాఱినపీనై పైకిరాఁ గొడ్డటన్
జదియంజేసితి దచ్ఛిరంబు శతధాసంశీర్ణఖండంబులై

మధ్యాక్కర.
గొడ్డంట నర్జునుపొగరు కోదండకోటినిష్ఠ్యూత
ముద్దీనశరపాళి వాని యుదగ్రసైన్యోద్ధతి నార్చి
గిడ్డిఁ దోలికొని యింటి కరిగిన నన్నుఁ గీర్తించెఁ దల్లి
గడ్డ నేలెడు రాజుఁ జంపఁ గాదని కలఁగె మా తండ్రి

క. ఏ పాపమొ తెలియదు క
ట్టా! పెయ్యను దోలికొంచు నరుగునె యింటన్
సాపడి కృతఘ్నతాభర
మోపదుగద నరకమైన నోయి రఘుసుతా!

గీ. అయిన దేమొ యయ్యె నంతతో నూరకు
న్నారె? కార్తవీర్యు లౌర! యర్జు
నాత్మజులును దశసహస్రులు సనుదెంచి
యేను నింట లేమి యెఱిఁగి వచ్చి

క. మా గిడ్డిఁ దోలికొని చన
సాగనుఁడగు తండ్రి నేను జంపితి వానిన్
మా గురువు వారి గిడ్డిని
లాగి బలిమిఁ దెచ్చెనా? బలంబుమదమునన్

మధ్యాక్కర.
కన్నులు మూసి సమాధిగతుఁడయి కైవల్యబుద్ధి
నున్న మా తండ్రి మస్తకము నురియాట నుడుకు మాయమ్మ
మున్నుగాఁ బఱపఱఁ గోసి ముష్కరుల్ పోయిరి తల్లి
నన్ను రామా!రామ! నాయనా! నాయనా! యంచు నేడ్వ ౪౭౦

చ. ముసరుచు వచ్చు నార్తరవముల్ విని తల్లిగళంబు పోల్చి సా
ధ్వసమున నైన యాపిలుపు వచ్చుచు నాశ్రమవీథి లెక్కిడన్
గొసరుగ నిర్వదయ్యెఁ; నదిగో నృపలోకము నన్నిసార్లు వె
క్కసముగ నూటిపోసితిని ఖడ్గపరశ్వథబాణవహ్నులన్

క. నీ కడుపునఁ బుట్టెద మ
య్యా! కోపీ! జామదగ్న్య! యను ప్రార్థనలున్
నా కడుపుచుంటలోపలఁ
గైకో లే దమ్మ దీనకంఠస్మృతిలో

విచికిలితము.

పొదివి పొదివి నృపులతలలు పుణికి పుణికి నఱికి స
మ్మద ౹౹౹ ముదము నెడఁదఁ గదుర మలఁగి మలఁగి గురునకున్
గుదురు కలుగ జలము వదలి కొసకుఁ గినుకతొలఁగితిన్
వదలి ధనువు జగ మఖిలము వదలి యెచటొ యరిగితిన్

శా. తాదృక్శాంతిపరున్ ననున్ విదళితత్ర్యక్షాశుగాసంబుగా
నీ దోర్దండము పిల్చె యుద్ధమునకున్ నీవెంత వీరుండవో?
కాదా యీ ధను వెత్తి యొత్తి శరలక్ష్యంబేయు మేఁ జూచెదన్
దోదుమ్మిన్ విదలింపుగా శివధనుర్దోర్భీ! రఘూత్తంసకా!

క. అప్పుడు వీర్యశ్లాఘ్యున
కొప్పుగ నే ద్వంద్వయుద్ధ మొసగెద నీకున్
దెప్పరము ధనువు గుణమును
గొప్పున సంధించి యమ్ముఁ గూర్చి విడువుమీ!

వ. అనినంత శ్రీరామచంద్రుం డిట్లనియె

మధ్యాక్కర.

నీ కర్మ లోకాద్భుతంబు నీవలె నృపలోకమెల్ల
సాకుగా నిర్వదియొక్క సారులు చంపంగ నగునె?
చేకొని తలచినయంత చేయంగఁ జేవయు వలదె?
కాక నీకింత కోపమ్ముఁ గలిగించు గారణం బుండె ౪౨౭

చ. అది యటులుంచి వైష్ణవశరాసన మియ్యది యెక్కుపెట్టినన్
వదలిన బాణ మెప్పుడును వ్యర్థముకాని ప్రతిజ్ఞ నాకు ను
న్నది శివచాప మక్కతమునం గల మందసమందె యమ్మ లే
నిది విదలించితిన్ బరిగణించి వచింపుడు మీరె నాకనన్

వ. పరశురాముం డిట్లనియె

మధ్యాక్కర.
నీ వెక్కుపెట్టెదవేని నీ క్రింద నే నోడినట్లె
యీవల శరమేయు టెందొ? యప్పటి యీమాట చూతు
శ్రీవైష్ణవము మహాధనువు చేతి కిచ్చెదను గైకొమ్ము
నీ విశ్వమోహనకరము నిగిడించు నీరదాకార!

క. అనుటయు ధను విచ్చుటయును
ధనువు రఘూత్తంసకమ్ము తాఁ గొనుటయు నొ
క్కనిమేషంబున జరిగెను
ధనువు తుదంబడి యొకండు తా దీపితమై

శా. శంఖస్వచ్ఛముగా సుదర్శనమహాచండాంశుసంఘర్షిగా
ప్రేంఖాగారుడపక్షపుచ్ఛనిబిడశ్రీకాంతిగా వెంబడిన్
న్యాంఖోదారనినాదమేదురముగా నుద్భ్రాంతిగా నై ధనుః
పుంఖంబుంబడి తేజ మొండు వెలిగెన్ మున్నంచి వెన్నంచియై

క. ధనువుఁ గొనినంత రాముని
కు సనంతానంతకల్పఘోరతపస్సం
జనిత మగు శక్తి తనదగు
తనువునఁ గల్గినటు తోఁచెఁ దత్కాలమున

క. తన సంపాదించిన పు
ణ్యానితాంతాభినవజగము లన్నియు వడి జా
ఱినరీతిఁ దోఁచె భార్గవు
తనువున మనసున నితాంతతాపము గలుగన్

కమలనగీతి.

ధనువుఁబూను రామచంద్రుఁ దర్శనంబు చేయఁ
జనిరి సర్వదేవతలును జలజసంభవుండు
ధనువుఁ బూని రాఘవుండు దానిగొనము చేత
నినిచి జ్యానినాదమునను నించె సర్వధాత్రి

శా. నృత్యన్మంజులతారహారకబరీనిష్యందిముక్తామణి
ప్రత్యగ్రప్రసవాళిసంకలనదివ్యత్కంధరాభేదసా
హిత్యప్రౌఢనవాప్సరోనటనసౌహిత్యప్రశస్తచ్ఛదృ
గ్గీత్యాకారమనోజ్ఞమై ధనువు ప్రోఁగెన్ స్వర్గలోకంబులన్

వ. అంత శ్రీరామచంద్రుండు బాణంబు సంధించి భార్గవుం జూచి

మధ్యాక్కర.

బ్రాహ్మణుండవు నిన్నుఁగూర్చి బాణంబు పరగింపరా ద
జిహ్మాగమ్మున నీ పదంబు ఛేదింపఁ జింతింతునొండె
బ్రహ్మలోకము లీవు ఘనతపంబునఁ బండించినవి య
జిహ్మాగంబుల నుగ్రశరముచేతను ఛేదింతునొండె

మధ్యాక్కర.

గాధిసంతతికిని నీవుగాని దగ్గరచుట్టమవును
సాధించి యద్దాన నిన్నుఁ జంపంగఁజాలను నేను
వేధించి నీపాదములను విశిఖమ్ము విడువుమం చనెదో?
సాధుభవత్తపోలోకసంతానసంహార మనెదొ?

మ. అనినన్ భార్గవరాముఁ డిట్లనియె దేవా! సర్వధాత్రిన్ జిరం
తనుఁడౌ కాశ్యపుచేతిలో విడచి పాథఃపూర్వమే నుండ నా
యన యీ ధారిణియందు న న్నిలువరా దం చానవెట్టెన్ మహా
త్మునియాజ్ఞంబడి నే నిటన్ నిశలయందున్ నిల్వ నేవేళలన్

క. నే నెంత చెప్పికొన్నను
మానుగ నీ క్షత్రియాభిమానము పో దే
మైనను శరీరగత మభి
మానము చెడ్డదిగదయ్య మధుహున కేనిన్

గీ. కాశ్యపుప్రతిజ్ఞ కృతమయ్యెఁ గాన స్వామి!
పాదములయందుఁ గొట్టకు వాసుదేవ!
యే మనోజవమ్మున నిల్చె యేగుదును మ
హేంద్రగిరికందరాశ్రమ మింతలోన

మధ్యాక్కర.
కేవలము తపస్సుచేత గెలిచిన కీర్తిలోకములు
నీవు ఛేదించుము జాగు నీకు గానీ సుంత తగదు
నీవు చే విల్లందినపుడె నీవు శార్ఙ్గినటంచు నేను
భావమం దెఱిఁగితిఁ బద్మపత్రశోభా నేత్రయుగళ!

క. నీచేత నోటుపడుటఁ ద్ర
పాచపలత లేదు నాకుఁ బద్మదళాక్షా!
వీచీమనోజ్ఞమృదుతర
లోచనకాంతులు సురావళుల్ గనుగొంటె!

మధ్యాక్కర.
వదలుము శరము మహేంద్రపర్వతప్రత్యంతధాత్రిఁ
గదలుదు నేను మనోజ్ఞకల్హారకమనీయనేత్ర!
వదలుము శరమన్న వదలె బాణంబు బాలరాఘవుఁడు
కదలెఁ బరశురాముఁ డంత గమనవేగచటులమూర్తి

క. ధృతి నేగు భార్గవునకును
దతధనువును బూనియున్న దాశరథికి వ
ర్ధితజామదగ్న్యతపసా
ర్జితలోకము లెల్ల మంటచేఁ గనిపించెన్

సీ. అంతట విశదము లయ్యె దిక్సంతతి
విదిశలు స్వచ్ఛమై వెల్లపాఱె
సురలును ఋషులును స్తోత్రముల్ చేసిరి
రవివంశమార్తాండు రామచంద్రు

భార్గవుఁ డేగిన పథమెల్ల రామనా
రాయణ తేజోమయాకృతిన్ బ్ర
దక్షిణించుచుఁ బోవు దర్శనమయ్యె స
ర్వర్షి సంఘమునకుఁ బ్రధ్నరోచి
రథ్యములయందునను న్యాంఖరావ మొప్పె
వాయువీథులయందున వఱలి వఱలి
ప్రబలు వైదేహుసభలోన వానకురిసి
వెలసిన ట్లయ్యె లేయెండ విరిసినట్లు

వ. అంత లక్ష్మణుండు దశరథుంగని మహారాజా! పరశురాములు వెడలి పోయిరని చెప్పిన దశరథుం డాగతసంజ్ఞుఁడై రాముని గవుంగిలించి కొని మూర్ధంబు ముద్దాడి

మధ్యాక్కర.
కల్యాణపీఠంబుమీఁద గండంబు గడచివచ్చితివి
శల్యంబు ప్రోథఘాతమ్ము చదు రదృష్టమున నొడ్డితివి
కల్యాణరామ! నా గర్భకంపంబ! కన్నారి తండ్రి!
బాల్యంబునందె గండములు పాసిపో బ్రదికినబిడ్డ!

క. అని సర్వాంగంబులు దృ
ష్టినిపాతార్ద్రమ్ముగాగఁ జేఁ దడుముచుఁ బొం
దిన యానందవశంబునఁ
గనుగొన లానందబాష్పకంబులు తేఱెన్

ఉ. బంధువులెల్లఁ గూడికొని బాలుని రాఘవు సంస్తుతింపఁగా
బంధురకీతి నవ్వి రఘుబాలుఁడు భార్గవుచన్న త్రోవ రో
మాంధువులందుఁ బుల్కలగునట్లుగఁ గాంచి నిజంబుగా దయా
సింధువు భార్గవుండు ననుఁజేసె నకారణవీర్యవంతునిన్

మ. అనినన్ బంధులుచూచి నీవు పటుబాహాశౌర్యవారాశి వా
యన నీ ముందట నిల్వఁజాలక కదా యారీతి జేజేలు వె
ట్టెను నీహేతువుగాఁగ నేఁడు పొడకట్టెన్ క్షత్త్రశౌర్యంబు పో
యిన యా గౌరవమెల్లయున్ మఱలఁగంటే! యెంతయౌన్నత్యమో!

మధ్యాక్కర.

లోకంబునందు రాజన్యలోకంబు లోకువై పోయె
నే కదా! భృగురాము నామ మింత యెందేని విన్బడిన
నీ కతంబున నింకను తలలెత్తి యెందేనియుఁ దిరుగ
మా కయ్యె నో రామచంద్ర! మన్నించి మా దెసఁ జూడు

క. అనినంత రామచంద్రుఁడు
కనుఁడీ! భార్గవుని నేనుగాని గెలచినా
డనె? ద్వంద్వయుద్ధ మాడెనె
నని యాడెనె? యాడెనేని నప్పుడు గెలుతునే?

క. ఆయన సర్వాస్త్రవిదుం
డాయన పటుబాహుశాలి యా యమ్మున కే
లో యొదిగినట్లు చూపెను
శ్రీయుతుఁ డా మాని యేమిచేతము కలఁడో?

వ. అని భార్గవుండు చన్నదిక్కు తిరిగి నమస్కరించిన

గీ. శుభపరంపరాకళ్యాణసూచిమధుర
మధురమధురస్వరంబుగా మక్కళించి
దశశతధనుష్మదుగ్రసంధానచాప
గుణనినాదంబు పేర్చి దిక్కులను నిండె

గీ. బాలరాఘవహస్తసంబంధచలన
కలనపలనానినాదోగ్రగగనపథవి
సారిశైవవైష్ణవధనుర్జ్యాప్రతిస్వ
నమున దిగ్దిగంతములును నద్ధమయ్యె

శా. దర్పస్వీకృతహాససంశ్లథనరుంధద్దుష్టవాగ్ధోరణీ
సర్పద్వీరచమూపథశ్లథనమై స్రంసత్కటీశాటికా
కూర్పాసప్రకటోగ్రసాధ్వసవధూగుర్విణ్యాభద్రాఢ్యమై
దర్పాడంబరమై ధనుస్సు మొఱసెన్ దైతేయలోకంబులన్

## ఖండాంతము

గీ. ఇది ధనుష్ఖండ మాత్మేశ! మదన మద న
మనదృశాగ్నిక ! నీ కృపామహిమఁగనుత
చంద్రమౌళిభూపతియశస్సాధువుగను
మచ్ఛివోహమ్మతి తపోభిమర్శముగను

ఉ. ఆదిని బంధహేతు వయినట్టివి సంగతమోహకోపకా
మాదులు త్రుంచికొను నిను న్నాశ్రయ మంది త్వదర్థమైన నీ
వాదములం దగుల్కొనుచు వాదసమాగతమోహకోపకా
మాదులచేతఁ గట్టుపడునట్టులఁ జేయకువే! మనఃపతీ !

మాలిని.

ఉపనిషదుదితోక్తివ్యూహనానాభిధానా !
తప ఉదితప్రమాభాక్తత్త్వ తేజోనిధానా !
నిపుణమతివచోనిర్ణీతవేద్యైకమూర్తీ!
వపురమలినచాంద్రీభావపీయూషవర్తీ !

# కళ్యాణ ఖండము

క. శ్రీసదసంలక్ష్యక్రమ
 భాసితజాయాసమూహపర్యసనన్నా!
 శాసితహృషీకధీధా
 రాసితసంవిత్కళాంకురసముత్పన్నా!

మధ్యాక్కర.
 ప్రాణంబులందున సర్వభారంబుఁ బాసి తేలికగఁ
 దూనీఁగవలెనైన మేనితోఁ బ్రేమతోఁ గాంచి జనకు
 సానందపరిణయసాధుసామ్యాఖ్యసంభాషణముగఁ
 బూని వశిష్ఠులఁగూర్చి భూపతి ముగ్ధుఁడై పలికె

మ. భగవంతుండు వశిష్ఠుఁడీకులమునన్ బ్రత్యక్షదైవంబు వా
 రుగ సర్వంబునయందు నాథులయి తీర్పన్ సర్వకార్యంబు నే
 మిగ నిగ్గాధిసుతుల్ వచింపఁదగుఁ గర్మిష్ఠుల్ మహర్షుల్ వచో
 నిగముల్ చెప్పఁదగున్ వశిష్ఠులె ప్రమాణీభూతులౌ యంతటన్

వ. అని దశరథుండు తూష్ణీంభావ మవలంబించిన వశిష్ఠులు శతానం
 దుని జనకరాజుం గాంచి కన్నులంను నవ్వుచు నిట్లనిరి

క. మిథిలాశృంగాటకములఁ
 బృథులంబగు విషయమట్లు వినఁబడియెడు శ్రీ
 మధురాకృతి సీత ధరకు
 మధుసూదనురాణి వచ్చి మన్నించినటుల్

క. మధురాకృతి మా రాముఁడు
 మధుసూదనుఁడౌనొ కాదొ మధుసూదను నం
 శధురాఖ్యాతుని భార్గవు
 నధరీకృత తేజుఁ జేయు టది యద్భుతమే

మ. మది నీ ధైర్యముచేత మీగృహముల౯ మన్నించు లక్ష్మి౯ రమా
స్పదుఁడౌ మా పసివానికోస మయి యభ్యర్థింతు మిల్లాలుగ౯
విదితంబైన ధనుర్వికర్షణకళావిస్ఫారగర్వంబు లే
దిదియుం జూడుఁడు వంశగౌరవము నీ సృష్ట్యాదిఁ బూపాద్యము౯

క. తదనంతరు లోకోత్కర్కరి
మొద లిట్లని తెలియవచ్చు మొద లిట్లని యే
మొదలి వెలుంగునకును వెల
యదో యా బ్రహ్మకు మరీచి యాత్మజుఁ డయ్యెన్

వ. కాశ్యపుఁడు మారీచి; వివస్వంతుండు కాశ్యపుఁడు; వైవస్వతుఁడు మనువును ప్రజాపతియుఁ నాయన గర్భ మిక్ష్వాకువు

ఉ. నా కులగౌరవంబు నవినాశ మయోధ్యయు రెండు రెండు ని
క్ష్వాకులనాఁటి వాయనసుఁ గలైను కుక్షి పయిన్ వికుక్షి శౌ
ర్యాకృతి బాఁణుఁ డల్లయనరణ్యుఁడునున్ బృథువున్ త్రిశంకుఁ డ
వ్యాకులభాగ్యుఁడైన యువనాశ్వుఁడు తండ్రిసుతుల్ నృపాలకుల్

వ. ఆ యువనాశ్వుఁడే దుంధుమారుఁ డాయనకు మాంధాత తన యుండు

గీ. ధర్మమతి యైనవాని మాంధాత వాఁడ
టన్న నానుడి గలిగిన యంతవాఁడు
ప్రభువు మాంధాతయు సుసంధి వాని యనుఁగు
బిడ్డ ధ్రువసంధియు సుసంధి పెద్దకొడుకు

వ. రెండవవాఁడు ప్రసేనజిత్తు; ధ్రువసంధికి భరతుండును భరతువ కసితుండును బుత్రికులు

క. హైహయులు తాలజంఘులు
నాహావదోహాలులు శూరు లలశశిబిందుల్
శ్రీ హరియింపఁగ నసితుఁడు
శ్రీహరిమతి మంత్రియుతుఁడు చేరె వనముల౯ ౧౪

వ. ప్రాలేయగిరికందరాగతుండు భృగుప్రస్రవణంబున వసియించు చుండ నతని యిద్దఱుభార్యలు గర్భవతులై కాళింది యన్నామెకు రెండవయామె సపత్నీమాత్సర్యంబున గర్భస్రావంబు నపేక్షించి గరంబుఁ దినిపించిన దుఃఖజర్ఝరహృదయుం డసితుండు కాలాంతర గతుం డయ్యె నపుడు

చ. చ్యవనుఁడు భార్గవుండు హిమశైలమనోజ్ఞవనీఝరీప్రియుం బవు నెడఁదం దపించుటకునై భృగుతుందమ్ముఁ జేరవచ్చినన్ సవతికి మత్సరంబున విసంబును బెట్టిన చాన పుత్త్రివాం ఛ వెలయ వచ్చి భార్గవునిసన్నిధిఁ జేతులుమోడ్చి నిల్వఁగన్

క. గరళకృతానారోగ్యో
ద్ధురతాపాండురశరీర తోయ్యలి కాళిం
ది రమణవియోగదుఃఖిత
తరుణీమణి చ్యవనమునిపదంబుల వ్రాలెన్

ఉ. ఓ చ్యవనా! దయాగుణపయోనిధి! నాబ్రదుకైనరాజు రా
జ్యచ్యుతుఁడై యసుచ్యుతుఁడునై సగరావిలగర్భ నాటకున్
విచ్యుతిఁ బొందె నన్నుఁగని వెక్కసమూ గరభుగ్నపిండ మో
యచ్యుత! యచ్యుతంబు నగునట్లుగఁ జేయవె! నే నెపైననున్

వ. అని లేవలేక ప్రాకుచు నాసీతదండకమండల్వాదిశుశ్రూషాపరయైన కాళిందిం గాంచి విప్రుఁడు చ్యవనుండు

క. తల్లీ! భయంబు పడకువె
మెల్లి యొకం డగుచు జగమునేలెడు సుతసం
పల్లాభమగుత నీకని
ఫుల్లసరోజాక్షుఁ డైన ముని వచియింపన్

ఆ. సవతి యిడిన గరళసహితుండు కాళింది
కాత్మజుండు గలిగె నతని సగరు
డనిరి యతఁడు వందయశ్వమేధంబులు
సలిపె భోగిజగతి జలధిఁ ద్రవ్వె

వ. అసమంజ సాంశుమ ద్దిలీప భగీరథు లతని వంశంబు

క. అవిరళవార్ధారాపా
తవిధై రావణకరాభ దైవతధుని శ్రీ
శివకపిలజటానిస్రుతి
యవని డిగె భగీరథప్రయత్నము గాఁగన్

వ. ఆపైని గకుత్థ్సుఁడు రఘువు పురుషాదకుఁడైన కల్మాషపాదుండు శంఖణుఁడు సుదర్శనుఁ డగ్నివర్ణుఁడు శీఘ్రగుఁడు మరువు ప్రశుశ్రుకుం డంబరీషుఁడు నహుషుఁడు యయాతి నాభాగుఁ డజుండు దశరథుండు క్రమంబుగఁ బితృపుత్రపరంపరయా రాజులైరి; వీరందఱు రాజర్షులు; ఆదివంశవిశుద్ధులు; పరమధర్ములు; వీరులు; సత్యవాదులు; ఇందు

సీ. ఇంద్రుఁడు మూఁపురం బెక్కించికొనియె నె
దై కకుత్థుని దైత్యహననకృతికి
యాచకుఁడైన బ్రాహ్మణునికోసము కుబే
రుని నిధు లెత్తించికొనియె రఘువు
యేకపత్నీవియోగాకులుండై త్రివే
ణీవాఃప్లుతిన్ మరణించె నజుఁడు
పౌలస్త్యుఁడైన రావణునితో నెదిరించి
దంగుళ్ళు గఱపించె దశరథుండు

దశరథునిగర్భశుక్తిముక్తాఫలములు
చిరతపస్సమాయాతవాంఛితఫలములు
మృదుహాసితమంజులాననామృతఫలములు
శౌర్యనిధులైన రామలక్ష్మణులు వీరు

వ. వీరిద్దఱికోసము నీ కుమార్తెల సీతోర్మిళల భవద్దత్తౌరసుల వరించుచుంటి నని వశిష్ఠుండు కూర్చుండిన

ఉ. అంజలిఁబూని తా జనకుఁ డశ్రుల సమ్మదబాష్పపూరముల్
గ్రొంజడిగాఁగ నిట్లనియెఁ గోరి పణం బిడినట్టి దాదిగా
నెంజిలిఁ గాంతు విల్విఱుచునేరము వెట్టి మృధార్థ మేగుదెం
చుం జమదగ్నిసూతి యనుచున్ మది నా నెగులుం దొలంగెఁబో

క. ఆ దిగులులోనఁ బరిణయ
మోదంబునఁ గొంత తఱుగు పుట్టకయుండన్
జోదు పరశ్వథరాముని
ప్రోదియుఁ జెడె మున్ను మున్న పొంగెదు శుభమై

ఆ. సర్గవేళ బ్రహ్మ సర్వావయవముల
మూర్తవములైన మునులు పుట్టు
వేళ బ్రహ్మప్రాణమూలనిర్గతి వెల్గు
శ్రీవశిష్ఠులకును జేయి మొగుపు

క. ఆయన యడుగుట కాదని
వాయియు వచ్చెడునె? యుభయవంశముల్ లసున్
నీయాజ్ఞ యాజ్ఞ యిదియును
మా యన్వయశుద్ధి చూడుమా? వచియింతున్

క. దిశలు తణగాము లెవ్వని
విశదంబగు కీర్తిసుధకు విదితపరమధ
ర్మశమదమాపాంపతి నిమి
వశి సత్త్వాధికుఁడు రాజు వఱలె నధికుఁడై

ఆ. ప్రథమజనకరాజు మిథిలావినిర్మాత
మిథి జనించె నిమికి; మిథి కుదావ
సుండు సుతుఁ డుదావసునకును నందివ
ర్ధనుఁ డతఁడు సుకేతుఁ గనియె ధర్మి

వ. ఆయనకు దేవరాతుఁడు మహాబలుఁడైన దేవరాతునకు బృహద్రథుఁడు రాజర్షియైన బృహద్రథునకు మహావీరుఁడు ప్రతాపవంతుఁడైన మహావీరునకు సుధృతి సత్యవంతుఁడైన సుధృతికి ధృష్టకేతుఁడు సుధార్మికుఁడైన ధృష్టకేతునకు హార్యశ్వుఁడు రాజర్షియైన హార్యశ్వునకు మరుండును బుత్త్రికులు మరుప్రతింధక కీర్తిరథులు కీర్తిరథ దేవమీఢమహీంధ్రకులు మహీంధ్రక కీర్తిరాతమహారోములు మహారోమ స్వర్ణరోమ హ్రస్వరోములు నేకపిండులు; ఆహ్రస్వరోమునకు మేమిద్దఱము పుత్త్రికులము; నేను పెద్దవాఁడను; నాతమ్ముఁడు కుశధ్వజుఁడు

గీ. నన్ను రాజ్యాభిషిక్తుఁ బొనర్చి చిన్ని
తమ్ము నా కప్పగించి మా తండ్రి వనము
లేగెఁ గాలక్రమంబున మా గురుండు
నిరవధికమోక్షసామ్రాజ్యనీతిఁ గాంచె

క. నా తమ్ముఁడు ధర్మధురా
స్ఫీతిఁ గుశధ్వజుఁ డమర్త్యవిక్రముఁడు ననుఁ
జేతస్సాధుతరసప
ర్యాతంద్రుఁడు సేవ సేయు నవసరమందుఁ

వ. తనసేనలతో మిథిల ముట్టడించి

క. సాంకాశ్యపతి సుధన్వుఁడు
శాంకర మగు ధను వయోనిజయు నిమ్మంచున్
గింకరులఁ బుచ్చె నా టక
టొంకనకున్ గాదు నావుడున్ బవరమ్మై

క. బవరమ్మున నిహతుండై
చివికె సుధన్వుండు తమ్ముచే సాంకాశ్యం
బవుపురి నేలించుచు నుం
డ విరించిసుతుండ వడిగినావు తనుజలన్

క. సీతను నూర్మిళ నిట మీ
భూతలపతిసుతుల పెండ్లములుగా నొసఁగన్
నా తమ్మునకును నాకు ని
దే తాత్పర్యము గ్రహింపవే! పరమేష్ఠీ!

వ. నా కూఁతుండ్ర నిద్దఱ ముమ్మాటికి మీ కిత్తునయ్య బ్రహ్మర్షీ!

మ. కృతగోదానులకున్ గుమారులకు తేపే యుత్తరాఫల్గునీ
గతమౌఁ బున్నెపుమూర్త మిచ్చెదము మత్కన్యాద్వయిన్ ధారణీ
సతిగర్భంబున కింత యోగ్యతమమౌ సంబంధ మౌనంచు నెం
చితినో తొల్లిటిభాగధేయములు వచ్చెన్ గుప్పలై తెప్పలై ౪౧

మ. అన గాధేయుఁడు నవ్వి మంచిది సెబా సన్నట్టి వాక్యంబులో
నన క్రోత్రథము తాఁకి వచ్చెడు నచింత్యం బప్రమేయంబు చూ
చిన నిక్ష్వాకువిదేహవంశమహిమ శ్రీ మీరునున్ మీరుఁ బొం
దిన గాధేయవశిష్ఠసౌహృదము పొందెన్ నూతనార్ద్రత్వమున్

ఆ. దర్భముళ్లవంటి తమ్మెలవారి ల
క్ష్మణుని రాము మిథిలమార్గమునకుఁ
గదలఁజేసినట్టి గాధేయుడను నేన
యింద యుండ నిచ్చి తెవరి నడిగి!

గీ. నాకుఁ దెలియును గష్టమ్మనాది ఫలము
శ్రీవశిష్ఠు లిట్టులె కయిసేసికొంద్రు
ఇచ్చినదియేమొ యిచ్చితి వినకులశిశు
యుగ్మమునకును ద్వాత్సతాయుగ్మ మిట్లు

గీ. తుల్యధర్మసంబంధులు దుల్యరూప
సంపదులు వీరు వారు నిశ్చయముగాఁగఁ
బూర్వదత్తము నర్థింపఁబోదు నెట్లు
నాకుఁ గ్రొత్తగా నిమ్ము మానవకులేశ!

క. దాశరథులు నలుగురు కకు
భీశసమానులు సుపర్వవిశ్రుతశౌర్యుల్
ధీశబలులు భరతుండును
నీ శత్రుఘ్నుండు నిద్ద ఱిద్దఱికి సముల్

క. మే మిచ్చెద మంటివి యం
దేమోను గుశధ్వజుండు నిచ్చుట యుండెన్
మీ మాండవి శ్రుతకీర్తియుఁ
జామ లగుట వలయు భరతశత్రుఘ్నులకున్

వ. ఏకత్రైకత్రాన్వయముచేతఁ గన్యాద్వయము నట్లే యర్థ మిచ్చు
నన్నంత దొర లందఱు మందహాసాననారవిందు లయిన నిము
సంబులో వశిష్ఠుండు గాధేయుని ముందుంచికొని జనకరాజుతో
మహారాజ! మా రాజపుత్త్రు లయిన భరతశత్రుఘ్నులకొఱకు మీ కుశ

ధ్వజరాజుకూఁతుండ్ర మాండవీశ్రుతకీర్తులను వరించుచుంటి నన
సభలో నందఱు నవ్వలై తెర వెనుక నంతఃపురస్త్రీల యుచ్చైర్హాసం
బయ్యె; నంత జనకుండు

ఆ. అపుడు గిరిజ నడుగ నరుదెంచినారు బ్ర
హ్మర్షు లస్మదీయ లైన సుతల
నడుగ నిపుడు గూడ నరుదెంచినారు బ్ర
హ్మర్షు లింక నేమి యనదు నాకు

క. విచ్చేయుఁడు బ్రహ్మర్షులు
పచ్చాకును వక్కఁగొనుడు బ్రహ్మర్షులు మే
మిచ్చెదము మాదు కూఁతులఁ
గ్రచ్చఱ ఋషివరులమాటఁ గాదనఁగలమే?

చ. తనువులు దాల్చియున్న సముదారతపంబులు మీరు వచ్చి యా
సనము నలంకరింపుఁడి! ప్రసన్నులు గందము వక్కలాకులుం
గొనుఁడి! యయోధ్యకున్ మిథిలకున్ మఱిమీరె ప్రభుల్ కుమార్తెలన్
గొనుటయు నిచ్చు టీ యుభయకోటికి మీరె ప్రమాణ మెచ్చటన్

వ. ఆపటిశుభలగ్నంబునందె నాల్గుముళ్లు పడనిండనిన దశరథుండు

గీ. తెల్లవడిన మీసంబులు చిళ్లలందు
నల్లవడినట్లు యువతాసనాథదృగ్వి
లాసముల గుండెలోని యుల్లాస మదుమఁ
జాలక కుశధ్వజుఁగాంచి జనకుఁ గాంచి

క. మీ రిరువురు ధర్మాత్ములు
మీ రిరువు రమేయగుణులు మీ రిరువురు ద్ర
య్యారోపితగుణరత్నాం
భోరాసులు మీరు మీరు పురుషోత్తములున్

గీ. సర్వఋషులు మీచేతను సర్వపూజ
లందినారలు మే మింక నాలయముల
కేగెదము సెలవిండని యెల్లవారుఁ
దోడితోడిం దమతమ విడిదులకుఁ జేరి

శా. ఆ సాయంతన మెల్లెడన్ మిథిలఁ దూర్యస్వానదీర్ఘీకృతా
భ్యాసంబుల్ సరిచారికాముఖసుహాసాంకూరముల్ చూతశా
ఖాసంపాదితకోకిలాలపనరేఖావైఖరుల్ మల్లికా
రాసుల్ కూడికగాని కూడిక రసబ్రహ్మంబు సౌందర్యమున్

ఉ. ఎక్కడఁ జూచినన్ రఘుకులేశుఁడు రాముఁడు సిన్నతల్లికిన్
బ్రక్కనఁ దోఁచుఁ గైకయికి భార్గవరాముని గెల్చినాడతే!
చొక్కపు సిగ్గుతో దితిజసూదనుఁ డా సినతల్లి పెంబడిన్
జిక్కని చీరకొంగు మునిచేఁ గొని చిత్రముగాఁగ నేగెడున్

క. కొడుకుల నలుగురఁ బెంచిలి
కొడుకులఁ జేసెను సుమిత్ర కోరిక తెగ దా
పడతులు మువ్వురు శాంతయు
విడతవిడతగాఁగ ముద్దుపెట్టుకొనంగా

గీ. అతిమనుష్యమ్ములైన శౌర్యములు కలిమి
బుగ్గగిల్లినఁ బొల్గారు బుసతలసము
నలుగురుకుమారు లట్లు తల్లులనుబట్టి
తిరుగఁగాఁజూడ ముద్దు సచ్చెరువుఁ బుట్టె

సీ. కషణాహీనకుతారగతి వికర్తనసాంధ్య
జరఠబింబము సన్నసన్నపడియె
పెండ్లికూఁతురు నవ్వు విరిసినరీతి శు
క్లాష్టమీజ్యోత్స్నావిలాస మొప్పె
నస్వప్నసౌఖ్యనిద్రాకృతి నమరాత్రి
కందమా చీఁకట్లు నరుగుడెంచె
దామోదరనవావతారంబు గాఁగ మా
ర్తాండుండు నుదయించె బ్రాచిశిఖరి
సాగె వృక్షాగ్రభాగనిస్వనదుదార
మధుశకుంతారవంబుల మధురమైన
స్త్రీలకలకలారవముల స్త్రీలనూపు
రస్వనముల యూర్ధ్వాధోధురాసరణము ౬౦

వ. అంత శిశువుల గోదానానుసంధికర్మాచరణంబులయందు

సీ. చనుచున్న తల్లి వెన్కను ముట్టెలాడించు
కొనుచు వచ్చెడు దూడలను గలట్టి
వర్ధచంద్రాకృతి నలరు కొమ్ములయందు
బంగారుతొడుగుల వఱలునట్టి
వల కంటి నదరుత్రోపులువెట్ట వెంట్రుక
ల్త్రాళ్లు కాళ్ల నడుములం గలట్టి
వఱ్ఱులఁ బ్రేలాడ నగు హొన్నుగంటల
తోఁ గల్పికట్టిన దోహనార్థ
కాంస్యపాత్రల తళతళల్ గలిగినట్టి
మొదటి యీఁతావులు సహస్రములు శతంబు
నాల్గు నాల్గులుగా నిచ్చినాఁడు రాజు
ధరణిదేవతాతతికి సదక్షిణముగ

కర్ణాటచతుష్పద.
మును వశిష్ఠులు వెన్క మొగిడి రాఘవుఁడు
మును కౌశికులు వెన్క మొఁగిడి లక్ష్మణుఁడు
మును యుధాజిత్తు వెఱ మొగిడి భరతుండు
మునికొడుకు వెనుకఁగా మును దశరథుండు

చతుష్పద.
వాద్యముల్ పెండ్లివారు ముఱ వెనుక సద్యోమహోలసత్వ మగు నడక
చోద్యమైనసఁగఁజూడఁగా సర్వహృద్యమై తోఁచె నెదముదముబర్వ

గీ. మకరతోరణములు బొమిడికము లొప్పు
ప్రత్ననిర్మిత సింహకవాటములను
మఱియుఁ గత్ప్యాంతరము లేదు మఱియు నేడు
వెడలె భృగురాముఁ జేతయాఁ బెండ్లికొడుకు

సీ. ఒక పెద్ద కెరటము నొక పెద్ద కెరటము
గలసి యన్యోన్యంబుఁ గౌఁగిలించుఁ
నొక చిన్ని కెరటము నొక చిన్ని కెరటముఁ
గలసిపోవును రెండుగానియట్లు ౬౬

ఒకచిన్నికలువపూ వొకచిన్నికలువపూ
వును గూడి యంచులకొనలు పుట్టు
నొకరాజహంసమ్ము నొకరాజహంసంబు
భువనోన్నతత్వంబు పుక్కిలించు
దివిజభాగీరథీసరయువులసంగ
మమ్ము పోలిక నయోధ్యకు మైథిలాన
నీశ్వరుల పెండ్లివారికి నృపుని సనత
మయమహాసౌధముల సంగమమ్ము గలిగె

క. ఎద పట్టరాని యుబ్బున
నెదురై వచ్చిన విదేహనృపసత్కారా
స్పదులు పుగ పెండ్లివారికి
నెద విసయము తోఁచెఁ జిత్ర మిది ధారుణిలో

వ. అంత వశిష్ఠులు జనకరాజుం గాంచి యయ్యా! మా రాజు దశర
థుండు తన కుమారచతుష్టయంబుకొఱకు కన్యావరణార్థంబు దాతృ
ప్రతిపాలనంబు సేయుచుండె కన్యాదానంబు దాతృప్రతిగృహీతల
యుత్తమలోకప్రాప్తిహేతువుగదా యనిన జనకరాజు నవ్వి

క. పదఁడు పదఁడు నా యిచ్చుట
యది మీరు గ్రహించుటయును నని కలదే? మీ
యది యీ గృహంబు నిటు యె
ల్లది మీ యిష్టానుసారమయ్యా! మహర్షీ!

చ. చిలికినపాలవెల్లి వడిఁ జిందిన లోపలి నిప్పతివఁగా
వెలిఁగెడు కన్నె మీ కొఱకు వేఁచెడు గాఁచిన వెన్నవోలెఁ జా
యలకు మలంగి సన్నిహితమైనది ఫల్గుని మీరు మీరు పెం
డిలి బొనరించుకొండు హావణించిన సాధుశుభప్రపాగతుల్

సీ. పచ్చియాకులతోడి పండినగొలలతో
మొదలిదుంపలతోడి కదళికలకు
నాల్గుమూలల స్తంభనాళత్వ మేర్పడి
వ్రాలు మబ్బుల మిన్నువోలెఁ బైని

లాజపూర్ణములైన లలితమోహనములా
హారివేణికుండలవరుసలకును
నాల్గుదిక్కుల క్షేత్రనాథత్వ మేర్పడి
పంటకుప్పలధాత్రివలెను గ్రింద

రత్నమాణిక్యదీపతోరణము లొప్పఁ
గ్రిమ్మ పైని దారామండలమ్ముగవలె న
నంతసాద్యంతమైన బ్రహ్మాండమట్లు
నవమనోజ్ఞకళ్యాణమంటపము వొలిచె

వ. అంత వశిష్ఠ వామదేవ శతానంద గాధేయులు ప్రవాహనమ్ముఁజేరి

ఆ. వేది నొకరు సేసి వేదిఁ బుష్పంబుల
నొక రలంకరించి యొకరు గంధ
మలఁది యొక్క రొకరు హైమపాలికలను
ఛిద్రకుంభములను జేర్చినారు

క. శుభలగ్నసన్నిధిని వ
ల్లభులై నడువంగ మంగళస్నానార్థం
బిభరాజగతులు నలుగురు
ప్రభువులు కళ్యాణమంటపస్తంభములై

లయగ్రాహి.

ఇచ్చట వశిష్ఠులును హెచ్చినముదం బలరఁ
బచ్చని నవాంకురము గ్రొచ్చిన శరావా
భ్యుచ్చతరధూపములు ముచ్చిలిన లాజవిల
సచ్చయము కాంతిఁ గనవచ్చినవి పాత్రల్
పుచ్చుకొని చేర్చికొని మచ్చిక సమస్తమును
నెచ్చట నెదుండవలె నచ్చట నదుండన్
బుచ్చి రఘుబాలకులు వచ్చినను బీఠముల
ముచ్చట నిషణ్ణులుఁగ హెచ్చరికతోడన్

శా. శశ్వచ్ఛ్వేతవరాహకల్పవిలసత్సర్గాదిపాథోజసూ
విశ్వాసప్రథమావతారఋషి విఘ్నేశుఁ బ్రసాధించి పు
ణ్యైశ్వర్యాహవచోఽంకురార్పణవిధూతాభద్రతాచిహ్నమై
విశ్వామిత్రపరిస్తృతంబులుగఁ గల్పించెఁ హావిర్వాహ్నులన్

గీ. తుమ్మెదలు పైని గ్రమ్మిన తమ్మిపూలు
నాల్గుతట్టలతోఁ దెచ్చినాఁడు మేన
మామ లంతలోఁ జూడఁగా మధురలజ్జ
లుదయమైన రాకన్నెల వదనములుఁగ

సీ. సంకల్పసంభవాస్థానమా తెరతోఁచి
పంచీకృతంబులౌ ప్రాణములును
దెరవెన్కఁ బ్రతిబింబదీధితుల్ ప్రకటించి
తనకు మించిన మోహమున వెలింగి
తనుదాన రాముఁ డయ్యును విస్మరించి త
త్ప్రతిబింబమునయందు రాముఁ డగుచుఁ
దెరఁదీసినంతన తెలిసి నిజస్వరూ
పంబు బ్రహ్మానందపరిధి యగుచు
నెంతటి మహిమయుఁ డయ్యును నినకులశిశు
వింతగ నణీయుఁడై సర్వసృష్టిసహజ
మైన విభ్రాంతిఁ బొందె మోహజమునైన
వికృతి నలుగురితోఁబాటు విస్తరించు

గీ. ఎదురు బల్లైన లజ్జచే నెత్తరాని
తెప్ప లవి యెత్తఁబడకుండఁ గ్రేవలందుఁ
బ్రక్క గూర్చున్న యప్పటి ప్రసరణంబు
ప్రసవబాణుండు నేర్పిన ప్రథమవిద్య

క. పరసుఖదశాపరీపా
కరామణీయక మెఱుంగుఁ గచసాన్నిధ్యా
త్తరమణఁ బ్రథమస్పర్శ
ప్రరూఢి మెడ వాలిచె సూత్రబంధనవేళన్

గీ. కరరుహంబులు చర్మంబు గాకపోవొ
నవియుఁ బులకించునేమొ ప్రియాగళాత్త
మైన స్పర్శసుఖాప్తిఁ బ్రియాగళంబు
నంటి బాధించు వీని కేలా? సుఖంబు

క. తలఁబ్రాల వేళఁ బడుచును
నలఘుచ్ఛవి నెగురు ముత్తియంబుల మిషచే
నలుకేళకుళులు వాలిచెను
నలుగురు దంపతులు మోహనస్తంభములై

గీ. నాలుగవ పాలుగా నింద్రనీలమణులు
మణులు కలియంగఁ బోసిరో యనఁగఁ బొలిచె
ముత్తెములు చతుర్దంపతిముగ్ధతనుస
మాత్తనీలరక్తచ్ఛవుల్ హత్తుకొనఁగ

గీ. అలుపములు రెండుమూఁడు ముత్యాలు నిలిచి
సీత పాపటలోఁ జిఱుచెమట పోసె
హత్తుకొని గందపూఁత ముత్యాలు రెండు
రామచంద్రుని మేనఁ దారకలు పొలిచె

మ. పదిదోసిళ్లకు నొక్కదోసిలి త్రపాపర్యంతమై సేసబ్రా
లాదిగించెన్ జనకాత్మజాత పతిపై నొయ్యారపున్ లజ్జయున్
జదురా తొల్తటి మెట్టు డిగ్గుచుఁ ద్రపాశైథిల్యమార్గంబునన్
బెద రావేళకుఁ దీరినట్టి కనులన్ వీక్షించుచున్ రాఘవున్

ఆ. చంద్రరేఖపైని సన్నని తెలిమొయి
ళ్లాడినట్లు ముత్తియమ్ములాడెఁ
దల్లిమేనిపైని నల్లని యాకాశ
మట్లు రామచంద్రుఁ డందె యుండ

ఉ. అల్ల వివాహమంటపమునై చను చోటికిఁ జిత్రచిత్రముల్
కొల్లలుగాఁగ వచ్చె వెలుఁగుల్ వెసఁ బెండిలివారలెల్ల ద్వా
ర్వేల్లితదృష్టులై చినుకు వెక్కసమౌ చిఱుజల్లువానలో
ఫుల్లవిచిత్రవర్ణములు పూవులు చూచిరి లంబమాలలన్

రామచంద్రునియందుఁ బూర్ణంబు నగుచు
నంతలో నంత తొలఁగియు నంతగాఁగ
నెంతయో గాని తెలియనియంత యగుచు
నవనిజాకృతిఁ దెలిసిన దగుచుఁ బొలిచె

ఉ. చిత్రపుచేతపక్కెరముఁ జేఁగొని రత్నపుదివ్వెఁ జెల్వు లా
రాత్రిక పట్టె శాంత మధురంబగు వీణియ తోడురాఁగ ను
ద్గాత్రథినేత ద్మై చను నోకానోక వైణికసామవేది హా
స్త్రతయక్ష్మిగాఁగ మఱడంద్రయుఁ దమ్ములల కండ్ల కద్దుచున్

క. నలుగురు దంపతులును బీ
టలపై నుండి యిటు లేచుటయుఁ జిఱుముత్తె
మ్ములు జ..జల రాలుటయును
బొలిచిరి జాల్వారు ముత్తెములప్రోవులునా

వ. అంత.

సీ. కోణోన్నతాంసాసఁగుణపీన కనదురో
ధృతి బొడ్డుదాఁక జందెములవారు
కర్ణాగ్రకుండలకాంతి ప్రసవ్షరీ
భ్రమఁ జెంపదాఁక నేత్రములవారు
సీమంతసంస్కారశృంగార రేఖాగ్ర
ముగఁ బెడదాఁక గ్రొమ్ముళ్ళవారు
గండపెండెరపు రేఖాశౌర్యదీపనా
వధిఁ బిక్కదాఁక దోవతులవారు
బుజము కృష్ణాజినాల్ మహోరజతమయము
లైనయట్టి జారీచెంబు లందగింప
విజయముంబొనర్చిరి పెండ్లివిందుకై స్వ
హస్తపాకులౌ క్షత్రియయాజివితతి

వ. అంత నా రాత్రి స్థాలీపాకానంతరమ్మున 

సీ. ఆ ధ్రువనక్షత్ర మనుసరించిన రేఖ
మలయుచో సప్తర్షిమండలంబు
నాల్గు నక్షత్రముల్ నాల్గు మంచముకోళ్ళ
వలె నున్న యెడఁ దుదివంక మూఁడు
సాగినయట్టి నక్షత్రమ్ములన్ మధ్య
వారు వశిష్ఠులు వారిప్రక్క
మినుకు మిన్కంచుఁ దాఁ గనిపించు లీలఁగా
నామె యరుంధతి యంచుఁ జూపె

శ్రీవశిష్ఠులు రాఘవశిశువులకును
బాలరాముండు జానకివంకఁ దల్లి
వంక నచటి యరుంధతివంకఁ జూచి
మహియ తలఁచె నరుంధతీమయముగాఁగ

గీ. అట్లరుంధతీమయ మైన దగు వివాహ
యజ్ఞము సమాప్తమై చతురంగబలము
తోడ మగపెండ్లివారు తోడ్తో నయోధ్య
కై పయనమైరి సందడి యతిశయిల్ల

శా. విశ్వామిత్రుఁడు స్వాశ్రమాభిముఖుఁడై వేంచేయుచో దీర్ఘముల్
నిశ్వాసంబులు పుచ్చుచున్ గనుఁగొనల్ నిండారఁగా బాష్పముల్
ప్రస్వేదాకృతి రామచంద్రునిఁ బరిష్వంగంబులన్ బట్టుచున్
శిశ్వాశీస్సులు శ్వోవసీయముగఁ దా సృష్టించి వేంచేసినన్

గీ. రామచంద్రుండును శరదారంభమందు
వార్షికాభ్రాంబుపుష్టమా వల్లివోలె
నేవళము మాత్రమే పైకి నింపుఁగాని
చేతమున సౌఖ్యమో! దుఃఖమో! తెలియదు

మ. కలితాస్యాంచలమోదరేఖ యెసఁగన్ గన్యాధనం బిచ్చె మై
థిలుఁ డూళుల్ పది కోసలావనిశిరోధిప్రాయభూభాగపుం
బొలిమేరం బడి నాగవల్లివనికాపూగద్రుమైలాలతా
సరణిస్వచ్ఛలవంగపట్టతరుభాస్వత్ క్షేత్రవంతంబులన్ ౧౦౩

క. మగపెండ్లివారి కన్నుం
జిగురుల మెప్పొదలచిన్నెఁ జెందినవగు నే
నుఁగు లశ్వంబులు రత్న
స్థగితసకలవస్తుసమితి జనకుం డిచ్చెన్

ఉ. ఇచ్చిన రత్నకంబళము లిచ్చిన రత్నవిభూష లెక్కువై
యిచ్చిన గోసమూహములు నిచ్చిన బంగరుపట్టువస్త్రముల్
క్రొచ్చిన పాలవెల్లి నురుగుల్ బడి వచ్చిన లక్ష్మితోడుగా
వచ్చిన కల్పవృక్షముఖవస్తువులంబలె కామదోగ్ధ్రులై

గీ. ఎంతసాధువుగా నైన నేమి తగవు
సుంత లేకుండఁ బెండ్లికి శోభ లేదు
అలుకుగుడ్డకునై కలహంబు జరిగె
జనకదశరథగృహపరిచారికలకు

చ. దశరథు సాగనంపుటకుఁ దా జనకుండు పురీబహిస్సరః
ప్రశమితవారిదాఁకఁ జని పైనొకతోఁట కెలంకు వాగులో
ని శిలలనీటిదాఁకఁ జని నిల్వఁ డటన్న నుదారబంధుతా
వశుఁడయి చాలదవ్వుచనెఁ బాదచరుండయి దీననేత్రుఁడై

వ. మఱియుఁ గుశధ్వజుండు

ఆ. సీత నెత్తికొనును జేరి యూర్మిళ నెత్తి
కొనును మాండవిఁ గయికొనును గక్షు
జతగ నెత్తికొనును శ్రుతకీర్తి వారిని
దించి వీరి వీరి దించి వారి

వ. సీరధ్వజకుశధ్వజులును వారి భార్యలును గన్నులం దుబికిన బాష్పములు కూఁతుండ్రకుఁ గన్పించకుండ దిక్కులు చూచి చూచి

ఆ. ఆగలేక తుదకు నావురు మన రామ
చంద్రునకు నమర్ష సరణి కలిగెఁ
దనకు నిచ్చినట్టి తరుణిని దనవెంట
నేగుపుచ్చ దుఃఖమేల నంచు                                                                ౧౧౨

క. మగిడి జనకాదులు సిద్ధా
శ్వ గజ వృషభ రాజ చిహ్న విస్ఫుట జన సం
తిగమనవిధూతధూళీ
స్థగితవియద్వీథికానులంబుగ నడిచెన్

గీ. దశరథురథంబులో నెక్కి శిశువు రాముఁ
డమ్మదగ్గరకుం బోదు ననుచుఁ జెప్పె
బాలరాముని గౌసల్యబండిఁ జేర్చెఁ
గొంచుఁ జనె సుమిత్రయుఁ దన కోర్కెమీఁద

ఆ. రా నదృష్టవంతురాలైన కౌసల్య
గ్రుచ్చి కౌఁగిటను నదుముకొనియెఁ బైకి
నెవరుఁ జూడకుండ నెన్నెన్నొ ముద్దులు
పెట్టుకొనియెఁ బట్టరాని సుఖము

ఉ. నాయన! నీవు నా కడుపునం బుట్టినప్పటి యాఁక నైకకల్పి
నే యఖిలంబుగా మనసు నిండఁగ నిన్నుఁ జూచి యే
దో యొకరీతి నన్నుఁ గనుచుంటి కుమారక! నీకునైతమున్
నా యెడఁ బ్రేమ లేనియది న బ్రతు కేమని వచ్చురా? శిశూ!

గీ. అది మొదటిసారిగా విన్న యమ్మనగవు
రాము నెద గ్రుచ్చుకొన్నట్టి ప్రథమశరము
అప్రతిక్రియాయోగ్యమైనట్టి శరము
తండ్రి దైవమ్ముగా నైన తనయునకును

ఉ. గౌతమమౌనియాశ్రమముగా రథముల్ చననిం డటంచుఁ దా
నై తనతండ్రితోఁ బలుక నాతని ధైర్యము తల్లిచేత నె
ట్లో తనకోర్కెఁ దీర్చుకొను నూహను వచ్చిన రామచంద్రుఁ డా
రీతికి ధైర్యభాగవిధురీకృతమానసుఁడై చలించుచున్

శా. అమ్మా! దేహమునన్ విచిత్రమగు దుఃఖారామ మన్పించు దే
హమ్మున్నంతన జీవి పొందనగు బాధాసహ్యతల్ చెప్ప శ
క్యమ్మా? యొక్కొకజీవి యొక్కొకవిధంబై పొందు దుఃఖమ్ము రా
జ్యమ్మో రాణియొ కాననంబొ ఋషిభార్యారత్నమో చెప్పఁగన్

శా. అనినన్ గోసలరాజకన్యకకు భయంబై వత్సా! యీయీ వనం
బున నీ వీ ఘోరోహ లేటికి వరింతో [illegible]! నా దుఃఖ మే
మని నీతోఁ బలికందుతోఁ బలికితిన్ హా! హా! యటం చార్తిఁజెం
దిన శ్రీరాముఁడు తల్లి గద్గదస్వరము బూనెన్ గన్నులం జూచుచున్

క. పూని జననీ! యిదేమిటి
యేనుగ మృగయావిహార మేగిన మొకలన్
నానాక్రూరతరమృగ
ప్రాణోత్క్రమణములు చిత్రభంగులు కననే

చ. ఇలపయి రాచబిడ్డ బ్రదుకే యిది వానికి మృత్యుతత్త్వముల్
దెలియఁగఁ జేల్కిసైనపని తెలియఁగాఁగను బాటకావన్నా
విలగతి నేగ్రహించితిసి వెక్కసమై చని జీవి యెంతగా
గిలగిల తన్నుకొన్నయది? కేవల మప్పుడు చూడఁగావలెన్

చ. ఇదియునుగాక గౌతమఋషీంద్రునిభార్య యహల్య యెంత ప
డ్డది? యల నామె దుఃఖపిశాచికాగ్ని మనంతరంబు నం
దొదిగిన కోటిజన్మల మహోన్నతదుఃఖముఁ ద్రవ్వి చూపె; నా
సదమలదుఃఖశీల క్షితిజాతను నన్నును నట్లు రమ్మనెన్

క. మనరథము లిట్లు పోయెడి
నిను నడుగఁగ వచ్చినాడనే యనఁ దండ్రీ!
తన ప్రాణములును నీవే
యను తండ్రిని నడుగ భయమురా! యని నవ్వెన్

క. అరదములవరుస దివ్వెనఁ
దిరిగె నహల్యాశ్రమప్రదేశముఖముగా
నరుదుగ షష్టిసహస్ర
స్ఫురితాబ్దాంతమున రాజ్ఞిముదల యనంగా

గీ. మొదల నివ్వెఱపోయెను బిదప నవ్వె
దశరథావనినాథుండు తల్లి కొడుకు
లేక మైమరని కైకేయి యేమొ యంత
లోన లో ముసిముసినవ్వులుగ వెలుంగ ౧౨౫

వ. అంత గౌతమాశ్రమంబుఁ జేరిన నేకత్రస్థితులకు సీతారాముల కహల్యాదేవి దృష్టిదీసి యారతి యిచ్చి

క. నామాట వ్యర్థ మౌనని
స్వామీ! నిక్కంబుగాఁ జనుదెంచితి వే
దో మాటను బితృవాక్య
ప్రామాణ్యంబుగ రచింతు పరిపాలనమున్

క. అని నారచీరలిచ్చినఁ
దన మధుపర్కములమీఁదఁ దాలిచి రాముం
డును నామెఁ గుశికసుతుతో
నిను గురువుగ స్వీకరింతునే యని మ్రొక్కెన్

గీ. అంతట నహల్య చూచినయామె చూచి
నల్లె సీతను జూచి యోయమ్మ! దృష్టి
తగులునేమో! యటంచును దలను ద్రిప్పి
కొనును మఱి సీతమీఁదికే చనును గన్ను

చ. తనపతి తాల్చినాఁడనుచుఁ దానును దాల్చెను నారచీరలన్
జనకతనూజ బాలబుద్ధిఁ జంపతు లంచు గిలాకిలా హాసిం
చిన ముని యాశ్రమస్థతరుశేఖరశారికలున్ బికంబులున్
గనుకని ముద్దు వచ్చి మఱి కైకయు నవ్విన నవ్వులుం దగెన్

వ. అంతఁ దమ్ముఁ గౌగిలించుకొనుట కలవిగాక యెత్తుకొని చిబుకంబు ముద్దాడిన యహల్యాగౌతములకు సీతారాములు నమస్కరించి సెలవుగైకొని తల్లులుఁ దారును బోయి తోఁటవెలుపల నున్న రథంబులం గలిసికొనఁగ

క. మగుడ నడకయంది రథా
శ్వగజవృషభరాజచక్రశఫచరణజవా
తిగమనవిధూతధూళి
స్థగితవియద్వీథికానతంబుగ నడచెఁ

వ. అట్లు మూన్నాళ్ళు ప్రయాణించి యయోధ్య యదిగో యిదిగో యని

మధురగతి.

అచ్చట రథములు నాగిన నాలుగు
వచ్చిన కుచ్చులపల్లకు లందునఁ
గ్రచ్చుఱఁ గొడుకులఁ గన్యల నల్వుర
హెచ్చినముదమున నెక్కఁగఁజేయుచు

విజయమంగళము.

వేణునాదములును దివ్యభేరికానినాదములును
బూని వారకామినీవిముగ్ధనాట్యచారుగతులు
పెండ్లినడకసిరియుఁ దమ్మె వే వరించినట్లు నడచు
పెండ్లిపెద్దలుగఁ బురీప్రవేశముం బొనర్చినారు

మహాక్కర,

ఓసి ఓసి యయోధ్యరామయ్య తా నొక్కవిల్విఱిచిచందిరపుబొమ్మ
కోసము త్తెమ్ముఁ గొని తెచ్చినాడంట! కోడళ్లొకేసారి నల్వురును
రాసులై పున్నెములు గుంపులై మూగి రాజుగారివరించెనట వెకొమ్మ
ఓసి రావె రావే యంచు మూగినా రూరిముత్తైదువ లెల్లరును

క. కనులకుఁ బసిరాముండును
మనసుల కాకాశమంత మహనీయుండున్
మనసో కనులో వంచిం
చిన దేదో తెలియరాని స్థితియై పౌరుల్

సీ. పసుపుబట్టలతోడి బాలుండు రాముండు
గరుడిపచ్చలబొమ్మ కాదె యంచు
గాధేయయాగరక్షామూర్తి రాముండు
నఖిలలోకత్రాత యగునటంచు
బుగ్గకాటుకతోడి సిగ్గరి రాముండు
జొత్తుకాన్గుచివుళ్ళ జొంపమంచు
శైవశరాసనజ్యాభేది రాముండు
దైత్యసంహాననావతారుఁ డంచు

ప్రక్కనున్న సీత వంకఁ జూచీచూడ
నట్టి రాముఁ డంపె మా[illegible] యంచు
ధృతి నహల్య పడిన తిట్టు దీర్చిన రాముఁ
డాత్మరక్ష యనుచు [illegible]నుకొనిరి

క. కమలాక్షుఁడైన రాముఁడు
తమవంకనె చూచుచునంచుఁ దలతురు రహహా! చి
త్రముగా నెల్లరు ప్రతిబిం
బము వోలిన రాము మొగమువంకం గనుచున్

సీ. వందలా లజ్జాకవాటముల్ ఛేదించి
యొక సీతచూపు తా నుండియుండి
రామచంద్రుని ముఖారామమ్ముపైఁ బ్రాఁకు
బెఱుకుఁబొందిన లేఁటికలికి వచ్చి
తరుణవాంఛాసుధాప్రవనసమాప్లుతంబైన
రాము చెక్కిళ్ళ పత్రములపైని
గాల్జారినట్లు త్రిక్కక జాఱిపడి సిగ్గు
బురదలోఁ దికమక పొందుచుండు

సీతచూపు తన్నుఁ జెందవచ్చిన వంద
సార్లలోన రామచంద్రు నేత్ర
మొక్కసారి కలియు నొకసారి యాసారి
తానుగూడ లజ్జ తరకకట్టు

సీ. వజ్రాలతమ్మంట్లు వరిమొక్కజొన్నపే
లాలు సౌధాగ్రభాగాళి కురియ
లజ్జాధిదేవతాలలితారుణకపోల
ములు మంగళారాత్రికలు వెలుంగ
కువలయకింజల్కకోమలాంశులు ప్రౌఢ
కాంతాకనీనికాగ్రములు నిగుడ
జిలుఁగు సీతాకోకచిల్కలు పరిమళ
[illegible]పటవాసధూళికాభ్రములు క్రమ్మ. ౧౮౧

వేణువీణామనోజ్ఞ నిస్వానములును
భసలనవవఘూర్ఘుంకారవిసరములును
ననుసరింపఁగ నాల్గుపల్యంకికలును
రాజగృహా మేగెఁ గథ్యోంతరములు దాఁటి

వ. అంత నయోధ్యలో రెన్నాళ్లు తక్కిన వివాహకాండమ్ము జరిపి యుత్సవానుగతములైన యనేకసంతోషమ్ములు చేసిరి

క. ఎరి గృహములకు బంధులు
వారును వా రరుగఁ దాను వల్లభమతియై
శ్రీరామచంద్రుఁ డారూ
ఢారూఢాత్మాభికాముఁడై చెలు వొలికెన్

ఉ. ఆయన యాత్మలో మఱియు నాయనకే కను నబ్రమయ్యో లీ
లాయుతబుద్ధి తాను మిథిలాముఖమై ఋషిరాజు వెంబడిన్
బోయినవేళ శౌర్యరమ పొందిన స్వీయహృదంతరంబునన్
దోయజనేత్ర జానకియ తోఁచె నెఱుంగఁగరాని మాఱుపై

ఉ. తా నెటకేఁ జనున్ దిరిగి తానును స్వీయగృహంబు లేగుచో
జానకిగాని కన్పడదో సారసనేత్రరమాభిరాముఁడై
తానుఁగ నేగుచున్ ముగురుతల్లులసౌధము లేగి చూచుచున్
జానకి కోసమై యడుగఁజాలని లజ్జను హజ్జ కొత్తుచున్

మ. తలుపోరన్ నిలుచుండి చూడఁగ నయోధ్యావృద్ధరాజన్యకాం
తలు శ్రీకంఠధనుర్విభంగకలనాదాంపత్యసంపాదనో
జ్జ్వలునిం గన్బొమవిండ్లు వంచక పరీషానిశ్చలాపాంగకో
ణలసద్ధీరత నారి లాగని విధానన్ రాముఁ డొప్పారెడున్

చ. పరమవిరోధియైన పురవైరిధనుస్సును రెండుచేసి సు
స్థిరమగు వైరవీథిని బ్రతిక్రియ తానుగఁ జేసిపెట్ట నా
విరిగిన ముక్కలే యదుకువెట్టెను నా విలుదంటు లస్త్రకో
త్తరపథమై కృతజ్ఞుఁడో? కృతఘ్నుఁడో? పూల్ పిడికిళ్ళ దూసెడున్

సీ. ఈనెలబాలుఁడు నింతలో నింత మొ
నృటిదాఁకఁ బాలు నన్నమును బైడి
వెండిగిన్నెలలోనఁబెట్టి తా వచ్చెనుఁ
దినిపింప నట్టిచందిరుఁడు నేఁడు
వాఁడెంతవాఁడయ్యెఁ? బరిశిన దేవు మహా
శిపయిఁ జిన్నారిబాలెలును గొన్న
సుపవిత్రమూర్తియై చూడ గౌరవభాజ
నుండయి బాలమనోజ్ఞరాము
నల యెదో తెలిసీతెలియని యెడంద
నైన సుఖమైనబాధగా నలయఁజేయు
స్నేహితుఁడో కాదొ! యితఁడు నూనె యని తలకుఁ
బోసికొన నేయి యని త్రావఁ బొదుకయగుచు

మ. తనవోలెన్ మఱి లక్ష్మణుండును నఘాతాత్పర్యలీలావినూ
తనరేఖామధురాకృఁడో యనుచు నంతంతం బరీక్షింపఁ జ
క్కన హేత్వంతరకల్పనాకృతిఁ బ్రతీతోగాఢదీప్తాస్యుఁ డ
య్యును గాఢాభినయప్రతారణసముద్యోగాత్మునిం జూచుచున్

క. తన మేనమామ భరతుని
గొనిచనె శత్రుఘ్నుతోడఁ గోరిక వారున్
దనవలె సౌమిత్రియువలె
గనుదురొ భార్యలను దొంగకన్నులతుదలన్

ఉ. రాముని మేనిలోని ప్రతిరక్తపుబిందువు జానకీమనో
జ్ఞామృతభావనాసుమధురాంచితకోమలపారిజాతమా
లామధువాసనాభరవిలాసముగా నయిదింద్రియంబులన్
బ్రామినదౌ నవాచ్యమధురం బనుభూతి యొకండు పొల్చుచున్

క. తన కాలిబ్రేలిదుమ్మున
మునికామినిపంక మొల్ల ముడిఁగిన నాఁడున్
దనకంటికోసలను దో
చనిదూనదంబు రామచంద్రుఁడు వెలుచున్ ౧౫౨

క. ఒక కారణమ్ము లేకయ
చికిలిమెఱుఁగుదంతకాంతి చిందిన క్రొవ్వా
లికసన్నని నవ్వుల చా
లిక వెఱ లెవ్వరును జూడలేదని తలఁచున్

ఆ. విల్లుపట్టఁగ త్తివిసర నేర్చినదాది
తనదు నోడిని వీడి చనిన రామ
చంద్రవిరహదుఃఖసరణి కౌసల్యకు
సాటి చిన్నిసీత లోటు దీర్చె

గీ. ఇంకఁ గోడలువచ్చిన దేముగాని
యేటి కని హేలఁగా దెప్పు చెసకమెసఁగు
శాంతఁ జూచుఁ గౌసల్య నిశ్చలములైన
కనుల నిండాభితృప్తి రేఖలు వెలుంగ

గీ. సీతయన్నమ్ము స్నానమ్ము సీత జపము
సీత శ్రీరామచంద్రుఁడు సీతయయ్యెఁ
బట్టమహిషికి లోభికిఁ బరమమైన
ధనమె యైనట్లు సౌఖ్యసాధనము లెల్ల

ఆ. రాని రాము నడుగొ రాముఁ డంచును బల్కుఁ
గైక సీత పర్వగములు పెట్టు
అడవికోడి కూసినట్లుగా నవ్వును
కైక, సీత తిరిగిరాక కలుగు

చ. మెలఁతను సీతఁ గైక తనమేడలకుం గొనిపోయి మెచ్చుమే
రలుగ నలంకరించి యలరామునకుం బనియున్నయట్లు వా
ర్త లనిచి రామచంద్రుఁడును రా నొక పన్నకమాడి యిద్దఱిన్
గలియగఁద్రోసి నవ్వులునుగా గదితల్పులు మూసి తీసెడున్

ఆ. సీతతోడఁ జెప్పుఁ జెలఁగి కైకయి యంద
గాఁడు తండ్రి నీవు కాదటంచు
రాముతోడఁ జెప్పు రమణఁ గైకయి యంద
కత్తె సీత నీవు కాదటంచు ౧౫౯

సీ. అదుగో రాముఁడు వచ్చు నన్నంతలోఁ జూసి
కోలు వెట్టును చున్నవాలె సీత
యా రామచంద్రుఁడే యరుగుదెంచిన లేచి
నిలుచుండఁ బుత్రికవలెను సీత
యెదురైన నతఁడు తా నెచటఁ బ్రవాహాత
యగు వాపికసరస్సు నట్లు సీత
ఉల్ల పోయెడు రాము మొల్లంపుఁ జూపుల
గాంచు జాబిలి వెల్గు కరణి సీత

కడుసమీపంబుగా సాగి కడచు రాము
నింతదగ్గరతనము సహించు సీత
యిట్టులే పోనుపోను తా నెదుఁ జూచు
వంచి తల సీత పతి పల్కరించు నంచు

ఉ. పూవులు తాకనీ రెమరుపోవరు చల్లనిపిల్లగాలికిన్
రేవెలుఁ గింతసోఁకిన భరింపరు భోజనవేళఁ జూడరున్
క్రోవులకన్నులం దెవరికోసము చూతురు నేకతంబు వాం
ఛావధియాదు రేకతమునందున నేకతముం భరింపరున్

వ. ఇట్లైన కొడుకుకోడండ్రఁ గాంచి దశరథుం డేతత్సర్వపుష్పధను ర్దోషనిష్కాసన హేతూత్సవంబులు జరిపించిన

ఉ. వచ్చి వసంతకాలము నవర్తువు సన్నచివుళ్ళు లొత్తి లేఁ
బచ్చనియాకు తుట్టతుదఁ బల్లని మొగ్గలు సాగులార్చి రే
విచ్చిన రేకలన్ నునుపు వెట్టి పరీమళమాధురీఝుకి
భృచ్చుణుఁ డైన మాధవుఁడు ప్రేమపొలాలను గుత్రగై కొనెన్

ఆ. పలుకుపంచదార చిలుకలు పూగుత్తు
లంబుజాస్యమధుకృదమృతగీతు
లలరుఁబోడులసెజ్జ లోలయు పన్నీరులు
నూపె మధువనంబు శోభనంబు ౧౬౪

ఉ. బంధురలజ్జ వ్రాలుటను వచ్చును దవ్వుచనున్ గుమారపు
ష్పంధయచక్రవర్తి పయి వ్రాలఁగ వచ్చిన లేఁతగాలి యున్
మంథరమాత్రతన్ దొలఁగు మల్లడికోరికచే నవత్రపా
గంధిలమై ప్రసూననవకాంతివధూటిక క్రొత్తకూటమిన్

గీ. పూవుఁదేనియ త్రావఁగాఁ బోయినట్టి
పేర్మిగల క్రొత్త యొక తేఁటిపెండ్లికొడుకు
పసిమిదారాల రంగులు ప్రబ్బికొన్న
ఱెక్కలను సిగ్గుచే సవరించికొనియె

చ. లలితవిదేహకోసలములన్ బొలిమేరల నంటుమావితోఁ
టల నునుగున్నలం జివురుటాకుల ఱెక్కల రాచి ముక్కులం
గలఁచి కుహూకుహూనినదక్రమవికస్వరమాధురీఝరీ
కలితతరంగమగ్నములుగా నొనరించెను జంటకోకిలల్

మ. పువుదొన్నెన్ దొలిజాతిమావిచివురుల్ పొన్నారిపన్నీరునం
దివతాళించి గరుద్విలాసచలనం బేపారఁ బుంస్కోకిలం
బివురుంబోడికిఁ బ్రేమ నామెతల నందీయంగ మందాక్షమి
శ్రవిసంవాదమనోజ్ఞనూత్నవధు వర్ధస్వీకృతిం జేసెనున్

మ. కనరాకన్ జివురాకుజొంపముల ఱెక్కల్ ఱెక్కలన్ రాచి ము
క్కున ముక్కున్ గదియించి యెఱ్ఱనికనుల్ కోసల్ పిసాళింపులై
తనుకౌ చొక్కున మన్మథాగమశిఖాతాత్పర్యమీమాంస తే
లిన కోడీంద్రగు జంటకోకిలలు పాలించెన్ వనీవీథులన్

సీ. తొలకరిసంజవేళలఁ బశ్చిమాకాశ
మావరించిన మేఘునట్టివాఁడు
గిర్యుపత్యకల సాగించు సన్ననియేళ్ళ
యాషాఢమాసంబు నట్టివాఁడు
వైజయంతీపుష్పవాసనాభరితమౌ
వైకుంఠు వక్షంబువంటివాఁడు
మఱల సృష్టిని జేయు మహితప్రాతర్వేళ
బ్రహ్మదేవుని యూహవంటివాఁడు .౧౭౦

మహితుఁ డొక్కఁడు పంగనామాలచెఱకు
విల్లుగాఁ దుమ్మెదలనారి పెల్లుగాఁ బ్ర
సూనములు నంపజల్లుగా సురభిమాస
పుష్పవనవీథుల విహారముం బొనర్చె

సీ. నొసలులో మొదలిడి యొసలారు సీమంత
మృదుపథంబున శిరఃపదము గాఁకఁ
బునుగులో నరుగఁదీసిన డాగు రేకుల
పొడితోడఁ దీర్చినబొట్టువోలె
ప్రథమచేలాంచలస్పర్శవేళాభయా
పనయనాంతరనర్మభాషణముల
సిగ్గుచే నదిమి హెచ్చినఁ బట్టుకోరాక
రువ్వగా వెలలిన నవ్వువోలె
రా మనోహరదీర్ఘదర్శనము సంకు
చన్మనఃప్రాణపదవికసనము గాఁగఁ
గులవధూసంగమానంద మొలుకఁబోసెఁ
బుష్పవని సన్నగా సాఁగి పూలతావి

సీ. ఐరావణాభ్రము వ్యాభుక్తశేషముల్
నందనసల్లకుల్ క్రిందరాలె
బ్రహ్మతర్పణనటద్వ్యోమమరాళజం
పతుల ఱెక్కఁకలు మహికి జాఱె
వెన్నెలపుల్గు లావిష్కృతప్రేమపా
థోరాశి పోటెత్తి పాఱుదెంచె
నైహికానందబ్రహ్మానందముల రెంటి
పొలిమేరలఁ గేళకుళులు తిరిగ

ననఁగఁ గాసెఁ గర్పూరనీహారదివిజ
వాహినీతీరడిండీరప్రసవభరతు
షారహారసన్నిభము కల్హారహితుని
మధునిశాక్రమశస్సుషీమమ్ము వెలుఁగు ౧౭౨

సీ. శారద వల్లకీ జంటతంత్రులు మీటి
కేవలామృతము లొలికించినట్లు
కడ కొక్కవాఁగుఁగాఁ గాఁబోవు సెలయేళ్లు
రెండు జోడుగఁ బ్రసరించినట్లు
మనసిజురథము పోయిన మేరఁ గ్రొత్తరో
జాలకిజ్జు వివాది సాగినట్లు
ప్రణయభరద్విజిహ్వాకులాంగనా కాకు
కాకలీగీతిక కదలినట్లు

చారుచూతకిసాలకషాయగంధ
బంధురము జీరసాగిన పాటపాడె
గున్నజొంపంబులం దాగియున్న యెట్టి
మదిరకన్నుల కోకిలకౌదమజంట

ఉ. ఆ సమయంబునన్ విచలితాత్ములు నిత్యపరస్పరాభిలా
షాసముదీర్ణమానసులు సర్వతనూపరివాంఛితప్రియా
భ్యాససమాగముల్ రఘువరాన్వయరత్నకిశోరదంపతుల్
మాసరమైనయట్టి మధుమాసదినంబులకున్ వశంవదుల్

చ. ఒక పరిగాఢమైన మధురోహ జనించినఁ జెప్పికోఁ ద్రపా
చకితులు చేయఁగా మధురసాధ్వసులై మృదుహాసంబునన్
బ్రకటితమై త్రపాహసనభాసి కపోలము లూఁది చూచుకో
రొకరి మొగంబు నొక్కరు రహోబహుభావగతత్రపాహతుల్

చ. అలయకయే పరస్పరహృదంతరనాథమనస్కు లిద్దఱున్
దెలియకయే సుఖాతిపరిధీకృతధీపరిణాము లిద్దఱున్
గలయకయే సమాగమసుఖప్రవిభాగకృదాత్ము లిద్దఱున్
సలలితమూర్తులౌ జనకజారఘురాములు దివ్యకాములై

ఉ. సీతయు రామచంద్రుఁడును జేతములందు యుగాలుఁ గల్పముల్
నాతియుఁ బూరుషుండుగ ననంతరదంపతిభావయాపనా
వ్యాతతసంసృతిప్రథము లైనటు లాత్మఁ దలంచుచుండు రా
సీతకు రామచంద్రునకుఁ జేతము లందలి ప్రేమ యెట్టిదో ! ౧౭౭

చ. ఒలయు దివావియోగభర మోపరు మేనుల పూరసంస్థితిన్
గలిసి నిశార్ధభాగమునఁ గాంచినయంత నొక శ్లోకళ్ళ మే
నులందగు దూరసంస్థితిని నూల్కొను నయ్యెడ బొటుకొంక మే
నుల దని విస్మరింతురు కనుంగొను చొక్కగ నొక్క రట్టు తే

చ. కలయికయున్ వియోగము జగజ్జనులందు సుఖంపు దుఃఖపుం
బాలములలో వికృష్టముగఁ బూన్చు నొకానొక పూరసంస్కృతిన్
ఫల మటి తోఁచెడున్ జనకజారఘురాములకున్ వియోగసం
చలనము సంగమం బసహాజస్థితియున్ సహాజస్థితిం బలెన్

ఉ. ఏపున మంటినుండి యుదయించిన మైథిలి మింటినుండి యూ
వాపముఁ గన్న రాఘవుఁడు వచ్చి బుగధ్వములందునుండి ద్యా
వాపృథువుల్ సమాహరణభావము పొందినరీతి సంగమ
వ్యాపృతిఁ బండువెన్నెలమయంబుగఁ జేయుదు రాత్మరోదసిన్

చ. అనితరదృష్టిఁ గాంచి మిథిలాత్మజమోమును గన్నుముక్కుతీ
రును మిథిలాపతిప్రణుతరూపము తోఁచ నమస్క్రియావినూ
తనపరిచర్య రాముఁ గని తా హసియించును సీత; సీతతోఁ
చును వెనువెంట నవ్వుకొనుచున్ రఘువీరుఁడు నీవు కావనున్

ఉ. ఆహితరామపుష్కరద యాహితలక్షణ సీత కోటివ
ర్షాహతసర్వసాగరసరస్సరిదానతభావ మందుచో
సేహనిరీహమాఁ బభ్రమసృష్టివికస్వరసూక్ష్మదేవతా
దేహసముజ్జ్వలద్వరుణదేవుని పోలిక రాముఁ డొప్పెడున్

ఉ. పాలితరాత్రులై కలశవార్ధిసితద్రవసద్మమం దుషో
వేళ వినిర్గమింతు రరవిందదళాక్షుఁడు రాజనేత్రియున్
ప్రాలి జలంబు లగ్నులు తపస్సులు వేళలు లోకవృత్తముల్
బాలసరోజబంధునృపవంశజకుర్దనముల్ గమించెడున్

వ. ఇట్లొకయేఁడాది జరిగిన తరువాత

ఉ. రాముని కంతలో నొక విరాగము మైథిలిమీఁద నంతలోఁ
గామము కామమెంతయు నికామము సాఁగి విరాగమున్ హృదా
రామవిధూతకౌసుమపరాగము సీతకుఁ దోఁచనీని ని
ష్కామము పట్టుకో ననువుచాలని కామము వెంట వెంటరాన్ గలాగ్

వ. ఇట్లున్నంత గ్రీష్మర్తు వేతెంచిన

సీ. పలుచచివ ళ్లెత్తువడిన వృక్షాగ్రముల్
కాషాయశాటికాకార మొప్పఁ
బచ్చాకు డుల్లి లోఁబచ్చి యెండిన చెట్ల
మోళ్లు దండాకారమును వహింపఁ
బంగలలో నేరుపడి యంచులన్ బెర
ళ్లవు దోట్లు కమండలువుగఁ దోపఁ
బరిశుష్క తాంబులా బాలవృక్షంబులు
మాడి నారాయణస్మరణ చూప
గూఢగంధబలంబునఁ గుండలిన్యు
దితసముత్థానగతభయాధీనమా ప
లాయమానదంపతిశుకాలాపములుగ
గ్రీష్మవని యొక్క వైరాగ్యకేళి నెఱపె

సీ. లోనిగుంజును గింజ నాని కాకము వేప
పండుఁడొల్లను వీడు భావ మరసి
సరయూతటీశుష్క సస్యభూముల నత్త
గుల్లలలోఁ దత్త్వగుప్తిఁ దెలిసి
ముదిసంజ ముకుళితచ్ఛదగుచ్ఛ మగు శిరీ
షద్రుబోధామృతస్థాన మెఱిఁగి
యుగపత్సమాగతు లుడురాజు వడగాలి
బోధించు ద్వంద్వప్రబోధ మూని
రాఘవకులేశుఁ డొక్క వైరాగ్యభావ
తాడితంబైనయట్టి చిత్తంబుతోడ
వృద్ధకృకలాస మట్లు నిర్వేదమందె
బద్ధసామజ మట్లు క్షోభము వహించె

సీ. నిలచి తపించు మానిజటావలిఁబోలె
గలఁచెఁ బెన్ దాటి మొవ్వులను గాలి
తపదిలా దేవతాతనుసర్వరోమాంధు
నిర్గతధూమ్యనా నెగడె దుమ్ము

మార్తండదేవు భ్రూమధ్యదీప్తజ్యోతి
మెగచినట్లుగ మండె నెండవెలుగు
ప్రకృతియోగాభ్యాసపరత నిశాముఖం
బులఁ బూనుకుంభకముఁ దగె గాలి
చరమయామినీదేవి శీర్షాసనంబు
పట్టినప్పటి యసృగధఃప్రసరణంబు
వోలెఁ దొలిసంజ యెఱ్ఱనిబాలసూర్య
వెలుఁగు మిన్నంటి నిలువుగా నిలచె ఫగ్గ

సీ. లేని వున్నట్లుగాఁ గానిపించుట కెండ
మావులు తార్కాణ మలయఁ జేసె
తెలివివెల్గున మాయ తొలఁగు నంటచు నెండ
కెండుసరస్సు సాదృశ్య మిచ్చె
పైనిపటారమ్ము లోనిలొటారమ్ము
మేనంచు రూపించె మేడిపండు
ప్రాణానికి విరోధి ప్రాణమ్మె యని వడ
గాలిఁ గీడ్వడిన జనాళి తెలిపె
నటఁ దదంతరప్రతిపత్తియందు జీవుఁ
డట్లె సంపరిష్వక్తుఁడై యరుగునంచు
ధరణినెఱియలు నీటియావిరులు భావి
సస్యసంస్కారగూఢబీజములు నెఱపె

గీ. అగ్నిహోత్రకుండంబులు నారిపోవు
నేమొ యని వాసరోజుల నెంతయత్న
పడిరొ యీనాళ్ళ నగ్నులు పర్ణశాల
లంటుకొనకుండ ఋషు లంత యత్నపడిరి

చ. అరుణశిఖాలి భగ్గుమనునట్టి మహాగ్నులు భూమిదేవి కూఁ
తురును నరుంధతీసతియుఁ దోరపువేసఁగిమంటగాలి త
త్పరిణత కేతకీదళవిభాసికపోలములందు గాళ్ళుగాఁ
దిరుగఁగ శక్తిచేసికొనెఁ ద్రిమ్మరికాలపు బల్మి యండఁగాఁ ౧౯౨

మ. పరితఃకోమలకాంతిమంజులతరప్రాభాతనీరేరుహా
దరభాగక్షిచలత్కటాక్షవిలసత్తారుణ్యరేఖోదరం
భరి భూమీతనయాకపోలపదవీమాంజిష్ఠకాంతిచ్ఛటా
పరమోదారమ్మృగీమదంబులు ద్రవింపంజేసె గ్రీష్మ మ్ముగ్రిన్

మ. తతవార్ధుల్ సరయూజలంబులె యయోధ్యావప్రసంపర్కవి
చ్యుతివైరాగ్యము చూపె సైకతమిషన్ శుద్ధాంతసౌధాంతని
ర్గతసోపానపరంపరాపరిచయభ్రష్టంబులై పంకసం
గతి నెండించుకొనెన్ లసత్కువలయగ్లానిన్ విడంబించుచున్

శా. మాయామానుషవిగ్రహుం డయిన రామస్వామి వైరాగ్యరే
ఖాయుక్తిన్ దనయాత్మ దీర్చికొనెఁగాకన్ సంభవిష్యన్మహా
త్మీయోషాతనయావియోగదహనజ్వాలల్ సహింపంగ నె
ట్లై యుండున్ మఱి కేవలత్వపు మనుష్యత్వంబె సంధించినన్

క. నట్టనడి గ్రీష్మమందున
బట్టతడుపు వానజల్లు పడి యార్ద్రిత లోఁ
బుట్టని యచ్చని వెట్ట యి
టట్టనక పొసఁగుట దుర్ఘటంబని తోఁచెన్

శా. ఏస్వామిన్ భజియించి యా కృతముగా నిక్ష్వాకువంశోద్భవ
త్మాస్వాముల్ క్షితిశాసనాంతమున రాజర్షిత్వముల్ తాల్చిరో
యా స్వామిన్ బ్రభువున్ వశిష్ఠమునిఁ బాదాంభోరుహాంచత్సప
ర్యాస్వీకారము చేసి రాఘవుఁడు శిష్యత్వంబు సేవించుచున్

శా. స్వామీ! ప్రాణముకంటెఁ బ్రాణము ధరాజాతాముఖాంభోజమే
యేమోగాఁ గనిపించు లోయెడఁదలో నింకన్ సమస్తావనీ
స్వామిత్వాదికభావనావిషయవాంఛాపూర్ణ వేశంతముల్
తా మండించెను గ్రీష్మ మెచ్చటిది! తాతా! నన్ను మన్నింపవే?

ఉ. చూచినదానికై కనులు చూడవు; నాలుక తిన్నదానికై
చాచదు; విన్నదానికయి సాగవు వీనులు; లోయెడందలోఁ
దోఁచియుఁ దోఁచనట్టిదయి దూరము దగ్గరకాని సందడిన్
రాచినరాపిడై యెఱుఁగరానిది తాత! యనుగ్రహింపవే! ౧౯౯

ఉ. నిద్దురపోయి మేలుకని నిద్దురపోయితి నంచు నెంచెదన్
నిద్దురపోవువేళఁ బ్రభు! నిద్దురపోవుచు నుంటినం చెదన్
దద్ద యెఱుంగజాలను విచాత్వవివేకము లేక యోగిసం
పద్దళితాఘుఁడా! యనుభవస్మృతి యెట్లొకొ యనుగ్రహింపవే!

ఉ. ఎందును నేనుగానివగు నింద్రియసంతతియందు నేను మే
ల్కాందును నిద్రపోవుదును గాలున పల్లవపుష్పము లట్లుగా
బిందువుకూడ నోడ్చెడిని కెట్టుగ సన్నిధి యోగిరాజ! నా
యందున నేను మేలుకొను టన్నది యున్నె? యనుగ్రహింపవే!

ఉ. నాటినకంబ మే నెవరు? నాయది యన్న విచిత్రభావ మే
చోటిది? యస్మదీయ మను చోద్యపుభావము ఎట్టు లున్నె? యే
పాటిది యప్పు నే ననెడు పస్తువు? జానుస్వరూప మెద్ది? యీ
గాటపుసందియంబు నవుగాములు చెప్పి యనుగ్రహింపవే!

చ. ఒకపని చేసినప్పుడు మహాత్మ బుధా! యహంకృతి మాలి చేయ నౌ
నో కొ! యదిచేసినట్టు లగునో కొ? యకర్తృకకార్యము న్నె? క
ర్తకును నకర్త కొక్కముడిఁ జార్చుట యెట్లు? విచిత్రమైన యీ
నికరము తెల్చిపెట్టవె మనీషిశిరఃప్రచలన్మహామణీ!

ఉ. ఇంటికి దివ్వె తెచ్చినటు లెప్పుడు వచ్చితి నిందు? పూర్వ మెం
దుంటిని? నెట్లువచ్చితి నహో! యిలు సి ల్వెలిగించుకొంచు నీ
వెంటనె పోదునో కొ? యొకవెంబడి నాఁగునో? నిత్యయాత్రయో?
కంటికి నిద్రఁ దేని దగు గాఢతరార్థము తెల్చిపెట్టవే!

శా. ఆయాసంపడిపోవుచుంటిఁగదె తాతా! నన్ను సైరింపవే!
నా యీ పక్షవదద్రిపాతవికటానంతోహభారాసహం
బై యాకస్మికలిప్తఘట్టనవశం బప్పచ్చియై పోవునో
నా యీ దేహ మదగ్ధదగ్ధ మగునో నాకున్ భయం బయ్యెడిన్

ఉ. మన్నన జేయుచున్ విషయమాత్రము బోధయొనర్చు నొక్కఁడా.
పన్ను సమాశ్రితుం దెలియఁబట్టు నొకండు తనంతఁ బొల్చు ప
గ్గెన్నిలఁ బెట్టి నీవు వెలిఁగింతువు నిన్నడుగంగ నాట నే
తెన్నునవైన రాఘవు నదృష్టము కాదటవే! మహాప్రభూ! ౨౦౬

వ. ఏతాదృశజిజ్ఞాసాపథవిహారియైన శ్రీరామచంద్రునకు నొకయేఁడాది తిరిగి వర్షర్తువు ప్రాప్తించిన

సీ. గోదుకస్తురితోఁడఁ జాదిన తిలకమై
నిక్కు తుమ్మెద సాచు టెక్కె యగుచుఁ
జెదరినకానుగు ముదురాకు కదలికై
తూఁగాడు మదకేకి తోఁక యగుచుఁ
దానమాడినపైని దడియాఱమిని జాఱ
వదలిన స్త్రీకేశపాశ మగుచుఁ
దొలిచిల్పవానజల్లులచేత జల ముబ్బి
యఘుగు నాఁ చగుపించు పడియ యగుచుఁ

జంటఁ బిల్ల పిల్ల సందడిసేయఁగాఁ
బండియున్న యడవిపంది యగుచుఁ
నంబుదం బొకండు నాషాఢమాసంబు
మొదలి దినమునందుఁ జదల నోఁచె

చ. చెదరిన సంజలం బగటెఁ జీఁకటి జేగురుకాంతి వానకా
ళ్ళు దిగిన గోడలా దిశలలోఁ బరదాలును దీర్చు బండుగై
ముదిరినకారులోఁ దడిసిపోయిన కట్టుడుచీర లెండమిన్
ముదితలు తాల్పనైనది విముగ్ధలు దాపుడు చీర లెత్తుచున్

గీ. మసక మసకైన చీఁకటి మలసియాడి
నాల్గు వైపుల జల్లులు నాట్యమాడి
యలగవాక్షంబులును మూయనైనవేళఁ
బగటి దివ్వెలు రాజవైభవముఁ దెచ్చె

క. ఒకతాటిమొవ్వపైఁబడు
నొకబంగరుబయలుమీఁద నుఱుకును బర్జ
న్యు కరుణ యెంత చలువయొ?
రొక పిడుగును బడదు గ్రామ ముండినచోటన్ ౨౧౧

చ. ముసురుల నాళ్ళలో నిరులు మూయు నిశాంధముసందు శీకరా
వసముదయంబు ధారలగు వానల ప్రాంతాలు గాలిహోరు వె
క్కసముగ మధ్య మధ్య నవికంపితమంధర మేఘగర్జలున్
ముసుంగులలోన మేల్కొనిన ముద్దియలన్ బతి కంటరా చెదున్

మ. సరయూవాహిని వేఁడి వెల్లుకుఁ బిపాసాగ్లాని కల్పాల్పశీ
కరముల్ మున్నుఁగ సప్పసెట్టి యుతెంచుంగా వెల్లునల్ తీర్ప దు
ర్ధరమై వార్షికంపుబీసు మాయాధ్యాసాధుమర్గంపు ముం
దరి ఆవంతిస కత్తుకొం చొదగ నుండా తొడ్కినీ కేజమై

గీ. సూక్ష్మలక్ష్యంబు లంచు నాస్తికపృషత్తు
లూరకుండెనె? మొత్తని సిరజములు
ముకుళశేఖరముల బల్లెములుగఁ బొడుచు
మృదుత కఠినత సంవర్శ్యమిశ్రితములు

ఉ. వావిలిపూవుకన్నెపయి వ్రాలును వ్రాలినయంతెఁ దేఁటి ధా
రావిధురంబు వానజడి రాపిడివెట్టిన లేచిపోవుఁ దా
నై వరుసంపుచిన్కుగము లాడిన సందుల వ్రాలు వెండియున్
వావిలిపైని; నంత జడివానలు క్రుమ్మిన లేచిపోయెడున్

శా. సంధ్యావేళలఁ బ్రాచి నిర్జలదమై సాఁగన్ బ్రతీచీదిశా
వంధ్యప్రక్రియ మేఘముల్ మెఱపులున్ వాల్లభ్యకాంతిప్రభా
కంధ్యుల్లోలతరంగభాగ్ధరిధనుఃకాండంబులై యోఁచగా
నాంధ్యం బొక్కెడసన్ మఱొక్కెడస మార్తాండప్రభాముద్రలై

సీ. ఎలయించి కికురించి వలపులు ప్రాఁకించి
దొంగయౌ కన్నెసంపంగిచేత
వెలయించి మలయించి తలఁపులు ప్రాకించి
ముంగియౌ ప్రోడగేదంగిచేత
సులభసంగ్రహమునై వలపు దుర్గాహ్యమై
చెల్లు మంకెనకాంతి వెల్లివలన
తెలివి దురూహమై వలపు నిరీహమై
యల్లు వావిలితేనెపెల్లువలన

సర్వవిధనాయికా సమాస్వాదసాధు
ఋతుమహాసభాశిశిరపారిషదసంచ
యప్రథమమూర్తి వర్షామహాధినేత
కలఁచి వలపించెఁ గాఋనలుపువాఁడు

సీ. ఒకనైగనిగ్యంబు నురలు పచ్చదనంబు
లేని సౌదామనివోని కనుల
నార్ద్రిత లేని నీలాంబుదాంచలయుగ
ప్రసరణంబును వోని గాహులతల
గుమిరైన తడి దమ్ముకొను గాలియుండఁగ
ద్రెవ్వ వెన్నెలవోని నవ్వుపెఱల
యుగపదాత్తనిమీలనోన్మీలనము నల్ల
కలువను బోని మొగంబుఁ జిగులఁ
జానకీరహస్యంయోగసమయవివృత
సంవృతాత్మండు శ్రీరామచంద్రునందు
ఱెక్క చాచిన యంజనాద్రివలె నైన
వర్షఋతు వంను భేద మేర్పఋపరాక

గీ. స్త్రీ స్వభావంబుతోపాటు చెలఁగు సంస్కృ
తిప్రథమదశామందాక్షతీవ్రరేఖ
ననుభవింపంగఁ బడ నిగ్గుకొనెడు సీత
యనుభవప్రార్థనామూర్తి యయ్యెఁ గనుల

ఉ. ఉఱుమఁడు చానక్రొమ్మెఁగిలు నొత్తఁగనీఁడు వియత్పథావృతిన్
దఱుగఁడు వర్షతీవ్రతను దాల్పఁడు చిన్కుట మానఁ డానతిన్
మొఱఁగడు సుంత సంజయెఱుపుం జొరనీయఁడు నాశలందునన్
జెఱగఁడు తత్తథాగతవిశేషగుణుం డభిరామమేఘుఁడున్

సీ. తొలుత శ్రీరామచంద్రుని దర్శనము వేళ
నొక స్వర్గసౌధవీథిక స్ఫురించి
శివశరాసనపణస్మృతి గల్గి సందిగ్ధ
మైన తత్ప్రాపణంబై కలంగి

శైవకార్ముకవికర్షణవార్త వినినంత
సౌధప్రవేశనిశ్చయము కలిగి
పెద్దయంగలతోడి భృగురాముఁ డరుదెంచె
నని విని సర్వనాశార్తిఁ గొరసి
యాది నొక యేఁడు పెరిగి యోఁడాది తిరిగి
నంత విరిగిన సౌధసౌఖ్యప్రచార
విధృతి పర్యాయమఘునితావిఘురతాస
మావృతిక్లిశ్యమానాత్మ యగుచు సీత

గీ. వింటిద వ్యనుకొన వే..విండ్లవప్పు
వెదకికొని వచ్చె సనఁ దానె వెదుకనగుట
ప్రభుని రాముని యాత్మతత్త్వంబు నెదకు
నంది యందక జానకి యటుమటించి

గీ. అలరు మల్లికల్ మంచానములును సంపె
గలును కేతకుల్ శామంతికలును మావి
చివురులును వాడక త్రియామశేషమైన
యాఱుఋతురాత్రులను మూరువార్చఁబట్టె

గీ. సీత తాను దలంటిపోసికొని వార్షి
కములు మలుసంజలన్ గైశికమ్ము జాఱు
ముడి ఘటించి మందారము పొదివి పైని
సరిగతోఁగరద్దుచీరతోఁ దిరుగఁజూచి

గీ. అప్రతీక్షాప్రతీక్షలదైన నడిమి
బిగుసుగల జాగరపుటెఱ్ఱసెరలకనుల
నుసనుజలమాడి దొనజారుచున్న ధాతు
శిఖరి పార్శ్వంబు వెదురైన సీతఁగాంచి

గీ. తాను దా గాఢ రేఖావితర్కమందు
వేళఁ గాదు కాదని కొనవ్రేళ్ళు సాచి
దక్షిణకరాంబుజాత మెత్తంగ గోళ్ళు
చిమ్మ గోరంట యెఱ్ఱదనమ్ము చూచి

గీ. నడుము విడలని మొగ్గకు విడిలిన వెలి
పసరు రేకులకుఁ మధ్య వానచినుకు
నిలుచుఁ దమ్మిరనా గ్రుడ్డుఱెప్పలకు నడుమ
కనులనీ ర్నించు నతివ యేకాంతముఁ గని

వ. సిగ్గిలి వార్షికంబులు మొగుడుసంజలు వెనుకఁబట్టిన

గీ. సకలఋతురాజపరిషదాచార్యమూర్తి
మహితుఁ డాతపచంద్రికామధ్యుఁ డచ్చ
మైన నరసుండు శరదృతు వరుగుదెంచె
సంబుజాతాంగనల కనుంగన్న గారు

చ. చిఱుతుకలాటఁ బెన్నెఱకచేయని వెన్నెలపుల్గు లచ్చపుఁ
వఱదలుగాఁగ వెన్నెలలు వచ్చిన ముక్కుదుమఁ బ్రసన్నమై
విఱిగెడు స్వాదుగర్భనిధిపిచికలంచని నేరకూరకే
తెఱచిన చిట్టికన్నులుగ తెల్లనిచూపుల వెల్లిఁ గొల్పెడిఁ

చ. ఒకచిఱుకావివడ్డ సరయూనది వార్షుకమైన యొంపు క్రిం
దికి దిగి పేరుకొన్నదని తీరము జాఱిన నీటిపాయచేఁ
బ్రకటితమౌచు నీర్వెఱుపు పద్ధతి తోఁచెడు వెన్నపోని పూఁ
తకుఁ బయిఁదోఁచినట్టివగు దారపుకోతల సన్న నెత్తెలఁ

శా. అంతం గాసెను వెన్నెలల్ ప్రియవధూహాసాభముల్ లోచనో
పాంతానంతరితాంత శాంతసుషమాప్రాంతమ్ము లారామసీ
మాంతవ్యాపృత కేతకీకుసుమపత్రాగ్రాజహచ్ఛ్యామికా
సంతాపాగతబాష్పవన్నతతుషారాసారికాంత్యధ్వముల్

చ. బురదలయొండు వేల్పునది ముద్దులచెల్లెలిపాయలోపలన్
సరయువు లోపలన్ విఱిగె జాఱెడు సంజల పుక్కిలింతలై
ధరణిసురుండు కుంభజుఁడు తాల్చిన పండిన నీరుకావిరం
గురలిన యుత్తరీయయుగమో! యనఁ గుచ్చెల లట్టి వీచులై

ఉ. త్రచ్చినపాలవెల్లి నసుదార జనించు సుధాప్రవాహముల్
వచ్చినయట్లు శారదికబాలనవాతపముల్ చలించినన్
గ్రొచ్చిన వీరముద్దెలయి కొట్టములందలి వెల్లగుజ్జముల్
రెచ్చిన పౌరుషాన సకిలించెడు వార్షికమేఘగర్జగాన్

చ. నిడివిగ ముల్లుసాగుకొను నివ్వరిగింజ లధస్సరోఽంబులన్
బడి యుపయోగభాజనతఁ బాయకమున్న ఋషీంద్రపత్నులున్
నడుములు మున్గఁగా జలమునన్ నిలుచుండి వెదుళ్ళనంచెలన్
దుడిచి రహో! తలల్ పెడకుఁ ద్రోయుచు నెత్తిన గంపలందునన్

గీ. సాగరసమాగమము లేని శైవలినియు
నవసిభృత్స్పర్శ లేని మేఘాంగనయును
వలపుమై నెఱ్ఱవాగైన సలుపు విఱిగి
పతివియోగవ్యథావ్రతల్ పాలిపోరె?

గీ. శారదశ్రీకి నిది సితచ్ఛత్ర మిద్ది
చామరము మేఘ మంచుఁ గాశప్రసూన
మంచు నేటికో? పరిశుష్కతాంబుమషువు
లార్ద్రితకు వీని కామడ లంత దవ్వు

గీ. యామినీదేవి సాంజనార్ద్రాక్షి రేఖ
వోని నల్ల మొగిల్ కడుపున మెఱుంగు
సితనిరంజనశుష్కదృజ్ఞలపయోః
మలమి తెలతెల్లవోవు శీతాంశురేఖ

మ. ఎపుడే వచ్చినచో నరుంధతియుఁ దా నీక్షింపఁగా మైథిలిన్
వపురాకుంచనఖిన్నయై యుపచరింపన్ దొట్రుపాటొచుఁ జో
క్కపుఁజూపుల్ ప్రసరింప వార్మిళితరేఖావీథి యాంచున్ లవం
గపుమొగ్గల్వలెనైన తారకలుగాఁ గన్పించు సీతాదృతిన్

శా. శుశ్రూషాపరముండు రాముఁడు వశిష్ఠుల్ సేవకున్ రాఁగఁ ద
ద్విశ్రాంతిప్రథమానవేళలఁ గృపావిర్భూతచేతస్కుఁ డా
నై శ్రేయోఽవధి కర్మయోగి జనకుండౌఁగాని సంసారరే
ఖాశ్రాంతుల్ చిఱుకావిశాటులజనుల్ కారంచు మన్నించుచున్

మ. మిథిలాజాత యయోనిజాత పసిసామీ! నీదు పుణ్యాత్తయో
యి! ధురాసంగతమైనభాగ్యము కదోయీ! యంచు నీధాత్రి నీ
పృథుబాహాపరిరక్షితంబయినఁగానీ లేదు నిష్కార మం
చదమానేకనిశాచరప్రళయ మేలా? పాయునం చూర్పులై ౨౮౧

శా. రామా! మేలగు నద్ది యంచడుగఁ గర్మజ్ఞానయోగోజ్జ్వల
న్మీమాంసాపథిఁ గర్మయోగమవుఁబో మేలందు నీ రెండునున్
శ్రీమంతంబులె బ్రహ్మ మెప్పు డవికారిత్వంబెయా లోకయా
త్రామిత్రాత్ములఁ గర్మయోగులచరిత్రల్ బిట్టు పాలించెడిన్

ఉ. కాదని నిన్నుఁబోలిన జగత్స్థితిహేతువు తన్నుఁదాన సం
పాదనచేయఁ జొచ్చినఁ గృపారహితాత్మక! లోకశాంతిసం
పాదనసేఁత యెవ్వనికిఁ బట్టెను? బట్టదు పట్టు; నాకు నే
లా? దయపేర్మి సీతవ్యవహారము పట్టెనుగాక కుఱ్ఱఁడా!

చ. వెనుకటి కొక్కసారి యరవిందదళాక్షుఁడు యోగనిద్రలో
మునిఁగి యనేకకల్పములు మూసిన మూసినదై యకల్ప్యచే
తనతను నంతరించినవిధాన సనాతని తోఁచ యోగపుం
గనులను ద్రవ్వి యెచ్చుటనోగాని కనంగను లేఁడ యిందిరన్

మ. తనకుంజాలదో సీత? నీవిభవసౌందర్యంబులన్ జిక్కి ని
న్ననె మన్నించునుగాక యెల్లపుడు తన్నుం జూచుకో లేదో? చూ
డను వాఛించదు వాంఛరాద; యదికూడన్ నీప్రభాముద్రయే
కనఁగా బిడ్డలకై యరుంధతికి శోకం బేల నోయీ శిశూ!

చ. అనిన యరుంధతీసతిముఖాంతము దుఃఖముకాని దుఃఖమై
కన నొకసారిగా నలము కమ్మని తేజము శోకభావమున్
బెనఁగొన రామచంద్రునకు భీతియు నచ్చెరువున్ మఱేదో బో
ధనకలిమిన్ వివేకమును దార్కొనె సంతిఁ బ్రసన్నవాంఛమై

చ. వలసినఁ ద్రవ్వుకోన్నయిన వాటము నక్కఱ లేదయేని నా
తలపును గూడ లేక చనుదారిగఁ బెన్నిధి యొండు రామచం
ద్రులకును మానసంబునను దోఁచెను తోఁచినయంత సీతపై
మలఁగిన మానసంబునెడ మన్ననయున్ ఘటియిల్లె లీలఁగా

మ. తనలో శ్రీరఘురామచంద్రునకు మార్తాండాభమా జ్యోతి తో
డన ధారాహిమపాతసన్నిభము వ్రీడామూర్తి సీతాననా
తనసౌందర్యగతాభిలాష యుగపత్సంస్థానముల్ తోఁచె న
య్యినవంశ్యుం డొకనాటి ప్రొద్దునఁ గనెన్ హేమంతసంపాతమున్

గీ. ఒడలినల్లతనంబు రేఁబడిన మంచు
వలని నిగనిగచేఁ బరస్పరము కోర్కి
పెంచ సామాభిరామబృంహితము చేసె
సామజయుగంబు రాఘవేశ్వరులయిండ్ల

గీ. తా ననంతతారాస్నిగ్ధదారగణము
వెలువఱుచు ప్రేమవాహినుల్ వెక్కసమయి
చూఱ వదలెనేమొ యమృతాంశుం డనఁగఁ జి
గుళ్ళపైఁ బూలపై హిమాంబువులు కురిసె

ఉ. దుమ్మడఁగించి ముంగిళులు తోఁగఁగఁజేసి కలాపిఁజల్లి ము
త్తెమ్ముల సన్నముగ్గులను దీరిచి బాల లుషోఽధిదేవతల్
పమ్మిన యందగింపు హిమపాతము వేళల రాఘవేంద్రగే
హమ్ములఁ జేసిపోయెద రహో! జనకాత్మజమీఁది మన్ననన్

శా. హైమాసారవిదూషితాబ్జముఖయై సాద్యంతవేళాత్రియా
మాముగ్ధాభినిపాతబాష్పఝురయై మందీకృతాశాంతయై
శామంతీసితకుట్మలాగ్రరుచియై సంఛన్నరాజాస్యయై
హేమంతేందిర జానకీసదృశయై యేపారె గ్లాపాండువై

శా. పూవుంబూవున వేలువందలు హిమాంబుశ్రీలు శ్రీశ్రీని వే
లావే లుస్సార్యమయూఖమాలలును మాలన్ మాల వేల్ లక్షలై
యావిర్భూతములైన వేల్పునెకిమీనందంపుఁజిర్విండ్లు విం
డ్లై విండ్లా నెడలందు వేలు మఱి కోట్లా నందపున్ రేకలున్

ఉ. సూర్యునితో సహాస్థితియుఁ జొప్పడనే వలె మంచుబిందులున్
ధుర్యములైన యందములు దోపిడిపెట్టును వంపులౌ సునా
సీర్యములైన విండ్లు నునుసిబ్బితికత్తెల వాలుచూపులై
పర్యయకోటిమన్మథనిపాతములం బలె నెత్తివచ్చెదున్

మ. తెరలై సుగ్గడితంబులై గగనవీథీమధ్యభాగంబునన్
దొరలం జొచ్చెడి మంచుబిందువుల సందుల్ సందులం జొచ్చి చం
దురులే వెన్నెలకాంతిపుంజములు చెందున్ జెందొగన్ గోర్కిమైఁ
దిరమౌ కోర్కియె యున్న వేవిధము లింతిన్ జెందు కాంతాధ్వముల్

శా. ఆ కెల్లంబడి సన్నసన్నవగు ముత్యా లట్లుగాఁ జిన్నిబొ
ట్లై కూడంబడి యంతటన్ దొడిమపట్లై బర్వుచే నాకుఁగ్గై
కో కించించుక ప్రవాలజాలుటను జేకోనై తుషారాంబు వ
ర్యాకుం దుట్టతుదన్ త్యజించదు ప్రియాప్రావారలగ్నం బటన్

శా. ఆయెంబో! తొలిసంజలో సహజమోహావేశముం దెచ్చి ప్రా
లేయవ్యాజవిరాగభావపథిఁ దూల్చెన్ బైని మధ్యాహ్నవే
ళాయోషాభిముఖత్వ మేమి ఫలమో! మ్లానాంగలావణ్యరే
ఖాయుక్తిన్ నవనీరజాతసతివాఃకంపంబులన్ గుందగాన్

ఉ. అద్దిర! మంచుచేఁ దడిసి యన్నియుఁ బుప్పొడితిన్న లందముల్
నిద్దపునై గనిగ్యములు నెక్కొని కొంచెపుటెండ సాఁగినన్
ప్రొద్దుటిపూటపోయి వలపుల్ నునుపుల్ చెడి తాతిపెంకులై
యుద్దవిడిన్ సుతీక్ష్ణకిరణోగ్రతరోష్మలు వెల్లడించెడున్

సీ. ఒకనాఁడు తనదురాకకు సీత యెదురుచూ
చు నటన్న ధైర్యంబు చూఱవోయి
ఒకనాఁడు గాఢదుఃఖోల్బణంబున సీత
మాఁగిపోవుటఁజూచి మమత హెచ్చి
ఒకనాఁడు బతిమాలి యొక వేయిబాసలు
చేసి నవ్వించి మచ్చికలు తెచ్చి
ఒకనాఁ డభినయించి యొక్కకోపము బతి
మాలించికొని రహోమధువు లాని

ఒక్కదినమున నాలస్య మొప్పవచ్చి
యొక్కదినమున ముందుగా నొప్ప నేగి
రామచంద్రుఁడు జానకీప్రేమ మఱల
వేయివిధములుగాఁగ నావిష్కరించె

ఉ. ఎన్నివిధాలఁ గూర్మి వెలయించిన నైనను జానకీమనః
ఖిన్నత పాయకే మొగము క్రేవలఁ గన్నులకోసలన్ సమా
సన్నతఁ బొందఁ జూచి రఘుసత్తముఁ డే గతి నామెదుఃఖవు
ర్జిన్నెలు పాయఁ జేయుటయొ చిత్తమునం దెలియంగ లేకయున్ ౨౬౦

సీ. తనవంకఁ జూచుచుండిన సీత నావంక
నేలఁ జూతు వటంచు గోలఁ జేసి
తనవంకఁ జూడకుండిన సీత నావంకఁ
జూడవులే! యంచుఁ గోపు వెంచి
తన పరిచర్యఁ జేసిన సీత నాకు స
క్కఱ లేదులే యంచుఁ గలఁత వెట్టి
తనసేవసేయ జంకిన సీత నాకేలఁ
జేసెదవంచును జివ్వఁ బెంచి
యైనదానికి మఱియును గానిదాని
కేలికతనానఁ జిల్లికజ్జాలు పెంచ
సీత కేడ్పులు బాష్పముల్ చివరికైనఁ
బ్రభువు ప్రకటించు గాఢానురాగ మవధి

ఉ. అంతట నొక్కనాఁడు జనకాత్మజ రాముని జూచి యోయి వే
దాంతి! నిజంబుగానె జనకాత్మజ యిష్టము కాదయేని వ
ర్తింతువ యుష్మనీపదధురీణుఁడ వీ గతి నన్ను నేల బా
ధింతువు నీవు క్రమ్మి కడు చెప్పరనై చను నాదుగుండియన్

మ. అనుకూలుండవ యేని గమ్మ; మఱి కావా? చన్నమూఁడేండ్లవో
లెను నా గుండియ ఛిన్నధూర్జటిధనుర్లీలాకయన్ నిన్ జిరం
తను మన్నించుచు జీవితాంతము నితాంతంబైన సంయోగభా
వన దీక్షవ్రతమై చరింతుఁ గరుణింపంజూడు మిట్లైనన్

మ. అని బాష్పస్నపితాక్షిగల్లయును గాంతాకారదుఃఖంబునై
చను సీతం గని రామచంద్రుఁడును బాష్పంబుల్ సుధావ్యావా
హినిగా మిశ్రితశోకమోదవినయప్రేమరుద్ధకంఠుండు చా
చిన బాహాజటలన్ గ్రహించికొనియెన్ సీతావియద్వాహినిన్

శా. పెల్చన్ రాఘవజానకీహృదయగాంభీర్యంపు రాపిళ్ళపాం
గు ల్చల్లారిన రాఘవుం డనియె నాకుం గుండెలో సీతయై
తాల్చెన్ బ్రాణము ఛిన్నధూర్జటిధనుర్దర్పంబు లేదింత నీ
నిల్చెన్ నీడలు తాల్చునూహాలు హిమానీగేహాకల్పంబులై ౨౯౫

ఉ. అల్పమొ ప్రేఁగొ బ్రహ్మ మను నాంతరవస్తువు వీడి నాదుసం
కల్పమునందు సర్వమును గామిని! నీవుగ నిండియుంటి వీ
కల్పితమైన మోహ మను కాటుకచీఁకటిఁ జిన్నదివ్వెవై
శిల్పపు వెల్గుగాఁగ విరచింతువు నా హృదయాంతరంబునన్

గీ. శ్రీవశిష్ఠర్షి సాక్షిగాఁ జెప్పుచుంటి
నస్వతంత్రమ్మయైన దేహమ్మునందు
నౌనొ కాదొ వచింపఁగ లేనుగాని
యాత్మ నిన్ను నిత్యంబుగా హత్తుకొందు

చ. అలుపపుటూహలన్ గలఁచి యాడి నిజంబుగ నొవ్వఁజేసితిన్
దలఁగఁగరాక నీదునెడఁదం గల సందియ మార్పు కోర్కెన
ట్టులు పొనరించితిన్ ననుఁ గనున్ సయిరింపవె యోసి యోసి మై
థిలి! యని జాలిగాఁ గనెడు దేవుని జానకి యోర్చెఁ బ్రీతయై

ఉ. హత్తినప్రీతి యిర్వురకు నాత్మలయం బెడబాటుభీతికిన్
గత్తళమై భజించియు నొకానొక దూరవియోగరేఖలో
నొత్తినయట్లు తోఁచిన ముహుర్ముహురావృతగాఢకాములై
చిత్తములం దొకళ్ళొకరు చేరగనీరు విరామభావమున్

వ. ఈలోన నేఁడాది తిరిగి మరల శిశిరము ప్రాప్తించిన

గీ. అగ్నికార్యంబు సేయుటయయ్యెఁ గూడ
సోమయాజియు నెదురుగా సోమిదమ్మ
యగ్ని కిఱుప్రక్కఁ గూర్చుండి యర్థరాత్ర
మైనదాఁక లేవరు చలి యపుడు తోఁచి

గీ. పరమసుకుమారమైన జీవంబులన్ ద
దాత్వకోరకభావ సుందరములన్ స
మానసూక్ష్మరేఖాపరిమళములన్ శి
శిరము మాఘ్యమ్ములన్ వికసించనీదు శిశి

గీ. ఆకు లూరలిన రెమ్మల యంతములను
జివురు తొలిరూప మెత్తనిజీరగట్టె
బాకు మండింపఁ గలుగు నేర్పాటు కొఱకు
మన్మథుఁడు నిప్పు లుంచిన మ్రోడి గాఁగ

గీ. ఆకు సర్వము రాలి మ్రోడైన చెట్టు
పైనిపంగలలో గూటిలోన నుషసు
చలికి నోర్కొనకదాని ఱెక్కలను మూసి
బాలకలవింకజంపతుల్ పవ్వళించె

గీ. సరయువునఁ బూసకట్టుల జలము వాఱె
నల్ల శిశిరర్తురాజజలాధిదేవి
తారహాఃపరిభోగ సంచారమంజు
లశ్రమస్వేదబిందుమాలాభసుషమ

గీ. కుందురుష్కంబు ధాతకీకుసుమ మగురు
పుండరీకంబు హ్రీబేరమును మొదలగు
మొగుడుకొను సుగంధద్రవ్యముల మనోజ్ఞ
తమములగు ధూపములు గవాక్షముల మసలె

గీ. దశరథేశు కుమారసౌధంబులందు
నడికి రే వినిపింపఁగాఁ దొడఁగె మధుర
వేణు వీణామృదంగ నిస్వానకములు
ప్రసవబాణుని గీతాప్రబంధములును

గీ. పైకిఁ దోఁచని యార్ద్రిత ప్రకటితముగ
శిశిరఋతురాజు పాలించెఁ జివరిదాఁకఁ
బలకపై గంద మూరులోపలను దిరిగి
వత్తు నని చన్న ధృష్టుని వాక్యసరణి

గీ. గందపూఁతకు నగురుపొగల్ ఘటించి
పేరు నూనె దూపంబుల వెచ్చపెట్టి
విరవిరలు కౌఁగిలింతల విరియఁబాఁచి
భోగు లెడమీరు చలికాఱు పూనికలకు

గీ. నవనవప్రౌఢతరయౌవనప్రఘూణ
రత్నమాణిక్యకలితనీరాజనంబు
చెలువ యధరంబు పగిలించి శిశిరరాజు
కృపణవహా రతిసర్వస్వ మపహరించె

మ. మదిలో దూరవియోగభీతి రఘురామత్కౌసుతల్ దూరముల్
కదియం జొచ్చినయట్లు తోఁచి యెడఁదల్ కంపింపఁగా సన్నిధుల్
వదలంజాలక ప్రేమవాక్యరచనావాల్లభ్యసంధానసం
పద సర్వస్వము గాఁ గనై మసలి రౌర్వాక్లాంతపాథోధులై

ఉ. రాజితమైన మోహము నిరంకుశమై రఘురామమూర్తి సం
ధ్యాజపమంత్రహోమనిశితాదరసూక్ష్మతరశ్లథాత్మఁడై
శ్రీజనకాత్మజాప్రణయజీవన మోహనకారి ప్రేమశం
డాజగలాయమానధిషణాస్ఫురణంబులఁ జెంగలించుచున్

సీ. కనకపాత్రికల నింపిన యిరారసములఁ
దెచ్చి మైథిలికి నందిచ్చి యిచ్చి
జిలుఁగు కుంకుమల మంజిష్ఠాహరిద్రల
లలితాస్య పదము లలంకరించి
కర్పూరము స్తక కాలాగురుద్రవ్య
ములు ధూపములువేసి వెలిచి వెలిచి
గ్రథితమాలామాఘ్యకహ్లారమాలలు
హాస్తకైశికకంఠమందుఁ జెరివి
మెడమలుపు నోరచూపుల నిలచి చూచి
యందముగ నున్నదో లేదో యంచు నాడి
యంద మురలెడుఁగాదే? యటంచు నాడి
మాలలన్ నిల్చి యొయ్యారములుగఁ జూచి

శా. ఆడంజూడగఁ జూడనాడగను వా రన్యోఽన్యనేత్రాంతర
క్రీడాదర్పణదృశ్యమానము లసంఖ్యేయాత్మరూపంబులన్
వ్రీడాముగ్ధములన్ వినిశ్చలదృగావిర్భూత రోచిస్సులన్
గూడన్ దోరణబద్ధమాలలఁ గనన్ గూలంకషప్రేములై ౨౧౪

సీ. కోకిల మారాన( గూసిన నీవటే?
నన్ను( బిల్చితివంచు నవ్వు సామి
తుమ్మెద గూటిలో ఝుమ్మన నిది యే ర
హస్య మాడునో యంచు నాడు సామి
గృహశిఖావళము తీర్చిన( బింఛమును నీదు
శైశికచ్ఛవి నెఱుంగ దను సామి
పెంపుడు లేడి ద్వారంపుకోసల( జూడ
నవసిజాక్షుల( బోల్చియాడు సామి

సీత చెఱ(గు గాలిచే( జిందులాడిన
దాని నిగుడు వాలులోన నిలచి
పడవలోన నేను బయనించు చుంటి నం
చేలో భయము నభినయించు సామి

సీ. తనపాద మామెపాదము జతగా(బెట్టి
యస్మత్పదంబు మోటని వచించు
తనహస్త మామెహస్తము లోన జత(జేసి
ముదురాకు చివురాకుపదను లనును
ఆమె ప్రక్కన నిల్చి యానుకొమ్మని నన్ను
విడిపోకవే యని విరిసిపోవు
చెక్కిలి( జెక్కిలి( జేర్చి యాప్రాతన్ను
లేవో రహస్యంబు లెత్తిపోయు
తనుగుకొనిపోవు( బ్రేమ సంతాపహేతు
వంచు( దనప్రేమబరువు( జూపించి పలుకు
నొక్కసమయాన మనకు వియోగమైన(
బ్రేమ యే మగునంచు వారింప(బడును

గీ. శ్రీమనోనాథు లీలావిశేష మరసి
సీత యో స్వామి! యెందు నేర్చితని యడుగ
నేను నేర్చిన దేమున్నదే? నతాంగి
కౌశికుం డుపదేష్టయు(గాని దనును

క. ఒకకొంత భోగవేళకు
నికామకామమ్ము తగ్గు నింద్రప్రకృతులం
డొక ముసరుకొనెడు పెనుకో
రికయు శమించుచు హృషీకతృప్తి సహజమై

గీ. అంత జానకీరాముల కా భయమ్ము
సర్దుకొని పునశ్శాంతప్రచారవిషయ
నిభృతవిషయేంద్రియములుగాఁ బ్రభువులై వి
కుంఠపరిపూర్ణ యోగమ్ము కొల్లగొనుచు

గీ. పూని వైదేహి! మైథిలీ! జానకీ! య
టంచు శ్రీరామమూర్తి నోరారఁ బిలుచు
నా పిలుపుసవ్వడితరంగ లమ్మవారు
ప్రాణమూలమ్ములందున హత్తుకొనఁగ

గీ. సీత శ్రీరామచంద్రుని చిత్తపదము
రామచంద్రుఁడు జానకీప్రాణపదము
రామ సర్పఫణామణి రమణి సీత
ధరణిజాజీవితాతపతరణి స్వామి

వ. ఇట్లు వైరాగ్యసంసారభావంబులు ప్రయాగక్షేత్రస్థగంగాయమునల
వలె సీమప్రసారరమ్యంబులైన శ్రీరామచంద్రుండు

మత్తేభవిక్రీడితము.

ఆనందాస్యుఁడు పరుషంబౌ నే మాట యనఁడు తోనాడున్
దానే ముందుగ నెవరైనన్ గానీ యితరుల పారుష్య
స్థానోక్తుల్ తలఁపఁ డొగిన్ దానై సర్వశరసువిద్యాపా
రీణుండయ్యు నితరశస్త్రవ్రాతంబు కృతికి నగ్గించున్

సానుక్రోశుఁడు మధురస్వాద్వాభాషి సకలవేదార్థా
హీనప్రౌఢుఁడు ధిషణాహేలాలోకహితసదాజీవుం
డేనోదూరుఁడు తరుణుం డీహాదూరుఁ డితిహాశబ్దార్థ
జ్ఞానాస్థానము నిరతస్వాహాభర్తృచరణశీలుండున్                                                                                    ౨౯౮

ప్రాణం బిచ్చినపగిదిం బల్కున్ దీనపటలబాధార్త
గ్లానివ్యాధుఁడు పృథుశిల్పజ్ఞానాధికమతి దేశానే
హానిష్పావుఁ డనలసుం డుర్వీరక్ష కొదిగి శ్రీరామున్
నానాసద్గుణసమితుల్ నారాచీవినతము లేలించున్

భూతగ్రామ మవమతిం బూనంబోఁడు పురుషసారజ్ఞుం
డేలా మెత్తిన జల; నీ రేతౌ బావి కృపకు; భూదేవ
వ్రాతార్చకుఁడు నృపశాస్త్రప్రౌఢుండు బహులసేనాగ్ర
స్థానాగ్నేయుఁడు పృతనాషాట్ శ్రీగోపచణుఁడు వర్తించున్ ౨౯౬

## ఖండాంతము

గీ. భాసిగంగాన్నపూర్ణాంబికాసమేత!
స్వామి! విశ్వేశ్వరా! యిద్ది సాకుమయ్య!
చంద్రమౌళిభూపశ్రోతృసత్యసుకవి
కల్పనావధి కళ్యాణఖండమనువు

మ. అమరీకైశికపారిజాతకుసుమోహాస్వాదు వీ బాలకాం
డము నీ భర్తుఁడు శోభనాద్రి దగు సంతానంబు జన్మాద్యపా
యముఁ దప్పించుత! యెన్ని పుట్టువుల పెట్టైతిన్ శివా! యేమి కా
మము? కోపం బదియేమి? యేమియగు నీ మాత్సర్యమో హా! ప్రభూ!

క. ఇది మెచ్చెదరో మెచ్చరో?
యిదియును జదివెదరుఁ జదువ రేలా నాక
య్యది? నాయెద మీతో రా
చెద నద్దానికి ఫలంబుఁ జెందించు శివా!

ఉ. హాళిఁ జరించుఁ గావ్యరచనార్త్తయశఃకృతనాకసౌఖ్యవాం
ఛాలులితంపుటాత్మయె పొసంగదు నా దెసఁ బొందుఁగాక ము
క్త్యాలధరాధినాయకుఁ డదంతయు; నా తపమెల్లఁ బండి యు
ద్వేలజనూరుజావితతి విచ్ఛేదునట్టు లనుగ్రహింపవే!

పంచచామరము.

అపారసత్కృపాపయోధి ! యాత్మవస్తుసారథీ !
యుపాసనానమస్తసత్పథోపజీవనాకృతీ !
తపస్విషచ్ఛటాశిరోధి! తప్తలోకసేవధీ!
కృపాప్రణీతభక్తపాపకీలికానిరాకృతీ !

శిఖరిణి.

ధృతాంభఃపూతాకృత్యమరతటినీతీరసుగృహీ!
నితాంతవ్యావల్గన్నిజభజనకృన్నిత్యవిరహీ!
కృతాంతప్రౌఢాజ్ఞానిరసనకళాకేళిజటిలా!
శ్రుతిప్రామాణ్యాత్ప్రకటతర తేజోచ్ఛపటలా!

ఓం తత్సత్.